# వి ష య సూ చి క.

| అధ్యా. సం. | విషయము. | పుటసంఖ్య. |
|---|---|---|
| ౧. | సూతముని విజయము ... | ౨ |
| ,, | సేతుస్నానఫలము ... | ,, |
| ౨. | సేతుమాహాత్మ్యము ... | ౬ |
| ౩. | సేతుమధ్యంబుననుండు తీర్థములలో ప్రధానమగు చక్రతీర్థప్రశంసయు, గాలవచరిత్రయు ... | ౧౦ |
| ౪. | విశ్వావసు సుమంతుడగు దుర్దముని రాక్షసత్వము చక్రతీర్థంబున గాలవమునీంద్రునిచే విముక్తిబొందుట ... | ౧౩ |
| ౫. | చక్రతీర్థప్రభావాకరంబును అలంబుసాదిధూమశాపమోక్షణము .. | ౧౫ |
| ౬. | దేవీపురాఖ్యానంబును, మహిషాసురయుద్ధంబు ... | ౨౧ |
| ౭. | చక్రతీర్థప్రశంసయు దేవీపురాభిధానకథనంబును మహిషాసురవధయు ... | ౨౪ |
| ౮. | భేతాళవరదతీర్థప్రశంసయు - విద్యాధరాత్మజుండగు సుదర్శను భేతాళత్వంబునొందుటయు ... | ౨౬ |
| ౯. | భేతాళవరదతీర్థప్రశంసయు సుదర్శన సుకర్ణునికి శాపవిమోచనంబు ... | ౨౯ |
| ౧౦. | గంధమాదనప్రశంసయు పాపవినాశనతీర్థప్రభావంబు ... | ౩౨ |
| ౧౧. | సీతాసరోవరప్రశంసయు ఇంద్రబ్రహ్మహత్యావిమోచనంబును ... | ౩౬ |
| ౧౨. | మంగళతీర్థప్రశంసయు మనోజవాలక్ష్మీనివారంబు ... | ౩౮ |
| ౧౩. | అమృతవాపీప్రశంసయు అగస్త్యభ్రాతృవిముక్తియు ... | ౪౨ |
| ౧౪. | బ్రహ్మకుండప్రశంసయు కమలాసనశాపవిమోచనము ... | ౪౪ |
| ౧౫. | హనూమత్కుండప్రశంసయు ధర్మసఖిశతపుత్రావాప్తియు ... | ౪౬ |
| ౧౬. | అగస్త్యతీర్థప్రశంసయు కక్షీవద్వివాహోద్యోగంబు ... | ౪౯ |
| ౧౭. | కక్షీవద్వివాహనిష్పత్తియు ... | ౫౨ |
| ౧౮. | రామతీర్థప్రశంసయు ధర్మపుత్రమిథ్యాదోషశాంతి ... | ౫౪ |
| ౧౯. | లక్ష్మణతీర్థప్రశంసయు బలభద్రబ్రహ్మహత్యావిమోచనంబు ... | ౫౮ |
| ౨౦. | జటాతీర్థప్రశంసయు శుకచిత్తశుద్ధ్యవాప్తియు ... | ౬౧ |
| ౨౧. | లక్ష్మీతీర్థప్రశంసయు ధర్మపుత్రరాజసూయావాప్తియు ... | ౬౩ |
| ౨౨. | అగ్నితీర్థప్రశంసయు దుష్పణ్యపైశాచమోచనంబు ... | ౬౫ |
| ౨౩. | చక్రతీర్థప్రశంసయు ఆదిత్యహిరణ్మయపాణిప్రాప్తియు ... | ౬౮ |
| ౨౪. | శివతీర్థప్రశంసయు భైరవబ్రహ్మహత్యామోచనంబు ... | ౭౧ |

ఓమ్.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.



స్కాందపురాణమునందలి

# సేతుమాహాత్మ్యము.

## మొదటి అధ్యాయము.

శ్లో॥ వ్యాసంవసిష్ఠనప్తారం శక్తేఃపౌత్రమకల్మషమ్।
పరాశరాత్మజంవన్దే శుకతాతంతపోనిధిమ్॥

శ్లో॥ వ్యాసాయవిష్ణురూపాయ వ్యాసరూపాయవిష్ణవే।
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయనమోనమః॥

శ్రీమన్నిఖిల మహీమండలంబునంగల క్షేత్రంబులలో నుత్తమంబును ముక్తిప్రదంబుననగు నైమిశారణ్యంబను పుణ్యక్షేత్రంబుగలదు. అందష్టాంగయోగ నిరతులును, బ్రహ్మజ్ఞానతత్పరులును, మోక్షాపేక్షగలవారును, మహాత్ములును, మదరహితులును, బ్రహ్మవాదులును, ధర్మజ్ఞులును, అసూయారహితులును, సత్యవ్రతులును, జితేంద్రియులును, జితక్రోధులును, సర్వభూతహితంబుగోరువారును, ఆదిపురుషుండును తేజోరూపుఁడును సనాతనుండుననగు విష్ణుదేవునిం బూజించుచుండువారును, సర్వధర్మజ్ఞులును, లోకాను

గ్రహతత్పరులును, మమతలేనివారును, నిరహంకారులును, పరబ్రహ్మసంసక్తమానసులును, జటావంతులును, బ్రహ్మచారులును, సూర్యసమాన తేజోవంతులును, సకలాగమపారగులును, సకలశాస్త్రార్థతత్త్వజ్ఞులును, యజ్ఞంబులచే యజ్ఞేశ్వరుని, జ్ఞానంబులచే జ్ఞానాత్మకుని, పరమభక్తిచే శ్రీమన్నారాయణుని బూజించువారును, ధర్మార్థకామమోక్షోపాయంబులం గోరుచుండెడువారును, పాపప్రణాశనంబులు పుణ్యంబులునగుకథలం బరస్పరంబుం జెప్పుచు ముక్త్యుపాయంబుగోరుచుండువారును, అనేకశిష్యప్రశిష్యులతోఁ గూడియుండువారుననగు నిరువది యాఱువేల శౌనకాదిమహామునులు తపంబుచేయుచు నొకానొక దినంబున సమాజంబు చేరియుండు సమయంబున వ్యాసశిష్యుండును పౌరాణికోత్తముండును విద్వాంసుండునునగు సూతుం డచటికేతెంచెను.

## సూతమహానివిజయము.

అంత శౌనకాదిఋషిశ్రేష్ఠులు ప్రజ్వలించు నగ్నిహోత్రసమానతేజుండగు నా సూతుని నర్ఘ్యాదులచే బూజించి శుభకరంబైన యాసనంబున సుఖోపవిష్టుండగునట్లు కావించి లోకానుగ్రహకాంక్షగలవారలగుచు నిట్లనిరి, ఓ సూతుండా! నీవు సాత్యవతేయువలన సకలపురాణంబులను విన్నవాడవు, సకలధర్మార్థంబులం దెలిసినవాఁడవు, గాన నీకుం గోచరంబుగాని విషయం బెయ్యదియుఁ గలుగదు, ఈ భూమండలంబున నే యే క్షేత్రంబు లేయేతీర్థంబులు పుణ్యకరంబులు, జనంబులకు భవసాగరంబువలన ముక్తియెవ్విధంబునం గలుగు, భగవత్పాదంబులయందు భక్తి దేనిచే జనించు త్రివిధంబగు కర్మఫలం బెద్దానివలనం గలుగు నివి యన్నియు మాకు విశదంబుగా కృపసేయుము, లోకంబున విశ్వాసవంతులగు గురువులు శిష్యుల కతిరహస్య విషయంబులను కరుణచే నుపదేశింపుచున్నారుగదా యని వేడ, సూతుండు పరమహర్ష పరిపూర్ణహృదయుండై స్వగురువందనం బొనరించి చెప్ప నుపక్రమించెను.

ఓ బ్రాహ్మణోత్తములారా! లోకంబునకు హితంబగు విషయంబడిగితిరి ఈరహస్యం బెవ్వరికి నిదివరకు జెప్పినవాఁడంగాను మీరాదరించి యడిగినందున జెప్పుచున్నాడను మనశ్చంచలనంబు మాని భక్తిపురస్సరంబుగా నాకర్ణింపుడు.

## సేతుస్నానఫలము.

శ్రీరామునిచే నిర్మింపంబడిన సేతువుచే బవిత్రంబును, సకలక్షేత్రోత్తమంబును, సర్వతీర్థశ్రేష్ఠంబునునగు రామేశ్వరంబను నొక క్షేత్రంబు గలదు. ఆ సేతుదర్శనంబుచే సంసారసాగరోత్తారణంబును, హరిహరభక్తియు, పుణ్యాభివృద్ధియు, త్రివిధంబగు కర్మఫలంబులును గలుగు. ఎవ్వఁడు తన జీవితకాలమధ్యంబున భక్తిపూర్వకంబుగా సేతుదర్శనం బొనరించునో వాఁడు పితృమాతృకులకోటిసమేతుండై యీశ్వరసన్నిధానంబున నొక

కల్పపర్యంతంబు నివసించు. భూపరాగంబులను తారకంబులనైన లెక్కింప నలవియగుం గాని సేతుదర్శనంబువలనంగలుగు పుణ్యంబు లెక్కింప నాదిశేషునకైనం దరంబుగాదు. మరియు సమస్తదేవతారూపంబగు సేతుదర్శనంబొనరించు నరుని పుణ్యంబుగణింప నెవ్వరికి శక్యంబు? మరియు సమస్తతీర్థసేవాఫలంబులును సర్వయాగఫలంబులును సర్వతపః ఫలంబులును సేతుదర్శనంబునంగలుగును.

ఇంతేగాక యేనరుండైన సేతుస్నానంబునకుం బోయెదనని వచించునతఁడు సర్వ ఫలంబులంబొందుటకు సందియంబులేదు. మరియు సేతువగాహనంబుజేయు మనుజుండు సప్తకోటికులంబులంగూడి పునరావృత్తిరహితంబగు విష్ణులోకంబునొంది యచ్చటనుండి శంభులోకంబునకుం బోయి తత్సన్నిధానంబునం గల్పత్రయకాలంబు నివసించు. రామేశ్వరలింగంబును గంధమాదనపర్వతంబును దలంచునతండు సమస్తపాపంబులనుండి దొలంగును. పంచమహాపాతకంబులఁజేసిన నరుండు సేతుస్నానంబొనర్చిన పితృమాతృకుల శతకోటి సమన్వితుండగుచు గల్పత్రయకాలంబు విష్ణుపదంబున వసించు. నిరంతరంబు సేతుస్నానంబునకుం బోవలయునని దలంచుచుండువానికి సకలపాపంబులు నాశనంబగు.

మరియును మూషాకవస్థయు, వపారూపంబును, వైతరణీనదియును, శ్వభక్షణంబును, కాలసూత్రంబును, తప్తశూలంబును, తప్తశిలయు, పురీషహ్రదంబును, శోణితకూపంబును, శాల్మల్యారోహణంబును, క్రిమిభోజనంబును, శ్వమాంసభక్షణంబును, వహ్నిజ్వాలాప్రవేశనంబును, శిలావృష్టియు, వహ్నివృష్టియు, మూత్రపానంబును, క్షారోదకంబును, ఉష్ణతోయంబును, అథశ్శిరశ్శోషణంబును, క్షారసేచనంబును, పాషాణయంత్రపీడయు, మరుత్ప్రపతనంబును, పురీషలేపనంబును, క్రకచదారణంబును, పురీషభోజనంబును, రేతఃపానంబును, సంధిదాహనంబును, అంగారశయ్యాభ్రమణంబును, ముసలమర్దనంబును, బహుకాష్ఠయంత్రకర్షణంబును, శస్త్రభేదనంబును, పతనోత్పతనంబును, గదాదండనిపీడనంబును, గజదంతహననంబును, నానాభుజంగదంశంబును, ధూమపానంబును, పాశబంధనంబును, నానాశూలనిపీడనంబును, ముఖనాసికాక్షారోదకానిషేచనంబును, క్షారాంబుపానంబును, తప్తాయస్సూచీభక్షణంబును, క్షారాంబుపూర్ణరంధ్రంబును, మేహభోజనంబును, స్నాయుచ్ఛేదంబును, స్నాయుదాహంబును, అస్థిఘేవనంబును, శ్లేష్మాదనంబును, మహాతిక్తనిషేవణంబును, అత్యుష్ణతైలపానంబును, దశనమర్దనంబును, తప్తాయశ్శయనంబును, కషాయోదకపానంబును, క్షారోదకపానంబును, అత్యుష్ణసికతాస్నానంబును, తప్తపాషాణభోజనంబును, నేత్రముఖసంధిసూచీప్రక్షేపణంబును, శిశ్నవృషణాధోభాగబంధనంబును, వృక్షాగ్రపతనంబును, దుర్గంధపరిపూరితంబును, తీక్ష్ణధారాస్త్రశయ్యయు ననునీమొదలగు నరకంబులను సేతుస్నాయియగు మనుజుండును, సేతుదర్శనంబుచేసిన నరుండును వీక్షింపరు.

సేతుమధ్యస్థిత సైకతప్రదేశంబులం దత్పరాగ పరిప్లుత శరీరుండై శయనించునతని శరీరంబున నెన్నిపరాగంబులు సక్తంబులగునో యన్ని బ్రహ్మహత్యాది మహాపాతకంబులు నశించు. సేతుమధ్య పవనం బెవనిశరీరంబుపై వీచునో యాతండు జేసిన సురాపానాద్యయుతపాతకంబులు తత్క్షణంబ నశించు. సేతుమధ్యంబున పవనంబొనర్చునతండు గురుతల్పగాద్యనేక దురితసమూహంబుల విదళించు. ఏమానవుండైన దాజేసిన దురితంబులం దలంచి పశ్చాత్తాపంబునొంది సేతువునకుంబోయి మజ్జనంబొనరించినచో మహాపాతకసంసర్గాదులంబాసి నిర్మలుండగు. ఏనరునిశల్యంబులు సేతుమధ్యంబునస్థాపింపంబడునతండు సకలదోషపుంజంబులంబాయు.

మరియు మార్గంబుల విధ్వంసనంబుఁజేయువాఁడును, ఏకాకియై భుజించువాఁడును, యతిబ్రాహ్మణనిందఁ జేయువాఁడును, అత్యాశాబద్ధుండగువాఁడును, వేదవిక్రేతయు, బ్రాహ్మణజనంబులకు విత్తంబొసంగెదనని వచించి పిమ్మట ద్రవ్యాశచే లేదనువాఁడును, సకల శాస్త్రోపదేష్టయగు గురునకు ద్వేషంబొనర్చువాఁడును, జలపానంబు జేయు గోబృందమును నివారించువాఁడును బ్రహ్మఘాతకులనంబడుదురు. అట్టి దూషకులు సేతుమజ్జనమాత్రంబునం బాపసంచయంబులం బాయుదురు. ఇంతేగాక తత్సమాన దోషకారులు సేత్వభిషేచనంబునం దోషపుంజవిముక్తులగుదురు.

మరియును ఔపాసన పరిత్యాగియు, దేవతాన్నభోజియు, వ్రతదినంబుల స్త్రీలఁ గలయువాఁడును, గణికాన్నభోజియు, గణాన్నభోజియు, వనితాన్నభోజియు సురాపులని చెప్పంబడుదురు. అట్టి సర్వకర్మబహిష్కృతులు సేతుమజ్జనంబుచే బాపసంచయంబులం బాయుదురు. కస్తూరీ కటివాస క్రముక కర్పూరాజ్య పయశ్చందన మధ్వాజ్య కాంస్య తామ్ర రుద్రాక్ష చోరసులు స్వర్ణస్తేయులనంబరగుదురు. ఆమనుజులు సేతుస్నానంబుచేఁ బాపసమూహంబుల దొలంగుదురు. మరియు దత్సదృశ దోషవంతులును సేతుస్నానంబువలనం బాపపుంజ విముక్తులగుదురు. పుత్ర భ్రాతృ మిత్ర భార్యా జనంబులను సహోదరిని విశ్వస్తను మద్యపానంబొనర్చు వనితను, హీనవంశ సంభవయగు దాసిని గామాంధుడై గవయునతండును దత్సదృశకల్మషులును దత్సహవాసంబుచేయు నరులును సేతుస్నానంబు జేసిన క్షణంబున పాపపుంజంబులంబాయుదురు, యజ్ఞంబులంజేయక దేవలోకంబునంగల ఘృతాచీ మేనకాద్యప్సరసల భోగంబులం గోరువారును, సూర్యాది దేవోపాసనంబులం జెద్దియుంజేయక శుభంబులంగోరు నతండును, భూసువర్ణధాన్యశిలాదిదానంబులం జేయక స్వర్గం బనుభవింపఁ గోరు నతండును, ఉపవాస వ్రతాదులచే దనశరీరంబు దపింపజేయక స్వర్గంబుగోరునతండును సేతుస్నానంబుగావింపవలయు. కోర్కలేక సేతుస్నానంబొనర్చువాఁడు పునర్జన్మరహితుండని పూర్వాచార్యులు చెప్పుదురు.

సంపదలంగోరి సేతుస్నానంబు చేయుమానవుం డఖిలైశ్వర్యంబులంబొందు, కుక్షింగోరి సేతుస్నానంబుగావించు నతం డీప్సితంబుబడయు, ముక్తింగోరి సేతుస్నానంబొనరించుమనుజుండు పునరావృత్తి రహితంబగు ముక్తింగాంచు, బ్రహ్మలోక వైకుంఠ కైలాసంబులకుం బోవలయునని దలంచి సేతువునం దవగాహనంబుజేసిన నట్లు సంఘటించు. ఆయురారోగ్యైశ్వర్యంబులను అతిరూపగుణంబులను సాంగంబుగఁ జతుర్వేదపాఠంబును సర్వశాస్త్రార్థతత్త్వపరిజ్ఞానంబును సర్వమంత్రాభిజ్ఞతయుంగోరి సేతుస్నానంబు గావించునతం డీప్సితపరంపరలంబొందు, దారిద్ర్యాదులకు భయంబునొందువారు విముక్తిలంబగు సేతుమజ్జనంబు గావింపవలయు. శ్రద్ధాసహితుండైనను శ్రద్ధాహీనుండైనను సేతుస్నానంబుచే ఇహపరలోక సుఖంబులంబొందు. సేతుస్నానంబు మోక్షదంబనియు మవశ్యప్రదంబనియు జప తపో హోమ యోగ యజ్ఞ దాన వ్రతంబులకంటె నుత్తమంబనియు నకలకామప్రదంబనియు సకలపాపనాశకరంబనియుం బురాణంబుల చెప్పంబడు. సేతుస్నానంబుచే ధర్మరాశి శుక్లపక్ష నిశాకరుంబోలె దినదినప్రవృద్ధమానంబగు. మరియును సముద్రంబున రత్నసమూహంబు లెవ్విధంబున వృద్ధినొందు నావిధంబున సేతుస్నానకృజ్జనపుణ్యంబులు వృద్ధిబొందు. కామధేను కల్పవృక్ష చింతామణు లెట్లు జనంబుల కఖిలేప్సితంబులొసంగునో యట్లు సేతుస్నానంబు సర్వాభీష్టంబులనొసంగు. మనుజుండు సేతుయాత్రకుంబోవ దారిద్ర్యదోషంబుచే నశక్తుండగునేని శిష్టజనంబుల యాచించి లబ్ధక్రీతధనుండై సేతుస్నానంబుగావింపవలయు. నట్లొనర్చు మనుజుండును దత్ప్రదాతయు నవికలంబగు ఫలంబులం బొందుదురు.

సేతుయాత్రార్థంబుగా నరుండు బ్రాహ్మణజనంబుల యాచించి ధనంబు గ్రహింపవలయు. విప్రులొసంగరేని క్షత్రియులవలనం గ్రహింపవలయు. పార్థివులొసంగనితరి వైశ్యులవలనం గ్రహింపవలయు, వైశ్యులొసంగని పక్షంబున మిక్కిలి ప్రయాసంబునొందినను బోవలయుగాని శూద్రజనంబువలన గ్రహింపఁదగదు. సేతు యాత్రకుంబోవు మనుజునకు ధన ధాన్య వస్త్రంబు లొసంగునతం డశ్వమేధాది యజ్ఞఫలంబును చతుర్వేద పారాయణ ఫలంబును, తులాపురుష దానఫలంబును, బ్రహ్మహత్యాది పాపనాశనంబును, సర్వాభీష్టంబులం బొందు బహుభాషణంబులేల తద్విధంబునం దల్పప్రతిగ్రహీతయు ప్రతిగ్రహదోష రహితుండై, తత్పుణ్యఫలంబులంబొందు సేతుయాత్రార్థంబుబోయెడు నరునకు ద్రవ్యంబొసంగెదనని పలికి పిమ్మట లోభంబున లేదనునతండును, సేతుయాత్రకుం బోయెదనని శిష్టజనంబులవలన ధనంబునంగ్రహించి పిమ్మటం బోకయుండు మనుజుండును, బ్రహ్మఘాతకులనంబడుదురు. సేతుయాత్రార్థంబై తానంపన్నుండయ్యు దరిద్రునివిధంబునం బరులయాచించునతండు స్వర్గస్తేయి యనంబడు. ఎన్నివిధంబులనైనను మనుజుండు సేతుయాత్రకుంబోవలయు. నట్లుబోవుట కశక్తుండయ్యెనేని విత్తం బొసంగి విప్రోత్తమునిం

బంధవలనయు, ద్రవ్యహీనుండగు నేని యాచ్నవలననైన గ్రహించి సేతుయాత్రకుం బోవలయు. మనుజుండు యజ్ఞకరణాది విషయంబగు యాచ్నయం దేవిధంబున దోషంబు నొందఁడో యట్లు సేతుయాత్రార్థంబై యాచించునరుండును ప్రతిగ్రహదోషంబు నొందడు. జనంబులకు కృతయుగంబున మోక్షంబు జ్ఞానంబువలనం గలుగుననియుఁ, త్రేతాయుగంబున యజ్ఞంబులవలనం గలుగుననియు, ద్వాపర కలియుగంబుల దానంబులవలనం గలుగనియు, సర్వయుగంబులయందున్ను సేతుస్నానంబునం గలుగుననియు పురాతనులగు ఋషిశ్రేష్ఠులు చెప్పుచున్నారు.

ఇది స్కాందపురాణంబున సేతుమాహాత్మ్యంబునందు
మొదటి యధ్యాయము సంపూర్ణము.

## రెండవ యధ్యాయము.



మహనీయ గుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులు సకలపురాణాభిజ్ఞుండగు సూతుం జూచి యో సూతుడా! అక్లిష్టకర్ముండగు శ్రీరామునిచే నగాధంబగు వరుణాలయంబున సేతు వెవ్విధంబున జేయంబడె నందును గంధమాదనపర్వతంబునం దెన్నితీర్థంబులు గల వవి విశదంబుగా జెప్పుమని యడిగిన నతం డిట్లనియె. శ్రీరాముండు జనక శాసనంబున సీతాలక్ష్మణ సమేతుండై యరణ్యంబునకుం బోయి పంచవటీ తీరంబున నుండు సమయంబున రావణుం డామహామహునిభార్యం గపటంబున నపహరించె, నంత నద్దశరథాత్మజుండు శోకమోహసమన్వితుండును, భార్యాన్వేషణ తత్పరుండు నగుచుఁ బంపానదీతటంబునకుం జనియె నాసమయంబున సుగ్రీవప్రేరితుండగు నాంజనేయుం డచటికేతెంచె నప్పుడు రామచంద్రుండు విప్రవేషధారుండై నీ వెవ్వం డిచటి కేల వచ్చితివని యడిగిన నావాయుపుత్రుండు సుగ్రీవవృత్తాంతం బంతయుం జెప్పి, యేనతనిభృత్యుండ నంజనాపుత్రుండ డను యుష్మత్సఖ్యంబుగోరి నన్నుం బంచెనని వాక్రుచ్చె, నంత రాఘవుండు లక్ష్మణహనుమత్సమేతుండై సుగ్రీవాంతికంబునకుం బోయి యగ్నిసాక్షికంబుగా సఖ్యంబొనరిచి వాలివధకృతప్రతిజ్ఞుండయ్యె. నప్పుడు సుగ్రీవుండు వైదేహ్యానయన కృతశపథుండయ్యె, నంత వానరేశ్వరరామేశ్వరులు కృతసముద్యమంబులు పరస్పర నివేదితోదంతులును బరస్పరకృతాశ్వాసనలును పరమప్రీతి సంయుతులు నగుచు ఋశ్యమూకంబున నివసించియుండిరంత. రఘూత్తముండు సుగ్రీవ ప్రత్యయార్థంబై పాదాంగుష్ఠక్షిప్త దుందుభికళేబరుండు నిర్భిన్నసప్తసాలుండయ్యె నాసమయంబున సుగ్రీవుం డత్యంత సంతోష పరిపూరితాంతరంగుం డగుచు రాఘవుం గాంచి ఓరఘువీరా! యుష్మత్సఖ్యంబు గలిగెం గాన నింద్రాదులం గాంచి నకు భయంబు నొండ, రావణుం బరిమార్చి సీతం దెచ్చెదనని పచించి రామలక్ష్మణయుక్తుండై

వాలిపాలితంబగు కిష్కింధాపురంబునకుంబోయి వాల్యాగమనకాంక్షఁ జేగర్జించె, నంత వాలి యనుజగర్జితాసహమానుండై యేతెంచి సుగ్రీవుంజేరి ముష్టియుద్ధంబునం బీడించె, నంత సుగ్రీవుండు పలాయమానుండై రాఘవు సమీపంబునకుంబోయి స్వపరాభవంబెఱింగింప నృపోత్తముండు తత్కంఠగంబున పుష్పమాలను చిహ్నంబుగా నొనర్చి యుద్ధంబునకుంబంపె నప్పుడు వానరాధిపతియగు వాలి సుగ్రీవగర్జితంబుచేఁ బునరాగతుండై బాహుయుద్ధంబుచేయుచుండ రాఘవుం డేకశరంబున వాలిం బరేతనిలయుంజేసి సుగ్రీవునకు వానరరాజ్యంబొసంగె. నంతవర్షాకాలంబు గడచిన వానరాధిపుండు వసుధాధిపు సమీపంబుచేరి సీతాన్వేషణంబునకై వానర సమూహంబుల సర్వదిశలకుం బంపె, నంత నాంజనేయుం డంగదాది వానరవీర సమేతుండై దక్షిణాశకుంజని లంకాపురాశోకవనంబున వైదేహిం గాంచి తద్గృహీతచూడామణియగుచు రాఘవుసమీపంబునకరుదెంచి తద్వృత్తాంతంబంతయుం జెప్ప, నంతరాఘవుండు హర్షశోకంబులం బొంది లక్ష్మణ సుగ్రీవాంగద హనుమన్నలాది వానరసమూహ సమేతుండై యభిజిన్ముహూర్తంబునం గృతప్రయాణుండై వివిధదేశంబులంగడచి మహేంద్రపర్వతసమీపస్థిత చక్రతీర్థోపాంతంబున నివాసంబొనరించె నయ్యవసరంబున రావణావరజుండగు విభీషణుండు మంత్రిచతుష్టయ సహితుండై రాఘవు శరణంబు వేడె నప్పుడు సుగ్రీవాదులు శంకింపుచుండ, రాఘవుం డభయప్రదానంబు గావించి రాక్షసరాజ్యంబున నభిషేకంబొనరించి సుగ్రీవసదృశుంగాజేసి వానరులం గాంచి కాలయుక్తంబగు వచనంబు వక్కాణించెను.

ఓ వానరశ్రేష్ఠులారా! ఈపారావారం బతిదుస్తరంబును, చంచలోర్మిసమాకులంబును, ఉద్భ్రాంతమత్స్యంబును మహానక్రశంఖ శుక్తిసమావృతంబును బౌర్వానలాక్రాంతంబు నతిభీషణంబును ప్రకృష్ట పవనాక్షిప్త నీలమేఘ సమన్వితంబును శతయోజనాయతంబును మనోదురాసదంబును ప్రళయాంభోధరారావసారవంతంబును భీషణంబునగుచు దనరారుచున్నది, ఏయే యుపాయంబుల మత్సైన్యంబు తరింపందగు, విఘ్నంబులు బహుళంబులై యున్నయవి, ఏవిధంబున వైదేహింబొందెద, రాజ్యంబుపోయె వనవాసంబుగలిగె, జనకుండు మృతుండయ్యె, భార్యాపహరణంబాయె, మహాజలంబగు సముద్రసమీపంబున నిరాశ్రయులమైతిమి, ఈవ్యసనంబులకంటె సాగరలంఘనంబతిశయంబై యున్నది. ఋషిపుంగవుండగు నగస్త్యుండు రావణాసురుం జంపి తద్వధజనితపాపోపశమనార్థంబుగా గంధమాదన పర్వతంబునొందెదవనివచించె నవ్వచనంబును మిథ్యయయ్యెయని యివ్విధంబున పరిక్షుభితమానసుండగు రాఘవుగాంచి సుగ్రీవాదులు ప్రాంజలులగుచు నిట్లనిరి.

ఓ రఘునాయకా! ఈసముద్రం బనేక విధంబులగు ప్లవాదులచేఁ దరింపందగు, నిందులకు చింతింపనేల యనుచుండు సమయంబున విద్వాంసుండగు విభీషణుండు విన్నవం

భాషించెను. ఓ రఘువీరా! ఈరత్నాకరుండు యుష్మద్వంశసముద్భవ సగరతనయనవహాఖనిత్యుండగుటంజేసి సాగరుండనుపేరం బ్రసిద్ధినొందెంగాన శరణంబువేడ నస్మత్కార్యానుకూలుం డగునని వచించిన నంగీకరించివానరులంగాంచి యోకపివరులారా శతయోజనాయతంబు నతిభీషణంబగు సముద్రంబు ప్లవాదులచేఁదరింపనశక్యంబు విభీషణోక్త ప్రకారంబున మార్గసిద్ధింగోరి వరుణాలయంబు నుపాసించెద, ఏనుపాసించినం బ్రసన్నుండగునేని యప్రతిహతాస్త్రంబుల నితనిందహించెదనని సౌమిత్రిసహితుండై యాచమనంబు జేసి దర్భశయనంబున శేషభోగనిభంబగు స్వహస్తంబుఁదలగడగానిడికొని వేదగతుండగు వటుకాశనుంబోలె దర్భశయనంబునశయనించె. నిర్వ్యథంబున త్రిరాత్రంబులు సకలధర్మవేదియు నియమసమన్వితుండు నగు రామచంద్రుండు యథార్థంబుగా ననేకవిధంబులవేడినం బ్రసన్నుండగు సాగరుండు దర్శనంబొసంగకపోయె, నంత నృపోత్తముండు కోపసంరక్తాంతలోచనుండగుచు సమీపవర్తియగు లక్ష్మణుంగాంచి, ఓయీ సౌమిత్రీ ఈ సముద్రుండు మదయుక్తుండగు నన్నసమర్థుంగాదలంచె నేతాదృశజనవిషయంబైసామంబుదగదు, ధనుర్చాపంబు నాశీవిషోపమంబులగు బాణంబులనొసంగు మీక్షణంబ మహార్ణవసంకులుండును మహామకరనక్రాద్యుండును మహావీచీసమాకులుండును నిర్మర్యాదుండునునగు నితని నమోఘాస్త్రంబులచే శోషింపంజేసి నిర్భిన్నమకరుండును నిర్జలుండును నగునట్లు గావించెద, వానరసమూహంబులు పాదంబులచే గృతగమనులగుదురని లక్ష్మణగృహీత ధనుర్ధారియై క్రోధపర్యాకులేక్షణుండగుచుఁ ద్రిపురాంతకుంబోలె ధనురాకర్షణంబుగావించి తమ స్వకంబులుకంపంబునొంద నుగ్రంబులగు బాణంబులం బ్రయోగించె, నంత రామప్రేరితంబులయిన దశదిగ్విభాసమానంబులగుబాణంబులుతోయంబులం బ్రవేశింప సాగరుండుపాతాళోద్ధతుండును భీతుండును కంపమానగాత్రుండుననన్యశరణుండును కృతాంజలియగుచు కైవల్యపదకారణుండగు రాఘవుశరణంబునొంది యిట్లనిస్తుతించె.

ఓరఘునాయకా నీవు తాటకాంతకుండవు కౌశికయాగరక్షకుండవు మహాదేవశరాసనవిదారివి భక్తాభీష్టఫలప్రదాయకుండవు దేవకార్యార్థివి, రఘువంశసముద్భవుండవు, మహానుభావుండవు, ఆదిమధ్యాంతరహితుండవు, సకలసురబృందసేవ్యుండవు నిన్నుం గొనియాడ నాతరంబగునె నీకనేకవందనంబులాచరించెద శరణాగతుండగునన్ను గావుము, కోపంబుపసంహరింపుము, క్షమింపుము భూమ్యాదులుపరమేష్ఠికల్పితంబులును స్వగుణంబులనెట్లువిడువ దట్లయేను నగాధంబగుమత్స్వభావంబుమానసేర మన్నింపుము, యుష్మత్సేనాతరణంబునకుందగిన సాహాయ్యంబుజేసెదనని విన్నవించినం బ్రముదితుండై రామచంద్రుండు ఓ రత్నాకరా, మత్సైన్యసమూహంబు లంకకుంబోవలయుంగాన మార్గంబు నొందుమనిన సముద్రుండిట్లనియె. ఓ నృపోత్తమా నీవు సైన్యసమేతంబుగా లంకకుంబోవ నుపాయంబువచించెద నాకర్ణింపుము, యుష్మదాజ్ఞాగౌరవంబున శోషంబునొందిన

నన్నుంగాంచి జనంబులు దనుజబాలంబునకు భీతుండనైతినని వచింతురుగాన మరియొక్క యుపాయంబు సెప్పెద, బలవంతుండును విశ్వకర్మపుత్రుండునగు నలుండు కాష్ఠంబైన తృణంబైన శిలనైన నాయందుంచిన నవియన్నియును ధరించెద, అది సేతువనంబడు నా సేతువుచే రావణపాలితంబగు లంకాపురంబునకుంబొమ్మని పచించి సముద్రుండంతర్హితుండయ్యె నంత రాఘవుండు నలుంగాంచి సేతువొనర్పనాజ్ఞాపింప నతండిట్లనియె, ఓ నృపోత్తమా నేనుమంథరంబున మత్పితృదత్తవర తత్సదృశ సామర్థ్యుండై సేతువుంగావించెదనని మహాకాయ గరుడానిలవేగులగు వానరులు లతా తృణ మహీరుహ పర్వతాదులం దెచ్చియిచ్చుచుండ దశయోజనవిస్తీర్ణంబును శతయోజనాయతంబగు సేతువొనర్చె నివ్విధంబున్న రఘుపుంగవుండు విశ్వకర్మసుతుండగు నలునిచే సేతువుంగావించె నాసేతువుంబొందిన జనంబులు సర్వపాతకంబులం బాయుదు రీశ్వరుండు సేతుమజ్జనంబున నెవ్విధంబునం బ్రీతుండగు నవ్విధంబున జప తప హోమాదులం బ్రీతుండుగాడు. సకలతేజంబులు సూర్యతేజస్సమానంబులుగానియట్లు లోకంబున నెవ్వియు సేతుస్నాన సమానంబులుగావు. రామభద్రుండు వానరసమేతుండై యిచ్చట సేతువొనర్చుటకారంభించె నది సేతుమూలంబని వచింపంబడె నదియ దర్భశయనంబని ప్రసిద్ధిసొందె.

మరియు నిచ్చట కోటిసంఖ్యాతంబులగు తీర్థంబులుగలవు వానిగణింప శేషునికైనం దరంబుగాదు. అందు గొన్నితీర్థంబుల వచించెద, సేతువంద లిరువదినాలుగు తీర్థంబులు ముఖ్యంబులై యుండు చక్రతీర్థంబు, భేతాళవరదంబు, పాపవినాశనంబు, సీతాసరస్సు, మంగళతీర్థంబు, అమృతవాపి, బ్రహ్మకుండంబు, హనుమత్కుండంబు, అగస్త్యతీర్థంబు, రామతీర్థంబు, లక్ష్మణతీర్థంబు, జటాతీర్థంబు, లక్ష్మీతీర్థంబు, అగ్నితీర్థంబు, చక్రతీర్థంబు, శివతీర్థంబు, శంఖతీర్థంబు, యామునతీర్థంబు, గంగాతీర్థంబు, గయాతీర్థంబు, కోటితీర్థంబు, సాధ్యామృతంబు, మానసతీర్థంబు, ధనుష్కోటి అను నీయిరువదినాలుగుతీర్థములు సేతుమధ్యగతంబులై సకలపాపనాశనంబు జేయుచుండును. ఇట్టి సేతుబంధనంబు పఠించువాఁడును, ఆకర్ణించు నతండును సకలపాప రహితుండగు. మరియు భక్తియుక్తుండై వినునతండు నిహపరంబుల ననంతజయంబునుబొంది, పునర్భవంబునొందడు.

ఇది స్కాందపురాణంబున సేతుమాహాత్మ్యంబునందు

రెండవయధ్యాయము సంపూర్ణము.



## మూఁడవ అధ్యాయము.

మహనీయ గుణగరిష్ఠులగు శౌనకాది మహామునీంద్రులు, సకలపురాణాభిజ్ఞుండగు సూతుంజూచి యో సూతుఁడా ? సేతువునంగల చతుర్వింశతి ప్రధాన తీర్థంబులలోఁ బ్రథమంబగు తీర్థంబునకు చక్రతీర్థంబను నామంబు గల్గినవిధంబును వచింపుమని యడిగిన నతండిట్లనియె. విప్రోత్తములారా! చతుర్వింశతి తీర్థంబులలోఁ బ్రథమంబగు చక్రతీర్థంబు లోకప్రసిద్ధం బందుస్నానంబుగావించినను స్మరించినను లక్షజన్మార్జిత పాపనాశనంబగు, మరియు పునర్భవంబుగలుగదు, లోకంబున నీతీర్థంబుకంటె నధికంబును, తత్తుల్యంబును లేదు, గంగా, సరస్వతీ, రేవా, పంపా, గోదావరీ, కాళిందీ, మణికర్ణికాది సకలతీర్థంబులును నీతీర్థకోట్యంశంబునకైన సమంబులుగావు, ఈతీర్థంబును పూర్వకాలంబున ధర్మతీర్థంబని వచింపుదురు, పిమ్మట చక్రతీర్థంబను నామంబునొందె.

ఎట్లనిన, పూర్వంబున విష్ణుపరాయణుండగు గాలవుండను మునిపుంగవుండు దక్షిణాంభోధితీరంబున హాలాస్య (మధుర) సమీపంబునవెలయు ఫుల్లగ్రామ సమీపస్థిత క్షీరసరోంతికంబుననుండు ధర్మపుష్కరిణీతటంబున సకలభూతదయాళుండును, నిరాహారుండును, జితేంద్రియుండును, విషయనిస్స్పృహుండును, సర్వద్వంద్వవివర్జితుండును, సత్యవంతుండును, నిరుచ్ఛ్వాసుండును, నిరాస్పదుండును, వర్షాకాలంబుల నాకాశగుండును, గ్రీష్మంబునఁ బంచాగ్నిమధ్యవర్తియు, హేమంతంబున జలాశయుండును, క్వచిత్పారణంబులు జీర్ణపర్ణాశనుండును, క్వచిత్ వర్షంబులు జలాహారుండును, క్వచిదబ్దంబులు వాయుభక్షకుండునగుచు, అష్టాక్షరమంత్రధ్యానతత్పరుండునునై నిరంతరంబు హృదయంబున నారాయణునిందలంచుచు నిర్విఘ్నంబున నయుతయుగంబులు తపంబొనర్చె. నంత శ్రీమన్నారాయణుండు శంఖచక్రగదాధరుండును, వికచాంబుజపత్రాక్షుండును, సూర్యకోటిసమప్రభుండును, వినతానందనారోహుండును, ఛత్రచామర శోభితుండును, హారకేయూరమకుటకటకాది విభూషితుండును, విష్వక్సేన సనందాదిసూరిజన పరివృతుండును, వీణావేణుమృదంగవాదక నారదాది పరమహంస ప్రగీయమానవిభవుండును, పీతాంబరవిరాజితుండును, లక్ష్మీవిరాజితోరస్కుండును, నీలమేఘసమప్రభుండును, మధుసూదనుండును, సనకాదిమహాయోగిస్తుతుండును, మందస్మితసకలభువనమోహనాకారుండును, దశదిగ్విభాసమాన భూషావళియు గంఠలగ్న కౌస్తుభశోభితుండును, సువర్ణవేత్రహస్తద్వారిదళ్ళగీయమానాద్భుతచరిత్రుండునగుచు ప్రత్యక్షంబునొందె. నంత గాలవుండు విష్ణుదేవుంగాంచి పరమభక్తియుక్తుండగుచు నిట్లనిస్తుతింపందొడంగె.

ఓ దేవా, నీవు శంఖచక్రగదాధారివి, నిత్యుండవు, శుద్ధుండవు, సచ్చిదానందరూపివి, భక్తార్తినాశకుండవు, మహావ్యక్తవ్యక్తస్వరూపివి, త్రిమూర్త్యాత్మకుండవు, సృష్టిస్థిత్యం

తత్కారణుండవు, పరేశుండవు, విభూమ్నివి, సూర్యేందులోచనుండవు. విరించాద్యభినంది
తుండవు, జాత్యాదివికల్పహీనుండవు, సమస్తదోషవర్జితుండవు, సంసారభయాపహారివి,
దైత్యవినాశకుండవు, వేదాంతవేద్యుండవు, వైకుంఠవాసుండవు, రమాపతివి, భక్తజన
కుండవు, నారాయణశబ్దవాచ్యుండవు, అమితవిక్రముండవు, భగవంతుండవు నన్నుఁగాని
యాడ నాదరంబే, నీకనేకవందనంబులొనర్చెద, నన్నుఁ రక్షింపుమని విన్నవించిన రమాకాం
తుండు, గాలవకృతస్తోత్రంబునం బ్రీతుండై చతుర్భుజంబుల నలసిం గౌఁగిలించి, యో
గాలవా యుష్మత్తపంబునకును స్తోత్రంబునకునుఁ బ్రీతుండనైతి, వరంబులొసంగెద వేఁడు
మనిన నతండు ఓ రమానాయకా! సర్వధర్మజ్ఞులంగాసి నన్నుంగాంచి కృతార్థుండనైతి
ధర్మిష్ఠులు ధర్మపాలకుండగు నిన్నుంగాంతురు, భవుండును, చతుర్ముఖుండును, యోగు
లును, నిగమంబులును, వేదంబులునుం గాసి, నిన్నుంగాంచుటకంటె అధికంబగు వరం
బొండెద్దిగలదు. మహాపాతకులు నీనామస్మృతిమాత్రంబున ముక్తింగాంతు రట్టి నిన్నుం
గాంచుటంజేసి కృతార్థుండనైతి నాకనారతంబు త్వత్పాదయుగళి నిశ్చలంబగు భక్తిని
ప్రసాదింపవేయని వేఁడిన భగవంతుండిట్లనియె.

ఓ గాలవా! నిష్కామివగు నీకు నాయందు భక్తిదృఢంబుగఁగలుగు, మత్పరాయ
ణుండవు, మద్ధ్యానివి. మదర్థకృతకర్ముండవగుచు నేతిత్ప్రారబ్ధదేహాంతంబున మత్స్వరూ
పంబునొందెదవు, తత్పర్యంతం బీయాశ్రమంబున నివాసంబొనరింపుము, సకలపాపనాశని
యగు నీధర్మపుష్కరిణీతటంబున దపంబొనరించుచు సిద్ధింబొందెదవు, పూర్వంబున
ధర్ముండీదక్షిణోదధితటంబున మనంబున మహాదేవుందలంచుచు దపంబొనర్చుచుండ స్వా
ర్థం బీతీర్థంబునిర్మించెంగాన నీతీర్థంబు ధర్మతీర్థంబని ప్రఖ్యాతింగాంచె, ఇవ్విధంబున
ననేకవర్షంబులు హరుంగూర్చి దపంబొనర్ప, మహేశ్వరుండు తుష్టుండై దశదిగ్విభా
సమానుండును శూలపాణియు నగుచు ప్రత్యక్షంబయ్యె నంత, ధర్ముఁడు దయానిధియగు
మహాదేవుంగాంచి పరమసన్మోదపరిపూరితహృదయుండై వందనంబొనర్చి, ఓయీశ, నీవు
ప్రణవాత్మకుండవు, సమస్తదేవతారూపుండవు, ఊర్ధ్వరేతస్కుండవు. విరూపాక్షుం
డవు, ఆదిమధ్యాంతరహితుండవు, సమస్తజగదాధారుండవు, అజుండవు, అవ్యయుం
డవు, అప్రమేయుండవు, మహాయోగిసేవ్యుండవు, పుష్టివర్ధనుండవు, లోకాధినాథుండవు,
నీలకంఠుండవు, పశుపతివి, రుద్రుండవు, క్షేత్రపతివి, పినాకహస్తుండవు, శూలహస్తుండవు,
పంచాస్యదేహుండవు నీకనేకవందనంబులొనరించెదనని విన్నవించిన, మహాదేవుండు తత్
స్తుతిప్రీతుండై, యో ధర్ముఁడా! నీతపంబునకు మెచ్చితి, వరంబువేఁడుమనిన నతండు,
ఓ దేవా! నేనిరంతరంబు త్వద్వాహనంబగునట్లుఁ బ్రసాదించి కృతార్థుంజేయవేయని వేఁడిన
వామదేవుండట్లంగీకరించె. నంత ధర్ముండు వృషభరూపధరుండయ్యె. నీశుండునుం దద్వృ
షభారూఢుండై శోభమానుండగుచు నో ధర్ముఁడా! ఈతీర్థంబు త్వత్ఖ్యాతంబగుటంజేసి

త్వన్నామమంపై లోకంబునం బ్రసిద్ధినొందు, నీతటంబున జపతపోహోమదాన స్వాధ్యాయంబులొనర్చు జనులనంతఫలంబులం బొందుదురనివచించి, హరుండు కైలాసంబునకుం బోయె. గాన ఈతీర్థతటంబున శరీరపాతపర్యంతంబు దపంబొనర్చుము, నన్నుంబొందెదవు. మరియు నీకు భయరీవెపుడుగల్గునపుడ మచ్చక్రంబుచే నాభీతిందొలంగించెదనని విష్ణుదేవుండంతర్హితుండయ్యె.

అంత గాలవుండు విముక్తిదంబగు సాలగ్రామంబున విష్ణుదేవుం బూజింపుచు నొకానొక మాఘశుక్లయేకాదశ్యుపవాసంబుజేసి, రాత్రియందు జాగరణంబుండి, తద్ద్వాదశియందు ధర్మపుష్కరిణిం గృతావగాహుండై, కృతనిత్యకర్మకలాపుండై, తులస్యాది పుష్పంబులంగ్రహించి ఆవాహనాది షోడశోపచారంబులచే బూజించి, స్తుతించె, ఎట్లనిన:—

సహస్రశిరసుండును, మత్స్య కూర్మ వరాహ హృషీకేశ నారసింహ వామన జామదగ్న్య రాఘవ బలభద్ర కృష్ణరూపధరుండును, కల్కియు, వాసుదేవుండును, అనాధారుండును, ప్రణతార్తినాశనుండును, సర్వభూతాధారుండును, సర్వజ్ఞుండును, సర్వకర్తయు, సచ్చిదానందవిగ్రహుండును, అప్రతర్క్యుండును, అనిర్దేశ్యుండును నగు ఓవిష్ణుమూర్తీ రక్షింపుమని నిశ్చలచిత్తుండై స్తుతించుచుండునమయమున నొకరాక్షసుండు క్షుత్పీడితుండగుచు భక్షించుటకేతెంచి, యతనిం గొనిపోయె. నంత రాక్షసగృహీతుండగు గాలవుండు విష్ణుదేవుంగూర్చి, ఓ పరేశా, హరీ, విష్ణూ, గరుడధ్వజా, గ్రాహాక్రాంతుండగు గజేంద్రుంగాచితివి, హిరణ్యాసురపీడితుండగు ప్రహ్లాదునిరక్షించితివి, అట్టిభంగిన నన్నుంగావవేయని విలపించగా, విష్ణుదేవుం డనంతాదిత్యసంకాశంబును, అగ్నిసమప్రభంబును, మహాజ్వాలంబుమహానాదంబును, మహాసురవిమర్దనంబునునగు స్వచక్రంబునంపె, నది యతిత్వరితగమనంబుచే ధర్మపుష్కరిణీతటంబున కరుదెంచినంత రాక్షసుండు భయవిహ్వలుండై పలాయమానుండయ్యె, నంత నాసుదర్శనంబు రాక్షసుశిరంబు ఖండించె. నప్పుడు భూపతితుండగు రాక్షసుంగాంచి గాలవమునీంద్రుండు పరమసంతోషయుక్తుండై సుదర్శనంబునుంజూచి యిట్లనిస్తుతించె. ఓ విష్ణుచక్రమా! నీవు భక్తరక్షణదీక్షితుండవు, నారాయణకరాంభోజభూషణుండవు, సకలాసురసంహారకుశలుండవు, భక్తార్తినాశనుండవు నీకు నమస్కరించెద, మత్కృతాపరాధంబులంబాపి, యీధర్మతీర్థంబున నధివసించియుండుమాయనివేడిన సుదర్శనంబిట్లనియె.

ఓ గాలవా! రాక్షసపీడితుండగు నిన్నుంగావ విష్ణుదేవప్రేరితుండనై యరుదెంచి రక్కసుమర్దించితి, యుష్మత్ప్రార్థనంబున దేవీపట్టణపర్యంతంబు ధర్మకృతంబగు నీతీర్థంబున లోకరక్షణార్థంబై సతతంబునుండెదం గాన, సకలరాక్షసజనితంబులగు బాధలిచటం గలుగవు. మరియు నేనిందుండుటంజేసి యీతీర్థంబు చక్రతీర్థంబని ఖ్యాతింగాంచు, నీతీ

ర్థంబున స్నానంబుచేయు నరులు పుత్రపౌత్రులు విధూతపాపులై విష్ణుపదంబునొందుదురు. మరియు నీతీర్థంబునం బితరులంగూర్చి పిండదానంబొనర్చిన నాపితృసమూహంబులు స్వర్గంబునొందుదురని వచింప, గాలవుండును మఱిగొందఱు మునీంద్రులు చూచుచుండ విష్ణుచక్రంబు ధర్మతీర్థంబునం బ్రవేశించెంగాన దత్తీర్థంబు చక్రతీర్థంబను నామంబునొందె. లోకంబునం దీనితో సదృశతీర్థంబులేదు. ఈతీర్థంబునం గృతస్నాతలగువారు మోక్షంబునొందుదురు. ఈయధ్యాయంబును సమాహితచిత్తుండై పఠించువాఁడును, నాకర్ణించువతండును చక్రతీర్థాభిషేకఫలంబునొంది యిహపరలోకసుఖంబుల నొందుదురు. మరియు ఉగ్రసమాధియోగుండగు గాలవమునీంద్రుని, విష్ణుచక్రంబును, రాక్షసనాశనంబును క్షణమాత్రంబు స్మరించునతండు పాపంబునొందఁడు.

ఇది స్కాందపురాణంబున సేతుమాహాత్మ్యంబునందు

గాలవరాక్షసమోచనాఖ్యంబగు కథలంగల

మూఁడవయధ్యాయము సంపూర్ణము.



## నాల్గవ అధ్యాయము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులు, సకలపురాణాభిజ్ఞుండగు సూతున కిట్లనిరి. ఓ సూతుండా! గాలవమునీంద్రుని భక్షించుటకేతెంచిన రాక్షసుండెవ్వండు? అతనివృత్తాంతం బెఱింగింపుమనిన సూతుండిట్లనియె. కైలాససదృశంబగు హాలాస్యక్షేత్రంబున బ్రహ్మవాదులును, భస్మోద్ధూళిత సర్వాంగులును, త్రిపుండ్రాంకితమస్తకులును, రుద్రాక్షమాలాధరులును, పంచాక్షరజపనిరతులును, వసిష్ఠాత్రి ప్రముఖులునగు నిరువది నాలుగువేల ఋషీంద్రులు చంద్రచూడుండగు హాలాస్యనాథుని సేవింపుచుండు సమయంబున విశ్వావసు సుతుండును, విటజనగోష్ఠిపరాయణుండును, బలవంతుండునునగు దుర్దముండను గంధర్వుండు, వివస్త్రలగు నాజనపరివృతుండయి జలాశయంబునం జలహేలనుం డగుచు నోలలాడునవసరంబున ఋషిపుంగవుండగు వసిష్ఠుం డనేకమునిగణపరివృతుండై తపశ్శ్వరాలయంబు వెడలి మాధ్యందినకృత్యంబొనర్ప తత్తీర్థంబునకేతెంచిన నక్కామినీజనంబులు నితాంతలజ్జాభయభ్రాంతలగుచు, నంశుకంబులం ధరించిరి. సాహసంబున దుర్దముండు స్వకీయాంశుకంబు ధరింపకపోయె. నంతవసిష్ఠుండు గతత్రపుండగు గంధర్వుంగాంచి కుపితుండై యో దుర్దమా! నీవు మత్సాన్నిధ్యంబున వస్త్రధారణంబొనర్పనికారణంబున రాక్షసుండవుగమ్మని శపించి, తత్పత్నులంజూచి యో మానినీమణులారా! మీరలు మత్సందర్శనభయంబున వస్త్రధారిణులలగుటంజేసి మిమ్ముశపింపనొల్ల, త్రిదివంబు

నతుం బొందసిన, నక్కాంతాజనంబులు నిటలతట ఘటితాంజలులగుచు, మునిమండల మధ్యస్థితుండగు నవ్వసిష్ఠమునీంద్రునకు వందనంబులొనరించి, ఓ చతురానన సుతుండా! నీవు దయానిధివి, సర్వజ్ఞుండవు, నీవు కోపంబుమాని మమ్ముంగాంచినైన నితనిం గావుము; తత్త్వవిదులచే నొకయపరాధంబు క్షమింప నర్హంబు, భవచ్ఛిష్యుండగు దుర్దముని నిగ్రహింపక ననుగ్రహింపుమని ప్రార్థింపగా వసిష్ఠుండు సదయహృదయుండై ఓ కాంతామణులారా! నావచనం బమోఘంబుగాన నితండు రాక్షసత్వంబునొంది, పదియాఱవవత్సరాంతంబున యదృచ్ఛచేఁ జక్రతీర్థంబునకుంజని, తత్తీరంబునం గృతనివాసుండగు గాలవమునీంద్రుని భక్షింపంబోగా నామౌని స్తుతిప్రీత రమానాథప్రేరిత చక్రంబుచే విదళితమస్తకుండై నిజస్వరూపంబునొంది దివంబునకేతెంచి మిముంబొంది సుఖంబుండు పొందనివచించి, వసిష్ఠుండు స్వాశ్రమంబునకుంబోయె. నంత నమ్మధురభాషిణులు దురంతచింతాసాగర నిమగ్నలగుచు దుర్దముంగౌగిలించుకొని విలపించుచుండగా నతండు మహాదంష్ట్రిండును, మహాకాయుండును, రక్తశ్మశ్రు శిరోరుహుండునునగు రాక్షసుండయ్యె, నప్పుడప్పడతులు భయభ్రాంతలై త్రిదివంబునకుంబోయి రంత నారక్కసుండును, దృష్టిపథగతప్రాణులం భక్షింపుచు వేగంబున సర్వాటవీభ్రమణంబు గావించుచు సకలదేశంబులకుంబోవుచు పదియాఱవయేఁటంబున చక్రతీర్థతటంబునం దపంబుజేయు గాలవమునీంద్రు భక్షింపంబోవ, నతండు విష్ణుదేవుం బ్రస్తుతించె నంత రమారమణుండు ప్రీతుండై యతనింగావ స్వకీయంబగు చక్రంబునంపుటయు నది శీఘ్రగతి నేతెంచి తద్రక్షశ్శిరోహరణంబొనర్చె నంత నతండు రాక్షసత్వంబుమాని దివ్యదేహుండును విమానారూఢుండును, పుష్పవర్షితుండును, ప్రాంజలియునగుచు తత్సందర్శనంబున నిట్లని స్తుతించె.

ఓ కౌస్తుభవక్షః ప్రశస్తహస్తభూషణా! నీవు సకలాసుర సంహారకారివి, సహస్రాదిత్యప్రకాశుండవు, యుష్మత్కృపావేశంబున రాక్షసదేహంబుమాని ధన్యుండనైతి, మద్భార్యాజనంబులు దుఃఖింపుచుందురు. గాన నం త్రిదివంబునకుంబోవ ననుజ్ఞయొసంగుము అస్మజ్జీవాంతపర్యంతంబు త్వన్నివిష్టచిత్తుండనగు నట్లనుగ్రహింపుమని భక్తియుక్తుండై వేడ సుదర్శనంబంగీకరించె నంత దుర్దముండు తదనుజ్ఞాతుండై గాలవమునీంద్రునకు వందనంబుజేసి గంధర్వనగరంబునకుం జనియె.

పిదప గాలవుండు విష్ణుచక్రంబు నివ్విధంబునం బొగడె, ఓ చక్రరాజంబా మహాసురవిమర్దనకారివగు నీవీ దేవీపట్టణపర్యంతవ్యాపియు సకలకల్మషాపహారియునగు ధర్మతీర్థంబున వసించి, యిందు స్నానంబుసేయు జనంబులకు పాతకనాశనంబు గావించి, మోక్షంబొసంగుము. మరియు నీతీర్థంబునకు చక్రతీర్థాఖ్యంబొసంగుము. భవత్సన్నిధానంబుచే నీతీర్థస్థిత మునిసమూహంబులకు భూతప్రేతపిశాచంబువలని భయంబు నాశనంబుగావింపుమని ప్రార్థింప, చక్రంబు తత్తీర్థతిరోహితంబయ్యె. ఇట్టి రాక్షసనాశనం

బును, చక్రతీర్థమాహాత్మ్యంబును సావధానుండై యాకర్ణించునతండు సర్వపాపవిము క్తుండగునని విని శౌనకాదిమునీంద్రులిట్లనిరి.

ఓ సూతుడా? దేవీపట్టణపర్యంత విస్తీర్ణంబగు చక్రతీర్థంబేల విఖ్యాతంబయ్యెనో దాని వినుపింపుమని వేడిన నతండిట్లనియె. పూర్వంబున పర్వతంబులు పక్షసహితంబులై మనోజవంబుచే గగనభ్రమణంబొనరించుచు నగరంబులయందును, రాష్ట్రంబులయందును, గ్రామంబులయందును, గహనంబులయందును పతనంబొనర్చుచుండ, తత్పతనంబుచే సకల ప్రాణినివహంబులు పీడ్యమానంబులై నిధనంబునొందె, నంత బ్రాహ్మణాదిజనంబులు మరణంబునొందినకతంబున యజ్ఞాభావంబయ్యె నప్పుడు దేవతలు వ్యసనాక్రాంతులగుచుండ, నింద్రుండు కోపసంరక్తాంతలోచనుండగుచు, వజ్రాయుధంబుగొని తచ్ఛైలపక్షవిదళనంబొనర్చె. నంత గరుద్విహీనంబులగు కుధరంబులు సముద్రంబున బ్రవేశించుచుండ గొన్ని శైలంబులు చక్రతీర్థంబున అర్ణవభ్రాంతి నిపతనంబులయ్యెం గాన నేతచ్చక్రతీర్థంబు మధ్యప్రదేశంబున స్థలీకృతంబుంజేసె యివ్విధంబయ్యెనని శౌనకమునిశ్రేష్ఠులకు సూతుండు వచియించె.

ఇది స్కాందపురాణంబునంగల సేతుమాహాత్మ్యంబునందు
నాల్గవయధ్యాయము సంపూర్ణము.

## ఐదవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సూతుండిట్లనియె. ఓ ముని శ్రేష్ఠులారా? చక్రతీర్థప్రభావాకరంబగు నొకవిశేషంబువచించెద వినుండు, పూర్వంబున విధూముండను వసువును అలంబుసయను నప్సరయును ఘోరంబగు బ్రహ్మశాపజనితమానుష్యంబునొంది చక్రతీర్థంబునం గృతస్నాతులై తచ్ఛాపంబువలన బాసిరనిన, శౌనకాదులు విస్మయాహ్లాదయులై సూతుంగాంచి, యో పౌరాణికోత్తమా! సకలశాస్త్రార్థవిశారదుండవు, ప్రాజ్ఞుండవు, వ్యాసశిష్యుండవుంగాన, నీకుందెలియని రహస్యంబులుగలవే, చతురాననుం డేయపరాధంబున నలంబుసాసహితంబుగా విధూమవసువునకు శాపంబొసంగె నాయిరువురు భూమండలంబున నెవ్వారికి జనించి రాశాపంబెవ్విధంబునం బాసె నవ్విధంబు సవిస్తరంబుగా జెప్పుమాయని యడిగిన సూతుండిట్లనియె.

పూర్వకాలంబున సత్యలోకంబునందు భగవంతుండును స్వాయంభువుండునగు చతురాననుండు సావిత్రీసరస్వతీసహితుండై, సనక సనందన సనత్కుమార నారదాది మునిజనంబులు సేవింప, సిద్ధసాధ్యకింపురుషగణంబులు అష్టవసువులుగొలువ, నూర్వశీప్రముఖ

స్వర్వేశ్యాజనంబులు మనోహరంబులగు వాదిత్రసహితంబులగు నృత్యంబులసల్పనం జేరోలగంబుండు సమయంబున మేఘగర్జితగంభీరంబగు వీణావేణుమృదంగారవం బానందకరంబై ప్రవర్తించె నక్కాలంబున గంగాతరంగమాలాశీకర స్పర్శశీతల సుఖస్పర్శంబై మందమారుతంబువీచె నప్పుడు దివ్యాప్సరస్సంఘంబులు క్రమంబున నృత్తంబులసలుపుచుం దజ్జనిత శ్రమంబున నిశ్చేష్టితులై యుండ రూప యౌవన విభాసియగు అలంబుసాయోషారత్నంబు జనంబులమనంబుల కధికమోదంబొసంగుచు నాట్యవిలాసంబునం దేజరిల్లుచుండ, పవమానుండు తదీయాభ్యంతర వస్త్రవిక్షేపంబొనర్చె, నాసమయంబున తదీయోరుమూలంబు దృశ్యంబయ్యెఁ, దత్కాలంబున నావిలాసినింగాంచి తత్సభాస్థితులగు బ్రహ్మాదిసురసమూహంబులు నిమీలితనేత్రులైరి. విధూముండు కామశరపీడితుండై వివస్త్రయగు నవ్వధూమణింగాంచి హర్షసంపుల్లనయనుండును హృష్టరోముండయ్యెఁ. నంతచతురాననుం డలంబు నాజాతకాముండగు విధూమవసువుంగాంచి, మర్త్యంబున మనుష్యుండవుగమ్మి, యలంబునియు నచ్చటనీకుభార్యయగునని శాపంబిచ్చిన విధూముండు ఖిన్నమానసుండై చతురానను నివ్విధంబునఁ బ్రార్థించె. ఓ దయాపయోనిధీ! భగవంతుండవు భక్తవత్సలుండవు నీవునన్నుగావుము, ఘోరశాపంబనుభవింపజాల, రక్షింపుమని వేఁడిన భారతీధవుండు కృపావరిపూర్ణుండై యతనింగాంచి సాత్వికవచనంబుల నిట్లనియె.

ఓ విధూమా? మద్వచనం బసత్యంబుగాదు గానఁ దచ్ఛాపంబునకు నవధిఁగల్పించెద, భూలోకంబున నలంబుసాసహితంబుగా మనుష్యభావంబునొంది రాజన్యుండవై చిరకాలంబు భూపాలనంబుచేసి యలంబుసయందప్రతిమపుత్రుంగాంచి యతనిరాజ్యరక్షా విచక్షణుంజేసి తచ్ఛాపవిముక్తికై దక్షిణోదధితటంబున ఫుల్లగ్రామసమీపస్థిత చక్రతీర్థంబున భార్యాసహితంబుగాఁ గృతస్నానుండవై భుజంగంబు జీర్ణత్వచందంబునుంబోలె మానుష్యంబుబాసి స్వర్లోకంబునొందెదవు. చక్రతీర్థస్నానంబుగాని యేతాదృశశాపనాశనంబు గాదనిన విధూముండు దీనుండగుచు స్వగృహంబునకుఁబోయి యివ్విధంబునం జింతించె.

భూమండలంబున నేరాజన్యునకుం దనయుండనగుదు. యేమిసేయుదుదనని యనేకవిధములఁజింతించి కౌశాంబీనగరంబున శతానీకుండను నృపుండుగలం డతనిభార్యయగు విష్ణుమతియందుద్భవించెదనని నిశ్చయించి మాల్యవంత పుష్పవంత జటోత్కటులను మంత్రిత్రయంబుగాంచి తద్వృత్తాంతంబెరుఁగించి ఓ మంత్రివరులారా, మహాభయంబగు బ్రహ్మశాపంబుచే భూలోకంబున శతానీకభూవర భార్యయగు విష్ణుమతియం దుద్భవించెదనని వచించిన విని తద్బహిశ్చరప్రాణంబులగు యమాత్యనివహంబులు బాష్పపూర్ణవిలముఖులగుచు విధూముంగాంచి యిట్లనిరి.

ఓ నాయకా? త్వద్వియోగంబు సహింపంజాలముగాన మేముంగూడి మానుషభావంబునొంది శతానీకతనయుండవుగమ్ము. తన్మంత్రులగు యుగంధరవిప్రతీకవల్లభాఖ్య

లకుం బుత్రులమై మేముద్భవించి సకలకార్యంబులయందుఁ ద్వత్సేవం జేయుచుండెదమని ఇవ్విధంబునఁ బ్రార్థించు మంత్రిపుంగవులం గాంచి వసుశ్రేష్ఠుండిట్లనియె. ఓ స్నేహితులారా, మీకు నాయందుగల స్నేహంబెరుంగుదు, అయినను స్వదుష్కర్మదంబును ఘోరంబగు బ్రహ్మశాపజనితమానుష్యంబై నొకండయనువర్తించెద, యుష్మదనువర్తనంబయుక్తంబు గర్హితమానుషభావంబును మనంబునందలంచకుండు, మచ్ఛాపావధిపర్యంతంబు సహించి యుండుండని యనేకవిధంబులభాషించు విధూతుంగాంచి మంత్రులిట్లనిరి.

ఓ స్వామీ, నిరపరాధులగు మమ్ముఁ ద్యజింపం జెల్లునా యుష్మత్సహవాసనివర్తనంబుకంటె కుత్సితమానుష్యంబు శ్రేష్ఠంబని తలంచెదమని విన్నవించు సచివుల మనోభిప్రాయంబంగీకరించి కౌశాంబీనామకనగరంబున తనుగమనంబు సేయందలంచుచుండు నవసరంబున చంద్రవంశప్రవర్ధమానుండును, నర్జునకులోద్భవుండును, జనమేజయతనూజుండును, బుద్ధిమంతుండును, నీతియుతుండును, వాక్చాతుర్యసహితుండును, ప్రజాపాలనదక్షుండును, రథగజాదిచతురంగబలసమేతుండును, పరాక్రమధనుండును, వయోవంతుండును నగు క్షోణీనాయకుం డక్కౌశాంబీనగరం బేలుచుండెను. ఆనరాధిపుండు విమలమతీ సహధర్మిణీసహితుండై మంత్రరహస్యవేదియగు యుగంధరుండును రణప్రాగ్ర్యసరుండగు విక్రతికుండును సర్వకార్యవిచక్షణుండగు వల్లభాఖ్యుండనువారలంగూడి సర్వసద్గుణయుక్తుండై శిష్టజనంబులువొగడం దేజరిలుచు, చిరకాలంబు రాజ్యంబుచేసి యాత్మసదృశుండగు పుత్రకుఁబడయంజాలక శోకసంతప్తమానసుండై యుండునమయంబు మంత్రిశ్రేష్ఠుండగు యుగంధరుం డమ్మహీపతింగాంచి సాంత్వవచనపూర్వకంబుగా నిట్లనియె. ఓ నరాధిపా, శత్రుమిత్రసముండును తపస్స్వాధ్యాయనిరతుండును దాంతుండును శుచియు సత్యవచనుండునునగు శాండిల్యుండను నొకఋషిశ్రేష్ఠుండుగలం డతనిం జేరి యాత్మసదృశపుత్రుం బ్రార్థింపు మద్దయాళుండు నీకుపుత్రునొసంగు సందియంబులేదనిన మంత్రివచనం బాకర్ణించి రాజలలాముండు హర్షసంఫుల్ల లోచనుండగుచు, యుగంధర సహితుండయి తత్క్షణంబ శాండిల్యాశ్రమంబునకుం బోయి యచ్చటసుఖాసీనుండగు నామహర్షింగాంచి నమస్కరించె. నంత నామహర్షియు స్వాశ్రమంబున కరుదెంచిన నృపుంగాంచి పరమసమ్మదయుతుండై. యర్ఘ్యాదులంబూజించి త్వదాగమనకారణంబు వచింపుము. భవదభిలషితంబొనర్చెదనని విన్నవించిన తపోధనుంగాంచి యుగంధరుండిట్లనియె.

ఓ ఋషివర్యా, యీరాజన్యుండు పుత్రలాభకర్ముండై భవచ్చరణంబుల శరణంబునొందె, నీధరాధిపునకుఁ బుత్రుఁ బ్రసాదించి దుఃఖంబపనో నర్హుఁడవీవయని వేడిన శాండిల్యుఁడు దయార్ద్రచిత్తుఁడై కౌశాంబీనగరంబున కరుదెంచి తన్మహీధవుచేఁ బుత్రకామేష్టిఁజేయించె నంతటం దత్ప్రసాదంబున దశరథసదృశుండగు నానరాధిపుండు సహస్రానీకుండను పుత్రుంగాంచె. నివ్విధంబున విధూముండు శతానీకసుతుండయ్యెఁ

దన్మంత్రులగు మాల్యవంత పుష్పవంత బలోత్కటులును యుగంధర విప్రతీకవల్లభాఖ్యుల కుం గ్రమంబున యౌగంధరాయణ రుమణ్వానీక వసంతాఖ్యులం బుత్రులై జనించిరంత. నా రాజపుత్రుండు మంత్రికుమారసహితుండయి విహరింపుచుండ పంచాబ్దంబులయ్యె నంత. అలంబుసయు అయోధ్యాపతియగు కృతవర్మభూపాలలామునకుం బుత్రికయై యుదయించి, మృగావతీనామంబునం బ్రసిద్ధినొందె నివ్విధంబున విధూమాదులు భూమండలంబున మానుషరూపంబునొంది విహరించుచుండు సమయంబున మహాసత్త్వుండును దుష్టుండును అనుచరయుండునుం బలోత్కటుండును నగు అహిదంష్ట్రిండను దైత్యాధముండు, స్థూలశిరుండను రాక్షసుంగూడి దేవనగరంబునకుం బోయి దివిజనిరోధనంబు గావించి బాధించుచుండ నతిభయంకరంబగు దేవాసురయుద్ధంబాయె. నా సమయంబున సహస్రాక్షుండు సహాయార్థంబుగా శతానీకాహ్వానంబు గావింప. నద్ధరాకాంతుండు స్వరాజ్యంబునందుఁ బుత్రు నభిషిక్తుం గావించి, మాతలియుతేంద్రస్యందనారూఢుండై, దివంబునకుం బోయి దితిజులం గూడి, యతిభయంకరంబగు సమరంబు గావించి, తద్రాక్షసబాణనిహతుండయ్యె. నంత శక్రుండు వనుప దత్సారథియగు మాతలి పంచత్వంబునొందిన నృపుం గొని కౌశాంబీనగరంబునకుం బోయి తత్సుతునకుం జూపి తద్వృత్తాంతంబంతయు నెఱింగించి దివంబునకుం బోయె. నంత సహస్రానీకుండు పితృమరణదుఃఖపీడితుండయి ప్రేతకార్యంబులం జేయుచుండ శతానీకభార్యయగు విష్ణుమతియుఁ బతిమరణశోకపీడితస్వాంతయై మరణంబునొందె నంత భూపోత్తంముండు పితృమాతృపరేతకార్యంబులం గావించి, మంత్రిప్రార్థనంబున రాజ్యాభిషిక్తుండయ్యె నంత గొంతకాలంబు చనిన యుగంధరాదిమంత్రివరులును పంచత్వంబునొందిరి.

పిమ్మట సహస్రానీకుండు, యౌగంధరాయణాదుల మంత్రులం గావించుకొని మహీపాలనంబుఁ జేయుచుండ నింద్రుండు, నందనమహోత్సవకాలంబున నా నరోత్తముఁ బిలిపించి పూజించి, పూర్వవృత్తాంతం బివ్విధంబున నెఱింగించె. ఓ నరోత్తమా! పూర్వంబున నీవు విధూముండను వసురాజవు కాని మర్త్యుండవు గావు, చతుర్ముఖసభాసదనంబున సమీరచలితాంశుకయగు నలంబుసయను నచ్చరం గాంచి కామశరపీడితుండవైతి వది కాంచి సురజ్యేష్ఠుండు మానుష్యంబునొందుమని నిను శపించెం గాన నీవు రాజన్యుండవైతివి. ఆలంబుసయు నిన్నుం బొందంగోరి యయోధ్యాపురాధిపతియగు కృతవర్మునకుం బుత్రికయై యుద్భవించి మృగావతియను పేర రూపరేఖావిలాసంబునం జెలంగుచున్నయది. అచిరకాలంబున నక్కామినిం గూడి సౌఖ్యంబులం బొంది ఆత్మసదృశ తనయుం గాంచెదవు. మఱియు నీ వెప్పుడా పుత్రుని రాజ్యధురంధరుం గావించి మృగావతీసహితుండవై దక్షిణోదధితటస్థిత చక్రతీర్థంబునం గృతావగాహుండవగుదు వప్పుడ తచ్ఛాపంబువలనం బాసి, స్వస్వరూపంబునొందెదవని పురుహూతుండు వచించిన విని సహస్రానీకుండు, మృగావతీబద్ధచిత్తుండై తదుద్వాహకృతోత్సాహుండగుచు, పాకశాసనానుజ్ఞాతుండయి

స్వనగరంబునకుం బోవుచు మార్గంబునం గామశరపీడితయగు తిలోత్తమం గాంచి వీక్షింపక యనాదరణంబు గావించె, నంత నక్కాంతామణియు అనాదరకృతాపమాన పరితప్తభితమానసయై యమ్మహీధవుం జూచి ఓ నృపాలకా ? నీవు మృగావతీలోలచిత్తుండవై నన్నవమానంబు గావించినకతంబున నామృగావతిం బాసి చతుర్దశవత్సరంబులు శోకంబునొందెదవని శాపంబిచ్చిన, నృపోత్తముం డత్తిలోత్తమం గాంచి యిట్లనియె.

ఓ కామినీ ! యామృగావతిం బొంది సౌఖ్యంబులనొందెదనేని చతుర్దశవత్సరంబులు తద్వియోగంబు సహించియుండెదననుచు స్వపురంబునకుం బోయి, కృతవర్మతనూజాతయు విలాసతరువల్లరియు విభ్రమాంభోధిలహరియునగు మృగావతిని వివాహంబై తద్గతమానసుండై యనేకవిధసుఖంబులం బొందుచుండు సమయంబున గొన్నిదినంబుల కావనితారత్నంబు దౌహృదంబునొంది పీయూషప్రక్షాళిత శశిరేఖయుంబోలె పాండిమంబునొంది నిశాకరగర్భవతియగు పూర్వదిశంబోలెఁ బ్రకాశించుచుండ, నా రాజన్యుండు జాయాకామితంబుల సర్వంబునఁ దక్షణంబు ప్రేమాస్పదుండై యొసంగుచుండె నావమయంబున నక్కాంతారత్నంబు రక్తవాపీమజ్జనంబుగావింప గోరిన భూపాలలలాముం డాక్షణంబ కౌసుంభసలిలపూర్ణంబగు రక్తవాపింగావించె. నంతనమ్మానినియు తద్వాపీజలనిమజ్జనంబుగావించి రక్తతోయార్ద్రయై ఫుల్లకింశుకంబో యననొప్పుచుండ విధివశంబున సుపర్ణకులసంభవుండగు వికటుండను పక్షిశ్రేష్ఠుం డామిషభ్రాంతి నవ్వనితంగొని బహుదూరంబుపోయి ఉదయాచలకందరంబున మోహావివశయగు నవ్వధూతిలకంబునుంచె. నంత నక్కామినియు లబ్ధసౌజ్ఞయై యుత్పలతుల్యనేత్రంబుల నశ్రుజలంబులునించుచు పతివియోగజనితదుఃఖంబున ఓ నాథా, నేనెక్కడకుంబోదు, నేమినేయుదు, నింకేగతి, మీముఖంబెపుడు గాంతునని విలపింపుచు మరణంబునొందఁగోరి గజసింహాది మృగసమీపంబులకుంబోయి మరణంబునొందఁజాలక యవ్వధూరత్నంబు ఆపత్కాలంబున జనంబులకు మరణంబుగలుగుట దుర్లభంబని విలపించుచుండ, నవ్వనచరంబులగు మృగంబులు తదీయాక్రందనోన్ముఖంబులు నిష్పందగమనంబులై తృణంబుల భక్షింపకనుండె. నంత కరుణాసింధుండగు నొకమునికుమారుం డావనితనుఁ గృపచే స్వకీయాశ్రమంబునకుం గొని పోయి స్వగురువగు జమదగ్నికి నవ్విధంబెఱింగింప, నా ఋషిపుంగవుం డామానినిం గాంచి వినయపూర్వకంబుగానిట్లనియె.

ఓ కాంతామణీ, నీవంతకుందగు కృతవర్మంబోలె నన్నుంజూడుమని యాశ్వాసింప, నయ్యాశ్రమంబుననుండెనంత కొంతకాలంబునకావనిత పర్వతరాజనందనివిశాఖుం బోలె శౌర్యగుణాన్వితుండగు తనయుంగాంచె, నంతమునిపత్నులు సూతికాకృత్యంబులం జేయ నశరీరవాణి యబ్బాలుండుదయాచలసంజాతుండుగాన నుదయనాభిధుండను నామంబుగావించె నక్కుమారుండు జమదగ్నికృతచూడాదిక్రియాకలాపుండగుచు నామునీంద్రు

వలన సకలవిద్యలంగ్రహించి యౌవనంబున నక్కాననంబున మృగయాపరుండై విహరిం చుచు వ్యాధునిచేఁ గ్రహింపబడిన నొకభుజంగంబుఁ గాంచి దయాయుక్తుండై యిట్లనియె. ఓశబరాధమా, యీభుజంగంబు హింసింపనేల విడువుమన నతండిట్లనియె ఓ స్వామీ, నే దీనిచే ధనధాన్యసంగ్రహణంబొనర్చి జీవింపుదు నెవ్విధంబున విడువందగునని వచించి, యయ్యహిం బేటికయందు బంధింప, నృపకుమారుండు శబరాధముంగాంచి స్వజననీదత్త కంకణంబొసంగి, తదాశీవిషమోచనంబుగావింప, నయ్యురగంబు మనుష్యరూపంబునొంది యతనిం బాతాళంబునకుంగొంపోయె. నచ్చట ధృతరాష్ట్రసుతుండగు కిన్నరాఖ్యనాగేంద్రుం డారాజనందనుంబూజించి సఖ్యంబుగావించె నంతనతండు తద్భగినియగు లలితాఖ్యం బెండ్లియై యక్కన్యారత్నంబునంద ప్రతిమపుత్రుంగాంచి అమ్లానంబగు తాంబూలీస్రజంబును, ఘోషవతియగు వీణాదండంబును గ్రహించి శ్వశురాది సర్వసర్పశ్రేష్ఠంబులచే నమజ్ఞాతుండై భార్యాపుత్రసహితుండగుచు దుఃఖితయగుజననింజూడఁగోరి త్వరాన్వితుండై జమదగ్న్యాశ్రమంబునకుంబోయి జననింగాంచి స్వవృత్తాంతంబెఱింగింప నక్కాంతయుం బహుసంతుష్టహృదయయయ్యె.

అంత నక్కడ నాశబరుండు కౌశాంబీపురంబునకుంబోయి యొకవణిజుంగాంచి, కంకణంబు విక్రయించెదనని వచించె. నంత నావణిగ్వరుండు కంకణంబునంగల రాజముద్రంగాంచి యతనింగొని సహస్రానీకనృపాంతికంబునకుంబోయి తద్వృత్తాంతం బెఱింగించె, అంత నావసుంధరాధిపుండు స్వనామాంకితంబును, మృగావతీబాహుసంగపీయూష శీకరాసారశీతలంబగు కంకణంబుగాంచి మృగావతీవిప్రయోగవిషాగ్నిపరితాపితుండై యత్యంతదుఃఖంబునొంది శబరుంగాంచి యిట్లనియె. ఓ వ్యాధుడా, యీకంకణం బేవిధంబునం బ్రాప్తంబయ్యె నత్తెఱంగెఱింగింపుమనిన నతండు తత్ప్రాప్తిక్రమం బెఱింగించె, నంత నామహీధవుండు శబరవచనంబులాకర్ణించి, ప్రియాలోకనకౌతుకియై మంత్రిసహితుండగుచు భాస్కరోదయస్థానంబగు పర్వతంబునకుంబోయి యచ్చట విశ్రాంతసైనికుండై విశ్రమించి దయితాసంగమ ధ్యానతత్పరుండుగాన నిద్రం బొందక చింతించుచుండ, వసంతుండు విచిత్రకథాకథనంబుఁ జేయం దత్కథాశ్రవణంబున నారాత్రిగడపి, ప్రాతఃకాలంబున జంభారిపాలితంబగు పూర్వాశంబునంబోవుచు, నిర్వైరహరికుంజరంబగు జమదగ్న్యాశ్రమంబుజేరి తపోనిష్ఠుండగు మహర్షింగాంచి ప్రణతుండయ్యె, నంత నామహామునుండు రాజార్హణంబులగు పూజలొనర్చి కుశలంబడిగి ధర్మార్థసహితంబగు వచనంబు వక్కాణించె. ఓ నరనాయకా, ఈపాతివ్రత్యశాలిని భవద్భార్యయగు మృగావతి యితండు భవత్తనయుండు రామచంద్రుంబోలె సకల క్షత్త్రియచేతయగు నితండు భవత్పౌత్రుండు వీరలంగొనిపొమ్మనిన నరనాథుండు భార్యాసుత పౌత్రసమేతుండై కౌశాంబీనగరంబునకుంబోయి రాజ్యంబుజేయుచుండి, శక్రవచనంబుదలంచి, మానుష్యంబుగ

హించి ధీమంతుండగు సుదయనాఖ్యపుత్రకు రాజ్యపాలనదక్షుం జేసి, స్వశాపనివృత్తిం గోరి యౌగంధరాయణాది మంత్రిసమేతుండై భార్యాయుక్తుండై ఛాయాభూతంబులగు రక్షం బులచే దక్షిణోదధితటంబునకుం బోయి యచ్చటనుండు చక్రతీర్థంబున స్నానంబుగావించె యౌగంధరాయణాదులు స్నానంబుగావించిరంత. సహస్రానీకాదులు శాపంబువలనం బాసి విధూతపాపులై దివ్యాంబరధరులును దివ్యమాల్యానులేపనులగుచు స్వరూపంబులనొంది మహోజ్జ్వలంబులగు విమానాధిరోహణంబుగావించి, సమస్తజనంబులుం జూచుచుండ స్వర్లోకంబునకుం బోయి విదితతీర్థవైభవులుగానం దత్కాలప్రభృతి చక్రతీర్థస్నానంబు గావించుచుందురు. ఏనరులైనం దచ్చక్రతీర్థంబునం గృతస్నానులగుదు రానరులు స్వర్గవాసంబునొందుదురు. ఓ మునిశ్రేష్ఠులారా, విధూమచరితంబువచించితి, నెవ్వండైన నీయధ్యాయంబు సమాహితచిత్తుండయి పఠియించునతం డీప్సితసుఖంబులం బొందును.

ఇది స్కాందపురాణంబునంగల సేతుమాహాత్మ్యంబునందు
చక్రతీర్థప్రభావాకరంబగు అలంబుసా విధూమ శాపమోక్షణంబను కథలంగల
ఐదవయధ్యాయము సంపూర్ణము.

## ఆఱవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాది మహామునీంద్రులు సకలపురాణాభిజ్ఞుండగు సూతునకిట్లనిరి. ఓ సూతుఁడా, చక్రతీర్థంబు దేవీపట్టణపర్యంతమున్నదని తెలిపితివి గదా, ఆదేవీపట్టణం బెచ్చటనుండునది ఆప్పురవరఁబునకు ఆనామధేయం బెవ్విధంబున సంప్రాప్తంబయ్యె నాచక్రతీర్థఁబున స్నానంబాచరించిన వారలకును రామసేతుమూలంబున మజ్జనంబొనర్చినవారలకు నేలాటిపుణ్యంబులొనఁగూడు నీవృత్తాంతంబంతయు సవిస్తరంబుగా నానతిమ్మని యడుగుటయు, నతండు ఓ మునిపుంగవులారా, వినుండు రఘువంశవిస్తారకుండగు రాఘవుండు సేతునిర్మాణంబుగావించు కాలఁబున నవపాషాణంబులెచ్చటం బ్రతిష్ఠచేసె నాప్రదేశంబుననే దేవీపట్టణంబున్నయది. తదంతంబై చక్రతీర్థఁం బొప్పుచుండు నప్పురవరంబునకు దేవీపురంబను పేరొదవిన తెఱంగెఱింగించెద నేకాగ్రతతో జిత్తగింపుండని యిట్లనియె.

పూర్వకాలంబున దితి తనపుత్రు లమరనిహతులైనం బుత్రిక నవలోకించి యిట్లని వచించె. ఇంద్రాదిదేవతల కెట్టిపట్టివలన గిట్టులొదవునట్టివానిం గనుటకై తపంబుసేయం జనుమని యుక్కరణివక్కాణింప, జననివలన ననుజ్ఞాతయై మహిషీరూపఁబునొంది యొక్కయరణ్యప్రదేశంబునం బంచాగ్నిమధ్యఁబున నిలచి యత్యుగ్రంబగు తపంబొనరించె.

అతపఃప్రభావంబువలన మూఁడులోకంబులు దల్లడంబందె నింద్రాదిదేవాధిపతులునుదలంకి రట్టిసమయంబున సుపార్శ్వుండను మునివరుం డాతపంబునకుమెచ్చి నీకు మహిషవదనుండును మనుష్యశరీరుండునునగు తనూజుండుదయించు నతండు సబలుండగు బలారినోడుచుబలంబున వెలయునని పలికి నిజలోకంబునకుంబోయె. నంత పూర్వోక్తంబగు వాణీమనోహరవాక్యప్రకారంబున మహిషవదనుండుదయించి యుదధిపర్వంబులనుప్పొంగుమాడ్కిం బ్రవర్ధమానుండగుచుండ, విప్రజిత్తిపుత్రుండగు విద్యున్మాలిమొదలగు మనుజాదు లతనిసాన్నిధ్యంబుజేరి యో మహిషాసురోత్తమా, పూర్వకాలంబున మనవారలొంటన దేవాధిపత్యంబు చిత్రజాతజనకునారాధించి తత్సహాయంబుచేనొందియున్న పులోజాజానుం దేవసైన్యయుతంబుగాజయించి తద్రాజ్యంబుబొందు, నీవు విరించదత్తవర బలోద్ధతుండవు, నసమానుండవుగాన నీదగుపరాక్రమంబు ప్రకటంబుగావించి యశంబునొందుమని యివ్విధంబున బోధించు నిశాచరనికంబులవలనం బ్రీతుండయి వారలంగూడి యుద్ధార్థియై యమరావతికింబోయెనంత దేవాసురులకుం దుములంబగు సమరంబు నూఱేండ్లువడిచె నయ్యావసరంబున నింద్రాద్యమరు లసురులతోడఁ బోరొనర్పంజాలక కాందిశీకులై జలజాతజాతపురోభాగంబుఁజేరిరంత, దదాగమనకారణం బద్దేవుండెఱింగి వారలందోడ్కొని విశ్వపాలనాసమర్థులగు ఉమారమానాయకులుండెడి తావునకుంజని యద్దేవాగ్రణులకనేకవందనంబులాచరించి పలుదెఱంగులంబొగడి యావద్వృత్తాంతంబునుందెలియపరచె నది యెట్లనిన, ఓ జగద్రక్షకులారా, మహిషాసురుం డింద్రాద్యష్టదిక్పాలకులం దక్కిన దేవతానీకంబులంబీడించి, వారలయధికారంబుల నిరాకరించి యన్నియుఁ దానొందియున్నవాడుగానఁ దివిజులందరు నిప్పుడు తదీయబాధచేఁ దమతమనివాసంబులంబాసి మనుష్యప్రాయులై మనుజలోకంబున సంచరించెదరు ఈవృత్తాంతంబు మీకెఱింగింపనేతెంచితి ఈతెరగంటిదొరలంగాంచి రక్షింపుడని విన్నవించిన తద్వచనంబులాలించి, యాశంకరనారాయణులు అత్యంతకోపదీపితకరాళదంష్ట్రులై రంత నెల్ల వేల్పులు నట్టులై రపుడు ఉమానాయకాననంబున నొక్క తేజంబును, కమలాపతిముఖంబున నొక్క తేజంబును, నలువవదనంబుననొక్క తేజంబు నుద్భవించె దక్కిన దేవతాముఖంబులవలనం దత్ప్రకారంబ నొక్కొక్క తేజంబుజనించి యొకరాశియయ్యె. నా తేజోరాశి ప్రకాశమాన పర్వతంబుమాడ్కి స్వప్రభావ్యాపితదిగంతరంబై నొకస్త్రీరూపంబునొందె నదెట్లనిన, శివతేజంబు ముఖంబును, విష్ణుతేజంబు భుజంబులును, బ్రహ్మతేజంబు చరణంబులును, యింద్రతేజంబు మధ్యంబును, వైవస్వతతేజంబు కేశంబులును, చంద్రతేజంబు కుచంబులును, వరుణతేజంబు జంఘోరువులును, పృథ్వీతేజంబు నితంబంబును, అర్కతేజంబు పాదాంగుళులును, వసుతేజంబు కరాంగుళులును, కౌబేరతేజంబు నాసికంబును, నవప్రజాపతులతేజంబులు దంతపఙ్క్తులును, హవ్యవాహనతేజంబు చక్షుర్ద్వయంబును, వాయుతేజంబు స్కంధభ్రూశ్రవణయుగళంబులయ్యెం దక్కిన తేజంబులచే నితరావయవంబులయ్యె. " ఇవ్విధంబున కృతా

వయవయై యావిర్భవించి, ప్రభాశాలియు సురాసురదుర్ధర్షతరయు నగు దుర్గాదేవిం గాంచి మహిషాసురపీడితులగు నమరులు ప్రీతింబొంది భూషణవస్త్రచందనాదులొసంగి రంత నాదేవియు వస్త్రాభరణభూషితయు కుసుమహారశోభితయు పరిచారికాసమన్విత యగుచు భీషణంబగు నట్టహాసంబుగావింప, తద్భైరవనాదంబుచే సకలజగంబులు కంపంబునొందె నపుడు రుద్రాదులు స్వకీయంబులగు శూలాద్యాయుధంబులొసంగ నద్దేవియు సింహవాహనాధిష్ఠితయయ్యె.

నంత మునిసమూహంబులు విద్యాధరాది దేవసమూహంబులు జయజయ యను శబ్దపూర్వకంబుగా స్తోత్రంబుచేయుచుండ, నతిభీషణంబగు దేవీసింహనాదంబు విని, దైత్యనివహంబులు యుద్యతాయుధులై, మహిషాసుర యుక్తులగుచు నేతెంచి రాసమయంబున త్రిలోకవ్యాపితతేజోవతియు, ఆయుధవిభాసితహస్తయు, నాదకంపిత భూతలయు, క్షోభితాశేష శేషాది నాగసమూహయు నగు చండికం గాంచి యమరులు రథగజతురగారూఢులై అస్త్రశస్త్రాద్యాయుధపాణులగుచు రాక్షసులం గూడి సమరంబుఁ జేయుచుండ, మహిషవదనుం డద్దేవితో నాయోధనంబు గావించె, నాసమయంబున లక్షకోటి సహస్రసంఖ్యగల రాక్షససేనానాయకు లసంఖ్యాతులగు సైన్యంబులం గూడి నద్దేవిం జుట్టుకొని శరవర్షంబు వర్షింప నంబికయు నాబాణవర్షంబుల స్వకార్ముకవినిసృతబాణంబులచే విదళించి దైత్యశరీరంబుల నపరిమితశరంబులేయం గాంచి, నిలింపులు నిర్భయులగుచు నతిభయంకరాస్త్రంబుల నసురుల నిర్మూలనంబు గావింప మహిషదానవుండు క్రోధసంరక్తాంతలోచనుండై చాపంబుఁగొని మహానాదంబుగ టంకారంబు గావించి శతమఖుమీఁద దశసహస్రవిశిఖంబులు, వైవస్వతుపై పంచసహస్రశరంబులు, వరుణుపై యష్టసహస్రబాణంబులు, నరవాహనుమీద షట్సహస్ర శిలీముఖంబులు, దక్కిన దేవసమూహంబులపై ప్రత్యేకప్రత్యేకంబుగా నయుతవిశిఖంబులేయ నింద్రాదులు భీతింబొంది దుర్గాదేవిని శరణంబునొంది రక్షింపుమని వేడిన నద్దేవి భూతభేతాళకాది స్వగణంబులం గాంచి, ఓరీ మీరలసురబలంబుల నాశనంబు గావింపుఁడేను మదోద్ధతుండగు మహిషాసురు మర్దించెదననిన వారలవ్విధంబైన నాసురసైన్యంబుల క్షయంబొనర్చుచుండ, నమ్మహిషవదనుండు తద్దేవీగణనిహతంబగు స్వసైన్యంబు గాంచి యుద్ధోన్ముఖుండయ్యె నప్పుడు మహానాదుండును సుచక్షువును మహాహనువును, మహాదంతుడును మహాభక్షమహోదరులును మదోత్కటపంచాస్యులును పాదచూడబహునేత్రప్రబాహుకులును ఏకాక్షైకపాద బహుపాదకులును మొదలగు మహిషాసురుని యమాత్యులు యుద్ధార్థులయి దేవీపురోభాగంబున కేతెంచిరంత. అంబికయు మనోజవంబగు సింహవాహనారోహణయై ప్రళయాంబుదనిర్ఘోషచాపాకర్షణంబు గావించి వజ్రీవజ్రసమానంబులును కాంచనపుంఖితంబులగు శరంబులు ప్రయోగింప తద్బాణనిహతిచే దశలక్షగజయుతుండును శతలక్షహయసమేతుండును మహాహనుం

డును దైత్యయూధనాయకుండు నిహతుండయ్యె. మఱియు లక్షకోటిసహస్ర ప్రధానాసుర నాయకులు రథగజాదిసైన్యంబులంగూడి యామమాత్రంబున నిహతులైరి. మౌనివరులారా! యివ్విధంబువీక్షింప నాశ్చర్యజనకంబయ్యెను.

ఇది స్కాందపురాణంబున సేతుమాహాత్మ్యంబునందు
దేవీపుత్రాఖ్యానంబును, మహిషాసురయుద్ధంబనుకథలుగల
ఆఱవయధ్యాయము సంపూర్ణము.

## ఏడవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకలపురాణాభిజ్ఞుండగు సూతుండిట్లనియె. వినుండు ఓ ఋషిశ్రేష్ఠులారా, మహిషాసురుండు దేవీమహిమంబునం జేసి నిహతంబగు నిజసైన్యంబునవలోకించి చండకోపుండనువానితో నీవీదుర్వినీతం గిట్టి భంజింపుమనుటయు నతండట్లకాకయని నిజకోదండం బెక్కిడి యాదేవిపై ఘోరంబగు బాణవర్షంబుగురిసిన తద్వర్షంబంతయు స్వకీయ శస్త్రంబులచే నురుముచేసి వాని రథసూతవాజిబాణాదులనెల్లం దునిమి వానిం జక్కగానొచ్చునట్లు మర్దించె, నంత వాడును గోపించి ఖడ్గంబుచే సింహంబునొవ్వనేసి తద్దేవీసవ్యభుజంబుపై ఖడ్గంబువైవ నయ్యాయుధంబు తద్భుజంబును భేదింపంజాలక సహస్రశకలంబులయ్యె. నంత చండికయు శూలంబుగొని వానిం బరేతనిలయుంగావించె. ఇవ్విధంబున రణభూమింగూలిన చండకోపునిం గాంచి చిత్రభానుండు ఘంటానాదంబుల మ్రోయుచున్న శక్తిం బ్రయోగింప నద్దేవియు కోపోద్దీపితహుంకారంబున నాశక్తినిమరలించి శూలంబుచే నయ్యామిసీచరుని మృతుంగావించె. పిదప కరాళుండను నక్తంచరుం డక్షముండై యేతెంచిన ముష్టిఘాతంబుల నాతనిం బరలోకప్రాప్తుం జేసె. తదనంతరంబ గదనంబుగోరి యెదురనిలిచియున్న మదోన్మత్తభాష్కళాంధకనామంబులంగల పూర్వామరులం గదాపట్టసరథాంగంబులవలనం గనుపుగొట్టి మరియునుం దక్కిన మహిషాసురామాత్యులం దత్ప్రకారంబున మరణంబునొందించిన మహిషాసురుండు స్వసైన్యమరణజంబగు కోపంబుదీపింప, దేవీపరివేష్టితంబులగు గణంబులలోఁ గొందఱిందినుచు, కొందఱ ఖురలవలనం గొందఱ గొరిజలవలనం గొందఱ నూర్పులచేతం బెదరించి మరణంబునొందించి దేవవాహనంబగు సింహంబును మరణంబునొందింపంగవిసి యట్టహాసంబానర్ప నాబలవంతంబగు మృగరాజంబు స్వహస్తనఖంబులవలన నాదుర్జాతిశరీరంబు భేదించుచుండ నంబయు నయ్యసురుం జంపంగోరి నిజాస్త్రపాశంబులవలనబంధించుటయు, నతండు మహిషరూపంబువిడిచి సింహాకృతినొందిన దేవియు నాసింహంబును హరింపబోవ నతండారూపంబుమాని మానుషత్వంబునొంది ఖడ్గపాణియయ్యె, నంబయు ననేకాంశుకంబును వానిపైఁ బ్రయోగించి మిగులనొప్పించె, నంతఁ దద్రూపంబు వదలి

యమ్మానుషాదుండు మదగజంబై స్వహస్తంబున నాసింహంబుబట్టి యీడువందొడంగె నంత నాసింహంబు నఖంబులవిదళించ నానక్తంచరుండా రూపంబుమానినిజరూపంబునొందె నప్పుడచ్చెలియ మధుపానంబుగావించి పరవశహృదయయు నరుణలోచనయయ్యె. నాసమయంబున పర్వతోత్కరంబులద్దేవిపైవైవ నానగసమూహంబుల బాణంబులచూర్ణంబులు గావించి చండికనారాక్షసుంగాంచియిట్లనియె. ఓ నక్తంచరాధమా, ఏనుమధుపానంబు గావించు పర్యంతంబు గర్వగరిష్ఠుండవై యుండు నిన్నుయమసదనంబుకుంబంచి సిద్ధసాధ్యాదులవారిరా నివాసంబులకుంజేర్చెదనని ముష్టింబోడువనతండు దేవీతాడనభీతుండును కాందిశీకుండునునగుచు త్వరితగమనంబుచే దక్షిణోదధితటంబునకుంబార నద్దేవియు మృగేంద్రవాహనారూఢయగుచు ననుగమించెనంత్త నాసురవైరి దశయోజనవిశాలంబగు ధర్మపుష్కరిణి జలంబులందాగె నంబికయుతత్తటంబునకుంబోయి యతనింగానక రోయుచున్నసమయంబున నశరీరవాణియిట్లనియె. ఓ భద్రకాళి మహిషాసురుండు భవన్ముష్టిప్రహారచకితుండై ధర్మతీర్థజలంబులందాగియున్న వాడితనింబట్టి వధింపవలయుననిన చండికయు నసురవధోద్యుక్తయై తనవాహనంబుతో నిట్లనియె, ఓ మృగేంద్రుడా నీవత్యంతబలపరాక్రమశాలివి నీధర్మతీర్థజలంబుల నిశ్శేషంబుగా పానంబుగావింపుమని నతండట్ల గావింప తత్తీర్థరాజంబుజలరహితంబును ధూళియుక్తంబునయ్యె నంత్తమహిషాసురుండు దీనుండై భీతినొందుచుండ నద్దేవిస్వపాదంబులనాక్రమించి తీక్ష్ణశూలతాడనంబుగావించి యసింగొని తద్వక్షఃశిరః ఖండనంబొనర్చెను. ఓ భూసురాలా యివ్విధంబున సబలంబుగా మహిషవదనుండు నిహతుండయ్యెనంత సిద్ధసాధ్యాది దేవగణంబులును మహర్షిసమూహంబులు నద్దేవి ననేకవిధంబులంగొనియాడి తదనుజ్ఞాతులై ధర్మపుష్కరిణి నమృతంబుచే పూర్ణంబుగావించిరి గానతత్తీర్థంబమృతతీర్థంబను నామంబునొందె నద్దేవియు తత్తీర్థతటంబున స్వనామాంకితంబగు పురంబుగావించి, యీనగర నివాసులు నిరోగులయ్యెదరనియు నీచక్రతీర్థంబునం గృతావగాహులభిమత సుఖంబులంబొందుదురనియు వరంబులొసంగెంగాన నాపురవరంబుదేవీపట్టణంబను నామంబునొందె నోమునివరులారా శ్రీరామభద్రుండు సుముహూర్తంబున విఘ్నేశుంబూజించి తిలకస్వామి వందనంబుగావించి మహాదేవ్యనుజ్ఞాతుండై దేవీపట్టణంబుమొదలుకొని స్వహస్తంబుచే నవపాషాణంబులస్థాపించి సేతుబంధనారంభంబుగావించె నంతనలుండు నొకసింహాసనంబు గావింప రఘువరుండు తదధిరోహణంబుగావించియుండె నయ్యవసరంబున వానరవీరులు పర్వతపాదపాదులందెచ్చి యిచ్చుచుండ నళుండయిదుదివసంబులకు లంకాపురపర్యంతంబు పదియోజనంబువెడల్పును శతయోజనంబుల నిడుపునుంగల సేతువొనర్చె.

ఓ మునివరులారా యానళకృతంబగుసేతువు సకలపాపనాశనకారియై ప్రకాశించుచుండు నెవ్వండైన దేవీపట్టణసమీపంబున నవపాషాణరూపకంబగు సేతుమూలంబునంక్షౌర

తీర్థంబునందునుస్నానంబుగావించి సేత్వధినాథుండగు హరిభజించునతండు పాపవిశుద్ధిం బొందు ఓమునిపుంగవులారా దేవీపట్టణంబుమొదలునలుండొనర్చిన సేతుబంధనప్రదేశంబు సేతుమూలంబనిపనింపబడు మరియును సేతువునకు పశ్చిమప్రదేశంబున దర్భశయ్యాయనియు పూర్వప్రదేశంబు దుగాఖ్యురంబనియు నీరెండు సేతుమూలంబనియు నచ్చటస్నానంబుగావించిన పాపనాశనంబగుననియు వచింపబడు ఏనరులయిన దేవీపట్టణసమీపంబునను దర్భశయ్యాతీరంబునను యేమార్గంబుజేనైనంబోయి స్నానంబొనర్తురామనుజులు లక్షజన్మంబులనొనర్చిన పాపపుంజంబులు నాశనంబునొందు ముక్తియుసులభంబగు భూమండలంబునంగల గంగాది సకలతీర్థంబులు చక్రతీర్థషోడశాంశంబునకైనం దుల్యంబులుగావు సేతుస్నానంబుగావింపంగోరుమనుజుడు ప్రథమంబున నవపాషాణమధ్యప్రదేశంబున స్నానంబుగావించి క్షేత్రపిండంబిడి పిమ్మటచక్రతీర్థంబున స్నానంబుగావించి సేతునాయకుండగు హరింభజింపవలయు నివ్విధంబునగావించిననరుండు సకలపాపరహితుండై నిర్మలుండగు ఎవ్వండైన నశక్తుండైన రామచంద్రరూఢంబగు సింహాసనంబుగాంచి నమస్కరించునతండు నరకభయంబునొందడు నరుండు ప్రథమంబున సేతువుంగాంచి రామచంద్రుమనంబునందలంచుచు రఘువీరపాదసంచారంబుచే పవిత్రంబులగు ధూళిసమూహంబుగలదియు దశవదనశిరచ్ఛేదకారణంబును రామచంద్రిసేతువు మోక్షమార్గైకహేతువు సీతామానసాంబుజ చిత్రభానుమండలంబగు సేతువునకుం వందనంబొనర్చెదనని తన్మంత్రంబువచించి సాష్టాంగనమస్కారంబుగావించి పాషాణనవకమధ్యంబునను చక్రతీర్థంబునను స్నానంబుగావించి పిమ్మట భేతాళవరదంబునకుంబోవలయు ఎవ్వండైన భక్తియుక్తుండై సీయధ్యాయంబుపఠించు నాకర్ణించు నామనుజునకు స్వర్గాదిభోగంబులన్నియు సులభంబులు మోక్షంబును కరస్థితంబైయుండు

ఇది స్కాందపురాణంబునంగల సేతుమాహాత్మ్యంబునందు

చక్రతీర్థప్రశంసయు దేవపురాభిధానకథనంబును మహిషాసుర

వధయునను కథలుంగల

యేడవయధ్యాయము సంపూర్ణము.



## ఎనిమిదవ అధ్యాయము.



మహనీయ గుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులు సకలపురాణాభిజ్ఞుండగు సూతునకిట్లనిరి. ఓ వ్యాసశిష్యుడా నీవు సకలధర్మజ్ఞుండవు నీచే చెప్పంబడు నమృతతుల్యంబులగు కథలనాకర్ణించు మాకుదనివిగలుగదు గానవచింపుచుండుము చక్రతీర్థదక్షిణప్రదేశంబున భేతాళవరదంబను తీర్థంబుగలదని వక్కాణించితివి ఆ తీర్థంబునకు భేతాళవర

దాక్ష్యంబేలాగునంగల్గె నత్తీర్థప్రభావంబెవ్విధంబునవతిల్లు నీవృత్తాంతంబెరుంగింపుమని వేడిన నతండిట్లనియె. ఓ మునివరులారా, శ్రేష్ఠంబగు విషయంబడిగితి రతిగుహ్యంబత్యాద్భుతంబు పామరులకైన సంతోషజనకంబగు పూర్వవృత్తింబెరుంగించెద మనశ్చంచలంబు మాని వినుండు కైలాసంబున శంకరుండు పార్వతీకేళిలోలుండై యుండి యత్యద్భుతంబగు నొకకథవచించె నదియెరుంగించెద నాకర్ణింపుండు.

పూర్వంబున సత్యవచనుండగు గాలవుండను మునిపుంగవుండు పరబ్రహ్మంగూర్చి దపంబుగావింపుచుండె నామహనీయునకు కాంతిమతియను తనూజాతగలదా కన్యపితృశుశ్రూషణంబుగావింపుచు దేవపూజార్థంబై పుష్పాదులంబెచ్చియిచ్చుచు వేదీసమ్మార్జనాదులం గావింపుచుండి యొకానొకదినంబున పుష్పంబులకై వనంబునకుంబోయి రమ్యంబులగు పుష్పంబులం గ్రహించుకొని తిరిగివచ్చుచుండ సుదర్శనసుకర్ణులను విద్యాధర పుత్రులిరువురు విమానారూఢులై సంచరించుచు రతీసమానారూపవతియు యౌవనోపేతయునగు నక్కన్యంగాంచిరందు జ్యేష్ఠుండగు సుదర్శనుం డక్కన్యకయందు బద్ధానురాగుడై విమానావరోహణంబుగావించి దానిసమీపంబునకుం జేరి యిట్లనియె. ఓ కన్యకామణి నీవెవరి పుత్రిక వేమిటికొరకిందున్నదాన నేనువిద్యాధరరాజపుత్రుండ సుదర్శనుండనువాడ రూపరేఖావిలాసంబులుగలవాడ నన్నుంగరుణాదృష్టినవలోకించి రక్షించి భర్తగాగైకొనుమట్లయిన సమస్తభోగంబులు గలుగంజేసెదనని యవ్విధంబున సంభాషించు విద్యాధర పుత్రువాక్యంబులాలించి యక్కన్యకధర్మయుక్తంబగువచనంబు వక్కాణించె నో విద్యాధర కుమారకా నేగాలవమహామునీశ్వరపుత్రికను పితృశుశ్రూషాపరనై కన్యాత్వంబునం జరింపుచున్నదాన నిప్పుడు దేవపూజార్థంబై పుష్పంబులంగొనిపోవుటకువచ్చి యామమాత్రకాలంబయ్యె నింత నాలస్యంబయ్యెనేని దేవతార్చనానిష్ఠుండగు మజ్జనకుండు కోపించుగాన శీఘ్రంబునంబోవలయు కన్యలు పిత్రధీనలుగాని యొకానొకసమయంబునందైన స్వాతంత్ర్యంబు నొందనోపరు నన్నుగోరెదవేని మజ్జనకునడుగుమని చెప్పుచు కాంతిమతి పితృసాన్నిధ్యంబునకుంబోవుటకు ప్రయత్నంబుగావింప గంధర్వపుత్రుండు కామాతురుండై యక్కన్యాశిరోజంబులంబట్టి యీడ్చినంగురరియుంబోలె విలపించుచు వాపోయెండి యీవిద్యాధర కుమారకుండు నన్నుబలాత్కారంబు గావింపుచున్నవాడు సంరక్షణం బొనరింపుమని యాక్రోశింప నయ్యాశ్రమవాసులగు తపసులాలించి గాలవుదోడ్కొనివచ్చి విద్యాధర కుమారునిం దదీయహస్తావలంబిత కేశపాశయగు కాంతిమతింగాంచిరంత గాలవుండు కోపోద్దీపితమానసుండై సుదర్శనునవలోకించి యోరీ నాపుత్రికం బలాత్కారం బొనరించితి విట్టికృత్యంబు భూతభేతాళసన్నతేయజాతులుగాని యితరులెవ్వరుంజేయరు భూలోకంబుల మనుష్యుండవై జన్మించి పిమ్మట సర్వజనవింద్యమానంబగు భేతాళత్వంబునొంది మాంసాస్థిశోణితంబు లాహారంబుగా గొనియుండుము దుర్మార్గుండగు నీసాంగత్యంబుచే

నీయనుజుండగు సుకర్ణుండును మానుష్యంబునొంది కొన్నిదినంబులకు నిరపరాధుండగాన విజ్ఞప్తికౌతుకుండను విద్యాధరనాథదర్శనంబుచే శాపంబుదొలంగి స్వరూపంబునొందు నీవు భేతాళత్వంబునొంది చిరకాలంబుసంచరించెదవని క్రూరంబగుశాపంబొసంగి గాలవ మునీంద్రుండు తనూజుండోట్టుకొని నిజాశ్రమంబునకుంబోయె నంత్త విద్యాధరకుమారులగు సుదర్శనసుకర్ణులు పరితాపంబునొందుచు యమునానదీతటంబునకుంజని యచ్చట నున్న శీలసంపన్నుడగు గోవిందస్వామియను ద్విజునకుందనూజులై యుదయించి విజయదత్తాశోకదత్తానామంబులంబొంది వృద్ధింబొందుచుండ గొన్నిదినంబుల కనావృష్టిదోషంబున ద్వాదశవర్షక్షామంబుసంభవించె నంతగోవిందస్వామి దుర్భిక్షోపహతంబగు నిజపురంబువిడిచి సపుత్రకళత్రుండై కాశీపట్టణంబునకుంబోయి యందునివాసయోగ్యంబగు ప్రయాగతీర్థంబున కపాలమాలికాధరుండై పుణ్యవంతంబులుసలుపుచున్న నొక్కయతీంద్రు నవలోకించి నమస్కరింప నమ్మునివరుండతని నాశీర్వదించి యిట్లనియె.

ఓ బ్రాహ్మణోత్తమా నీజ్యేష్ఠపుత్రుడగు విజయదత్తునికి నీకును శీఘ్రకాలంబున వియోగంబు సంభవించుననినవిని గోవిందస్వామి సూర్యాస్తమయకాలంబగుటంజేసి సంధ్యావందనాది కృత్యంబులుగావించి శూన్యదేవాలయంబున భార్యాపుత్రసహితుండై విశ్రమించె నంత అశోకదత్తుండును తజ్జననియునై పుట్టంబులు విదిర్చుకొని నిద్రంబొందిరి విజయదత్తుండు మార్గాయాసపీడితుండగుటంజేసి శీతజ్వరబాధంబొంది దుఃఖించుచుండె నప్పుడు తజ్జనకుండగు గోవిందస్వామి శీతబాధాపీడితుండగు సూనుం గౌగిలించుకొని తాపోపశమనంబు గావింపుచుండె నంతవిజయదత్తుండు తండ్రింగాంచి వోతండ్రీ శీతజ్వరంబు బాధించుచున్నదిగాన నగ్నిందెచ్చి యాబాధం దొలంగింపుమనిన నతండనేక ప్రదేశంబులకుంబోయి యగ్నింగానక పుత్రసమీపంబునకరుదెంచి వోరీ యిప్పుడర్ధరాత్రికాలంబయినందున నగ్నిదేవదుర్లభంబనినవిని జ్వరార్తుండగు విజయదత్తుండు దీనుండై యిట్లనియె, వోతండ్రీ నేనీబాధసహింపజాల నీవగ్నియెచ్చటందొరకదనిబొంకెదవుజూడు మచ్చటదూరంబున జ్వాలామాలాభీలంబును నతిభయంకరంబగు నగ్నిదీపింపుచున్నది శీఘ్రంబున నీవచటికింబోయి యగ్నిందెచ్చి మదీయబాధందొలంగింపుమని విలపించుచున్న పుత్రుంజూచి గోవిందస్వామియిట్లనియె, ఓ పుత్రకా నేనిప్పుడుచెప్పెడిది యనృతంబుగా దగ్నియరయుచుంబోయి దూరంబునమండుచుండెడి యగ్నింగాంచితది శ్మశానాగ్ని అతిభయంకర జ్వాలాభీలంబైయున్నది అదియమంగళం బాయగ్నింగాంచుకొనిన నాయుఃక్షయంబగుగానందే లేదనిన విజయదత్తుండు శీతపీడితుండయి యిట్లనియె.

ఓ తండ్రీ నేనీబాధసహింపంజాల నదియత్వరాగ్నియైన చితాగ్నియైనందెమ్మా దానంజేసి పంచత్వంబునొందినంగాని మేలగుననివిలపింప, గోవిందస్వామి పుత్రమోహపీడితుండయి, శీఘ్రగమనంబుచే శ్మశానంబున కగ్నిదేవంబోవుచుండ, విజయదత్తుండు తన

తండ్రి యగ్నిం దెచ్చునో తేకుండునో యని సందియంబుచే వెంటంజని యందొకచోటం బ్రజ్వలించు నగ్నినొద్దంగూర్చుండి శైత్యోపశమనంబుగావించుచు మరియొకప్రదేశంబున వర్తులాకారంబయి రక్తవర్ణజ్వాలాకలితంబుగా మండుచుండుమంటంజూచి జనకుంగాంచి యోతండ్రీ, యిదియేమి రక్తాంబుజంబునుంబోలె వర్తులాకారంబుగా మండుచున్న యది యిట్లుండుటకు కారణంబేమి? యానతియ్యవలయునని వచించుటయు నాబ్రాహ్మణుండు కుమారునివాక్యంబులాకర్ణించి యామంటం జక్కాగా పరిశోధించి యిది వసాకమాంసరక్తమిశ్రితంబయిన కపాలపుమంటయనివచింప, నంత నాకుమారుండు కపాలజ్వాలితంబగు నగ్నిగాష్ఠంబున వ్రేయ నందుండి రక్తబిందువులెగసి యతనిముఖంబునం బడియె, నప్పుడతండారక్తగంధం బాఘ్రాణించి తద్వసారక్తపానంబుగావించి తత్క్షణంబ మహాకాయుండును నతినిష్ఠురదంష్ట్రిండును నతిభయంకరుండునునగు భేతాళుండై భూమ్యంతరిక్షాదిదిత్సమూహంబులుచలింప నట్టహాసంబుగావించి జనకుజంపంబూని సాహసంబుజేయ వలదను నశరీరవాక్యంబాకర్ణించి యతనింబరిత్యజించి గగనయానంబునొంది యనేకభూతభేతాళసంతానంబులు కపాలపాటనంబున భేతాళత్వంబునొందిలివిగాన కపాలస్ఫోటనుండను నామంబునొందుమని దన్నుంగొలువ నరాస్థిభూషణుండను భేతాళపతిసమీపంబునకుంబోయి యతనికిం సేనానాయకుండై యుండె, చిత్రసేనుండను గంధర్వుండా నరాస్థిభూషణుని గదనంబున నిహతుంజేయ కపాలస్ఫోటకుం డాయధికారంబు నొంది యుండె. నిట్లు సుదర్శనుండు మనుష్యుండయి బిమ్మట భేతాళనాథుండయ్యె.

ఇది స్కాందపురాణంబునంగల సేతుమాహాత్మ్యంబునందు
భేతాళవరదతీర్థప్రశంసయు విద్యాధరాత్మజుండగు సుదర్శనునకు
భేతాళప్రాప్తియు ననుకథలంగల
ఎనిమిదవయధ్యాయము సంపూర్ణము.

---

# తొమ్మిదవ అధ్యాయము.

---

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునిశ్రేష్ఠులకు సకలపురాణాభిజ్ఞుండగుసూతుం డిట్లనియె. ఓ మునివరులారా, యీప్రకారంబున విజయపుత్రుండు భేతాళత్వంబునొందఁ దదీయజనకుండగు గోవిందస్వామి భార్యయుం గనిష్ఠపుత్రుండునునున్న దేవాలయంబునకుంబోయి వారలకావృత్తాంతంబెఱింగించి వారలుందానునుం దుఃఖింపుచుండ సముద్రదత్తుండను వైశ్యుండరుదెంచి వారలంగాంచి దయాళుండై తనగృహంబునకుంగొని చని శోకోపశమనంబుగావించి గోవిందస్వామిని నిజద్రవ్యసంరక్షకుంగాజేయ నతండఖిలను

ఖంబులం బొందుచుండియు ప్రథమపుత్రశోకంబునం బొగలుచుండె, నంత ద్వితీయుండగు
నశోకదత్తుండు శస్త్రశాస్త్రవిచక్షణుండై సకలవిద్యా పరిశ్రమంబునొంది, ఎందు నిట్టివి
ద్యాధికుండు లేడని యాపట్టణంబున బ్రసిద్ధినొందె. నాకాలంబున కాశీపురాధీశ్వరుం
డగు ప్రతాపముకుటరాజన్యుని సమీపంబునకు దాక్షిణాత్యుండగు నొకమల్లుండరుదెంచిన
యానృపోత్తముం డతనిం జయించుటకై యశోకదత్తుం బిలుపించి యిట్లనియె. ఓయీ, నీవు
అతిబలోపేతుండవు. దాక్షిణాత్యమల్లుం జయించితివేని నీవు కోరినవాని నెల్ల నొసంగెదనను
టయు నశోకదత్తుండు మల్లుంగూడి గదనంబు గావించి స్వబలాతిశయంబున నతనిం బరా
జితుం జేయ నవనీనాథుండు ప్రీతుండై యశోకదత్తుని భృత్యుంగా జేకొనియుండె నొకా
నొకదినంబున నతనింగూడి సవారి పోయి యొకప్రదేశంబున ఓరాజేంద్రా, నేనల్పాపరా
ధుండ శత్రుప్రేరిత శూలఘాతంబునొందితి, నీశూలంబునం జిక్కి నాలుగుదివసంబులయ్యె
నెందేనియు దురాత్ములకు సుఖంబున ప్రాణంబులు వోవునే యిట్టి శ్రమంబు నొందయుం
డెడి నాకుంగల తృష్ణం బాపుమను దీనవచనంబులు విని రాజన్యుండు ధైర్యవంతుండగు
బ్రాహ్మణపుత్రునింగాంచి యిట్లనియె. ఓ ధీరోత్తమా, శూలప్రోతుండై తృషితుండగుచు
నిలయుచుండువాడెవడో యతనికిం జలంబులొసంగుమని యాజ్ఞాపించె నంత నాబ్రాహ్మ
ణకుమారుం డయ్యార్తధ్వని వినంబడిన ప్రదేశంబునకుం బోయి యచ్చట భూతభేతాళసం
కులంబయిన శ్మశానంబుగాంచి యందొకచోట శూలప్రోతుండై విలపించు నొకపురుషుని
జూచి యతనికి జలంబులొసంగం బోయి తద్విధప్రదేశంబున యౌవనోపేతయు రతీసమాన
రూపవతియునగు నొక లతాంగింగాంచి యశోకదత్తుం డతిధైర్యంబున నీవెవరవు? విజయం
బైన శ్మశానంబున నుండం గారణంబేమి యీపురుషుని క్రింద నేడ్చుచున్నదానవని యడు
గగా నతండు మదీయవల్లభుండు రాజుచేత శూలప్రోతుండయ్యె, కృపణుండు ధనావలో
కనంబు సేయుచు ప్రాణంబులెట్లు విడువం డట్లితండును శూలప్రోతుండయిన మరణంబు
నొందజాలక జలంబులం గోరుచున్నవాడితని విడిచిపోవుట కశక్తనై యున్నదాననని యివ్వి
ధంబునం బలికిన వనితావాక్యంబులాలించి కరుణాసముద్రుండగు నవ్విప్రకుమారుం డిట్లని
వచింపందొడంగె.

ఓ తల్లీ, మదీయస్కంధాధిరోహణంబు జేసి యతనికి జలంబులిమ్మనిన నయ్యువతి
యట్లగునని యెక్కె నప్పుడు రక్తబిందుపతనంబైన విప్రకుమారుండు వనితాముఖంబు వీక్షించి,
రాక్షసింగా నెఱింగి రత్ననూపురాలంకృతంబగు తదీయపాదాగ్రంబు బట్టికొనుటయు నావ
నిత రత్నమయంబగు నూపురంబు పరిత్యజించి పాదమును విదిలించుకొని పరుంగిడ నవ్విప్ర
పుత్రుం డాయందియం గొని రాజసాన్నిధ్యంబునకుం జని తద్వృత్తాంతం బెఱింగించి తా దె
చ్చినయందియనిచ్చుటయు నారాజేంద్రుం డిట్టి చరితంబు గావించుటకు దేవతలకైనం దరం
బుగాదని మెచ్చి యవ్విప్రకుమారునకు దన తనూజాతయగు ధనరేఖ నొసంగి వివాహంబు

గావించె. మఱియుం గొన్నిదినంబుల కొకసమయంబున నారాజన్యుం డానూపురంబు గాంచి దీనికిం దుల్యంబగు నందియం దెమ్మని వచించె. అంత నశోకదత్తుం డాయందియ ముందు శ్మశానంబునం దెచ్చితి నిప్పుడే తత్సదృశంబు నెక్కడ దెత్తు శ్మశానంబున మనోహరమాంసం బమ్ముచుండితి నేని యాప్రదేశంబునకు మాంసంబుఁ గోరి ముందే తెంచినముద్దియ యరుగుదెంచు నప్పుడు తదీయద్వయనూపురంబు హరింపందగునని నిశ్చయించి శ్మశానంబునకుం బోయి యచ్చటనుండు భూతభేతాళాదులం దృణీకరించి యత్యంతధైర్యవంతుండయి మాంసవిక్రయంబు గావించుచు దిక్కులు పిక్కటిల్లునట్లు మాంసంబు గొనుండని భూతభేతాళంబులం బిలువ నవియే తెంచుచుండ నారాక్షసియు కన్యాసహితయై యరుదెంచిన నవలోకించి దానిం దెలుసుకొని యోలలనామణీ ముందిచ్చిన యందియకు సమానంబగు రెండవనూపురం బొసంగుమనిన నది భీతయై యోవీరోత్తమా, యట్లె యొనర్చెదనని నూపురం బొసంగి మఱియును విద్యుత్ప్రభయనుతనూజను నొకసువర్ణాబ్జంబు నిచ్చి యనిపిన నతండు హేమాబ్జమణినూపురంబులం గొని విద్యుత్ప్రభాసమేతుండయి రాజసమీపంబునకుం బోయి తా దెచ్చిననూపురం బొసంగ రాజశ్రేష్ఠుండు సంతుష్టాంతరంగుండయి యతని ననేకవిధంబులం బొగడె, నంత నశోకదత్తుం డొకటనంబున విద్యుత్ప్రభం జూచి యో ప్రియసఖీ, మీతల్లి కీబంగారుదామరపువ్వెవ్విధంబునం దొరకె నిట్టికుసుమంబు లెచ్చటం దొరుకు నెఱింగింపుమనిన నదియిట్లనియె.

ఓ నాయకా, యీ హేమకమలంబులు కపాలస్ఫోటనాఖ్య భేతాళనాయకునికిం గ్రీడాకరసరోవరంబునం గలవు జలక్రీడార్థంబై మీయత్త యచ్చటకుం బోయి నీకమలంబులు దెచ్చెననిన నతం డాసరోవరంబునకు నన్నుం బిలుచుకొని పొమ్మనిన నదియట్లొనర్ప నప్పుడవ్విప్రకుమారుండు తత్కమలంబులం గ్రహింపం బోయి తద్రక్షకులగు భూతభేతాళానీకంబులం దనుమాడిన విని కపాలవిస్ఫోటనుండు నిజసైన్యనాశంబునకుం గోపించి యశోకదత్తు నెదిరింప నతండు గదసంబునం గపాలస్ఫోటనుం జంపం బూనిన నచ్చట కవిజ్ఞప్తికౌతుకుండను విద్యాధరాధిపతి విమానారూఢుండై యరుదెంచి యంతరిక్షంబున నిలచి, యో భూసురపుత్రకా, సాహసంబు జేయకుమని వచించిన నశోకదత్తుడు వివీక్షించి తదాలోకనమాత్రంబున శాపజనితమానుష్యంబు వదలి దివ్యరూపంబు నొంది విమానారూఢుండును సకలాభరణభూషితుండును నయ్యె నప్పుడతనిం గాంచి విజ్ఞప్తికౌతుకుం డో విద్యాధరకుమారకా యీభేతాళపతి గాలశాపంబుచే భేతాళత్వంబు నొందిన నీయగ్రజుండు నీవును తదీయశాపంబు నొందినవాడవయ్యు నల్పపాపుండవు గాన మద్దర్శనంబున శాపవిమోచనంబగునని యమ్ముని చెప్పిన కారణంబున నిర్మలుండవయితివి నీయగ్రజుశాపాంతం బతండు వచింపఁడయ్యె, గాన నీవు స్వర్గంబునకుం బొమ్మనిన సుకర్ణుం డావిద్యాధరపతిం గాంచి యోవిద్యాధరోత్తమా మదీయాగ్రజుం బాసి సర్వభోగయుతంబగు స్వర్గంబు నొం

మటకొండంబడుంజాల నెవ్విధంబున నతనికి శాపవిమోచనంబగు వచింపుమనిన, విజ్ఞప్తికౌతుకుండు దుర్నివారణంబగు శాపవిమోచనంబు గావింప నెవరికిందరంబుగాదయిన రహస్యంబగు యుపాయంబుసెప్పెద, దక్షిణోదధితీరస్థిత చక్రతీర్థతటంబున సర్వతీర్థోత్తమంబగు నొకతీర్థంబుగలదు. తత్తీర్థదర్శనమాత్రంబున సకలపాపంబులునశించునని కమలజుండు సనకాదిమునీంద్రులకుంజెప్పె గాన తత్తీర్థంబున స్నానంబుగావించు వారొందు ఫలంబెరుంగనే సమర్థుండగాను గాన నచ్చటకుంబోయిన భవదగ్రజుండు భేతాళత్వంబుమాని విద్యాధరుండగుననుటయు నతండు విజ్ఞప్తికౌతుకసమేతుండై యగ్రజుందోడుకొని దక్షిణసముద్రోపాంతంబున గంధమాదన చక్రతీర్థమధ్యంబుననుండు తీర్థంబునకుంబోయి యాతీరంబునంగూర్చుండి ఓ యగ్రజా గాలవశాపమోచనంబు కొరకీతీర్థంబున నవగాహనంబుగావింపుమని పలుకుచుండుసమయంబున వాయుప్రేరితంబులయి తత్తీర్థశీకరంబులా కపాలస్ఫోటనుమీదం బ్రసరించుటయు నతండారూపంబుమాని విజయదత్తుండును బ్రాహ్మణుండయి తన్మనుష్యత్వ నివృత్త్యర్థంబైన సంకల్పస్నానంబుగావించి తక్షణంబ దివ్యరూపంబునొంది విమానారూఢుండును దేవస్త్రీసమాజ పరివృతుండును నిజభ్రాతృసహితుండును సభూషణుండును పురస్థితవిజ్ఞప్తికౌతుకుండగుచు తత్తీర్థంబనేకవిధంబులంగొనియాడి దివంబునకుంబోయెం గాన నాతీర్థోత్తమంబు భేతాళవరదంబని ప్రసిద్ధింగాంచె. పినరులయినం దత్తీర్థరాజంబున స్నానంబుగావింతురామనుజులు జీవన్ముక్తులగుదు రాతీర్థసదృశతీర్థంబెచటగాన విద్యాధరుండేకారణంబున భేతాళత్వంబునుమానె నాకారణంబున తత్తీర్థంబు భేతాళవరదంబను నామంబునొందె యెవ్వరైన నాతీర్థంబున కృతస్నానులయి పితరులకుం బిండదానంబు గావింపుదురో వారి పితృసమూహంబులు తృప్తిబొంది స్వర్గంబు నొందుదురు. ఓ మునివరులారా భేతాళవరదతీర్థంబునకా నామంబుగలిగిన కారణంబెరుంగించితి ఎవ్వండైన నీయధ్యాయంబు సమాహితమనస్కుండయి పఠించు నాకర్ణించునతండు సమస్తపాపంబులంబాసి స్వర్గంబునొందు.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమాహాత్మ్యంబునందు
భేతాళవరదతీర్థప్రశంసయు సుదర్శన
సుకర్ణశాప మోచనంబును నను కథలంగల
తొమ్మిదవయధ్యాయము సంపూర్ణము.

---

## పదియవ అధ్యాయము.

---

మహనీయ గుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు పౌరాణికోత్తముండగు సూతుండిట్లనియె, ఓ మునీంద్రులారా పూర్వోక్తంబగు భేతాళవరదతీర్థావగాహనంబొనర్చిన

జనంబులు మెల్ల మెల్లగా గంధమాదనంబునకుం జనవలయు నప్పర్వతరాజంబు విశ్వకర్మ నిర్మితంబగు బ్రహ్మలోకంబునకు మార్గంబై యొప్పు నందు లక్షకోటిసరస్తటాకంబులు పుణ్యా వనాశ్రమంబులు వేదారణ్యంబులుగల్గియుండు మరియును మహాపాతకనాశనంబగు నాప ర్వతమూర్ధంబున లక్ష్మీధరిత్రీసమేతుండగు విష్ణుదేవుండును సావిత్రీసరస్వతీ సహితుండగు చతుర్ముఖుండును వినాయకకుమారచంద్రాదులును సూర్యాదిగ్రహంబులును అష్టవసువు లును పితృదేవతలును లోకపాలురును పార్వతీసమేతుండగు హరుండును దివానిశంబులు నివసించియుందురు అచ్చట కిన్నరకామినులు పురుషులంగూడి నిత్యంబు క్రీడింపుచుందురా పర్వతశిఖరాగ్రస్థితుండగు గిరిజామనోహరు నిరంతరంబు సిద్ధచారణాదులు శుభంబులం గోరి పూజింపుచుందురా ధరాధరంబనాదియు సర్వమునిగణసేవ్యంబును తుంగతరంగాభిల సముద్రసేవితంబై యొప్పుచుండు తదీయమారుతస్పర్శమాత్రంబున కోటిమహాపాతకంబులు అగమ్యాగమనాగతపర్వత ప్రతిమపాతకకోటులు దేహకలితంబులగు నవియును నశించు అం దు వానరసేనానాయకుండగు నలుండు రామాజ్ఞచే సేతువొనర్చె నాసేతు గంధమాదనం బులదర్శించు వారాధరాధరంబునకు వందనంబులుగావించి వో ధరాధరేంద్రోత్తమా నీవు బ్రహ్మవిష్ణ్వాది సమస్తదేవతాసేవితుండవు నన్ను మదీయపాపంబుల ద్రొక్కుటచేతం గల్గు పాపపుంజంబు విదళించి రక్షింపుము భవచ్ఛిఖరాగ్రవాసియగు శంకరు దర్శింపుమని యివ్విధంబునం బ్రార్థించి . సేతురూపతన్నగారోహణంబుగావించి తత్తీరంబున సముద్ర స్నానంబొనరించి సర్షపమాత్రకంబులు శమీదళసదృశంబులగు పిండంబులిడిరేని వారి పితరులు కల్పక్షయపర్యంతంబును తృప్తినొందుదురు మరియు వారలు స్వర్గస్థులయియున్న మోక్షంబును నరకగతులయియున్న స్వర్గంబునొందుదురు ఆపర్వత రాజంబునందులో ప్రసిద్ధంబును సర్వతీర్థోత్తమంబును పుణ్యతమంబును పాపవినాశంబను నొక తీర్థంబు గలదు తత్తీర్థస్మరణంబు గావించినవారలు గర్భవాసంబునొంద నోపరందు స్నానంబు గావించినవారలు నిర్మలులగుచు వైకుంఠపదంబునొందుదు రిందుకు సందియంబులేదనిన పౌరాణికుంగాంచి ఋషులిట్లనిరి వో మహాత్మా పాపవినాశనాఖ్యతీర్థప్రభావంబును వచింపు నీవు వ్యాసబోధితుండవుగాన సకలంబు నెఱుంగుదువనిన నతం డిట్లనియె. వో మహా మునులారా. వినుండు హిమవత్పర్వతసమీపంబున బ్రహ్మాశ్రమంబునందు జరిగిన వృత్తాంతంబు దెలిపెద సమీపంబున బహుగుల్మలతాకీర్ణంబును క్రూరమృగసంకులంబును మదగజసం చారితంబును సిద్ధచారణసేవితంబును రమణీయంబును పుష్పితకాననంబును నియమవ్రత పరాయణ బ్రాహ్మణపరిశోభితంబును సూర్యప్రకాశ తపోనిలయ ప్రకాశితంబును యజ్ఞ దీక్షిత వేదాధ్యయన సంపన్నశోభితంబును బ్రహ్మచర్యగృహస్థ వానప్రస్థ యత్యాద్యాశ్రమ నిష్ఠ విభాసితంబును మరీచివాలఖిల్య సంవేష్టితంబై యొప్పు నొక యాశ్రమంబుగల దచ్చ టికి సాహసవంతుండగు దృఢమతియను శూద్రుండరుదెంచి దేవకల్పులగు నమ్మహాముును లను వందనంబులంగావించి వారలచే పూజింపంబడి వారలు చేయుచుండు యాగాదులం

గాంచి దానుం దపంబుగావింపంగోరి యమ్ముని మండల శ్రేష్ఠుండనుగులపతియను మహాత్ముంగాంచి యో తపోధనా నీకు వందనంబులొనర్చెద నన్ను గరుణాదృష్టిచేతంగావుము నేనపరవర్ణజాతుండ మీకు శుశ్రూషణంబు గావింపనేతెంచితి ప్రసన్నుండవై నాచేత యజ్ఞాదులం గావింపుమని యివ్విధంబునంబలికిన దృఢమతివాక్యంబులాలించి యత్తపోధనుండిట్లనియె. వో దృఢమతీ హీనవంశజుండగు శూద్రుండు యాగదీక్షితుండగుటకు శాస్త్రపాఠంబునభ్యసించుటకుందగడు గాన బ్రాహ్మణశుశ్రూషంగావింపుము జాతిహీనునకుపదేశింపందగదట్లుపదేశించిన యుపాధ్యాయుండు దోషంబులంబొందుం గాన నాయుపదేశించునట్టి బ్రాహ్మణుని విప్రులు చండాలునింబోలె పరిత్యజింపవలయు మరియు మన్వాదులచే శూద్రకులజులకు ధర్మంబు ద్విజశుశ్రూషణంబని చెప్పబడియున్నది గాన నట్లుగావింపుము నినవిని యాశూద్రుండు శ్రద్ధాసహితంబుగా తపంబుజేయంగోరిన నితడంగీకరించకపోయెనైనను నేతపంబుగావించెదనని నిశ్చయించి కొంతదూరంబుపోయి యచ్చట నొకపర్ణశాలంగావించి దేవతాగారంబొనర్చి తత్సమీపంబున నొకతటాకంబుద్రవ్వి యొకపుష్పారామంబుగావించి తపస్సిద్ధింగోరి శ్రద్ధాయుక్తుండై తపంబుగావింపుచు దేవపూజలు సేయుచు నియమోపేతుండును జితేంద్రియుండును కందమూలఫలాశనుండు నతిథిపూజకుండునై యుండఁగొంతకాలంబాయె నట్టియెడ గర్గవంశసముద్భూతుండును జితేంద్రియుండునగు సుమతియను మునీంద్రుఁ డాతనియాశ్రమంబునకేతెంచిన యతండామహామునింబూజించి ఫలాదులచే సంతుష్టుంగావించి కుశలంబడిగిన నతండాశూద్రు నాశీర్వదించి స్వాశ్రమంబునకుంబోయి ప్రత్యహంబతనియందు విశ్వాసంబుచే వానియాశ్రమంబునకువచ్చుచుంబోవుచు యతండుగోరిన యతనిచే యజ్ఞాదులసేయించి రహస్యమంత్రోపదేశంబులంగావించి యాశూద్రునిచే పోషితుండైయుండె నిట్లుండఁగొంతకాలంబునకాబ్రాహ్మణుండు మృతుండై యమకింకరులచేత నరకంబులంద్రోయబడి యనేకకల్పసహస్రవర్షంబులాబాధల ననుభవించి పిదప భూమియందొకవృక్షంబై పుట్టి పిమ్మట గర్దభ విడ్వరాహ సారమేయ రూపంబులనొంది తరువాత చండాలశూద్రవైశ్యక్షత్రియయోనులందుద్భవించి కడపట విప్రుండై యవతరించి జన్మాష్టమంబునందుపనీతుండై వేదాధ్యయనంబొనరంపుచుండి యొకానొకకాలంబున బ్రహ్మరక్షస్సుచేపీడితుండై విలపించుచు భ్రమించుచు వేదబాహ్యుండై కర్మశూన్యుండైయుండ నతనిజనకుండు దుఃఖాక్రాంతుండై యబ్బాలుందోడ్కొని యగస్త్యమహాముని సమీపంబునకుంజని నమస్కరించి యోమునీంద్రా నాకీపుత్రుండుదప్ప పిత్రృణంబపనోదింప మరియొకండులేడు భవాదృశులగువారలు పరోపకారశీలురై యుందురు గాన నితనింగాంచి రక్షింపవేయని యనేకవిధంబులవేడిన నాబ్రాహ్మణుంగాంచి యగస్త్యుండిట్లనియె.

ఓ బ్రాహ్మణోత్తమా! యీబాలుండు పూర్వజన్మంబున సుమతియను బ్రాహ్మణుండితండు వయిదిక కర్మంబులను మంత్రంబుల శూద్రునకుపదేశించి మరికొన్నిదినంబులకు మృ

తుండై తత్కారణంబున ననేకసహస్రవర్షంబులు నిరయబాధలంబొంది పిమ్మట స్థావరా
దిజన్మంబులంబొంది యిప్పుడు బ్రాహ్మణుండై భవత్పుత్రుండయ్యె నితండు పూర్వజన్మకృత
పాపంబుచే బ్రహ్మరక్షోగృహీతుండై యున్నవాడు గాన నొకయుపాయంబు వచించెదవినుము
దక్షిణసముద్రతీరంబున సేతురూపంబును సమస్తదేవతాసేవ్యంబును పావనాశనంబునగు
గంధమాదనంబను నొకపర్వతరాజంబు గలదు తన్మధ్యంబున నొకతీర్థంబున్నయదియు, యాతీ
ర్థంబు భూతప్రేతపిశాచాదులవలనం గల్గుబాధల నణంచుంగాన పాపనాశనంబను పేరం బ్ర
సిద్ధినొందియుండు. ఓ భూసురవర్యా నీవు నీపుత్రుతోడ్కొని చని యందుస్నానంబొన
రింపు మచ్చట త్రిదినంబులు స్నానంబుగావించిన భవత్పుత్రుని బాధ నివారణంబగు యీ
యుపాయంబుగాక మరియొకయుపాయంబేనెరుంగ గాన శీఘ్రుంబునంబొమ్మనిన నాభూసు
రుండగస్త్యునకు వందనంబొనర్చి తదనుజ్ఞనొంది పుత్రసహితుండై గంధమాదనకుంబోయి
యచ్చట పాపవినాశనతీర్థంబున సంకల్పపూర్వకంబుగా గుమారుని త్రిదినంబులు స్నానం
బుగావింప నాకుమారుండు బ్రహ్మరక్షస్సుచే విముక్తుండై సుందరాకారుండై స్వస్థచిత్తుం
డును సంపన్నుండును సర్వభోగయుతుండై చిరకాలంబుండి దేహాంతంబున ముక్తింబొం
దె నతనిజనకుండును కైవల్యంబునొందె మరియును నాబ్రాహ్మణుచే మంత్రోపదేశంబు
లంబొందిన శూద్రుండనేక నిరయబాధలంబొంది యనేక యోనులందుద్భవించి పిమ్మట గృధ్ర
రూపంబునొంది. యొకానొకసమయంబున దైవయోగంబుచే గంధమాదనంబున కరుదెంచి
యాపాపవినాశన తీర్థజలపానంబొనర్చి యందుమునింగి యాక్షణంబున గృధ్రరూపంబుమా
ని సుందరాకారుండును సమస్తాభరణాలంకృతుండును దివ్యమాల్యాంబర ధరుండునగుచు
రక్తచందనంబులందిక్కొని దివ్యవిమానారూఢుండై దేవకాంతలు చామరంబులువీచుచు పరి
వేష్టించికొలువ దేవలోకంబునకుంబోయె గాన నాతీర్థంబు స్వర్గదంబు ప్రభావయుక్తంబు
ను బ్రహ్మవిష్ణుమహేశ్వరసేవితంబైన పాపనాశంబను పేరంబ్రసిద్ధినొందియుండు, ఓ ముని
వరులారా శ్రేయఃకాముండు యెచ్చట నాభూసురుండును శూద్రుండును స్నానంబుజేసి
సద్గతింబొందిరా తీర్థంబున స్నానంబుగావించి పాపరహితుండగు యీరహస్యంబగు పాపవి
నాశన తీర్థప్రభావంబు వచించితి.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమాహాత్మ్యంబునందు
గంధమాదన ప్రశంసయు పాపవినాశన ప్రభావ
కథనంబునను కథలుంగల
పదియవయధ్యాయము సంపూర్ణము.



## పదునొకండవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునిశ్రేష్ఠులకు సూతుండిట్లనియె. ఓమునీంద్రులారా మనుజులు పూర్వోక్తంబగు పాపవినాశనంబున స్నానంబుగావించి యనంతరంబ సీతాసరస్సునకుంబోయి యందునియమయుక్తులగుచు స్నానంబుగావింపవలయు నాతీర్థంబును కాశ్యాదిపుణ్యక్షేత్రంబులు గంగాదితీర్థంబులు స్వపాపనివృత్తికై సేవించుచుండు పూర్వంబున పాకశాసనుండాసరోవరంబున స్నానంబొనర్చి బ్రహ్మహత్యవలనంబాసెననిన ఋషులిట్లనిరి. ఓపౌరాణికోత్తమా పురందరునకెవ్విధంబున బ్రహ్మహత్య సంప్రాప్తంబయ్యె నతండాతీర్థంబున స్నానంబుగావించి యెట్లువిముక్తుండయ్యె నవ్విధంబు సవిస్తరంబుగా వచింపుమనుటయు సూతుండిట్లనియె.

ఓమునీంద్రులారా! పూర్వంబున కపాలాభరణుండను రక్కసుండు చతుర్ముఖుచే సర్వభూతంబులవలన మరణంబులేని వరంబునొంది వైజయంతియను పట్టణంబున రాక్షసులుగొలువ రథగజాదిసంయుతంబగు శతాక్షౌహిణీసేనలంగూడి రాజ్యంబొనర్చుచుండి యొకసమయంబున శరభక్షుండనుమంత్రింగాంచి యిట్లనియె. ఓ మంత్రిప్రవరా మంత్రాలోచనంబునల్పత్వము నెచ్చటంగాన మనమిప్పుడమరావతికింజని తదధిపుండగు నింద్రుంబరిమార్చి తద్రాజ్యంబునొంది వందనాదిక్రీడాప్రదేశంబుల రంభాద్యప్సరస్సమూహంబులంగూడి క్రీడింపంబోదమాయనిన నతండంగీకరింప కపాలాభరణుండు దుర్మేధసుండను పుత్రురాజ్యంబున కభిషిక్తుంగావించి సపరివారుండు ససైన్యుండయి యమరావతికింబోవుచుండ తదీయసేనాపాదఘట్టనాజనితంబగుధూళి యాకసంబుగప్పె మరియు నిస్సాణాదిధ్వనులు గజబృంహితంబులు నశ్వహేషితంబులు పదాతిసింహనాదంబులు మొదలగువానిచే జలధులుశోషించె గిరులుచూర్ణంబులయ్యె దిగ్గజంబులు బధిరత్వంబునొందె దిశలుప్రతిధ్వనులొసంగె నిట్లారక్కసుండమరావతిచేరుటయు బలభేదియు స్వసైన్యుండై సమరంబునకేతెంచె నాసమయంబున వారలకదృష్టపూర్వంబగు ద్వంద్వయుద్ధంబాయె నప్పుడు కపాలాభరణునితో నింద్రుండును శరభక్షునితో యముండును కేశికునితో వరుణుండును రుధిరాక్షునితో కుబేరుండును కపాలాభరణానుజులగు మాంసప్రియుండును మద్యసేవియు క్రూరదృష్టియు భయానకుండనువారలతో అశ్వినీదేవతులు నగ్ని వాయువులుగూడి ద్వంద్వయుద్ధంబుగావింప నిరువాగునుంగూడి ఘోరంబగు యుద్ధంబొనర్చె నాసమయంబున మహాబలుండగు ధర్ముండు కాలదండంబుగొని శరభక్షుంబరిమార్చి అక్షౌహిణీత్రయసంఖ్యాతంబగు తదీయసేనంబాడవడంగించె వరుణుండు పాశంబుచే కౌశికుశిరంబుద్రుంచె కుబేరుండు కుంతంబుగొని రుధిరాక్షునిహతుంగావించె అగ్నివాయువులు నశ్వినీదేవతులు కపాలాభరణానుజులందునిమిరి యింద్రుండును కపాలాభరణుంగేడించి తదీయసేనా

సమూహంబులనంతయు యామార్గంబునం జరేతనిలయంబున కసచిన కపాలాభరణుండు స్వసైన్యనాశనంబువీక్షించి గృహీతచాపుండయి తీక్ష్ణబాణంబులంగొని వోరీ యింద్రా నిలునిలుమని పలుకుచు బ్రయోగింప శచీధవుండాశరంబుల ఖండితంబులగాజేసిన నారక్షసుండు శూలంబుబ్రయోగించె నంత నింద్రుండు దాని స్వకీయంబగుశక్తిచే వారించె నంత నయ్యామినీచరుం డయిదు వేలబారువుల నుక్కుచేజేయబడి శతహస్తంబులపొడవుం గల గదంగొని నింద్రువక్షంబుపైవైవ తద్గదాఘాతంబున నతండుమూర్ఛంబొంద బృహస్పతి సంజీవనియనుమంత్రంబుచే నతని పునర్జీవితుంగావించె నంత నింద్రుండయిరావతారూఢుండయి నిజాయుధంబగుకులిశంబుకొని సాశ్వరథాదికంబుగా కపాలాభరణుని బ్రమాణంబుగ్గా ఖండితుంగావించి దండధరాంతికంబునకుంబంపె నంత నఖిలలోకంబులు నంతసిల్లె నారాక్షససంహారజన్యంబగు బ్రహ్మహత్య పాకారినాక్రమించె ననినవిని ఋషులిట్లనిరి వోమహాత్మా నీవువచించినకపాలాభరణుండు లోకబాధకుండగు రాక్షసుండుగాని బ్రాహ్మణుండుగాడు తద్వధంబున బ్రహ్మహత్యనింద్రునెట్లొందె నవ్విధంబువక్కాణింపవేయని వేడిన సూతుండిట్లనియె వోమునీంద్రులారా పరమరహస్యంబగువిషయంబు వచించెద వినుండని యిట్లనియె

పూర్వంబున వింధ్యప్రదేశంబున త్రివక్రుండను నొక రాక్షసుండుండె నతనికి రూప యౌవనశాలినియు సర్వలక్షణోపేతయగు సుశీలయను భార్యగలదా కామిని వింధ్యపర్వతోపాంతంబులం జరియించుచు వేదాధ్యయనతత్పరుండును సమాధియుక్తుండై యున్న శుచియను మునీంద్రుని యాశ్రమంబునకుంబోవ నతండక్కామినింగాంచి కామబాణపీడితుండై యిట్లనియె, ఓకాంతామణి నీవెవరివిజగువనంబున నేలసంచరించెదవు నిన్నుం జూచిన ఋషుల శ్రమనొందిన దానివలెనున్నావుగాన మదీయాశ్రమంబున గొంతప్రొద్దున నివసించియుండుమనిన సుశీలయిట్లనియె. వో మునీంద్రా నే త్రివక్రుండను రాక్షసేంద్రునిభార్యను పుష్పాపహరణార్థంబై యివ్వనంబునకేతెంచితి నే నపుత్రనై యున్నదాన నానాథుండు శుచియను మునీంద్రుంబొంది పుత్రుంబడయుమని యాజ్ఞాపించెగాన నేతెంచితి నన్నుం బ్రసాదదృష్టినవలోకించి పుత్రునొసంగుమనివేడిన యాకాంతామణింగాంచి మునీంద్రుండిట్లనియె. వో కామినీ నీదర్శనంబొనర్చినది మొదలు మన్మనంబు సంచలించుచున్నయది మనోరథంబులొనగూర్పుమని మునీంద్రుడాకాంతంగూడి రమింపుచుండ త్రిదినంబులయ్యె నంత మునీంద్రుండిట్లనియె. వోవనితామణి నీయుదరంబున గపాలాభరణుండను తనయుండుదయించి విరించిదత్తావరుండై సహస్రవత్సరంబులు రాజ్యభోగంబుల ననుభవించగలెడతండు పురందరుండుదప్ప నితరులచే వధ్యుండుగాడని వరంబొసంగి కాశీపట్టణంబునకుంబోయె నంత గొన్నిదినంబులకాసుందరియు కపాలాభరుణుంగనియె నిట్లు శుచిప్రసాదంబున సుశీలకుంబుట్టిన కపాలాభరణుని నింద్రుండువధించె నంతనతండు

బ్రాహ్మణబీజ సముద్భవుండగుటం జేసి బ్రహ్మహత్యనింద్రు నాక్రమించె నంత శతక్రతుండు భయాకులచిత్తుండై పరుంగిడిన నదియు ననుగమింప నింద్రుండు దీనుండై చతుర్ముఖు సమీపంబునకుం బోయి ఓపితామహ నాకీబాధ బోలంగు నుపాయంబు వచింపుమని వేడిన నతం డిట్లనియె. ఓ బలభంజన న్యాదక్షిణసముద్రోపాంతంబున గంధమాదనంబున నుండు సీతా కుండంబను తీర్థంబునకుం జని యందు స్నానంబు గావించి తత్తీరంబున శివప్రీతికరంబగు యాగంబొనర్పుము దానన బ్రహ్మహత్య నశించు నాతీర్థంబు మహాపాతకనివారణంబను ముక్తిదంబును సర్వదారిద్ర్యదుఃఖశమనంబును వైకుంఠాది పుణ్యలోకప్రదంబై వెలయు చుండుగాన నచ్చటకుం బోయి యజ్ఞంబు గావించి పాపంబుల దొలంగి నిజపురంబునకుం బొమ్మనిన నింద్రుండా క్షణంబున నచ్చటికిం బోయి సీతాసరంబున స్నానంబు గావించి తత్తీరంబున యజ్ఞం బాచరించి బ్రహ్మహత్యానాశనంబు గావించి యమరావతికిం బోయి సుఖంబులం బొందుచుండె. ఓ మునీంద్రులారా సీతామహాదేవి శ్రీరామదేవుసమ్మతికై ప్రజ్వలించు నగ్నికుండంబున బ్రవేశించి మహాపతివ్రత గావున చతుర్ముఖాద్యమర సమక్షంబున నిర్దగ్ధాంగియై యాకుండంబువలనం బైలువెడలె నంత నమరులు సంతసిల్లి రాసమయంబున నాకాంతామణి తత్కుండంబాక సరోవరంబుగా నొనర్చెంగాన నాతీర్థంబు సీతా కుండంబని ప్రసిద్ధింగాంచె నో మునీంద్రులారా నాసరోవరంబున స్నానంబు గావించిన సర్వాభీష్టంబులు జనంబులకు లభించు మరియును తత్తీరంబున యజ్ఞదానాదులం గావించిన వారలకు యీశ్వరుండు ప్రీతుండై సమస్తంబుల నొసంగు నీయుత్తమంబగు సీతాసరోవరవైభవంబు మీకెరుంగించితి నీకథ నెవ్వరయిన విని పఠించిన ఇహపరసుఖంబులం బొందుదురు.

ఇది స్కాందపురాణంబునందు సేతుమాహాత్మ్యంబున
సీతాసరోవరప్రశంసయు పురందరబ్రహ్మహత్యావిమోచనంబును కథలంగల
పదునొకండవ యధ్యాయము సంపూర్ణము.



## పండ్రెండవ అధ్యాయము.



మహనీయ గుణగరిష్ఠులగు శౌనకాదిముని శ్రేష్ఠులకు సూతుండిట్లనియె నట్లు సీతా సరోవరంబున స్నానంబు గావించిన వారలందుండి మంగళతీర్థంబునకుం బోవలయు నచ్చట నెల్లప్పుడు లక్ష్మీదేవి ప్రసన్నయై యుండు దారిద్ర్యనాశనంబునకై దేవేంద్రాదు లాతీర్థ సేవనంబు గావింపుచుందురు లోకపావనంబగు నాతీర్థప్రభావంబు వచించెద వినుండు పూర్వంబున చంద్రవంశోద్భవుండును మనోజవుండును భూపలలాముండును చతురుదధి వలయిత వసుంధరాపాలనదక్షుండై దేవతాప్రీతికరంబులగు యాగంబులొనర్చుచు నఖిల

బ్రాహ్మణజనంబులకు సంతుష్టిగా నన్నంబొసంగుచు పిత్రుదేవతలం దర్పణాదులచే దృప్తినొం
దించుచు వేదత్రయంబును శాస్త్రంబుల సార్థంబుగ నభ్యసింపుచు పరాక్రమంబుచే శత్రు
సమూహంబుల నిర్జించుచు శివకేశవ నామస్మరణంబు గావింపుచు మన్వాది నీతిశాస్త్రోక్త
మార్గంబు దప్పక ప్రజాపాలనంబు గావింపుచుండి కొన్నిదినంబులకతండు పుత్రకళత్ర సర
వస్వనాశకరంబగు నహంకారంబునొంది లోభమోహవిబద్ధుండై యసూయామోహితుం
డయి ప్రవర్తించుచుండె నెట్టివానికైన నిట్టి జనవిద్వేషకారిణియగు దుర్బుద్ధి యుదయించు
నతం డాక్షణంబున సకలసంపదలం బొలంగు నిష్ఠితండహంకారాదియుక్తుండయి బ్రాహ్మణ
జీవనంబులకు బన్నులేర్పరచి శివవిష్ణ్వాది దేవతాద్రవ్యంబులం బరిగ్రహించి యన్యాయ
యుక్తుండయి దేవద్విజవిరోధియై క్రూరుండయి ప్రవర్తింపుచుండ హూణదేశాధిపుండును
బలవంతుండగు గోలభుండను జననాథుండతని పురంబాక్రమించుటయు నామనోదవు
డాగోలభునితో పాణ్మానంబులు సమరంబొనర్చి పరాజయంబునొంది పుత్రభార్యాయు
తుండయి యొక మహారణ్యంబునకుం బోయె గోలభుండును తదీయరాజధాని కధీశుండయి
బహుకాలంబు రాజ్యంబు గావింపుచుండె నామనోజవుండు సింహవ్యాఘ్రద్విరద మహి
షాది క్రూరమృగాకీర్ణంబగు వనంబున సంచరించుచు క్షుత్పీడితుండయియుండ తత్పుత్రుం
డును క్షుద్బాధనొంది స్వజననిం గాంచి యోయమ్మ నాకు మిక్కిలి యాకలిగానున్నది
యన్నంబిడుమని వేడుచుండ నామనోజవుండు పుత్రాక్రందనంబు విని శోకాభిభూతుండును
కృశీభూత తాలుకంఠదేశుండును నగుచు పత్నిం గాంచి యిట్లనియె. ఓ ప్రియురాలా నీసు
తుండు క్షుద్బాధచే మరణంబునొందగలడేమి చేయుదు నెచటికిం బోదు యీ దుష్కర్మ
హితంబగు శోకంబపనోదించు వారలెవ్వరుగలరు నేదుర్భాగ్యుండ నన్నేల వృథాగా వెధ
బుట్టించె నేపూర్వంబున శివవిష్ణ్వాదిదేవపూజనంబులు తన్నామస్మరణంబులంజేసి యెరుం
గంగాన నీయసుఖంబబ్బె నేదురహంకారంబుచే శివవిష్ణ్వాది దేవతాద్రవ్యంబుల విప్ర
క్షేత్రాపహరణంబుల నొనర్చితిగాన గోలభునిచే పరాజితుండయి నిర్జనంబగు నరణ్యంబు
నకు నీవును యీబాలుండును దోడరావరువెంచి నిర్ధనుండ నిరన్నుండనైతి నేపూర్వం
బున బ్రాహ్మణులకన్నంబిడక శంభువిష్ణు పూజాసేవనంబులు నేయక నగ్నికార్యంబులం
జేయక మాతృపితృనిపహంబులకే కోద్దిష్టవిధానంబున శ్రాద్ధంబులు చేయక భూరిదానం
బున శ్రాద్ధంబులు చేయక భూదానంబులొనర్పని కారణంబున నట్టిదుఃఖంబులం బొం
దితి చిత్తానక్షత్రయుక్తంబగు చైత్రమాసంబున మధురంబులగు పనసామ్రకదళీఫలంబుల
దానంబు నేయక పానకంబుల పానంబు సేయింపక ఛత్రదండపాదుకాది దానంబులాచరిం
పక తాంబూలపుష్పగంధాదులచే వేదవిదులగు విప్రులం బూజింపక నిట్టిదుఃఖంబునొందతి
మరియును శివవిష్ణ్వాలయంబులయందు సమ్మార్జనంబు సేయక తటాక కూపప్రపాదంబు
ద్రవ్వింపక పుష్పతులసీవనాదుల శివవిష్ణ్వాలయంబులనొనర్పని కారణంబున నిట్టిదుఃఖంబు
ప్రాప్తంబయ్యె మరియు భాద్రపదంబున మహాలయాద శ్రాద్ధంబులంజేయక భూరిదక్షిణాకం

బులగు యజ్ఞంబులంగావింపక మాసోపవాస హరివాసరోపవాసాదులంజేసి శంభువిష్ణ్వాదులంబూజించి నైవేద్యంబులొనర్పక నుపేక్షించిన కారణంబున నిట్టిదుఃఖంబు నన్నుం జెందె మరియు మాతాశ్వత్థతులసీ న్యగ్రోధజంబీర కపిత్థామలక నారికేళాది వృక్షంబుల భృగుశ్రౌతితకరంబులుగా స్థాపింపమింజేసి యిట్టియవస్థసంప్రాప్తంబయ్యె మరియును జాబాలోక్తవిధానంబున త్రిపుండ్రధారణంబొనర్పక రుద్రాక్షలుధరింపక భూతికరంబగు విభూతి ధరింపక రుద్రసూక్తపంచాక్షరీ పురుషసూక్త అష్టాక్షరీ మంత్రజపంబులొనర్పక నితర ధర్మంబులెవ్వియునాచరింపక నిట్టివ్యసనంబునొందితినని యివ్విధంబున ఖిన్నుండయి విలపించుచు భూతలంబునబడి మూర్ఛంబొందెనంత మూర్ఛితుండగుపతింగాంచి సుమిత్ర యిట్లని యాక్రోశించె నో ప్రాణనాయకా నన్నువిజనంబైన యరణ్యంబున పుత్రుంగూడ నుంచి నెక్కడికింబోయితి నన్ననాథంజేసి మృతుండవైతివి నేననాథనై భయంకరంబులగు సింహాదిమృగంబులవలన బాధనొందంజాల నేనును నీతోడనవచ్చెదనని పలుకుచు బాలుం గాంచియిట్లనియె. వోకుమారకా యీపడియున్న తండ్రింజూడుమన నబ్బాలుండును క్షుత్పీడితుండయి తండ్రింగౌగలించుకొని యాక్రోశించుచుండె.

ఆసమయంబున జటావల్కలధారియు, సర్వాంగోద్ధూళితభస్మాండును, త్రిపుండ్రాంకితమస్తకుండును, రుద్రాక్షమాలికాభరణుండును, ధవళ యజ్ఞోపవీతుండును నగు పరాశరమునీంద్రుం డయ్యార్తధ్వనివిని యచటికరుదెంచిన సుమిత్రసపుత్రయగుచు నమ్మహామునికి వందనంబులుగావించె. నతండాసుమిత్రనాశ్వాసించి యో భామినీమణీ చింతింపకు మీభూపతితుండెవ డీబాలుండెవడు నీవెవరనిన నదియిట్లనియె. ఓమునీంద్రా యితండు మన్నాథుండు మనోజవుండను భూపాలకుండు, యీబాలకుండు మదీయపుత్రుండు చంద్రకాంతుండను నామంబుగలవాడు, మదీయనామంబు సుమిత్రయందురు. యీరాజన్యుండు గోళభుండనువానిచే రాజ్యంబుగోలుపడి యతిభయంకరంబగు నరణ్యంబున సంచరించుచుండి క్షుత్పీడితుండగు పుత్రుంగాంచి శోకాకులచిత్తుండై విలపించుచు మూర్ఛంబొందెననివిన్నవించిన నాసుమిత్రంజూచి పరాశరుండిట్లనియె వోమానినీమణీ భీతింబొందకు శీఘ్రంబున నశుభంబునశించు, నీభర్తయు క్షణమాత్రంబున మూర్ఛంబాసి లేవగలండనిచెప్పుచు నమ్మునివర్యుండు నిజకరంబున యానరనాథుశరీరంబు స్పృశించి, సదాశివమంత్రంబుజపించిన వసుంధరాధిపుండు మూర్ఛంబాసి పరాశరునకుం బ్రణమిల్లి యో మునీంద్రా! భవత్పాదసేవనంబున మదీయంబగు మూర్ఛనశించె, సకలపాపంబులు నాశనంబునొందె, పుణ్యహీనులకు యుష్మద్దర్శనంబు దుర్లభంబు. నేపూర్వంబున నొనర్చిన పుణ్యశేషంబున మిమ్ముంగాంచితి, నన్నుం గరుణాదృష్టి నవలోకించి రక్షింపుమని వేడిన నృపుంగాంచి మునీంద్రుండిట్లనియె. ఓ పార్థివా! భవచ్ఛత్రువులం జయింపందగిన యుపాయంబు వచించెద, పుణ్యప్రదంబగు రామసేతుసమీపంబున గంధమాదనంబునందు

సకలైశ్వర్యప్రదాయకంబగు మంగళతీర్థంబను నొకతీర్థంబుగలదందు సమస్తలోకోపకారంబుగా శ్రీరామదేవుండు సీతాసమేతుండై సన్నిధింజేసియుండుంగాన నీవుపుత్రకళత్రసమేతుండవయి యచ్చటికింబోయి భక్తిపూర్వకంబుగా దత్తీర్థంబున స్నానంబుగావించి యాతీరంబున క్షేత్రశ్రాద్ధాదికంబులంజేసిన నీయలక్ష్మీక్లేశంబునశించు. శుభంబులు ప్రాపించు నిశ్చయంబు. మరియును నీవు పుత్రకళత్రసమేతుండవై రాజ్యంబునొందగలవు గాన నచటికింజను నేనును స్నేహాతిశయంబున వెంటనరుదెంచెదనని పలికి పరాశరుండు భార్యాపుత్రసమేతుండగు భూమీశుందోడుకొని యనేకదేశంబులు గ్రామంబులు వనంబులందాటి గంధమాదనంబుజేరి యచ్చట మంగళతీర్థంబున సంకల్పపూర్వకంబుగా నాన్నపోత్తముని స్నానంబుజేయించి పితృప్రీతికరంబులగు తీర్థశ్రాద్ధంబులుగావించి దానును మజ్జనంబుగావించె. ఇట్లానృపోత్తముండు మాసత్రయంబు మజ్జనంబు గావింపుచుండ, పరాశరుండతనికి సర్వసిద్ధనాశకంబగు రామైకాక్షరమంత్రం బుపదేశింప, నతండాతీరంబున నామంత్రంబు మున్నుక్తప్రకారంబున నిరువదినాలుగు దినంబులు జపించుచుండ దత్ప్రభావంబున నతిదృఢంబగు బాణాసనంబును నక్షయతూణీరంబులు స్వర్ణమయఖడ్గంబును చర్మ గదా ముసలాద్యాయుధంబులును మహానాదంబగు నొకశంఖంబును సవాజీపతాకసారథికంబగు రథంబును కాంచనమయంబు నగ్నిప్రదంబగు కవచంబును హారకేయూరమకుట కటకాదిభూషణంబులు ననేకదివ్యాంబరమాల్యాదులు నామంగళతీర్థంబువలనం బరాశరమహాముని ప్రసాదంబునం బొడమినంగాంచి నృపోత్తముండు ప్రీతుండయి యామునీంద్రునకుంజూప నతండు దత్తీర్థోదకంబులెత్తి సమంత్రకంబుగా నారాజన్యునకభిషేకంబుగావించె.

అంత నాభూమీశుండామునివరప్రసాదంబున శోభమానుండును సన్నద్ధుండును చాపబాణాసన ఖడ్గధారియై, హారకేయూర కటక కిరీటాద్యాభరణాలంకృతుండును, దుకూలవస్త్రమాల్యచందనాదిధారియు ససారథికంబగు రథారోహణంబుగావించి మధ్యందినమార్తాండసమతేజుండై వెలుంగె నప్పుడు కరుణాసముద్రుండగు పరాశరుండు బ్రహ్మాస్త్రాదిదివ్యసాధనంబుల ప్రయోగోపసంహార మంత్రపూర్వకంబుగా నుపదేశింప నామనోజవుండామునీంద్రునకు వందనంబులొనర్చి దదాశీర్వచనంబులంబొంది దదనుజ్ఞాతుండై పుత్రభార్యాసమేతుండై నిజపురంబునకుంబోయి పురద్వారంబున శంఖధ్వానంబు గావించుటయు నారవంబాకర్ణించి గోభుండు సేనాసమేతుండై యరుదెంచె మనోజవుంజేరి దినత్రయంబతిభీషణయుద్ధంబుగావించె నంతమనోజవుండు నాలవదినంబున గోభుని బ్రహ్మాస్త్రంబుచే మరణంబునొందించి పుత్రభార్యాయుతుండై పురంబుప్రవేశించి రాజ్యభారంబు వహించి యహంకార రహితుండును అసూయాదిదోష రహితుండై ధర్మంబునప్పక వేయ్యేండులు రాజ్యంబొనర్చి విరక్తుండై నిజపుత్రు రాజ్యధురంధరుంజేసి గంధమాదనంబున

కుంబోయి యచ్చట మంగళతీర్థతీరంబునం దపంబుగావించుచు సదాశివధ్యాననిరతుండై యుండి కొంతకాలంబునకు తత్తీర్థప్రభావంబున దేహంబుబరిత్యజించి శివలోకంబునొం దె నతనిభార్యయు పత్యనుగమనంబుగావించి శివలోకంబునొందె గాన నోమునీంద్రులారా తత్తీర్థప్రభావంబున మనోజవుండు శివలోకంబునొందె నామంగళతీర్థంబు సమస్తజనసేవ్యంబు మరియునాతీర్థరాజంబు శుభప్రదంబు భుక్తిముక్తిప్రదంబు పాపపుంజవిదళనంబునై యొప్పుచుండు గాన మానవులాతీర్థంబుసేవించి యీప్సితఫలంబులంబొందుదురని శౌనకాదిమహామునులకు సూతుండువక్కాణించెను.

ఇది స్కాందపురాణంబునందు సేతుమాహాత్మ్యంబున
మంగళతీర్థప్రసంశయు మనోజనాత్క్రిసినారణంబను కథలుంగల
పండ్రెండవ యధ్యాయము సంపూర్ణము.

---

## పదమూడవ అధ్యాయము.

---

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సూతుండిట్లనియె ఓ మునీంద్రులారా! పూర్వోక్తంబగు మంగళతీర్థంబున స్నానంబుచేసినజనంబులు యచ్చటనుండి యేకాంతరామనాథాఖ్యక్షేత్రంబుననుండు అమృతవాపియను తీర్థంబునకుంబోయి స్నానంబుగావింపవలయు నచ్చటశ్రీరామచంద్రుండు సీతాలక్ష్మణహనుమదాదివానరసమూహసమేతుండై లోకానుగ్రహార్థంబై సన్నిధిజేసియుండు నాతీర్థంబునమజ్జనంబొనర్చినవారలు జరామరణభయవర్జితులై శివప్రసాదంబున నమృతత్వంబునొందుదురనిన ఋషులిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా! నీవిపుడువచించిన అమృతవాపియనుతీర్థంబున కానామంబెవ్విధంబున సంప్రాప్తంబయ్యె నవ్విధంబునవిస్తరంబుగా కృపాయుక్తుండవై యానతీయవలయు భవద్వాగమృతపానంబున మాకుందనివిగలదు గానవచింపుమనిన నతండిట్లనియె.

ఓ మునీంద్రులారా! మనోహరంబగు నమృతవాపికావైభవంబునచించెదవినుండు పూర్వంబున హిమవత్పార్శ్వంబున నానామునిగణ సమాకులంబును సిద్ధచారణకిన్నరాదిదేవతాగణసేవితంబును సింహవ్యాఘ్రమహిషగజాదిమహామృగసంవృతంబును తమాలతాలహింతాలచంపకాశోకాదినానావృక్షయుతంబును హంసకోకిలబకాద్యఖిలపక్షిగణసంకులంబును పద్మకైరవేందీవరవిభాసితసరోవరవిలసితంబునగు నొకఋష్యాశ్రమంబుగలదందు అగస్త్యసోదరుండను మహామునీంద్రుండు గలడతండు సత్యవంతుండును శీలవంతుండును మోక్షార్థియు శంకరప్రియుండగుచు దపంబుజేయుచుం త్రికాలంబుల శంకరునారాధించుచు వనజంబులగుఫలంబుల నివేదించుచు నిజాశ్రమాగతాతిథిజనంబుల మిగుల వందనంబులుంజేసి ఫలంబులచే దృప్తినొందించుచు నగ్నిపూజనంబుగావించుచు ప్రాతఃకాలంబున

సంధ్యావందనాదులంగావించి ప్రసన్నబుద్ధియై గాయత్రీజపంబుగావించి హరిశంకరపూజనంబులజేసి వేదాధ్యయనపరతుండై శాస్త్రపాఠియై మధ్యాహ్నంబున నతిథిపూజగావించి పురాణంబులువినుచు వైశ్వదేవాదియజ్ఞంబులంగావింపుచు షణ్ణవతిశ్రాద్ధంబులం బితృదేవతలకుం దృప్తిగావింపుచు నిట్లు దపంబుజేయుచుండ సహస్రవర్షంబులయ్యె నంతనతండు గ్రీష్మంబున పంచాగ్నిమధ్యంబుననిలిచి యూర్ధ్వబాహుండును నిరాహారుండును మౌనవ్రతుండును నిశ్చలుండునునై పాదాంగుష్ఠంబుననిలిచి యత్యుగ్రతపంబుగావింప దయాసముద్రుండును ప్రసన్నహృదయుండగు మహాదేవుండు దశదిగ్విభాసమానప్రభాశాలియు పార్వతీసహితుండును వృషభవాహనారూఢుండై సాక్షాత్కరించినంజూచి యామునీంద్రుండనేకవందనంబులుగావించి యిట్లనిస్తుతించె.

ఓ పార్వతీనాథా నీవు నీలకంఠుండవు, శివుండవు, రుద్రుండవు, మహాదేవుండవు, శ్రీకంఠుండవు, ఉమాపతివి, భగనేత్రహరుండవ్యయుండవు, గంగాధరుండవు, విరూపాక్షుండవు, అంతకారివి, కామారివి, దేవదేవుండవు, జగత్పతివి, పశుపతివి, శర్వుండవు, శతధన్వివి, దక్షయజ్ఞవినాశకారివి, సాధుసంరక్షకుండవు, కృపాళుండవు నిన్నుంగొనియాడ నాకలవియగునే దుస్తరంబగు సంసారసాగరనిమగ్నుండగు నన్నుద్ధరింపుమన్న యనేకవిధంబులం బ్రార్థించిన యగస్త్యసోదరుంగాంచి యీశ్వరుండు ప్రీతుండై యిట్లనియె. ఓ కుంభజానుజా, నీకు ముక్త్యుపాయంబు వచించెదవినుము సేతుమధ్యంబున గంధమాదనపర్వతంబున మంగళతీర్థసమీపంబున నొక మహాతీర్థంబుగల దచటికింబోయి నీవు స్నానంబుసేయుము. నాతీర్థప్రభావంబువర్ణింప నాతరంబుగాదు గాన నీవచటికింబోయి ముక్తింబొందుము నందియంబు నొందకుమనివచించి ఈశ్వరుండంతర్హితుండయ్యె నంత నామునీంద్రుండు గంధమాదనంబునకుంబోయి యేకాంతరామనాథక్షేత్రాలంకృతంబును ముక్తిదంబగు నాతీర్థంబున నీశ్వరోక్తప్రకారంబుదప్పక నియమయుక్తుండై వర్షత్రయంబు స్నానంబుగావించి సమాధిసంస్థితుండై బ్రహ్మనాడిని బ్రాణవాయువులంగూర్చి యోగబలంబుచే శిరంబున కారోపించె బ్రహ్మరంధ్రమువలన నాప్రాణవాయువులవెడలించి శరీరంబువిసర్జించి తత్తీర్థసేవావైభవాతిశయంబున పరమంబగు ముక్తింబొందె. అగస్త్యసోదరుండా తీర్థస్నానప్రభావంబున నమృతత్వంబునొందెంగాన నాతీర్థరాజం బమృతవాపియను పేరం బ్రసిద్ధినొందె. ఓ మునీంద్రులారా యాతీర్థోత్తమంబున నెవ్వరైన శాంతచిత్తులగుచు పక్షత్రయంబు స్నానంబుగావింపుదురో వారలమృతత్వంబునొందెదరు. అమృతవాపికా వైభవం బెరుంగించితి నికనేమి వినంగోరెదరనుటయు మునివర్యులు సూతునకిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా రామనాథాఖ్యక్షేత్రంబునకా యభిఖ్యనెట్లు సంభవించెనది సవిస్తరంబుగా గృపచేసిజెప్పుమాయనిన నతండిట్లనియె. ఓమునీంద్రులారా పూర్వంబున శ్రీరామభద్రుండు లక్ష్మణహనుమత్సుగ్రీవ విభీషణాదులంగూడి సేతునిర్మాణంబు గావించుసమయంబున సీతను

త్పాదయంబునందలంచుచు మంత్రాలోచనంబుసేయుచుండ సముద్రుండు తుంగతరంగాళిగలండై ఘోషంబుగావింప నారవంబుచే వారలకు పరస్పరరహస్యవాక్యంబులు వినమింగాంచి శ్రీరాముండతిక్రుద్ధుండై తీక్ష్ణదృష్టిచే నాజలనిధినదలించుటయు నాయకూపారుండు భయంబునొంది తరంగరహితుండు నిర్ఘోషుండయ్యె నంత నారామచంద్రాదులు రాక్షససంహారంబునకై యాలోచనం బేకాంతంబునం జేసిరిగాన నాప్రదేశం బేకాంతరామనాథాఖ్యక్షేత్రంబై యొప్పె నాప్రదేశంబున సముద్రుండా దినంబుమొదలిదివరకు తరంగంబులేనివాడును నిశ్చలుండునై యున్నవాడు అక్షేత్రంబుననుండు అమృతవాపియను తీర్థంబున స్నానంబుగావించిన మనుజులు ముక్తింబొందుదురు మరియును అద్వైతవిజ్ఞాన వివేకశూన్యులును విరక్తిహీనులును సమాధిరహితులును యోగానుష్ఠానశూన్యులగు మనుజులాయమృతవాపియందు స్నానంబుగావించిన యమృతత్వంబునొందుదు రిందుకు సందియంబు లేదని సూతుండు శౌనకాదులకుం జెప్పెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమాహాత్మ్యంబునందు
అమృతవాపీప్రశంస అగస్త్యభ్రాతృవిముక్తియునను కథలుంగల
పదమూడవ యధ్యాయము సంపూర్ణము.

## ప దు నా లు గ వ అ ధ్యా య ము.

మహనీయ గుణగరిష్ఠులగు శౌనకాది మునీంద్రులకు సూతుండిట్లనియె ఓమునీంద్రులారా మనుజులు పూర్వోక్తంబగు నమృతవాపియందు స్నానంబుగావించి యచ్చటనుండి యేకాంతరామనాథస్వామిని సేవించి వశీకృతేంద్రియులగుచు గంధమాదనంబుననుండు సర్వదారిద్ర్యనాశంబగు బ్రహ్మకుండంబునకుం బోవలయు నాతీర్థదర్శన మాత్రంబున ననేకసహస్ర బ్రహ్మహత్యాది సకలపాపంబులు నశించు. మరియును ఎన్నితీర్థంబుల నవగాహనంబుజేసిన నెట్టితపంబాచరించిన నెన్నియజ్ఞంబులాచరించిన నెట్టిదానంబులు గావించిన జనంబులకా తీర్థావలోకనమాత్రఫలంబైన సివ్వనోపదు మరియు నాతీర్థంబున కృవలి స్నానంబుగావించినవారలు వైకుంఠంబునొందుదు రట్టిమహామాన్వితంబగు బ్రహ్మకుండంబునంగల భస్మమునుధరించువారిని బ్రహ్మవిష్ణుమహేశ్వరు లనుసరించియుందురు. యెవ్వరైన నాభస్మమును త్రిపుండ్రధారణజేయుదురో వారలకు కైవల్యంబు కరస్థంబై యుండు మరియు నాభస్మంబొకించుకయైన లలాటంబున ధరించువారలకు ముక్తిగలుగుటకు సందియంబులేదు మరియు నాభస్మంబు మేనెల్లబూసుకొనువార లిట్టిపుణ్యంబులం బొందుదురనివచింప శంకరుండైన శక్తుండుగాడు ఎవ్వరైన నాబ్రహ్మకుండభస్మము నొకానొకప్పుడైన ధరింపకపోదురో వారలాచంద్రతారకంబుగ రౌరవాది నరకంబులంబడుదురు

మఱియు బ్రహ్మకుండభస్మము నిందించువారును లోకపావనంబగు నాభస్మంబునకు సమానంబుఁగలదనువారును నాభస్మంబుధరించక నితరభస్మంబుల త్రిపుండ్రంబుగా ధరించువారును వీరలు శంకరులని పండితులుచెప్పుదురు వీరికొకానొకప్పుడైన సుఖంబుగలుగనేరదు యెవ్వరైన నాభస్మంబు బ్రాహ్మణులకొసంగుదురా మనుజులు చతుస్సముద్ర మధ్యస్థిత భూమండలదాన ఫలంబునొందుదు రిందుకుసందియంబులేదు యీయర్థంబు నిశ్చయంబని భుజంబప్పళించి చెప్పంజాలుదు ఓ మునీంద్రులారా మీరు నాభస్మంబుధరింపుండు పూర్వంబున చతురాననుం డీశ్వరదత్తశాపనివారణంబునకై యచ్చట ననేకయజ్ఞంబులు సదక్షిణంబులుగాజేసి తచ్ఛాపమోక్షణంబొందె నాయజ్ఞకుండంబె బ్రహ్మకుండ తీర్థంబని ప్రసిద్ధినొందెనందేసరులైన స్నానంబు గావింపుదు రానరులు మహాదేవసాయుజ్యంబు నొందుదురసిన ఋషులిట్లనిరి.

ఓ పౌరాణికోత్తమా! పదునాలుగులోకంబుల నిర్మించిన చతుర్ముఖుండేమి యపరాధంబుగావించె, నీశ్వరుండెట్లుశపియించె దరశాపవిమోచనంబెట్లయ్యెనదియంతయు సవిస్తరంబుగా కృపచేసి జెప్పుమాయని వేడిన సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా? పూర్వకాలంబున బ్రహ్మవిష్ణులకిరువురకును నేనే సమస్తలోకంబులకుం గర్తనని యెడువాదంబు మహత్తరంబై ప్రవర్తించె నట్టిసమయంబున వారలగర్వంబునివారించి ప్రమోదంబుగలుగంజేయుటకై యనంతాగ్నిసమప్రభంబున ననాద్యంతంబునగు నొకలింగం బుద్భవింపగాంచి వారలాలింగాద్యంతంబు లెవ్వరు దెలియుదురో వారేలోకకర్తలని సకలదేవతాసాన్నిధ్యంబున శపథంబుగావించిరంత బ్రహ్మదేవుండు హరింగాంచి యిట్లనియె. ఓ రమానాయకా, నీవీలింగాదిం గాంచిరమ్ము, నేనూర్ధ్వంబునకుం బోయి యంతంబుగాంచివచ్చెదనని వచించిన విరించివాక్యంబులంగీకరించి రమానాయకుండు వరాహరూపంబునొంది యధోలోకంబునకుంజనియె, బ్రహ్మయు హంసరూపధరుండై యూర్ధ్వలోకంబునకుంబోయె నట్లుపోయి యాయిరువురనేకవర్షంబులు సంచరించి మరలి దేవసాన్నిధ్యంబు కేతెంచిరంత విష్ణుండు లింగాదింగానలేనని సత్యంబువచించె. నంత బ్రహ్మ తానంతంబుజూచివచ్చితినని యనృతంబుపలికె. నంత మహాదేవుండు వృషావాహనుడగు బ్రహ్మంగాంచి ఓయీ మత్సాన్నిధ్యంబున యనృతవాదివైతివిగాన లోకంబుల నీకుం బూజావందనాదులు లేకంబోవుగాకయని శపించె, నంత చతురాననుండు విషణ్ణచిత్తుండై ఓ యీశా, ప్రభువులగువారలు లోకయపరాధంబుక్షమింప సమర్థులుగాన నాయపరాధంబుక్షమించి రక్షింపుమని యనేకవిధంబుల వేడిన నీశ్వరుండు ప్రసన్నుండై పరితాపతప్తుండగు పద్మాసనుంగాంచి యిట్లనియె. ఓ పద్మజా నావాక్యంబనృతంబుగాదైన నొక యుపాయంబువచించెద వినుము నీవు గంధమాదనపర్వతంబునకుంజని యందు యజ్ఞంబులాచరించినవేని యీమిథ్యావాదదోషశాంతియగు, నంతట విగతపాపుండై శ్రౌతస్మార్తాదికర్మలయందు పూజితుండవగు

మవు. ప్రతిమూర్చనంబు నీకుంగలుగనేరదని యనుగ్రహించి విష్ణుదేవుంగాంచి ఓయీ నీవు సత్యవాదివిగాన లోకంబులనంతట నావలె పూజలంబొందుచుండుమని యనుగ్రహించి మహాదేవుండు తిరోహితుండయ్యె. నంత చతుర్ముఖుండు గంధమాదనంబునకుంబోయి శచీంద్రాదిదేవసమూహంబులంగూడి యెనబదెనిమిదివేలసంవత్సరంబులు పౌండరీకాదియజ్ఞంబుల నీశ్వరప్రీతిగానొనర్ప శంభుండు ప్రసన్నుండయి యిట్లనియె.

ఓ చతురాననా నీయనృతవాదదోషంబు నీచేజేయంబడిన యజ్ఞంబులచే నాశనంబునొందె. నింక శ్రౌతస్మార్తాదులయందు పూజ్యుండవుగమ్ము, యీయాగస్థలంబు భవత్కృతంబగుటంజేసి సకలపాపనాశకరంబై పుణ్యప్రదంబై బ్రహ్మకుండతీర్థంబని ప్రఖ్యాతింగాంచు, యీతీర్థంబున నెవ్వరైన స్నానంబుగావింపుదు రానరులు ముక్తిద్వారకవాటంబులభేదింతురు యీబ్రహ్మకుండజన్యంబగు భస్మమును ధరించువారలు మాయాకవాటవిపాటనంబొనరించి ముక్తింబొందుదురు యీభస్మమ్మును లలాటంబున ధరింపనిమానవుండు మాతృగర్భంబున పితృబీజనముద్భవుండుగాడు యీభస్మధారణంబుచే బ్రహ్మహత్యాసురాపాన గురుతల్పగస్వర్ణస్తేయనహస్రంబులునశించు యీభస్మంబున భూతప్రేతపిశాచాదులు క్షణమాత్రంబున నాశనంబునొందునని యివ్విధంబునజెప్పి యీశ్వరుండంతర్థానంబునొందిన చతుర్ముఖుండాయజ్ఞంబుల సమాప్తిగావించి శివప్రసాదంబున లబ్ధమనోరథుండై సత్యలోకంబునకుంబోయెనంత నింద్రాదిదేవతలును జితేంద్రియులగు మునీంద్రులు నాయజ్ఞభూమినాశ్రయించి సర్వవైభవంబులంబొందుచు సదక్షిణాకంబులగు యజ్ఞంబులంగావింపుచుందురు గాన మనుజులచ్చట నిరంతరంబు యజ్ఞంబులంగావింపవలయును. ఓ మునులారా మనుజదేవమునీశ్వర సేవితంబును సకలపాపవినాశనకారణంబును సకలసంసారబంధహరణంబును సకలార్థదంబునగు బ్రహ్మకుండతీర్థమాహాత్మ్యంబువచించితినని శౌనకాదులకు సూతుండుచెప్పెను.

ఇది స్కాందపురాణంబునంగల సేతుమాహాత్మ్యంబునందు బ్రహ్మకుండప్రశంసయు కమలాసనశాపమోచనంబునను కథలంగల పదునాలుగవ యధ్యాయము సంపూర్ణము.

## పదునైదవ అధ్యాయము.



మహానీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు సూతుండిట్లనియె. ఓమునీంద్రులారా పూర్వోక్తంబగు బ్రహ్మకుండంబునందుండి హనుమత్కుండంబునకుంబోవలయు నాహనుమత్కుండంబెట్టిదనిన పూర్వకాలమునందు రాక్షససంహారానంతరంబున యుద్ధమునువ

సంహరించి శ్రీరామచంద్రుండును సమస్తవానరసేనాధిపతులు స్వస్వసైన్యులై గంధమాదన పర్వతమునకు వచ్చినసమయంబున మారుతపుత్రుండగు నాంజనేయుండు లోకోపకారార్థము గ నిజనామాంకితంబై సర్వతీర్థంబులలోనుత్తమంబగు నొకతీర్థమును నిర్మాణముచేసెను తదీయవైభవంబెరింగిపలుకుటకు రుద్రునకైననుశక్యముగాదు యాతీర్థమునకు సమానమైనతీర్థము లేదు యాతీర్థస్నానమువలన సనాతనంబగు శివలోకము ప్రాప్తించు పుణ్యదంబగు నాతీర్థము నిది సర్వలోకోపకారార్థముగా వాయుపుత్రుండు నిర్మించె నాతీర్థమహిమవలన సమస్తనరకక్లేశమును శూన్యములై పోగలవు నాతీర్థస్నానంబుచే కేకయవంశజాతుండగు ధర్మసఖుండనుమహారాజు నూర్వురపుత్రులంగాంచెనని సూతుండు చెప్పగా ఋషులిట్లనిరి. ఓపౌరాణికోత్తమా హనుమత్కుండస్నానమహాత్మ్యంబున ధర్మసఖుండెట్లు నూరుగురుకుమారులంగనియె నాధర్మసఖుని చరిత్రము చెప్పవలయునని యడిగిన ఋషులంజూచి సూతుండిట్లనియె.

ఓ మునీంద్రులారా! పూర్వకాలంబున ధర్మసఖుండనురాజు శత్రువులంజయించి ధార్మికుండును మతిమంతుండును ప్రజాపాలనతత్పరుండునునై వెలుంగుచుండె, నతనికి నూరుగురుభార్యలుగల రాసతీమణులు భర్తయే దైవంబుగాదలంచుచుండి రతండు సశైల సవనకానన మహీరాజ్యంబునేలుచుండియు నానూర్వురుభార్యలవలన పుత్రులంబడయనోపక పుత్రార్థియై యనేకయోగంబులంజేసియు మహాదానంబులను దేవతాతుష్టికరంబులగు నశ్వమేధాదియజ్ఞంబుల తులాపురుషాదిదానంబులను ఉదయాద్యర్ధరాత్రపర్యంతంబు ఘృతసూపాదిసమన్వితంబగు నన్నదానముంజేయుచు పితృదేవతాప్రీతికరంబులుగా బ్రాహ్మణసమక్షంబున శ్రాద్ధంబులు జేయుచు సంతానానుగుణ్యంబులగు మంత్రంబులు జపంబుజేయుచు ననేకధర్మంబులాచరించినను పుత్రుండుకలుగకపోయె నివ్విధంబునం గొంతకాలంబుగడచిన నారాజేంద్రుండు వృద్ధుండయ్యె నప్పుడతండు జ్యేష్ఠభార్యయందు సుచంద్రుండను నొకకుమారునింబడసెను. ఇవ్విధంబున నరుదుగాబుట్టినపుత్రుండు దచ్ఛాభజాని జాయాశతంబునుం బరస్పరంబును వైషమ్యంబులేక క్షీరంబుమొదలైనవానిచేత నాకుమారునింబెంచుచుండి రాకుమారుండును రాజునకును మరియు నంతఃపురాద్యఖిలజనంబులకునుం బ్రధానులకును మనోనయనసంతోషంబుల జనింపంజేయుచుండగా నారాజన్యుండునుం గుమారునియం దత్యంతవిశ్వాసంబున సంతోషయుక్తుండై పెంచుచుండె. నిట్లుండ నొక్కనాడాందోళికాశయానుండగు బాలకుం దేలుకుట్టుటయు నావిషాగ్నిపీడచే నాబాలుండేడ్వసాగె నంతం దదీయమాతృసముదయంబును శోకాతురులై కుమారునింజుట్టి పొగలుచుండిరప్పుడా సంకులధ్వనివిని ధర్మసఖుండు సభామధ్యంబుననుండి మంత్రిపురోహితులంజూచి యొక్కభటునంపిలిచి యయ్యార్తారవంబు విచారించిరమ్మని పంపుటయు నాభటుండంతఃపురద్వారంబునకుంజని యచ్చటనుండెడి షండవృద్ధునివిలిచి ఓరి యాయార్త

పుత్రస్త్రీలేల విలపించెదరని యడుగుటయు నాతండు తద్వృత్తాంతంబంతయు నెఱింగించి వచ్చి భటునకుం జెప్ప నతండా వృత్తాంతంబు రాజునకు నెఱింగించె నంత రాజేంద్రుండు పురోహితామాత్యజనంబులం గూడి విషవైద్యులం బిలుచుకొని యంతఃపురంబునకుం బోయి తనసుతునకు ననేకవిధంబులగు చికిత్సలఁ జేయించె, నంత స్వస్థుండగు పుత్రుం గాంచి లాలనంబు చేయుచు విషచికిత్సకులకు రత్నకాంచనమౌక్తికాది బహుమానంబులు గావించి; యంతఃపురంబు వెడలి ఋత్విక్పురోహితామాత్యసహితుండై సభాసదనంబు జేరి యచ్చట సింహాసనాసీనుండై పురోహితులం గాంచి యిట్లనియె.

ఓ బ్రాహ్మణోత్తములారా, లోకంబున నొకపుత్రుండు కలుగుటకంటే పుత్రకులు లేకయున్నమేలు ఏకపుత్రత్వంబు దుఃఖంబుల నొసంగుచున్నది నేసంతానార్థంబై భార్యాశతంబుల వివాహంబొనర్చి వృద్ధుండనైతి, యిప్పుడు నాప్రాణంబులు నాభార్యాశతప్రాణంబులీ పుత్రకునందయున్నవి యితండు పంచత్వంబునొందిన నేభాగ్యలంగూడి క్షణకాలంబైన జీవింపంజాలగాన నో బ్రాహ్మణోత్తములారా నాకెవ్విధంబున బహుపుత్రులు గలుగుదురందుకుం దగిన యుపాయంబు శాస్త్రావలోకనంబు గావించి వచింపుండు భవన్నిగదితకర్మంబు దుష్కరంబయిన మహత్తరంబయిన నేనొనర్చెద యిందుకు సందేహంబు లేదనిన నృపుం గాంచి భూసురవరులిట్లనిరి వో నృపోత్తమా నీకు శతపుత్రులు గలుగు నుపాయంబు వచించెదము వినుము దక్షిణసముద్రతీరంబున సేతుపవిత్రితంబును సిద్ధచారణగంధర్వసేవితంబును నగు గంధమాదనంబను నొక పర్వతోత్తమంబు గలదందు లోకప్రసిద్ధంబును సర్వదుఃఖనివారణంబును మోక్షఫలప్రదంబును నారకక్లేశశమనంబును దారిద్ర్యనివారణంబును పుత్రప్రదంబైన నొకతీర్థంబు గలదు నీవచటికిం బోయి యందు స్నానంబు గావించి తత్తీరంబున పుత్రకామేష్టిం గావింపుము దాన నీభార్యలకందఱికి నొక్కొక్కపుత్రుండు కలుగుదురు గాన శీఘ్రంబున నంబొమ్మని చెప్పిన నృపోత్తముండు భృత్యామాత్యపురోహిత సంయుతుండును యజ్ఞసంభారసంభృతుండును ససైన్యుండును గా గంధమాదనకుం బోయి వానుమత్కుండంబున కృతస్నానుండై తత్తీరంబున మాసంబు వసించి యుండు నంతకాలంబేతెంచిన ఋత్విక్ప్రముఖాంబులతనిచే యిష్టినొనరించిరంత పురోహితులా రాజేంద్రుని భార్యలకుం బాయసంబొసంగ నక్కాంతలుం బ్రహించి గర్భంబులం దాల్చిరంత ధర్మసఖుండా తీర్థంబునం గృతావభృథస్నానుండయి బ్రాహ్మణోత్తములకు సదక్షిణాకంబులగు ననేక దానంబులొసంగి సపరివారుండును భార్యాశతపరివృతుండును నగుచు నిజపురంబునకుం బోయి సుఖంబుండె నంత కొన్నిదినంబులకా నృపోత్తముని జ్యేష్ఠభార్య యిర్వురును దక్కిన భార్యలొక్కొక్క పుత్రునంతున పుత్రులం బడసి రంత భూపాలుండు ప్రీతుండై కుమారులకు జాతకర్మాదులం జేసి బ్రాహ్మణోత్తములకు గోభూతిల హిరణ్యాది దానంబులొసంగె నంత నాకుమారులు దినదినప్రవర్ధమానులై సకలవిద్యావిశారదులయి ప్రవర్తింపుచుండ రాజేంద్రుండు

దనరాజ్యంబు పుత్రులకుబంచియిచ్చి సభార్యుండై గంధమాదనంబునకుంబోయి యచ్చట హనూమత్కుండంబున స్నానంబొనర్చుచు దత్తీరంబునహరుంగూర్చి దపంబుగావింపుచుండ ననేకదినంబులాయె నంతనతండు కాలధర్మంబునొంది హనూమత్కుండస్నానమహత్త్వంబున వైకుంఠంబునొందె నతనిభార్యలును పత్యనుగమనంబుగావించి భర్తంగూడిరంత సుచంద్రుండును జ్యేష్ఠపుత్రుండు నిజజనకుం బరేతకార్యంబులొనర్చి యనుజులంగూడి నిర్మత్సరుండై రాజ్యసుఖం బనుభవింపుచుండెంగాన నఖిలజనంబులీ హనూమత్కుండంబున స్నానంబుగావింపవలయునో మునివరులారా హనూమత్కుండ మహత్త్వంబును పరమాద్భుతంబగు ధర్మసఖుచరిత్రంబు నెరింగించితి యెవ్వండయిన నీయధ్యాయంబుభక్తియుక్తుండయిపఠించు వినునతండు ఇహంబున సర్వసుఖంబులంబొంది పరంబున దివ్యాప్సరస్సంభోగంబులంబొందునని శౌనకాదులకు సూతుండెరింగించెను.

ఇది స్కాందపురాణంబునందు సేతుమాహాత్మ్యంబున
హనూమత్కుండప్రశంసయు ధర్మసఖశతపుత్రావాప్తియను కథలంగల
పదునైదవ యధ్యాయము సంపూర్ణము.

## పదునాఱవ అధ్యాయము.

మహనీయ గుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సూతుండిట్లనియె నట్లు హనుమత్కుండవగాహనంబొనర్చిన జనంబులందుండి యగస్త్యతీర్థంబునకుం బోవలయు నాతీర్థంబగస్త్యనిర్మితంబయి మహాదేవాది సకలసుర సేవ్యంబయి యొప్పుచుండు పూర్వంబునం బర్వతరాజంబులగు మేరువింధ్యంబుల కన్యోన్యవిరోధంబువాటిల్లె నప్పుడు వింధ్యజఖలోకనిరోధంబై వృద్ధింబొందెగాన సర్వప్రాణులునిరుచ్ఛ్వాసులయిరంత దివిజులాయుత్పాతంబుగ్గాంచి పినాకిపాణికడకుంబోయి యావృత్తాంతంబంతయునెరుంగించిన నాదేవదేవుండు పార్వతీపాణిగ్రహణంబు సేయంగోరియున్నవాడుగాన వసిష్ఠాదిదివ్యమునిసమూహంబుల శైలరాజనందననిందేరంబంచి యగస్త్యుంగాంచియిట్లనియె. హో కుంభజా నీవు వింధ్యాద్రినిగ్రహించి లోకంబుల సంరక్షింపం బొమ్మ నపుడు యామునిపుంగవుడీశ్వరుంగాంచి యిట్లనియె, హో మహాదేవా యుద్వాహవేషంబుదాల్చిన నిన్నుజూడంగోరియున్న నన్నీకార్యంబునకుం బొమ్మనంపెగుసేయనిన కరకంఠుండిట్లనియె, హోయగస్త్యా నే పార్వతీసహితుండనై పుణ్యతమంబగు వేదారణ్యంబునందు మదీయంబగు వివాహవేషంబు నీకుంజూపెద నందుకు సంశయింపకనరుగుమనిన నమ్మునీంద్రుండట్లకాకయని యచటనుండి వింధ్యాద్రిసమీపంబునకుంజని తన్నగంబును నవనీతలంబునకు సమంబుగావించి యందుండి

దక్షిణాభిముఖుండయి చని గంధమాదనంబు జేరియందు గృతనివాసుండయి స్వనామాంకితం బగు నొకతీర్థంబు నిర్మించి తత్తీరంబున నిదివరకునున్నవాఁడా తీర్థంబునకు సమాన తీర్థంబు మూఁడులోకంబులనులే దాతీర్థస్నానంబున భుక్తిముక్తులొందవు పూర్వంబున దీర్ఘతముండను మునిపుత్రుండయిన కక్షీవంతుండనువాఁ డాతీర్థస్నాన వైభవంబునం జేసి స్వనయుండను నరపాలతనూజాతయగు మనోరమం బెండ్లియై సర్వసుఖంబులం బొందె నాకథ వివరించెద వినుండు పరమధార్మికుండగు దీర్ఘతముండను మునిశ్రేష్ఠుండుగల డతనికి కక్షీవంతుడను పుత్రుండు జన్మించి యుపనీతుండయి జితేంద్రియుండగుచు వేదాభ్యాసంబునకై యుదంకుండను గురుమందిరంబున వసించి యతనివలన చతుర్వేదంబుల సకలశాస్త్రంబుల యితిహాసపురాణాదులనెల్ల నభ్యసించి పిదప గురుదక్షిణయొసంగి గురుం గాంచి యోమహాత్మా మన్మందిరంబునకుం బోవ ననుజ్ఞ యొసంగవేయని వేడిన నతండు కరుణించి ఓకుమారకా భవద్వివాహంబునకుం దగిన యుపాయంబు వచించెద విను నీవు గంధమాదనంబునకుం జని యచ్చట రామసేతుసమీపంబున నగస్త్యకృతంబును సర్వాభీష్టప్రదంబును భుక్తిముక్తిప్రదంబును సర్వపాపనాశనకరంబును సర్వమంగళదాయకంబగు అగస్త్యతీర్థంబున నియమాచారయుతుండవై స్నానంబుగావించి మూఁడుసంవత్సరంబు లాతీరంబుననుండుమంత నాలవసంవత్సర ప్రథమదివసంబున శరదభ్రసమాన ధవళంబును చతుర్దంత విరాజితంబును మహోన్నతంబగు నొకగజంబా తీర్థంబువలనం బొడమ నాకరిపై నీవారోహణంబు గావించి మధురాపురాధిపతియగు స్వనయుసమీపంబునకుం బొమ్మతండును నైరావతారూఢుండగు పురందరుం బోలె ప్రకాశించు నిన్నుం గాంచి స్వతనూజాకృత దుఃఖంబువలనం బాయు పూర్వంబున నారాజేంద్రునకుం బుత్రికయగు మనోరమ సర్వాంగలావణ్యంబుగలిగి మిగులఁబాడవగు చతుర్దంతగజం బెక్కివచ్చినవాని బతిం గావరించెదనని ప్రతిజ్ఞగావింప స్వనయుండు వ్యాకులచిత్తుండై యాలోచింపుచుండ నొక్కనాఁడు దేవమునియగు నారదుండేతెంచిన నారాజేంద్రుండర్ఘ్యాదులచే బూజించి నమస్కరించి స్వపుత్రికా ప్రతిజ్ఞాప్రకారంబు విన్నవించి యోమహాత్మా చతుర్దంతదంతావళం బింద్రలోకంబునం గాని యీలోకంబున గనంబడ దెట్లీప్రతిజ్ఞ నెరవేరంగలదు నేనేమి సేయుదు నయ్యో యుక్తయగు కన్యయనాథయై యుండుట దుఃఖాకరంబై యున్నయదియనిన నారదుండిట్లనియె. ఓ రాజేంద్రా యింతకు చింతింపనేల నీపుత్రికకుం దగిన పురుషుండు కక్షీవంతుండనువాఁ డతండు చతుర్దంతదంతావళంబెక్కి శీఘ్రంబున రాగలండని చెప్పి నారదుండాకాశమార్గంబునం బోయె నాన్నృపుండును భవదాగమనంబు గోరుచున్నవాఁడుగాన నో బాలకోత్తమా నీవతిశీఘ్రంబున నగస్త్యతీర్థంబునకుం జని యందు స్నానంబు గావింపుచుండుము దానననీకు సమస్తశుభంబులుం గలుగునని యుదంకుండు బోధించిన కక్షీవంతుండు తదనుజ్ఞాతుండయి గంధమాదనంబు జేరి యందగస్త్యతీర్థంబున స్నానంబుచేసి

యొకదినంబు క్షేత్రోపవాసంబుగావించి మఱునాడు పారణంబొనర్చి యచ్చట గృతనివాసుండును నియతేంద్రియుండగుచు న త్తీరంబున మజ్జనంబు గావింపుచుండ నొకదినంబు గొరతగాగల మూడుసంవత్సరంబులాయె నంత నాభూసురకుమారుం డొకదినసాయంకాలంబున పశ్చిమాభిముఖుండయి సంధ్యావందనాదులం గావించి యాతటంబున సుఖసుప్తుండయి యారాత్రిగడపి వేకువజామున ప్రళయాంబుధివీచి కోలాహలంబును భీమంబగు మహాధ్వనివినిపింపకొని నలుదిక్కులంబరికించుచుండె. నాసమయంబున స్వనయుండను మథురాపురాధినాథుండు మృగయాకౌతుకుండై యరణ్యంబునకరుదెంచి రేమంగులు బెబ్బులులు యడవిదున్నలు కారుదున్నలు మొదలగు మెకంబులం బిలుకుమార్చుచు మంత్రి సమేతుండయి రథగజపదాతి సముదయంబులతో నగ త్యతీర్థంబుజేరి మృగయాజనిత శ్రమాపనోదనంబునకై త త్తీరంబున విశ్రమించె నంతప్రభాతసమయంబయ్యె నప్పుడు కక్షీవంతుండు స్నానంబుగావించి సంధ్యావందనంబొనర్చి నియమయుక్తుడై మంత్రజపంబుజేయుచుండ నాతీర్థో త్తమంబువలన కైలాసపర్వతంబునుబోలె నత్యున్నతంబగు చతుర్దంత దంతావళంబొకటి యావిర్భవించి జపనిష్ఠుడగు కక్షీవంతుప్రోల నిలువంబడిన యతండాగజంబుగాంచి యదంకో క్తలక్షణంబులన్నియు నందుంజూచి సముదితహృదయుండయి యాతీర్థంబునకు నమస్కరించి యనేకవిధంబులంబొగడి యాగజంబెక్కి మథురాపురంబునకుంబోవ నుద్యోగించె నంత చతుర్దంతదంతావళారూఢుండగు భూసురపుత్రుంగాంచి, స్వనయుం డతని కక్షీవంతునిగా నెరింగి ప్రముదితుండై యతనిసమీపంబునకుంబోయి యిట్లనియె.

ఓ భూసురో త్తమా! నీవెవ్వండవు నీనామంబెయ్యది యెచటికిం బోయెదవనిన కక్షీవంతుం డారాజేంద్రునకిట్లనియె. ఓ నృపో త్తమా, నే దీర్ఘతముండను భూసురుని పుత్రుండ కక్షీవంతుండనువాడ స్వనయుండను రాజేంద్రుని పట్టణంబునకుంబోయి త త్తనూజాతయగు మనోరమ పూర్వంబున చతుర్దంతగజంబెక్కి వచ్చినవాని వరించెదనని ప్రతిజ్ఞనొనర్చియున్నదిగాన నేనా ప్రతిజ్ఞాపూరణంబుగావించి యాకన్యారత్నంబును పరిణయంబుగావింపఁబోయెదననిన విని నృపో త్తముండు హర్షోత్ఫుల్ల నయనుండగుచు నతనికిట్లనియె, ఓ మహాత్మా నేస్వనయుండనువాడ భవద్దర్శనంబువలనం గృతార్థుండనయితి నీవిప్పుడుగోరియున్న మనోరమనా సంగెద యాకన్యంబరిణయంబై గార్హస్థ్యంబు పాలింపుమనిన విని ధర్మతత్పరుండగు కక్షీవంతుండు రాజేంద్రునకిట్లనియె, ఓ నృపో త్తమా మదీయ జనకుండగు దీర్ఘతముండు వేదారణ్యంబున దపంబుసేయుచున్నవా డమ్మహాత్మునిం బిలుపింపుమనిన నరనాథుండు సంతుష్టుండై యనేకసేనలతో సుదర్శనుండను పురోహితుం బంచె నతండును వేదారణ్యంబునకుం జని యందొక వృక్షమూలంబున వేదాటవీనాథుని ధ్యానంబుగావింపుచు తపోనియతుండై యున్న దీర్ఘతముం జూచి వందనంబులాచరించి యిట్లనియె.

తీర్థతీరంబున సపుత్రుండై యున్న దీర్ఘతపుం జేరి నమస్కరించుటయు నమ్మునీంద్రుండు కరంబులం గ్రుచ్చి యెత్తి యాశీర్వదించి యనేకవిధంబులగు వాక్యంబులం బ్రోత్సాహపఱచుచుండ మహాశ్రేష్ఠుండగు సుదంకుండును లక్షలకొలంది మునులును నేకంపు యనేకశిష్యులంగూడి తాము సేతుదర్శనంబునకు వచ్చి యందు ధనుష్కోట్యాదిగాస్నానంబు గావించి పిమ్మట యగస్త్యతీర్థంబునకరుగుదెంచిన శక్తివంతుండు దనగురునకుం బ్రణామంబులాచరింప నతం డా ప్రియశిష్యు నాశీర్వదించె నంత దీర్ఘతపుండయ్యుదంకు గుశలం బడిగిన నతండు నట్లరయు వచ్చె నిట్లు సర్వలోకవిశ్రుతులగు నయ్యుదంకపురుబరస్పరప్రీతికరంబులు పాపాపనోదనకరంబులగు కథలం బ్రొద్దుపుచ్చుచుండ నరేంద్రుం డుదంకునకుం బ్రణమిల్లి తదాశీర్వచనంబులం గైకొని దీర్ఘతపుం గాంచి యిట్లనియె.

ఓ మహాత్మా వివాహకార్యంబు నెరవేర్పవలయునని యనిన నతం డిట్లనియె నో రాజేశ్వరా వివాహకార్యంబెల్ల ఘనాగంధమాదనంబున నే గావింపం బ్రయత్నంబొనరింపుమనిన నతం డాక్షణంబ స్వకీయమంటపంబునకుం జని యంతఃపురంబునందు మనోరమం దోడ్కొని యగస్త్యతీర్థతీరంబునందు పటమంటపంబు జేరిరంత దీర్ఘతపుండు మఱుదినంబు శుభదినంబు గావున విధివత్ప్రకారంబున గోదానాదికర్మంబు లాచరించె నప్పుడు శక్తివంతుండు సర్వోచితశుభకర్మకలాపుండయి శిష్యగురుసమేతుండయి రాజకన్యాపరిగ్రహణార్థంబై సర్వాంగభూషితంబును మహోన్నతంబునునగు చతుర్దంతదంతావళంబెక్కి ఐరావతారూఢుండగు నింద్రుం బోలుచు మనోరమామనోరథపూరణంబు గావింపుచు ననేక సహస్ర భూసురపరివృతుండయి తోరణాలంకృతద్వారపరిశోభితంబగు రాజవివాహమంటపంబు ప్రవేశించిన నతనిం గాంచి కన్యామణియగు మనోరమయు ప్రతిజ్ఞాపూరణంబయ్యెనని సమ్మోదంబు నొందె నంత శక్తివంతుండు నృపాగారబహిర్ద్వారంబు జేరిన జనపాలుండు పురోహితసహితుండయి వరపూజనంబొనర్చె నప్పుడు కన్యాకాజనంబులు కనకపళ్లెరంబుల నీరాజనంబు లిచ్చిరంత శక్తివంతుండు నరపాలసమేతుండయి బ్రాహ్మణజనంబులం గూడి రాజమందిరంబు ప్రవేశించె నట్టియెడం బుడమిఱేడు దీర్ఘతపోదంక మునీంద్రులం బ్రియవాక్యంబులం దనిపె నంత వస్త్రభూషణాలంకృతయు సుధాధరయు బింబోష్ఠియు మనోహరయు పీనోన్నత స్తనయుగళయునగు మనోరమ సభామధ్యంబునందు సకలజనసమక్షంబున చంపకపుష్పమాలిక నతని కంఠంబునం జేర్చె నంత శ్వనయుండును శక్తివంతునకుం దనతనూజ విధివత్ప్రకారంబున నొసంగె నప్పుడుదంకుండు లాజహోమాదివివాహకృత్యంబుల సాంగంబుగ నొనర్చె నంత సభాజనులా వధూవరుల నాశీర్వదించిరా సమయంబున శ్వనయుండు ప్రీతుం డసంఖ్యాతులగు బ్రాహ్మణులకు షడ్రసోపేతంబుగ నన్నంబిడి తాంబూలవస్త్రభూషణాద్యులచే తృప్తినొందించె నంత వారలు ప్రముదితులగుచు నిజనివాసంబులకుం బోయిరంత యుదంకుండును నిజాశ్రయంబునకుం జనియె నాసమయంబున శ్వనయుండు శతసహస్రస్వర్ణ

ఖును సహస్రగోధనంబును దాసీసహస్రంబును పంచశతగ్రామంబులును దివ్యవస్త్రాభిరా తంబును భూషణపేటికాశతంబును హారమాలికాసహస్రంబును మరియు ననేకవస్తునముచ యంబును ధనమాత్మునకరణంబొసంగి వధూవరులననిపె నంతపుత్రస్నేహసహితుండయిన దీ ర్ఘకాలము స్వనయునివలన ననుజ్ఞవడసి వేదారణ్యంబునకుంబోయి భక్తిముక్తిప్రద దగువేదాటవీనాథు సేవింపుచు చిరకాలంబుసుఖంబుండె నంతస్వనయుండగస్త్యతీర్థంబు నం గృతస్నానుండై నిజసైన్యంబులంగూడి పురంబునకుంజని సుఖంబుండె నోమునీంద్రులా రా యిట్లగస్త్యతీర్థస్నానప్రభావంబునం కక్షీవంతుండనన్యదుర్లభంబగు రాజకన్యాకాపరిణ యంబుగావించె నీయితిహాసంబు వేదసిద్ధంబును పుణ్యప్రదంబునుయశస్సౌభాగ్యకారియు నై వెలయుచుండు గానమానవులీయితిహాసంబును పఠింపవలయునట్లొనర్చినజనంబులకు స కలదారిద్ర్యనాశనంబుగలిగి యిహపరసుఖంబులు గలుగునని శౌనకాదిమునీంద్రులకు సూతుండు వ్యాఖ్యానించెను.

ఇది స్కాందపురాణంబునంగల సేతుమాహాత్మ్యంబునందు
కక్షీవద్వివాహనిష్పత్తియను కథలంగల
పదునేడవయధ్యాయము సంపూర్ణము.



## పదునెనిమిదవ అధ్యాయము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సూతుండిట్లనియె నివ్విధంబున కుంభసంభవతీర్థంబున స్నానంబొనర్చినయనంతరంబున పుణ్యాతమంబును పాపవిముక్తి దంబుననగు శ్రీరఘునాథతీర్థంబునకుం జనవలయు నారామతీర్థతీరంబున నల్పదక్షిణా కంబులగు జన్నంబులాచరించినను బూర్ణఫలప్రదంబులగు. మరియు నాతీరంబున ముష్టి మాత్రద్రవ్యంబేనియు విద్వాంసులకొసంగిన ననంతగుణంబగు నాపుణ్యతీర్థమునుగూర్చి యొకయితిహాసంబు వ్యాఖ్యానించెదం జిత్తగింపుండు సర్వపాతకనాశకంబగు నాపుణ్య తీర్థసమీపంబునం గుంభసంభవశిష్యుండగు సుతీక్ష్ణనామకమహామునీశ్వరుండు నియతమా నసుండై శ్రీరామచంద్రచరణారవిందచింతనంబునం బ్రొద్దుపుచ్చుచు ధూమ్రాకారంబగుతపం బొనర్చుచు రామచంద్రాధిదైవత్యంబగు షడక్షరీమంత్రరాజంబు నిత్యంబును సహస్ర జపంబుచేయుచు ప్రత్యహంబా రఘునాథతీర్థంబునం గృతస్నానుండయి ఫలమూలీయుని యతాహారుండున్నవాడగుచు కామక్రోధాదులనింద్రియంబులం జయించియుండ ననేకకాలం బుగడచె నప్పుడొక్కసమయంబున నాసుతీక్ష్ణుండు జానకీసహితుండగు శ్రీరాముని నా రాధించి యిట్లనిస్తుతియించె నోజానకీప్రాణనాయకా హనుమత్ప్రియుండును గాధినంద నయాగరక్షణదీక్షితుండును కౌసల్యానందనుండును విశ్వామిత్రప్రియుండును వారకోదం,

డఖండనుండును మారీచాంతకుండును రాజేంద్రుండును తాటకాప్రాణాపహారియు కోదం డధారియు శ్రీహరియు ఖరాసురాంతకుండును జమదగ్నికుమారభంజనుండును దశరథాత్మ జుండును సుగ్రీవప్రభుండును వాలిసంహర్తయు విభీషణక్లేశప్రహర్తయు పాపహర్తయు నహల్యాదుఃఖసంహర్తయు భరతాగ్రజుండును సముద్రగర్వభంజనుండును సేతునిర్మాత యు సుకృతియు తారకబ్రహ్మంబును లక్ష్మణాగ్రజుండును రక్షస్సహారియు రావణమర్దనుం డును కోదండధారియు సర్వరక్షావిధానవిచక్షణుండునగు నీకువందనంబు లొనర్చెదనని సుతీక్ష్ణుండు రామచంద్రుం బొగడుచు ప్రత్యహంబు నాథతీర్థంబున స్నానము జేయుచుండ నతనికి రామచంద్రధ్యానంబువలన నిశ్చలభక్తియు అద్వైతజ్ఞానంబును ప్రత్యగాత్మైక్య లక్షణంబును త్రయీధర్మవిచారంబును అశ్రుతవేదార్థవేత్తృ సామర్థ్యంబును పరకాయ ప్రవేశంబును వియద్గమనశక్తియు సకలకళావిచక్షణత్వంబును గురుశిక్షలేయ యశ్రుతశా స్త్రాఖిలజ్ఞానంబును బ్రహ్మవిష్ణుమహేశ్వరలోకాదిసర్వలోకంబులకు నిరాఘాటంబుగబోవు సామర్థ్యంబును ఇంద్రియగోచరవస్తుదర్శనంబును దేవతాసంభాషణంబును పిపీలికాది సమస్తజంతుభాషాపరిజ్ఞానంబు నివిమొదలగు మహిమావిశేషంబులాతీర్థస్నాన వైభవంబు నంబ్రాప్తంబయ్యెంగాన నోమునీంద్రులారా నారామతీర్థంబు మహాపాతక నాశనకరంబు ను సకలసిద్ధిప్రదంబును మృత్యునాశనకరంబును భుక్తిముక్తిప్రదంబును నరకక్లేశనాశన కారియు రామభక్తిప్రదంబును సంసారభేదకారణంబై వెలయుచుండు నాతీర్థతీరంబున ర ఘునాయకుండొకలింగంబు స్థాపించిపూజించెంగాన జనంబులారామతీర్థంబున స్నానంబు గావించి తత్తీరంబుననుండు లింగదర్శనంబుగావించిన సకలైశ్వర్యంబులుగల్గి పిమ్మట ము క్తియుంగల్గు సంశయంబిందియుంబులేదు పూర్వంబున పాండవోత్తముండగు ధర్మపుత్రుం డాసరోవరంబున స్నానంబొనర్చి యాలింగదర్శనంబుగావించి యనృతజన్యంబగుపాపంబు వలనంబాసెనన మునీంద్రులాసూతునకిట్లనిరి నోమహాత్మా సత్యధురంధరుండగు ధర్మనం దనుండేల యనృతంబాడె పిమ్మట రామతీర్థస్నానంబువలన యాదోషంబెట్లు శాంతినొందెన ద్విధంబు సవిస్తరంబుగా నెరుంగింపవేయని వేడిన సూతుండిట్లనియె.

ఓ మునీంద్రులారా పూర్వంబున పాండవధార్తరాష్ట్రులు రాజ్యంబుగోరి మహా సైన్యపరివృతులై కురుక్షేత్రంబున గదనంబుజేయుచుండ భీష్ముండనేకవీరసంహారంబు గా వింపుచు పదిదినంబులు సమరంబుగావించి పుడమింగూలె నంతద్రోణాచార్యుండు సేనా నాయకుండై యనేకశస్త్రాస్త్రంబుల ప్రయోగించుచు పాండవబలంబుల బడలువడంజేయు చుండ తత్సేనానాయకుండును వీరోత్తముండగు దృష్టద్యుమ్నుండు కోపోద్దీపితుండై ద్రో ణుపయినడరె నాయుభయపక్షసమయంబున ఘోరంబగుయుద్ధంబయ్యె నప్పుడుద్రోణబా ణజాలపీడితంబగున పాండవసైన్యంబు భయార్తంబయి పరువిడిన నర్జునుండు నిజసైన్య

పలాయనంబుగాంచి ద్రోణుపైనదరి యనేకాస్త్రంబులం బ్రయోగించె నప్పుడింద్రాదిదేవస మూహంబులు దివ్యవిమానారూఢులయి యాకాశమార్గంబుననిలిచి రణప్రవీణులగునయ్యా చార్యశిష్యులకదనంబునకు వెరగందుచు లోకంబుననిట్టియుద్ధంబొనర్చినవారలులేరని పర స్పరంబువచింపుచుండ ద్రోణుండు ప్రియశిష్యుంబొగడి పాంచాలసైన్యంబుపైగవిసి దశలక్ష లయిరువదివేలసంఖ్యగల రథగజవాజిసమూహసమేతులగు నరపాలురం దునుమాడుచుండ దృష్టద్యుమ్నుండు కుపితుండయి ద్రోణుపైననేకాశుగంబుల ప్రయోగింప నతండాశిలీముఖం బులవారించి యగ్నిశిఖోపమంబగు బాణజాలంబులంబరప పాషదుండు భీతుండై రథంబు డిగి పరుంగిడిన వృకోదరుండతని తనయరదంబుపయినిడికొని ద్రోణుంగాంచి యిట్లనియె.

ఓ ద్రోణుడా! లోకంబున బ్రాహ్మణజనంబులకు శ్రుతిస్మృత్యాదుల నభ్యసించుటయు అహింసయు ధర్మంబు యిట్లుండ గొందరు బ్రాహ్మణాధములు స్వకర్మంబుమాని యస్త్రవిద్యలనభ్యసించి క్రూరులయి రాజన్యులనెదిరించి యుద్ధంబాచరింతురు. మరియును హింసాపరులగు వ్యాధులు, దారాపుత్రుల మృగవధంబుజేసి పోషింపుదురట నీవు నొక పుత్రురక్షింపంజాలక లోకరక్షావిచక్షణులగు రాజవరులం బరిమార్చెదవు యిప్పడాపుత్రుండును యుద్ధంబుననిహతుండయ్యె, నీవును లజ్జాహీనుండయి యేల కదనంబాచరించెద వనిన విని ద్రోణుండతనివాక్యంబు లాదరింపక ధర్మజులజేరి యడిగిన నతండు నిజంబని వచించె నంత ద్రోణుండు యుద్ధంబుమాని నిజస్యందనంబుపైబడి యోగవిద్యచే ప్రాణంబులం బరిత్యజించె. నంత దృష్టద్యుమ్నుండు ఖడ్గపాణియై ద్రోణురథంబుపైకురికి ఫల్గునాదులు వలదువలదని వారింపుచుండం గైకొనక ద్రోణుశిరంబుఖండించె నాసమయంబున యాదేహంబుననుండి యొకతేజంబు కృష్ణార్జున కృపధర్మపుత్రాదులు చూచుచుండ దివంబునకరిగె. నంత కౌరవబలంబు భయాకులంబయి పలుదిక్కులం బారినం గాంచి ద్రోణపుత్రుండగు యశ్వత్థామ దుర్యోధనుంగాంచి యిట్లనియె,

ఓ రాజరాజా! యీసైన్యంబు పారుటకుంగారణంబేమియనిన నతండు ద్రోణుమరణంబు తాజెప్పంజాలక కృపాచార్యుంబంచుటయు. నతం డశ్వత్థామునుంగాంచి యిట్లనియె. వో అశ్వత్థామా సంగరభయంకరుండగు భవజ్జనకుజయింపంజాలక పాండవులుండ శ్రీకృష్ణుడిట్లనియె వో పాండునందనులారా దుర్జయుండగు ద్రోణుంజయించుట కొకయుపాయంబువచించెద వినుం డశ్వత్థామ మృతుండయ్యెనని యొకండువచింపవలయు సామాన్యుండటువచింప నమ్మనేరండు ప్రామాణికుండగు జనుండట్లువచించిన గురుండు నిజాయుధంబులువదిలి ప్రాయోపవేశనంబుసేయు మరియొకవిధంబున ద్రోణుంజయింపరాదు గాన సత్యవాదియగు ధర్మజుం డశ్వత్థామ మృతినొందెనని వచింపవలయు ధర్మంబుల జయింపంగూడని శత్రుజనంబుల నధర్మంబుననైనం జయించుట యుక్తంబనిపలికిన కృష్ణవాక్యంబులువిని భీముండేటచింతెదనని గురుసమీపంబునకుంబోయి యశ్వత్థామ మృతుండయ్యెనని

యనృతంబాడిన యతండవ్వాక్యంబులు విశ్వసింపక ధర్మజానోద్ధకుంజుని యతనివలన నిశ్చితం డసత్యభయంబును జయాశాభావంబును మున్పరిగొన ద్రోణాయుధానన మాన్యుండ గ్గుతు గొంతదడవు చింతించి భీమువలన నశ్వత్థామయను కుంజరంబు నిహతంబయ్యె గాంచి భీమువలన నశ్వత్థామ మృతుండయ్యెనని పలికిన నావచనంబులాలించి ద్రోణుం డస్త్రసన్న్యాసంబొనరించె నంత ధర్మజుండు మదగజంబని పలికె నప్పుడు గురుండు మరల నస్త్రసంగ్రహంబొనర్పజాలక ప్రతిపక్షుండగు ధృష్టద్యుమ్నుం డేమి సేయునో యని సంశయింపుచు యోగవిద్యాబలంబుచే క్షణమాత్రంబున ప్రాణంబులం బరిత్యజించె నంత ధృష్టద్యుమ్నుండు ద్రోణువధంబు ప్రతిజ్ఞనొనరించియుండెం గాన రథంబుపైకురికి పార్థా దులు నివారించుచుండ తదీయకేశంబులు నిజకరంబునం బట్టి ఖడ్గధారచే భవజ్జనకుశిరంబు దెగ్రేసెనని యెరుంగించినవిని యశ్వత్థామ కొంతదడవు రోదనంబుచేసి పితృవధజనితకో పావేశంబుచే జ్వలితాగ్నియుంబోలె మండుచు ననృతంబాడి మజ్జనకు న్యస్తశస్త్రుం గావించిన ధర్మజాదిపాండవులనెల్ల దక్కినవారిని సన్న్యస్తశస్త్రుండగు మజ్జనకు కేశపాశ గ్రహణంబొనర్చి వధించిన ధృష్టద్యుమ్నుని బట్టిమార్చెద కృష్ణార్జునులు చూచుచుండ పరాక్ర మంబు మెరయించెదనని భయంకరంబగు ప్రతిజ్ఞ యొనరించె నంత నాదిత్యుండస్తగతుండయ్యె బిదపమూడుదినంబులు కర్ణశల్యదుర్యోధనాదులు కదనంబుజేయుచుండ ధర్మజుండు వా రలనందర నిశ్శేషంబుగాజంపి జయంబునొందిన రణసహాయులగువారలకు బరలోకక్రియలా చరించి ధృతరాష్ట్రసహితుండై హతశేషజనంబులంగూడి హస్తినాపురంబునకుంజని సు ఖంబుండె నంత పౌరజనంబులు ధౌమ్యాదిమునులును మహాత్ముండగు ధర్మజునకు రాజ్యాభి షేకంబు సేయంగోరి తత్ప్రయత్నంబు గావించుసమయంబున నశరీరవాణి ధర్మజుంగాంచి యిట్లనియె. ఓధర్మనందనా! నీవు శత్రుమిత్రసముండవై యుండియు ననృతంబాడియాచా ర్యునింజంపితివి గాన రాజ్యార్హుండవు గావు పాతకరం బతిశయంబై యున్నది తత్ప్రా యశ్చిత్తంబు గావించిన పిమ్మట రాజ్యార్హుండవగుదువనిన ధర్మజుండు ఖిన్నుండయ్యె మూ ఢుండ సాహసవంతుండ క్రూరుండ లోభాభిభూతుండ రాజ్యంబుగోరి యిట్టిపాపంబొనరిం చితి నీపాపంబునకుం బాసి శుద్ధినెట్లొందుదు నేమి సేయుదు నెక్కడికిం బోవుదునని యివ్విధంబునం జిం తించుచుండు సమయంబున కృష్ణద్వైపాయనుండేతెంచిన నతండా మునీంద్రునకుం బ్రణతుం డై యర్ఘ్యపాద్యాదులం బూజించి భక్తియుక్తుండును బద్ధాంజలిపుటుండును నగుచు నశరీర వాక్యంబుల నెరింగించిన ధర్మజుంగాంచి కొంతదడవు మనంబునం జింతించి వ్యాసుండిట్లని యె. ఓధర్మనందనా! చింతింపకుము నీకుగలిగిన పాపపరిహారోపాయంబు నెరింగించెదవి నుము దక్షిణసముద్రతీరంబునను౦డు గంధమాదనంబున రామసేతువునందు రామతీర్థం బను నొకపుణ్యతీర్థంబుగలదా తీర్థదర్శనమాత్రంబున బ్రహ్మహత్యాది మహాపాతకకోటులు సూర్యోదయంబువలనం బాయు తమంబునుం బోలె నశించు నిందుకు సందియంబులేదు గాన నీ వచటికిం జని యందు స్నానం బొనర్చి శుద్ధుండవై రాజ్యంబు పాలింపుము మరియునాతీర్థ

లంబున గోభూతిలహిరణ్యాది దానంబులొనర్చితివేని శిశుహత్యాజనితంబగు పాపంబువలన ముక్తుండవయ్యెదవని యాకాశవాణి పలుకుటయు పాండవాగ్రజుండనుజసహితుండై ధౌమ్యాదులం గూడి యయ్యాకాశవాణి సేతువునకుం జని రామతీర్థంబునవలోకించి యందు బిరోహితోక్త మార్గంబున స్నానంబొనర్చి క్షేత్రోపవాసుండై జితేంద్రియుండును, నిరాహారుండునై తల్లోకంబులేక నఖిలదానంబులొనర్చుచు నొక్కమాసంబు గడిపె, నంతనొక్కదినంబున నశరీరవాణి ధర్మనందనుం గూర్చి యిట్లనియె.

ఓ ధర్మనందనా ! నీవొనర్చినపాపంబులన్నియు లయంబునొందె నింక రాజ్యైశ్వర్యంబనుభవింపుమని నాగకరినగరంబునకుం జని పట్టంబుగట్టుకొని ప్రజాపాలనంబుగావింపుమని పలికిన యశరీరవాక్యంబులాలించి ధర్మజుండు ప్రీతుండయి యవ్వాక్యంబులు వినబడిన దిక్కునకు బ్రణమిల్లి యనుజపురోహితసహితుండయి హస్తినాపురంబునకుం జని మేదినీపాలనంబొనర్చుచు సుఖంబుండె. ఓ మునీంద్రులారా, యివ్విధంబున రామతీర్థస్నానమువలన ధర్మజుండనృతదోషముక్తుండయ్యె. సర్వపాపనాశనకారియగు నీ రామతీర్థప్రభావంబెవ్వరు పఠింపుదు రెవ్వరు వింటురా మనుజులు సమస్తపాపంబులకుం దొలంగి యనన్యలభ్యంబగు కైలాసవాసులై పునర్భవంబునొందరని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరింగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమాహాత్మ్యంబునందు
రామతీర్థప్రశంసయు ధర్మపుత్రమిథ్యాదోషశాంతియునను కథలంగల
పదునెనిమిదవ యధ్యాయము సంపూర్ణము,



## పందొమ్మిదవ అధ్యాయము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సూతుండిట్లనియె నట్లు రామతీర్థావగాహనంబొనర్చినవారలందుండి లక్ష్మణతీర్థంబునకుం బోవలయు నచ్చట స్నానంబొనర్చిననరుండు సకలపాపరహితుండై ముక్తింబొందు పూర్వంబున బలభద్రుండాతీర్థంబున స్నానంబుగావించి తత్తీరంబుననుండు లక్ష్మణేశ్వర దర్శనంబుగావించి బ్రహ్మహత్యవలనం బాసెనని నశౌనకాదులు సూతునవలోకించి యిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా బలభద్రున కేల బ్రహ్మహత్య సంభవించె విదవనది యెట్లు నాశనంబొందె నవ్విధంబు వచింపుమనిన సూతుండిట్లనియె.

ఓ భూసురులారా పూర్వంబున శేషావతారుండగు బలభద్రుండు కురుపాండవ యుద్ధంబాకర్ణించి బంధువధంబు సహింపజాలక విచారంబునొంది యిట్లని యాలోచించె నేదుర్యోధనునకు సహాయంబుగావించిన పాండుపుత్రులు కోపింతురు నేపాండవులకు సహాయంబొనర్చిన రాజరాజు కోపించుగాన మధ్యస్థుండనై తీర్థయాత్రకుం బోయెదనని నిశ్చయించి ప్రభాసతీర్థంబునకుం బోయి సంకల్పపూర్వంబునం గృతావగాహుండై దేవపితృతర్పణాదు

అరిగాపించి యచ్చటనుండి సరస్వతీనదికిం బోయి యందు స్నానంబు గావించి పిమ్మట పృథూదకంబును బ్రహ్మతీర్థంబును గంగయు యమునయు సింధువు శతద్రువు మొదలగు తీర్థంబుల స్నానంబు గావింపుచు మునీంద్రసేవితంబగు నైమిశారణ్యంబునకుం బోయి యందు దీర్ఘసత్రంబు గావింపుచున్న మునీంద్రులాయదుశ్రేష్ఠునైనరామునిం గాంచి యథార్హ్యాదులం బూజించి తంత మహాఫలాదులనొసంగి యుచితాసనంబిడిన నతండును సపరివారుండై ఉచ్చాసనస్థితుండై తన్నుంగాంచి వికృతాంజలియై నమస్కారంబొనర్పని సూతుంగాంచి కోపసంరక్తలోచనుండై ధృత్యులం గాంచి యిట్లనియె.

ధర్మపాలకులగు యీమునిశ్రేష్ఠులందరు నన్నుంగాంచి నమస్కరింపుచుండ యితండు విలోమయుండై వ్యాసమహామునీంద్రువలన నితిహాసంబులగు పురాణంబులనెల్ల నభ్యసించితినని గర్వంబున నన్నుంగాంచి యాసనంబువిగి నమస్కరింపక యున్నవాడు మరియు నిట్టివాడులగు వ్యాసశిష్యులి వ్విధంబున ధర్మాంబుగావింపరుగాన నీదురాత్మువధించెద దుష్టశిక్షణంబొనర్చుటకుగదా నేభూలోకంబున నవతరించితి యితండు నాచేనిహతుండై పరిశుద్ధుండగు నిందుకు సందియంబులేదని మహాబలుండగు రామపాలుండు కుశాగ్రంబునొని తచ్చిరంబు ఖండించెనంత నచ్చటనుండు బ్రహ్మవాదులగు మునీంద్రులాక్రోశించుచు బలరాముంగాంచి యిట్లనిరి ఓసంకర్షణా మేమీసూతునకు బ్రహ్మాసనంబును అక్షయంబగు నాయువొసంగితిమి నీవెరుంగక నితని వధించి బ్రహ్మహత్యంబొందితివి యోగీశ్వరుండగు నీకు నియామకుండెవడుగలండిప్పుడీబ్రహ్మహత్య పొలంగుటకు లోకసంగ్రహంబునకై అన్యప్రేరితుండవుగాక ప్రాయశ్చిత్తంబొనరింపుమనిన రాముండిట్లనియె వో మునీంద్రులారా నేకామంబులంగోరి ప్రాయశ్చిత్తంబొనర్ప లోకసంగ్రహణంబునకై యొనర్చెద నదియెట్లొనర్పవలయు వచింపుండు యుష్మద్వాక్యప్రకారంబునం జేసెద మీరీసూతున కక్షయంబగు నాయువొసంగితిరిగాన నాయోగమాయబలంబున సత్వంబు మొదలగునన్నియు నితనికిం గలుగంజేసెదననిన రాము నవలోకించి మునీంద్రులిట్లనిరి వోసంకర్షణా నీవు మృత్యుప్రభావాతిశయ ప్రవర్తకుండవు నిన్నుంగానియాడ మాదరంబేయనిన బలరాముండిట్లనియె. ఓ మునీంద్రులారా నాయోగమాయాబలంబున నితనికి మరల నాయువొసంగెదనని నమ్మునీంద్రులు పరిపూర్ణహృదయులగుచు యిట్లనిరి యోదేవా భవదాదృశ పరాక్రమాఢ్యులెందును లేరు మీరానతిచ్చిన ప్రకారం బీసూతుమరలం బ్రతికించి మమ్ముం గృతార్థులం జేసి కావుమనిన బలభద్రుండు మునీంద్రులం గాంచి ఆత్మావైపుత్రనామాసి యను వేదోక్తప్రకారంబున యీసూతునిశరీరంబువలన దీర్ఘాయుష్మంతుండగు పుత్రుండుదయించు నతండు సమస్తపురాణంబుల మీకు వినుపింపంగలండు మరియు మీకుంగల యభిలాషంబెయ్యది వినుపింపుండనిన వారలిట్లనిరి యోబలదేవా యిల్వలుండను రాక్షసపుత్రుండు బల్వలుండనువాడు పర్వకాలంబుల యిచటికరుదెంచి మేమొనర్చు యజ్ఞంబులం జెరిచిపోవుచున్నవాడా

కాన యెవరులైన యజ్ఞాదులొనర్పక యుపవాసంబులంజేయక యుండియు జటాతీర్థరాంబున స్నానంబొనర్చిరేని చిత్తశుద్ధింబొందుదురు మరియు నీ తీర్థస్నానంబున సకలదానఫలంబులుగల్గు సర్వధర్మంబులదరింపదగు సర్వపుణ్యంబులు మహత్వంబులుంగల్గు లోకంబున జనంబులకు జటాతీర్థస్నానంబు జేయక గాని యంతఃకరణశుద్ధి గలుగనేరదు మరియు నితరదేవతులును నియమంబులు జపోపవాసాదులాతీర్థంబువలె చిత్తశుద్ధిదంబులు కావు యాతీర్థోత్తమంబున సర్వలోకవిశ్రుతంబు ధన్యంబును యశఃప్రదంబును పవిత్రంబును పాపనాశనంబును సర్వమంగళకారియునై వెలయుచుండు పూర్వంబున వరుణనందనుండగు భృగుండు తండ్రింగాంచి చిత్తశుద్ధిగలుగు నుపాయంబు వచింపుమని యడిగిన వతండిట్లనియె.

ఓ నందనా పుణ్యంబగు గంధమాదనంబున జటాతీర్థంబను తీర్థంబుగలదందు స్నానంబొనర్చిన చిత్తశుద్ధిగల్గుననిన పితృవాక్యంబులువిని భృగుండాక్షణంబ జటాతీర్థంబునకుంజని యందుస్నానంబొనర్చి చిత్తశుద్ధింబొంది వినష్టాజ్ఞానవంతుండును పుత్ర స్వాద్వైతవిజ్ఞానుండును అఖండసచ్చిదానంద స్వరూపుండయ్యె వో శుకా దూర్వాసుండాతీర్థంబున మజ్జనంబొనరించి మనశ్శుద్ధింబొంది బ్రహ్మనందమయుండయ్యె మరియు విష్ణ్వంశసంభూతుండగు దత్తాత్రేయుం డాతీర్థంబునస్నానంబొనర్చి శుద్ధాంతఃకరణుండై బ్రహ్మాకారుండయ్యెగాన తువ్వండైన యజ్ఞాననాశనంబుగోరునతండు పరిశుద్ధంబును సకల పాపనాశనకారియునగు నాజటాతీర్థంబున స్నానంబుగావింపవలయు నీవును మనశ్శుద్ధిదంబగు నాతీర్థంబునకుంజని యందుస్నానంబుగావింపుమనిన శుకుండు రామసేతువునకుంబోయి యచ్చటవిశుద్ధిదంబగు జటాతీర్థంబున సంకల్పపూర్వకంబుగా స్నానంబొనర్చి మనశ్శుద్ధింబొంది దానవజ్ఞాననాశనంబునొంది పరమానందరూపకంబగు జ్ఞానంబునొందె మరియు మనశ్శుద్ధింగోరిన మునిజనంబులాతీర్థంబున స్నానంబుగావించి యీప్సితంబులంబొందుచుందురు కామధేనుసమంబగు జటాతీర్థంబు గలిగియుండియు నరుండితరంబుల మోహితుండయి సేవింపనేల యెవ్వండైన భుక్తింగోరిస్నానంబొనర్చిన భుక్తింబొందు ముక్తింగోరి స్నానంబొనర్చిన ముక్తినొందు నిందుకు సందియంబులేదు వేదంబులు తపంబులు ఉపవాసంబులు జన్మంబులు మొదలయినవన్నియు మనశ్శుద్ధిదంబు లవియన్నియు లేకపోయినను జటాతీర్థస్నానంబొనర్చిన మాత్రంబున మనశ్శుద్ధిగలుగు ధ్రువంబు వో మునీంద్రులారా జటాతీర్థమహాత్మ్యంబు వచింపంజాల హరిహరవిరించాదు లెరుంగుదురు లోకంబున తత్సదృశంబులేదు యెవ్వారైన నాతీర్థతీరంబున క్షేత్రపిండంబిడిన గయాశ్రాద్ధసమంబగు జటాతీర్థస్నానంబున నరుండు పాపంబులంబాయు దారిద్ర్యనరకాదులనొందడు ఓమునీంద్రులారా మహాయోగియు వ్యాససుతుండగు శుకయోగీంద్రుడు మనశ్శుద్ధిబొందిన జటాతీర్థప్రభావంబు వచించితి యెవ్వండైన నీయధ్యాయంబు భక్తిపూర్వకంబుగ పఠించునాత

ఠించు నతఁడు సకల పాపపుంజవిదళనంబొనర్చి విష్ణుపదంబునొందునని శౌనకాదులకు సూతుండెఱింగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు -
జటాతీర్థప్రశంసయు శుకచిత్తశుద్ధ్యవాప్తియును కథలంగల.
ఇరువదవ యధ్యాయము సంపూర్ణము.

## ఇరువదొకటవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకల పురాణాభిజ్ఞుండగు సూతుండిట్లనియె. అట్లు జటాతీర్థావగాహనంబొనర్చినవార లందుండి లక్ష్మీతీర్థంబునకుం బోవలయు నాతీర్థంబున జనంబులేయే కామంబులం గోరి స్నానంబాచరింతురో వారలాయభీష్టంబులం బొందుదురు మరియు నాతీర్థోత్తమంబున సర్వదారిద్ర్యశమనంబును సకల దుఃఖనివారణంబును సర్వసంపత్ప్రదంబై వెలయుచుండు పూర్వంబున ధర్మనందనుం డింద్రప్రస్థంబున రాజ్యంబొనర్చుచు శ్రీకృష్ణప్రేరితుండై యాలక్ష్మీతీర్థంబునకుం బోయి యందు స్నానంబు గావించి మహదైశ్వర్యంబునొంది రాజసూయంబొనరించెననిన విని శౌనకాదులిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా ధర్మజుం డెవ్విధంబున కృష్ణబోధితుండై లక్ష్మీతీర్థంబున స్నానంబొనర్చి యైశ్వర్యంబు నొందెనది విస్తరంబుగా జెప్పుమనిన సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా యుధిష్ఠిరుండనుజసమేతుండై యింద్రప్రస్థంబుననుండ శ్రీకృష్ణుడేతెంచిన నతండు పరమ సంతోషపూరితహృదయుండై యనేకవిధంబులం బూజించి కొంతదడవుండి యతనితో నిట్లనియె. ఓ పుండరీకాక్షా మానవులేధర్మంబొనర్చిన మహదైశ్వర్యంబుగల్గువచింపవే యని వేడిన కమలనాభుండిట్లనియె. ఓ ధర్మనందనా గంధమాదన పర్వతంబున లక్ష్మీతీర్థంబను తీర్థంబు సకలైశ్వర్యైకకారణంబై యుండు నాతీర్థంబున స్నానంబొనర్చిన వారలఖిలైశ్వర్యంబులం బొందుదురు నాతీర్థంబున స్నానంబొనర్చి యమరులసురులం జయించిరా తీర్థస్నానంబున ఐశ్వర్యంబు శ్రేయంబునుగల్గు సర్వపాపంబులు లయంబునొందు సకల వ్యాధులడంగు నింతకు సందియంబులేదు యాతీర్థంబున స్నానంబొనర్చిన మాత్రంబున నలకూబరుండప్సరః శ్రేష్ఠయగు రంభం బొందె మరియు నాతీర్థస్నానమహిమంబున కుబేరుండు మహాపద్మాది నవనిధినాథుండయ్యెగాన ధర్మనందనా నీవనుజయుతుండవై యచటికిం బోయి యాతీర్థంబున స్నానం బొనర్పుము దాన సకల శత్రువులం జయించి మహదైశ్వర్యంబునొందుదువు నిశ్చయంబనిన ధర్మనందనుండద్భుతదర్శనుండగు శ్రీకృష్ణవాక్యంబులాకర్ణించి యాక్షణంబ సానుజుండై గంధమాదనకుం బోయి మహదైశ్వర్యకారణంబగు లక్ష్మీతీర్థంబు జేరి యందు నియమసంయుతుండై మాసంబు స్నానంబు గావించి భూసురులకు గోభూతిల హిరణ్యాది దానంబులొసంగి యింద్రప్రస్థంబు జేరి రాజసూయం బొనర్ప నఖిలాపవాదమిన లీలామానుషవిగ్ర

వాఁడగు శ్రీకృష్ణుం బిలిపించి యామహామహునకు తనయభిప్రాయం బెఱుఁగింపవలెండి య్యాకొని ధర్మనందనుతో యుక్తియుక్తంబుగా నిట్లనియె.

ఓ పైతృష్వస్రేయా యీ రాజసూయంబు సకలరాజన్యులు జేయందరంబుగాదు అనేక రథగజాదిసేనాయుతుండగు మహీపతి యీయజ్ఞంబొనర్ప సమర్థుం డితరుండు సమర్థుండుగాడు గాన ప్రథమంబున బలవంతుడవై దశదిక్కులంగల రాజవరులం జయించి వారలచే కాంచనమయంబులగు కరంబులం గొని దాననా క్రతురాజం బొనర్పుము యుక్తిపూర్వకంబుగావచించెదగాని నిన్ను భీతినొందింపంగాదు దిగ్విజయం బొనర్పక యీయజ్ఞంబొనర్పం దగదనిన విని ధర్మజుండనుజులం బిలిపించి వో భీమబహుబలశాలీ వోయర్జునా ధనుర్బలశాలీ వోయమలులారా సుకుమారాంగులారాయని సాదరంబుగా బహూకరించి యిట్లనియె. ఓ బలవంతులారా రాజసూయంబొనర్పఁగోరెద యాక్రతువరంబు సర్వరాజన్యులజయించి కాని జేయనలవిగాదు గాన సైన్యంబులతో మీరలు నలువురు చతుర్దిక్కులకుంబోయి భూపాలురం జయించి ధనంబులం దెండు దాననామహాక్రతువొనర్చెదననిన భీమాదులు ప్రసన్నముఖులగుచు పురంబు వెడలి దిగ్విజయంబొనర్పఁగోరి నలువురు నాలుగుదిక్కులకుంజని సర్వరాజన్యులంజయించి వారలందమవశంబుగావించి యసంఖ్యాతంబులగు ధనంబులంగొని స్వపురంబున కరుగుదెంచి రందుమహాబలుండగు భీముండు శతభారసువర్ణంబుగొనియె తెంచె మహాపరాక్రముండగు నర్జునుండు సహస్రభారసువర్ణంబుగొనియరుగుదెంచె మహాబలుండగు నకులుండు శతభారసువర్ణంబుగొనియె తెంచె మహాతేజుండగు సహదేవుండు దాక్షిణాత్యమహీపాలురచే యనంతధనంబును విభీషణదత్తంబులగు చతుర్దశస్వర్ణతాళంబులఁగొని యేతెంచె నంత శ్రీకృష్ణదేవుండు లక్షకోటిసహస్రంబులు లక్షకోటిశతంబులసంఖ్యగల సువర్ణంబులు వస్త్రభూషణాదులనొసంగె నంతధర్మనందనుండనుజ గృహీతంబులు కృష్ణదత్తంబులు యసంఖ్యాతంబులగు ధనంబులఁగొని రాజసూయం బొనర్చి బ్రాహ్మణజనంబులకన్నంబును వస్త్రభూషణాదులు ధనంబులు నొసంగె నవ్విధంబెరింగించెద వినుండు యాచకులెంత ద్రవ్యంబుగోరుదు రంతకినుమడుంగులొసంగె నా ద్రవ్యంబుగణింప బ్రహ్మకోటికైనందరంబుగాదు మరియు నర్థిసమూహంబులు జేకొనియరుదెంచు ధనంబులం గాంచి జనంబులు యీరాజన్యుండు సర్వంబునర్థులకొసంగెనని వచింతురు. మరియు ననంతమణికాంచనంబులగు కోశంబులంగాంచి యర్థులకు స్వల్పంబొసంగెనని వదలంతురి వ్విధంబున ధర్మజుండు రాజసూయం బొనర్చి యనుజసమేతుండై బహుధనసమృద్ధంబగు పురంబుజేరి సుఖంబుండె ఓ మునీంద్రులారా, ఇవ్విధంబున యుధిష్ఠిరుండు లక్ష్మీతీర్థస్నానమహిమంబునంజేసి సౌఖ్యంబుల నొందెగాన తత్తీర్థసదృశంబులేదు వోమునీంద్రులారా దుస్స్వప్ననాశనంబును పుణ్యంబును సర్వాభీష్టఫలప్రదాయకంబగు లక్ష్మీతీర్థప్రభావంబు వచించితి యీయధ్యాయం బెవ్వండైనం బఠించు వినునతండిహంబున సర్వైశ్వర్యం

బులంబొంది సకలభోగంబులనుభవించి దేహాంతంబున ముక్తినొందుదనని శౌనకాదులకు సూతుండెరుంగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమాహాత్మ్యంబునందు
లక్ష్మీతీర్థప్రశంసయు ధర్మపుత్రరాజసూయావాప్తియను కథలంగల
ఇరువదొకటవ యధ్యాయము సంపూర్ణము.

## ఇరువదిరెండవ అధ్యాయము.

మహనీయ గుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సూతుండిట్లనియె నట్లు లక్ష్మీతీర్థంబున స్నానంబుజేసినవార లందుండి యగ్నితీర్థంబునకుం బోవలయు నాతీర్థంబు మహాపుణ్యంబును పాతకనివారణక్షమంబునునగు తీర్థోత్తమంబై సర్వాభీష్టైకసాధనంబునునై ప్రకాశించు నచ్చట స్నానంబొనర్చిన నరుండు పాపశుద్ధింబొందుదురనిన ఋషులిట్లనిరి. ఓ సూతుడా, యాతీర్థంబున కగ్నితీర్థంబను పేరెట్లాదవె తద్వైభవం బెట్లువర్తిల్లు శ్రద్ధాయుక్తులమగు మాకవ్విధంబు సవిస్తారంబుగా గృపచేసి చెప్పుమాయనివేడిన సూతుం డిట్లనియె. ఓ మునీంద్రులారా పూర్వంబున రాఘవుండు సపరిచ్ఛదంబుగా రావణవధం బొనరించి లంకారాజ్యంబున విభీషణునభిషిక్తుంజేసి సీతాసౌమిత్రి సమేతుండై సుగ్రీవాదివానరసమూహంబులుగొలువ సిద్ధచారణ గంధర్వాదులుపొగడ విభీషణసహితుండై నారదాదిమునీంద్రులు సేవింప గంధమాదనంబు జేరి లక్ష్మీతీర్థతటంబునవిడిసి యచ్చట జానకినిశోధింపంగోరి పితృసాన్నిధ్యంబున నగ్నినావహింపజేయ నతండు ఆతాంరసులోచనుండును పీతవస్త్రుండును ధనుర్ధారియు సప్రజాపూజ్యుండునునై వెడలి లక్ష్మీతీర్థసమీపంబుననుండు లీలామానుషరూపియు శూరుండునునగు రఘునాయకుంగాంచి జానకీశుద్ధి కొరకు రమ్యంబగు వచనంబు వక్కాణించె. ఓ మహానుభావా ఓ రాక్షసమర్దనా జానకీపాతివ్రత్యంబున నీవు రావణుంజంపితివి సత్యంబువచించెద యీవిషయంబునకు విచారంబుబన్నిలేదు నీవు దేవత్వంబునొందిన దేవత్వంబునొందు మనుష్యత్వంబునొంద మానుష్యంబునొందు మరియు లీలామానుషవిగ్రహాయగుచు భవద్రూపానురూపంబులగు దేహంబులంబొందుచుండు నీవు భార్గవరాముండైన ధరణియయ్యె. నీవిప్పుడు రఘురాముడైన జానకియయ్యె, నీవు కృష్ణుండైన రుక్మిణియగు మరియు నీవేయవతారంబుల నొందిన నాయవతారంబులనొంది త్వత్సహాయినై యొప్పుచుండు గాన మద్వాక్యంబులు విని యీసీతంగ్రహింపుమనిన యగ్నిదేవువాక్యంబులువిని మహర్షిసంఘంబులు విద్యాధరాది దేవసమూహంబులు సకలభూతంబులు ఆసీతారాముల ననేకవిధంబులం గొనియాడి రంత రాఘవుం డగ్నివచనంబువలన సీత నిర్మలంగా నెఱింగి గ్రహించె. యచ్చట యగ్ని

దేవుండగు రామునిచే యావాహనంబునొంది వెడలె గాన నా ప్రదేశం బగ్నితీర్థంబని
ఖ్యాతింబొందె, నాతీర్థతీరంబున నన్నదానంబుగావింప విశేషఫలప్రదంబగు. నరుండా
యగ్నితీర్థంబున స్నానంబొనరించి యుపోషణంబుండి వేదవిదులగు బ్రాహ్మణజనంబుల
కన్నంబిడి వస్త్రకాంచనాదులొసంగిన సర్వపాపంబులంబాసి విష్ణుసాయుజ్యంబునొందు
నాయగ్నితీర్థసదృశతీర్థంబులేదు పూర్వంబున దుష్పణ్యుండను వైశ్యుం డాతీర్థంబున
స్నానంబొనరించి మహాఘోరంబగు పిశాచత్వంబుమాని దివ్యంబగురూపంబునొందె. నత్తె
రంగెరుంగించెద వినుండు.

పాటలీపుత్రకంబనునొకపట్టణంబుగల దాపురవరంబున బ్రాహ్మణారాధననిరతుండును
ధర్మతత్పరుండగు పశుమంతుండను నొకవైశ్యుండునిరంతరంబు కృషిగోరక్షణాదులనొన
ర్చుచు వాణిజ్యంబుగావించుచు ధర్మనిరతుండయి భార్యాత్రితయంబునుద్వాహంబై వార
లలో జ్యేష్ఠభార్యయందు సుపుణ్యపుణ్యవంతచారుపుణ్యులనముగ్గురను ద్వితీయభార్యయం
దు సుకోశబహుకోశులనిద్దరను తృతీయభార్యయందు మహాపుణ్యమహాకాయ దుష్పణ్యు
లను ముగ్గురతనయులంగాంచె నంతనాసుపుణ్యాదులగు బాలకులు దినదినప్రవర్ధమానుల
గుచు ధూళికేళింగావింపుచుండ నైదేండ్లాయెనంత పశుమంతుండునుకుమారుల స్వకులో
చితంబులగు కృషిగోత్రాణవాణిజ్యాది కర్మశిక్షితులంగావింపుచుండ వారలా జనకువాక్య
ప్రకారంబుననడుచుచు సకలక్రియాదక్షులైరందష్టముండగు దుష్పణ్యుండు బాల్యంబునను
దసు దుర్మార్గనిరతుండై పితృవాక్యంబంగీకరింపక ధూళికేళియందు అన్యబాలురంబాధిం
చుచు దుష్కర్మలోలుండైయుండ పశుమంతుం డీబాలుండు బాలిశుండని యుపేక్షనొన
ర్చె నంతబలవంతుండగునతండు నగరంబునంగల బాలకులంగొని కూపసరోవరాదులంజేరి
యందుమృతినొందించుచు తనదుశ్చరిత్రంబెవ్వరికిందెలియకుండ వర్తించుచుండ మృతులగు
బాలకుల పితృమాతృలుదుఃఖితులై యాక్రోశింపుచు నగరప్రాంతంబులంబరిశీలించి జలంబు
లనుండు శవంబులంగాంచి విలపింపుచుండు రిట్లాదుష్పణ్యుండు ప్రతిదినంబును బాలమర
ణంబొనర్పుచుండ నాపురవరంబువృద్ధిరాహిత్యంబునొంది శూన్యప్రాయంబయ్యె నంతపౌర
జనంబు లావృత్తాంతంబు రాజునకెరుగింప నతండు నగరరక్షకులం గాంచి బాలమర
ణకారణంబెరింగిరండనిపంచిన వారలియ్యకొని నగరంబంతయన్వేషించి యెందుంగానక
భీతులై రాజసమీపంబునకేతెంచి యోనృపాగ్రణీ బాలమరణంబొనర్చిన వాడెందుంగాన
డయ్యె నగరంబంతయుంబరిశీలించితిమని వచింపుచుండిరాసమయంబున పురజనంబులుబా
ష్పపూర్ణావిలముఖులగుచుండ నృపుండూరకనుండె నంత నొకానొకసమయంబున నాదు
ష్పణ్యుండు బాలపంచకంబుగూడి పంకజాహరణఫలంబున తటాకంబునకుంబోయి యాబా
లురంబలాత్కారంబున కంఠదఘ్నజలంబులముంచి మృతులైరనితలంచి స్వగృహంబునకుం
బోయె నంతనాబాలురజనకులు వెదకుచువచ్చితోయంబులంబడి దైవయోగంబున ప్రాణం

బులంబాయక కాలంబునపరిక్లిన్నకాయులై నగరంబునకరుగజాలకయున్న బాలురంగాంచి రంత వారలు దూరంబుననరుదెంచు బంధుపరివృతులగు జనకులంగాంచి ప్రతిశబ్దంబొన రింప వారలు ప్రహర్షంబునొంది వో బాలకులారా మీకీబాధ యెట్లుసంభవించెనని యడి గిన వారలు దుష్పణ్యుండొనర్చెననిన వారలావృత్తాంతం బాక్షణంబ రాజున కెరుంగింప, నతండు పౌరజనసమక్షంబున వణిగ్వరుండగు పశుమంతురావించి యిట్లనియె. యోవైశ్యో త్తమా దురాత్ముండగు దుష్పణ్యునిచే మదీయనగరంబు శూన్యప్రాయంబయ్యె నిప్పుడీబాలు ర జలంబులయందుంచి గృహంబుకరుగ యదృచ్ఛచే సప్రాణులై పురంబునకరుదెంచి రింకంజే యందగినకార్యం బెరుంగింపుము నీవు ధర్మతత్పరుండవుగాన నిన్నడిగెదనని పశుమంతుం డిట్లనియె, వో నృపాలోత్తమా యీపాపాత్మునిచే పురంబునిర్మూలంబయ్యె నితండు పు త్రుండుగాడు శత్రువనిదలంచెద నితనికి నిష్కృతిగానంగాన వథార్హుండు నిజంబు వచించెదననిన పశుమంతునివచనంబులువిని సర్వసంగతు లతనింగొనియాడి రాజుంగాంచి యో రాజేంద్రా యీదుష్పణ్యువధించక పురంబువెడలంబనుపుమని వచించిరంత నృపుం డాదుష్పణ్యుంగాంచియిట్లనియె. వోరీ దుర్మార్గుడా నీవీదేశంబునకుంబాసి శీఘ్రంబొమ్ము యిచటనుండిన దండార్హుండవగుదువని యాజ్ఞాపింప భృత్యులాదుష్పణ్యుని పురంబు వెడలంద్రోయ నతండుభయంబునొంది యద్దేశంబుబాసి మునీంద్రసేవితంబగు నొకవనం బునకరిగి యందొకమునిపుత్రు జలంబులయందుంచి మృతినొందింపగాంచి కొందరావృత్తాం తం బతనితండ్రియగు ఉగ్రశ్రవునకెరింగింప నతండు కోపసంరక్తాంతలోచనుండై దుష్ప ణ్యుంగాంచి వోరీ వైశ్యనందనా నీవును నాపుత్రునివలె జలమజ్జనంబుచే హతుండవుగ మ్మనిశాపంబొసంగె. నంత వాడు ఖిన్నుండై యావనంబువదలి సింహాదిక్రూరమృగసమేతం బులగు మరియొకయరణ్యంబునకుంబోయి యందుండ నతిభయంబగు వర్షంబు పొంగు యుక్తంబై వృక్షోన్మూలనంబుగావింపుచు గాత్రభేదనంబొనరింపుచు వజ్రాఘాతసమస్పర్శ జంఝానిలయుతంబై కురియుచుండ దుష్పణ్యుం డాజడికోర్వజాలక భీతుండై మృతంబై శుష్కంబై పడియున్న యొకగజంబుగాంచి గహ్వరంబైన తదాస్యవివరంబునం బ్రవేశించె నంత నావర్షంబతిశయంబై కురియుచుండ ప్రవాహంబులు ప్రవహించె నంతనామృతగజం బు జలపూరితోదరంబై ప్లవంబుబోలె జలంబులం దేలుచుండ దుష్పణ్యుండు ప్రవాహవేగం బున సముద్రంబునొంది ప్రాణంబులంబాసి పిశాచత్వంబునొంది క్షుత్పిపాసాపీడితుండై దుర్గమంబులగు వనంబులంజరించుచు ఘర్మకాలంబులం దత్యంతదుఃఖంబు లనుభవింపుచు సమస్తదేశభ్రమణంబుగావింపుచు నిట్లు లక్షకోటిసహస్రవర్షంబులును లక్షకోటి శతసంవ త్సరంబులు దుఃఖంబనుభవించి పిమ్మట దండకావనంబునకుంబోయి యగస్త్యాశ్రమసమీ పంబున సంచరించు తపోధనులంజూచి భైరవనాదంబుగానిట్లనియె.

ఓ కృపాళులారా దుఃఖపీడితుండగు నన్నుం గరుణాదృష్టినవలోకింపుం డేను పూ

ర్వంబున పాటలీపుత్రకంబను పురంబున దుష్పుణ్యుండను వైశ్యపుత్రుండ నేనగరంబునం గల బాలుర మృతినొందించుచుండ జనపాలుం డానగరంబుననుండనీయక వెడలంద్రోయించె నంత నేనాదేశంబుననుండి యొకయరణ్యంబునకుంబోయి యందున్న యగ్రవః పుత్రుం బరిమార్ప నతండు మరణంబునొంది పిమ్మట పిశాచత్వంబునొందుమని శాపంబొసంగె నంత పిశాచరూపంబునొంది శుష్కకాననంబులక్షుత్పిపాసాపీడితుండనై యనేకవర్షంబులనుండి సంచరించెద నేపైశాచ్యంబుబాసి సుఖంబొందునట్లు గృపజేసి రక్షింపుండని వేడిన నామునీంద్రులు లోపాముద్రాసహితుండగు కుంభసంభవు సమీపంబునకుపోయి యిట్లనిరి. ఓ తపోధనా యీపిశాచంబునకు నిష్కృతియెట్లుగల్గు యీలాటి పాపాత్ములకు గతినీవేకదా యని వేడిన కుంభసంభవుండు ప్రియశిష్యుడగు సుతీక్ష్ణునిజూచి యిట్లనియె వోయీ నీవు త్వరితగమనంబున గంధమాదనకుంబోయి యచ్చట పాపనాశనకారియగు నగ్నితీర్థంబున పిశాచమోక్షణంబునకై సంకల్పమొనర్చి స్నానమొనర్పుము దానిచేనితడు పిశాచరూపము మాని దివ్యత్వంబునొందు. మరియొకతీర్థసేవనంబుచే నితనికి నిష్కృతిగల్గ నేరదు గాన నితని రక్షింపుమని యగస్త్యమహర్షి పలికిన సుతీక్ష్ణుండాక్షణంబు గంధమాదనంబునకుబోయి యందగ్నితీర్థంబున పిశాచమోచనంబుకొరకు స్నానముజేయ నాక్షణమే దుష్పుణ్యుండు పిశాచరూపముదూని తత్తీర్థవైభవమున దివ్యరూపమునొంది విమానారూఢుడును దివ్యస్త్రీపరివృతుడునునై సుతీక్ష్ణాగస్త్యులకు మరియుగల తపోధనులకు వందనమొనర్చి వారలచే ననుజ్ఞవడసి యమరలోకమునకుంబోయె. ఓ మునీంద్రులారా యివ్విధమున దుష్పుణ్యుం డగ్నితీర్థప్రభావమున పైశాచ్యంబుబాసి దివ్యత్వంబునొందె. నీయగ్నితీర్థప్రభావమెరుంగించితి యెవ్వండైన నీయధ్యాయంబు భక్తియుక్తుండై పఠించు విననతండు సర్వపాతకంబులంబాసి యిహపరంబుల సుఖంబులంబొందునని శౌనకాదులకు సూతుండెఱింగించెను.

ఇది స్కాందపురాణంబునంగల సేతుమాహాత్మ్యంబునందు

అగ్నితీర్థప్రశంసయు, దుష్పుణ్యపైశాచమోచనంబను కథలంగల

ఇరువదిరెండవయధ్యాయము సంపూర్ణము.



## ఇరువదిమూడవ అధ్యాయము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సూతుండిట్లనియె నట్లగ్నితీర్థావగాహనంబొనర్చిన వారలుపరిశుద్ధాత్ములై చక్రతీర్థంబునకుంబోవలయు నాతీర్థంబున నరుండు యేకామంబులంగోరిస్నానంబొనర్చు నాయభిమతంబులంబొందు పూర్వంబున అహిర్బుధ్న్యుండను తపోధనుండు గంధమాదనంబున సుదర్శనంబుగూర్చి దపంబు గావింప

చుండ ఘోరరూపులగు రాక్షసులతనితో విఘ్నంబొనర్ప భక్తరక్షణంబుగావింప సుదర్శ
నంబరుదెంచి యాతుధానులం బరిమార్చి భక్తిప్రార్థనంబుచే నాయహిర్బుధ్న్యకృతంబగు
తీర్థంబున సన్నిధానం బొనర్చెం గాన నాతీర్థంబు చక్రతీర్థంబను నామంబునొందె మరియు
నాతీర్థంబున స్నానంబుగావించువారలకు సుదర్శనప్రసాదంబున రక్షఃపిశాచాదిబాధలు గ
లుగవు పూర్వంబున ఛిన్నపాణియగు ప్రభాకరుండాతీర్థంబున స్నానంబుగావించి హిరణ్మ
యంబులగు కరంబులం బొందెనని ఋషులిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా, యాదిత్యుండేల
ఛిన్నపాణియయ్యె బిదప నెట్లు సువర్ణమయంబులగు కరంబులం బొందె వివరింపుమని వే
డిన సూతుండిట్లనియె.

పూర్వంబున ఇంద్రాద్యమరులు దైత్యసంఘపీడితులై బృహతింబురస్కరించుకొని
మంత్రాలోచనం బొనర్చి బ్రహ్మలోకంబునకుం బోయి పితామహుం గాంచి నమస్కరించి య
నేకవిధంబులం బొగడి ఓ భారతీనాథా బలోత్కటులగు దైత్యులు మమ్ము బాధించెదరిందుకు
దగిన యుపాయంబు గావించి రక్షింపుమనిన చతుర్ముఖుండు కృపాళుండై విబుధులం గాం
చి యిట్లనియె. ఓ సురులారా, భీతిం బొందకుండు ఒక యుపాయంబు వచించెద వినుండు సుర
నాశనకారియగు మాహేశ్వరయజ్ఞంబును తత్త్వవేత్తలగు ఋషులం గూడి జేయుండా యజ్ఞం
బు నితరప్రదేశంబులం గావించిన దురాత్ములగు రక్కసులు విఘ్నంబుగావింతురు గాన విధి
లోపంబులేక గంధమాదనంబున గావింపుండట్లొనర్ప సుదర్శనప్రసాదంబున నిర్విఘ్నంబై స
మాప్తినొందు పూర్వంబున గంధమాదనంబునం దపంబొనర్పు యహిర్బుధ్న్యునకుం బ్రీతంబై
సుదర్శనంబు తత్కృతతీర్థంబున లోకానుగ్రహార్థంబయియున్నయది గాన మీరలా గంధమా
దనంబుజేరి చక్రతీర్థసమీపంబున రాక్షసవినాశకారియగు యజ్ఞంబుగావింపుడనిన యమ
రులు కమలజువాక్యంబులువిని యాక్షణంబ బృహస్పతిసమేతులై గంధమాదనకుం బోయి
యచ్చటనుండు యహిర్బుధ్న్యునకు నమస్కరించి తదనుజ్ఞగొని తదీయాశ్రమసమీపంబున
యజ్ఞవాటంబులం గావించి తపోధనులును యజ్ఞకర్మనిష్ఠులగు ఋషులం గూడి యసురనా
శనకారియగు యిష్టియొనర్ప నారంభించి రందు బృహస్పతి హోతయయ్యె జయంతుండుద్గా
త్రావరుణుండయ్యె మరియు అష్టమవసువు అచ్ఛావాకుండును పరాశరుండు గ్రావస్తోత
యు అష్టావక్రుం డధ్వర్యుండును విశ్వామిత్రుండు ప్రతిప్రస్థాతయు వరుణుండు నేష్టయు మ
హేశ్వరుండుద్గాతయు సవిత బ్రహ్మయు వసిష్ఠుండు బ్రాహ్మణాచ్ఛంసియు శునశ్శేపుండా
గ్నీధ్రుండును పావకుండు పోతయు వాయువు ప్రద్గాతయు శమనుండు ప్రస్తోతయు అగస్త్యుం
డు ప్రతిహర్తయు మధుచ్ఛందుండు సుబ్రహ్మణ్యుండును యీవిధంబున నైరి పురుహూతుం
డు యజమానుండయ్యె వ్యాసపుత్రుండగు శుకయోగీంద్రుండుపదేష్టయయ్యె నంత పురంద
రుండు దీక్షితుండై ఋత్విజులం గూడి విధిపూర్వకంబుగా మాహేశ్వరక్రతువొనర్చె నం
త నిశాచరులు దుస్సహంబగు సుదర్శనప్రభావంబునకు భయంబునొంది విఘ్నంబొనర్ప జాల

త్విరిట్లు నిరంతరాయంబై క్రతురాజంబు జరుగుచుండ హుతాశనుండు హవిర్భక్షణంబు గావింపుచుండె. అధ్వర్యుండు కర్మజాలంబులం గావించి మంత్రపూరితంబగు పురోడాశంబు హోమంబొనర్చి హుతశేషంబు విభజించి హోతృముఖ్యఋత్విజులకొసంగె. నంతసలలిత యత్యుగ్రతేజంబును ప్రాశిత్రనామకంబగు పురోడాశభాగంబు పాణులం గ్రహించి తత్స్పృష్టి మాత్రంబున భిన్నపాణియై విషణ్ణవదనుండగుచు ఋత్విజులం గాంచి యిట్లనియె.

ఓ ఋత్విజులారా, ప్రాశిత్రనామకంబగు పురోడాశభాగంబు మదీయపాణిచ్ఛేదంబొనర్చెం గాన మీరందరుం గూడి మత్పాణులనొసంగుండట్లొనర్పక పోయిన యీ యజ్ఞంబు ధ్వంసంబు గావించెదనని న వారలా ప్రభాకరు వాక్యంబులు విని కొంతదడవు చింతించుచుండ అష్టావక్రుండు వారలం గాంచి యిట్లనియె. ఓ మునీంద్రులారా, నే జీవించియుండ నూఱిరించి శతకోటులుదయించి మృతులైరి వారలం జూచుచు నే జీవించియున్నవాడ. పూర్వంబున లోకేశ్వరుండను ప్రజాపతి కాలంబున శ్యామలాపురంబున హరిహరుండను విప్రుండు నివాసంబుండి యొకదినంబున యరణ్యంబునకుం బోయి యంకులక్ష వేదియగు వ్యాధునిచే భిన్నపాణుండై మునిప్రేరితుండగుచు గంధమాదనంబుం జేరి యందు మునితీర్థంబున స్నానంబు గావించి లబ్ధపాణుండయ్యె. నా మునితీర్థంబు పిమ్మట చక్రతీర్థంబని ఖ్యాతిం బొందె. గాన నా తీర్థంబునకీ సప్తాశ్వుండు పోయి స్నానంబొనర్చుట యుక్తంబని యష్టావక్రుండు వచించిన విని ఋత్విజులు మిహిరుం గాంచి ఓ ప్రభాకరా యీ యష్టావక్రుండు చెప్పిన ప్రకారంబు చక్రతీర్థంబునకుం బోయి స్నానంబొనర్పుము. దానికి నీకు కరంబులు గల్గునని హరిదశ్వుండా క్షణంబ చక్రతీర్థంబునకుం బోయి భక్తియుతుండై స్నానంబొనర్చి లేచి యా క్షణంబున లబ్ధసువర్ణమయపాణియై యా ఋత్విజుల సమీపంబునం గరుదెంచిన వారలతనిం గాంచి ప్రముదితహృదయులైరంత నింద్రుండు యజ్ఞసమాప్తిం గావించి సురసమేతుండై యసురసంఘంబులం బరిమార్చి జయంబునొంది స్వర్గంబునకుం బోయి సుఖంబుండెం. గాన అంధులు పంగులు కుబ్జులు ఖంజులు భిన్నపాణులు అంగహీనులు మొదలగు జనులంగపూర్తింగోరి యా తీర్థంబున స్నానంబొనర్చిరేని యభిమతంబొందుదురు. ఓ మునీంద్రులారా ప్రభాకరుండెచ్చట స్నానంబొనర్చి లబ్ధపాణియయ్యె నా తీర్థప్రభావంబెరుంగించితి. యెవ్వండైన నీ యధ్యాయంబు పఠించు వినునతండు వికలాంగంబులు లేక ముక్తింబొందునని శౌనకాదులకు సూతుండు వక్కాణించెను.

ఇది స్కాందపురాణంబునందు సేతుమాహాత్మ్యంబునఁ

జక్రతీర్థప్రశంసయు ఆదిత్య హిరణ్మయపాణిప్రాప్తియను కథలంగల,

యిరువదిమూడవ యధ్యాయము సంపూర్ణము.



# ఇరువదినాలుగవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు పౌరాణికోత్తముండగు సూతుండిట్లనియె. ఓమునీంద్రులారా, పూర్వోక్తంబగు చక్రతీర్థంబున స్నానంబొనర్చినవారలందుండి శివతీర్థంబునకరుగవలయు నాతీర్థోత్తమంబు సకలపాపవిదళనంబుగావించు పూర్వంబున కాలభైరవుండాతీర్థంబున స్నానంబొనర్చి బ్రహ్మహత్యవలనంబాసెననిన మునులిట్లనిరి. ఓ సూతుడా, కాలభైరవునకెట్లు బ్రహ్మహత్యగల్గె పిమ్మట నదియెట్లు నాశనంబొందె నదిసవిస్తరంబుగావచింపుమనిన సూతుండిట్లనియె. ఓభూసురులారా, విముక్తిదంబును శ్రవణమాత్రంబున సకలపాపహారియగు పూర్వవృత్తాంతమెరింగించెద వినుండు పూర్వంబున ప్రజాపతివిష్ణులకిర్వురకొకకారణంబున కలహంబయ్యె నదియెట్లనిన చతుర్ముఖుండే జగత్కర్తయు నిగ్రహానుగ్రహప్రదుండుంగాన నిప్రపంచంబులమదధికుండును మత్సముండును లేడని హరింగాంచివచించె నంతనారాయణుండు నవ్వుచు వోచతుర్ముఖా నీవిపుడు చెప్పినప్రకారంబున మరలవచింపకుము లోకంబులకుం గర్తయు రక్షకుండనేనన్నుంబాసిన యీలోకంబులకాధారంబేమియు లేదు మత్ప్రసాదంబున నీవీలోకంబుల సృజింపుచుందువని వచించె నట్లయ్యిరువురు పరస్పరజయంబులంగోరి కలహింపుచుండ చతుర్వేదంబులరుదెంచి దేవతలు వినుచుండ యావిరించి నారాయణులంగాంచి యిట్లనియె.

ఓ బ్రహ్మవిష్ణులారా, మీరీలోకంబులకుంగర్తలుగారు పరాత్పరుండగు యీశ్వరుండీలోకంబులకుంగర్త స్థావరజంగమంబులగు లోకంబులంతయు తన్మాయామోహితంబులై యుండు మరియు నాశివుండు సమస్తదేవవందనీయుండును అంబాసహితుండ సత్యక్షమాదిశుభలక్షణలక్షితుండును సృష్టియు పాలకుండు సంహర్తయు త్రిజగత్ప్రభుండై వెలయుచుండునని వేదంబులువక్కాణించిననిని బ్రహ్మవిష్ణువులు పార్వతీలోలుండైన ప్రమథులంగూడి మూర్తిమంతుండైయున్న యాశంభుండెట్లు సర్వసంగవివర్జితంబగు పరబ్రహ్మంబని యాక్షేపించిరంత వారలవాక్యంబులు విని యరూపంబగుప్రణవంబు రూపంబునొంది గంభీరరవంబుగానిట్లనియె. ఓబ్రహ్మవిష్ణులారా, శంభుండు పార్వతింగూడియుండువాడని వచించిరతండాత్మశక్తిస్వరూపిణియగు పార్వతింగూడియుండునది మాఖ్యంబుగాదు శంకరుండువప్ప నీశ్వరుండు లేడితండు స్వయంప్రకాశుండును నిరంజనుండును విశ్వాతీతుండును మహాదేవుండును ప్రపంచంబులకు వెలిగ్గైన పరమాత్మమూర్తియనంబరగువాడును సమస్తాంతరాత్మయును సర్వశక్తియును సర్వస్వతంత్రుండును సర్వభాసకుండై వెలయు మరియు నోచతుర్ముఖా జగత్సృష్టికొరకు నిన్ను రజోగుణంబునంబుట్టించె వోకేశవా నిన్ను సత్వగుణంబునంబుట్టించె వోకేశవా నిన్ను సత్వగుణంబునం బుట్టించి లోకరక్షకుంగా నియమించె

తమోగుణంబున రుద్రునింబుట్టించి జగత్సంహారకుంగావించె నట్లీశ్వరుండు త్రిమూర్తులం గలిగించి సమస్తజగత్సృష్టిపాలనసంహారంబులంజేయుచుండు నాతండేసర్వస్వతంత్రుం డుగాని మీరలిరువురుంగారు సర్వలోకంబులకుంగర్తయు విశ్వాధికుండగు నతనివలన బృథక్భూతగాక తదానందభూతయైన పరాశక్తియగుపార్వతి యాగంతుకియని వచింపంబడు గాన శంభుండు విశ్వాధికుండు స్వతంత్రుండు సర్వదేవసేవనీయుండవని తెలియవలయు మీరలుకర్తలుగారు రుద్రునకధికులు సమనులుంగారు మీకతండు సేవనీయుండు విశ్వాధి కుండగు నాపరబ్రహ్మంబునకే నిరంతరవందనంబు లొనర్చెదనని యిన్విధంబునవచించిన ప్రణవవాక్యంబులువిని బ్రహ్మవిష్ణువులు మాయామోహితులు గాన శంభుండు దైవంబని యెరుంగజాలక నహంకరించి రప్పుడు చతురాననుండద్భుతదర్శనుండై తపోబలనిస్పృష్టం బై యనంతాదిత్యసన్నిభంబై ప్రకాశించు పంచమశిరంబుజూపి సమస్తదిగంతంబుల గోపాగ్ని ప్రజ్వరిల్ల విలయకాలంబున లోకంబులందహించు బడబాగ్నియుంబోలె దేజరిల్లుచు నీలలోహితుంగాంచి యిట్లనియె.

ఓమహాదేవా, నిన్నునేనెరుంగుదు పూర్వంబున మదీయలలాటంబునంబుట్టినవాడవు నాపుత్రుండవు రుద్రనాముండవని యిట్లుగర్వించిపలికినవిని మహేశ్వరుండు కాలభైరవుండనునొకనింబంప నతండు శూలటంకాద్యాయుధధారియై బ్రహ్మకైగవిసి తపోయుక్తంబు నూర్ధ్వగంబతిశుభ్రంబగు నతనిపైదవశిరంబతిరోషయుక్తుండై త్రుంచుటయు చతుర్ముఖుండు మృతుండై యీశ్వరప్రసాదంబున పునర్జీవితుండై వాసుక్యాదిసర్పభూషణుండును పార్వతీసహితుండగు నతనింగాంచి మాహేశ్వరజ్ఞానంబువడసి యోశశాంకభూషణా నేజేసినయపకృతి నెన్నకక్షమింపవలయునని పలుమారు నమస్కరించిన సోమార్ధధరుండానలువనూరార్చి నిజాంశజుండగు భైరవుంగాంచి వోయి నీవు బ్రహ్మశిరోహరణం బొనర్చిన కారణంబునంబొసగిన పాపనాశనంబుకొరకును లోకానుగ్రహంబుకొరకు బ్రహ్మకపాలధారివై భిక్షంగొనుచుండుమనియె నాక్షణంబ బ్రహ్మహత్యబడబానల క్రూరమూర్తియై కన్యకారూపంబుధరించి యాభైరవునాక్రమించె నంతకాలకంఠుండు భైరవుంజూచి మరల నిట్లనియె. ఓ భైరవా నీవీకపాలంబుగొని భిక్షాటనంబుగావింపుచు నొకసంవత్సరంబు తీర్థంబుల స్నానంబుగావించి పిమ్మట వారాణసింజేరితివేని యీబ్రహ్మహత్య చతుర్థాంశశేషంబగు పిమ్మట దక్షిణసముద్రతీరంబునందు గంధమాదనంబున సర్వలోకోపకారార్థంబై నాచేజేయంబడిన తీర్థంబొండుగలదదిశివనామంబుచే వెలయు నీవందునియమయుక్తుండవై స్నానంబొనర్పుము దాననీబ్రహ్మహత్య నిశ్శేషంబుగా నశించునని యాజ్ఞాపించి శివుండు కైలాసంబునకుంబోయె నంతభైరవుండావాక్యంబులియ్యకొని కపాలధారియై భిక్షాటనంబుసేయుచు బ్రహ్మహత్యంగూడి దేవదానవయక్షాది లోకంబులం జరించుచు సర్వతీర్థంబులసేవింపుచు గాశికింబోయిన బ్రహ్మహత్యపాదాంశిష్టయయ్యె నంతభైరవుండు

చతుర్థాంశశేషితయగు నాబ్రహ్మహత్యంగూడి శంకరాజ్ఞచే గంధమాదనంబుజేరి యందుశి
వతీర్థంబున స్నానంబొనర్ప తన్మహిమాతిశయంబున భయంకరంబగు బ్రహ్మహత్యనిశ్శేషం
బుగా నశించె నంతయీశ్వరుండు సన్నిహితుండై యోభైరవా నీబ్రహ్మహత్యనశించె నింకనీ
విందుండి కాశికింజని యందొకచోట కపాలంబునుస్థాపించిరమ్మని యాజ్ఞాపించి యంత
ర్ధానుండయ్యె నంతభైరవుండందుండిగదలి వారణాసికింబోయి యీశ్వరోక్తప్రకారంబున
కపాలస్థాపనంబొనర్చె నాప్రదేశంబు కపాలతీర్థంబని ప్రసిద్ధిబొందెనని యివ్విధంబున
శౌనకాదిమునీంద్రులకు సూతుండు పుణ్యంబును ముక్తిదంబును మహాదుఃఖశమనంబును
మహాపాతకనాశనకారియు రౌరవాదినరకక్లేశపరిహారకంబును స్వర్గమోక్షప్రదంబును న
గు శివతీర్థమహాత్మ్యంబు వచించె నెవ్వరైన నీకథనియమయుక్తులై పఠించినవినిన దుఃఖ
గ్రహంబులవలన విముక్తులై సౌఖ్యంబులంబొందుదురు.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు
శివతీర్థప్రశంసయు భైరవబ్రహ్మహత్యామోచనంబను కథలంగల
ఇరువదినాలవ యధ్యాయము సంపూర్ణము.

## ఇరువదియైదవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా, బ్రహ్మహత్యావిమోచనంబగు శివతీర్థంబున స్నానంబొనర్చిన మానవులు యందుండి శంఖతీర్థంబునకుంబోవలయు నాతీర్థోత్తమంబున స్నానంబుజేసినమాత్రంబున కృతఘ్నుండైన పునీతుండగు మరియు మాతృపితృగురువుల నవమానించినవారలు నతిదురాత్ములును యాతీర్థంబున స్నానమొనర్చినం బరిశుద్ధులగుదురు పూర్వంబున విష్ణుపరాయణుండగు శంఖుండనుమునిచే స్నానార్థంబై యాతీర్థంబు నిర్మింపంబడెం గాన శంఖతీర్థంబని ప్రసిద్ధింగాంచె వత్సనాభుండను మునీంద్రుండాతీర్థస్నానమహిమాతిశయంబున కృతఘ్నతాదోషంబువలనంబాసె నవ్విధంబువక్కాణించెద వినుండు పూర్వంబున వత్సనాభుండనుభూసురుండు సత్యవ్రతుండును శీలవంతుండును సర్వభూతదయాళుండును శత్రుమిత్రసముండు నుదాంతుండును జితేంద్రియుండును పరబ్రహ్మనిష్ఠుండునై వెలయుచు నిజాశ్రమంబున నిశ్చలసర్వాంగుండై తపంబుజేయుచుండ ననేకవత్సరంబులుగడచె నంత నతనిచుట్టునుబుట్టపెరిగె నతండు వల్మీకమధ్యస్థుండయ్యును చలింపక తపంబుగావింపుచుండ నింద్రుండతనింగాంచి తదీయతపోవిఘ్నంబుగావింపంగోరి నవమేఘంబుల నతని వల్మీకధ్వంసనంబొనర్ప నియోగింప నవ్వియును ధారాపరంపరచే నతిభయంకరంబగు వృష్టి సేయుదినంబులుగురియుచుండ నావల్మీకశిఖరంబున కనితాడంబై ధ్వంసంబయ్యె నప్పుడామునీంద్రే

ష్ఠుండు వర్షధారచే దివానిశంబు పీడింపంబడియు సహించియుండె నంత ధర్ముండతనిం గాంచి యాశ్చర్యగతమానసుండును కృపాళుండగుచు నిట్లని మనంబునఁ దలంచె నీవత్సనాభుతపోమహిమ వర్ణింప నలవిగాదే నిపుడొక్క మహిషరూపంబునొంది యితనిం దడియకుండ నాచ్ఛాదించియుండెదనని తలంచి ధర్ముండట్లొనర్చె నంత నావర్షంబమ్మునిం బాధింపం జాలదయ్యె నిట్లేడుదినంబులు గడచినపిదప నావర్షంబు వెలిసె నంత గృపాలుండును మహిషరూపుండగు ధర్ముండు వత్సనాభుంబాసి దూరంబుగాజని నిలువంబడియుండె నంత నతండు దపంబు చాలించి సర్వదిశలు నిరీక్షించి యే తపంబు చేయుచుండ సర్వంబును జలమయంబయ్యెనని ప్రముదితుండై నన్నీవర్షంబుచే శ్రమనొందనీయక రక్షించిన మహాత్ముం డెవఁడోయని యాలోచించి తనసమీపంబుననుండు మహోన్నతమహిషంబుఁగాంచి యీమహిషరాజంబు తిర్యగ్యోనిసంభవంబయ్యును ధర్మశీలత్వంబుగల్గి నన్నుం గాచెం గాన దీర్ఘాయువుగలిగియుండునని పలికి మరలఁ దపంబొనర్పం బోయిన ధర్ముండతనిం గాంచి రోమాంచావృతసర్వాంగుండయ్యె నంత మునివరుండేకాగ్రచిత్తుండైనను మనంబు చంచలంబు నొందె నంతనతండు నేపాపకృత్యుండంగానందుకు మన్మనంబు చలనంబునొందెనని యనేకవిధంబులం జింతించి యిట్లని తలంచె నేదురాత్ముండ నఘుండ కృతఘ్నుండ కృతఘ్నతాదోషంబునకు ప్రాయశ్చిత్తంబెద్దియును లేదీమహిషోత్తముండు మహావర్షంబుచే బాధంబడనీయక నన్నుం గాచియుండ నేనితనిం బూజింపక కృతఘ్నదోషంబునొంది కృతఘ్నునకుం బుణ్యలోకంబులు లేవు బాంధవులును లేరీదోషంబున నామనంబు చలనంబునొందె విశ్వాసఘాతునకు నిరయంబు గల్గునని పెద్దలు చెప్పుదురీదుష్కృతికి నిష్కృతియగు మార్గంబెయ్యది యేమి నేయుదు నాకీదేహత్యాగంబుదప్ప నిష్కృతిగానదయ్యె ధర్మజ్ఞులగు వారలు పితృరక్షణంబొనర్పక గురునకు దక్షిణయొసంగక కృతఘ్నత్వంబొందుమానవునకుం బ్రాయశ్చిత్తంబు దేహత్యాగంబని వచింతురు గాన నేప్రాణపరిత్యాగంబు గావించెదనని నిశ్చయించి యమ్మునీంద్రుండాత్మప్రాణంబుల తృణసమంబులుగా దలంచి మేరుపర్వతంబెక్కి యందుండి భూమింబడుటకుద్యుక్తుండైన ధర్ముండు మహిషరూపంబువిడిచి నిజాకారంబు నొంది యావత్సనాభునితో నిట్లనియె.

ఓ మునీంద్రా, నీవు బహుకాలంబు జీవించుము నీబుద్ధికిం బరితుష్టహృదయుండనైతి ధర్మంబున నీకు సమానుండు లేమి నిక్కువంబు నీకృతఘ్నతకు నిష్కృతి యాత్మపరిత్యాగంబుగా దొకయుపాయంబు వచించెద వినుము. గంధమాదనంబున శంఖతీర్థంబను నొక తీర్థంబుగలదందు స్నానంబొనర్చిన కృతఘ్నతంబాసి విగతపాపుండవై చిత్తశుద్ధియు విజ్ఞానంబునుం గల్గి శాశ్వతంబగు పదంబునొందెద నేధర్ముండ నీవచనంబు నిక్కువంబనిన యామునీంద్రుండు శంఖతీర్థస్నానాభిలాషియై గంధమాదనంబునకుంబోయి శంఖతీర్థంబునందవగాహనంబొనర్చి విగతపాపుండై మనోనైర్మల్యంబునొంది కొంతకాలంబు వసుబ్ర

ష్టత్వంబునొందె వో మునీంద్రులారా శంఖతీర్థప్రభావంబు వచించితి అందుస్నానంబొనర్చిన కృతఘ్నుండైన పాపవిముక్తుండగు మరియు మాతృపితృగురుద్రోహులు మొదలగు పాపాత్ములైన నాతీర్థస్నానంబునం బరిశుద్ధులగుదురు లోకంబున మాతృపితృభరణంబొనర్పక గురుదక్షిణనొసంగక కృతఘ్నతంబొందు నరునకు మరణంబుదప్ప నిష్కృతి గల్గనేరదతండైనను నాశంఖతీర్థంబుజేరి స్నానంబుజేసినమాత్రంబున విముక్తుండగు నితరతుచ్ఛపాపకారులవచింపనేలనని శౌనకాదిమునీంద్రులకు సూతుండెఱింగించె నీయధ్యాయంబు పఠించువినునతండు కృతఘ్నుండైనను పాపవిముక్తుండై విశుద్ధాంతఃకరణుండగుచు సత్యలోకంబునకుంజేరి బ్రహ్మంగూడి మోక్షంబునొందును.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమాహాత్మ్యంబునందు
శంఖతీర్థప్రశంసయు కృతఘ్నదోషశాంతియును కథలంగల
ఇరువదియాఱవ యధ్యాయము సంపూర్ణము.

## ఇరువదియాఱవ అధ్యాయము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకలపురాణ వ్యాఖ్యానవైఖరీసమేతుండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా! యీ శంఖతీర్థంబున స్నానంబుగావించినవారలంగుండి యమునాతీర్థంబును గంగాతీర్థంబును గయాతీర్థంబునను తీర్థత్రయంబున స్నానంబొనర్పవలయు నాతీర్థత్రయంబు మహాపాతక నాశనంబును పుణ్యప్రదంబును సర్వలోకవిశ్రుతంబును సర్వవిఘ్నప్రశమనంబును సర్వరోగనిబర్హణంబును సకలజ్ఞాన నాశనంబును జ్ఞానప్రదంబై ప్రకాశించుచుండు పూర్వంబున నాతీర్థత్రయంబున జానశ్రుతియను నృపోత్తముండు స్నానంబొనర్చి ద్విజశ్రేష్ఠుండగు రైక్వమునీంద్రువలన నుత్తమజ్ఞానంబు నొందెననిన ఋషులిట్లనిరి. ఓ సూతా నీవు సర్వార్థతత్వజ్ఞుండవు వ్యాసశిష్యుండవు మహామతివి గాన నాతీర్థత్రయంబేల గంధమాదనంబున కరుదెంచెనం దెట్లు స్నానంబొనర్చి జానశ్రుతి రైక్వమునీంద్రువలన జ్ఞానంబు నొందెనది యంతయు సవిస్తరంబుగా గృపంజెప్పుమాయన నతండిట్లనియె ఓమునీంద్రులారా! పూర్వకాలంబున గంధమాదనపర్వతంబునందు తపోనిధియగు రైక్వుండను మునీంద్రుం డనేక దినంబులు తపంబొనరుచు తత్తపఃప్రభావంబున దీర్ఘాయువుంబొందె నతండు జన్మంబు మొదలు పంగులైనందున గంధమాదనంబునంగల తీర్థంబులనెల్ల స్నానంబుగావింప నసమర్థుండై శకటంబునెక్కి సంచరించుచుండుం గాన సయుగ్వుండను నామంబువొందె నిట్లామునీంద్రుండు పూర్ణజ్ఞానంబునొంది గ్రీష్మంబున పంచాగ్నిమధ్యస్థుండును వర్షా

కాలంబున జలాశయుండునగుచు తపంబుగావించుచుండ నతనిశరీరంబు కార్శ్యంబు నొంది కండూసహితంబయ్యె నట్లైనను నతండు నిజతపంబుం పరిత్యజింపకయుండె నిట్లుండి యామునీంద్రుండు యమునాగంగాగయాతీర్థంబుల స్నానంబొనర్పంగోరి యిట్లని వితర్కించె నేజన్మంబుమొదలు పంగుడై యున్నవాడగాన నాతీర్థంబులకుంబోయి స్నానం బొనర్ప దుర్లభంబు మరియు శకటంబునెక్కి దూరగమనంబు సేయ నశక్యంబై యున్నయది. యాతీర్థత్రయంబున స్నానం బొనర్పగ నెవ్విధంబునం గల్గు నేనేమి సేయుదునని యనేకవిధంబులం జింతించి యే నతిశయంబగు తపోబలంబుచే నాతీర్థత్రయం బిచటనావాహనంబు గావించెదనని నిశ్చయించి ప్రాఙ్ముఖుండును నియతేంద్రియుండు నతీంద్రియుండును నగుచు నాచమనంబుగావించి మంత్రజపంబొనర్చుచుండ నా మంత్రప్రభావంబున మహానదియగు యమునయు జహ్నుతనయయగు గంగయు పాపవినాశనియగు గయయు నీతీర్థత్రయంబును పాతాళోత్థితంబై భూవిపాటనంబొనరించి మానుషరూపంబులనొంది ప్రత్యక్షంబై యామునీంద్రునకు సంతోషంబొనర్చుచు నిట్లనియె. ఓ మునీంద్రా ధ్యానంబుమానుము త్వన్మంత్రశక్తి సమాకృష్టలగుచు మేమరుదెంచితిమి మాచే జేయందగిన కార్యం బెద్దియనిన నామునీంద్రుండు ధ్యానంబుమాని పరఃస్థితలగు యానదులంబూజించి యిట్లనియె. ఓ సరిచ్ఛ్రేష్ఠలారా మీరిగంధమాదనంబున నెల్లప్పుడు సన్నిధానంబుగావింపవలయు మరియు మీరు భూనిర్భేదంబుగావించి వెడలిన ప్రదేశంబులు పుణ్యప్రదంబులు యుష్మన్నామాంకితంబులగు తీర్థంబులై యుండంగోరెదననిన నానదులట్లయగునని యంతర్ధానంబునొందెం గాన నాదినంబుమొదలు యమునా గంగా గయానదు లెచ్చటభూవివరంబొనర్చి మనుష్యరూపంబునం బయలువెడలె నాప్రదేశంబులు యమునాతీర్థంబనియు గంగాతీర్థంబనియు గయాతీర్థంబనియు ప్రఖ్యాతింగాంచె రైక్వమంత్రప్రభావ జనితంబగు నాతీర్థత్రయంబున నెవ్వరేనియు స్నానంబొనర్పుదు రానరు లజ్ఞాననాశనంబునొంది సుజ్ఞానంబు వడయుదు రిట్లామునీంద్రుండు స్వమంత్రాకృష్టంబులగు తత్తీర్థంబుల నిత్యంబు స్నానం బొనర్చుచు తపంబుగావింపుచుండె నాకాలంబున జానశ్రుతియను నృపుండు పుత్రసంజ్ఞ పార్థివేంద్రునకుందనూజుండై వెలయుచు నన్నాదులచే నర్థిసమూహంబులం బరితృప్తులం జేయుచు శ్రద్ధాయుతుండై యుండె నతని యర్థిసమూహంబుల యనేకవిధంబులం బొగడుచుండు రిట్లానృపోత్తముండు బహుదాయియు ప్రియాతిథియునగుచు నగరంబుల గ్రామంబుల వనంబుల చతుష్పథంబుల సర్వదేశమార్గంబుల బహ్వన్నపానసంయుక్తంబున సూపశాకాదియుతంబులగు నన్నంబర్థులకొసంగుచు నన్నాదులుంగొనుండని యర్థిజనంబులం బిలుచుచుండు నానృపోత్తము చరిత్రము బహువిశ్రుతంబై సకలదేశంబులం బ్రవర్తించెనంత మహాభాగులగు దేవమునీంద్రులా నృపోత్తమగుణ గ్రామసంతోషితులను గ్రహకాంక్షులగుచు హంసరూపంబులనొంది నిదాఘకాల నిశీథసమయంబున రమణీయ్యం

బగు శ్రేణింగట్టి యాకాశమార్గంబున నరుదెంచి సౌధవాతాయనస్థుండగు నాభూపతి యు పరిప్రదేశంబున వ్రాలివేగంబునం బోవుచుండ నప్పుడం బొక హంసంబగ్రేసరంబగు హంసరాజంబుగాంచి యపహాసయుక్తంబగు వచనంబు వక్కాణించెను. ఓ మరాళకం ఠా పురప్రదేశంబున పూజనీయుండగు జానశ్రుతియను నృపోత్తముండున్నవాఁడతనింగా నకయంధుంబోలె సంచరించెద వతని తేజంబు బ్రహ్మలోకపర్యంతంబు దురాధర్షణంబనం తాదిత్యసంకాశంబయి వెలుఁగు నట్టి రాజుంగానక, యుపవనమార్గంబునం బోకుమటు బోయిన తత్తేజంబు నిన్ను దహించునని యివ్విధంబునం బలికెడు హంసవాక్యంబులాకర్ణించి యగ్రేసరంబగు హంసరాజంబిట్లనియె. ఓ హంసోత్తమా నీవజ్ఞుండవు సమస్తసూరిజనశ్లాఘనీయుండవయ్యు నజ్ఞుండును కితవుండగు నితని నేలంగొనియాడెద వితండల్పసత్వుండు కేవలంబు దేహధారియగు ధర్మపశుసమానుండితండు ధర్మరహస్యంబుల నెల్లెరుంగు సత్యజ్ఞానియగు రైక్వుండను నొక బ్రాహ్మణోత్తముండు గలండతని మహిమం గొనియాడ దేవతలకైన నశక్యంబుగాదు తత్తేజస్సమానతేజంబితరుల కెవ్వరికింగల్గ నేరదు పాంసుపుంజంబులం దారకంబులనైన నంగణింపందగుంగాని మేరుసమానంబులగు నతని పుణ్యసమూహంబు లెక్కింపందరంబు గాదు మరియు నామునీంద్రుని ధర్మకర్మంబులు శాశ్వతంబులయి యుండు నతండు యోగిబృందదుర్లభంబగు బ్రహ్మజ్ఞానంబుచే వెలయుచుండు తాదృశధర్మకర్మంబు లీజానశ్రుతి నరేంద్రునందుం గలుగదుగాన నీదురాత్ముని పరాకంబుఁబోలె బరిత్యజించి రయిక్వమునీంద్రుం బొగడుము మతఁడు జన్మపంగుండయినను తా స్నానంబొనర్పం గోరి యమునాగంగాగంగావదుల నిజాశ్రమసమీపంబునకు మంత్రబలంబుచే నాహ్వానంబుగావించె నాబ్రహ్మవిదుని ధర్మసంచయంబునందు త్రిలోకీజనధర్మంబులన్నియు లీనంబునగునని యగ్రేసరంబగు హంసోత్తమంబు పలికెన మరాళరూపులగు మునీంద్రులు సత్యలోకంబునకుం బోయిరంత వాతాయనుండగు జానశ్రుతినరేంద్రుండు అరధరహితుండును ఉత్కర్షకత్వగర్వహీనుండు నగుచు రయిక్వమహాముని ప్రభావంబు విని అక్షజితుండగు కరాతుంబోలె విషణ్ణుండయి నిట్టూర్పులిడుచు హంసరాజంబా మునీంద్రునుత్కర్ష చేసినన్ను నికృష్టుగావించె నాకన్న శ్రేష్ఠంబుగొనియాడిన మునీంద్రుమహిమ యతిశయంబయియున్నది గాన నేరాజ్యంబున నంగీకరించుమని మహాత్ముండగు నామునీంద్రు శరణంబు వేడెదనట్లొనర్పనతండు బ్రహ్మజ్ఞానంబుపదేశించునని యనేకవిధంబులఁ జింతించుచు నిద్రంబొందక నా రాత్రింగడిపి అరుణోదయకాలంబున వందిబృందసంకీర్తనంబుల మంగళరవంబుల నాకర్ణించి సారథిం బిలచి యిట్లనియె.

ఓయీ నీవు సత్వరంబుగా రథంబుగొని మహామునీంద్రుల యాశ్రమంబులయందును విపినంబులయందును ఘట్టనదీకూలంబులయందును మునీశ్వరస్థానంబులయందును శకటారోహకుండును రయిక్వనామధేయుండును బ్రహ్మజ్ఞానసంపన్నుండును నగు మునీంద్రుని వె

దికి యతని సంబోధగాంచి రమ్మనిన నతండియ్యకొని పర్వత గుహాలయందును ఋష్యాశ్ర
మంబులయందును నామునీంద్రుల వెదకుచు వివిధదేశంబులుం గడచి సమస్తమహీపర్యటనం
బొనరించి మహర్షిసేవితంబగు గంధమాదనంబు జేరి యందు కండూయమానుండును శక
టాధస్థితుండును అద్వైతబ్రహ్మచింతకుండునునగు నామునీంద్రుం గాంచి రయిక్వుంగా
నెరింగి సమీపంబునకుం బోయి వందనంబు గావించి వినయసంయుతుండై యతని యంతికం
బునం గూర్చుండి ఓయి మునీంద్రా రయిక్వనామ విరాజితుండవు నీవే కదా యెరింగింపుమ
నియడిగిన నతండిట్లనియె. ఓ సారథి నే రయిక్వుండను వాడ సంయుగ్వనామంబునుం గల
వాడనని వచించిన సారథియు బహువిధేంగితంబులచే నతనికిం గుటుంబభరణంబునకై ధనే
చ్ఛలేకయుండుటం గాంచి యతనిచే ననుజ్ఞగొని మరల రాజసమీపంబు చేరి తాబోయిన
వృత్తాంతంబంతయు నెరింగించె నంత నరేంద్రుండు గోషట్శతంబును దననిష్కహారంబును
అశ్వతరీయుక్తంబులగు రథంబులు మొదలగు వానిం గొని వినయసంయుతుండును త్వరా
న్వితుండగుచు గంధమాదనంబునకుం బోయి యందున్న రైక్వ మునీంద్రుం గాంచి నమస్క
రించి యిట్లనియె. ఓ తపోధనా మద్దత్తంబులగు ధేన్వాదుల గ్రహించి అద్వైతబ్రహ్మవిజ్ఞానం
బుపదేశింపవేయని వేడిన సస్పృహంబులు సంభ్రమయుక్తంబులగు నతనివాక్యంబు లాలించి
రైక్వుండిట్లనియె.

ఓ రాజేంద్రా, యీ ధేనువులు ధనంబు రథంబులు నీయందనుండనిమ్ము బహుకల్ప
జీవియగు నాకిట్టి యల్పంబగు ధనంబు నిర్వాహంబొనర్పంజాలదు మరియు నీవిట్టి శతగు
ణంబొసగిన నదియుం జాలదనిన మునీంద్రువాక్యంబులు వినిన నరేంద్రుండిట్లనియె. ఓ భూ
సురోత్తమా, నీవొనర్చు బ్రహ్మజ్ఞానోపదేశంబునకీ ధేన్వాదులు మూల్యంబుగా నేరదు వీనిం గ్ర
హింపుము విసర్జింపుము యెట్లొనర్చినను నాకు బ్రహ్మజ్ఞానంబుపదేశించి రక్షించుమని వేడి
న నతని వచనంబులు విని మునీంద్రుండిట్లనియె. ఓ నృపాలకా, యెవ్వండైన ప్రారబ్ధపుణ్య
పాపనాశనంబు గావించి సంసారనిర్వేదంబు నొందు నతండు జ్ఞానోపదేశార్హుండు నీకి
ప్పుడు సంసారనిర్వేదంబు గలుగు పుణ్యపాపనాశంబగు నప్పుడుపదేశింపనర్హంబు నీపు
ణ్యపాపంబులు పునర్జన్మహేతుభూతంబులు విభోగంబులనొందినం గాని నాశనంబునొంద
వు నన్ను శరణంబునొంటివి గాన నీకు నొక యుపాయంబు వచించెద వినుము పుణ్యంబును
సర్వాభీష్టదాయకంబును నగు యమునాతీర్థంబును గంగాతీర్థంబును గయాతీర్థంబున
ను తీర్థత్రయంబున సాదరుండవై స్నానంబొనర్పుము దానం బ్రారబ్ధకర్మనాశంబగు నం
దకు సంశయంబు లేదు. పిమ్మట స్వస్థచిత్తుండగు నీకు బ్రహ్మజ్ఞానంబును పదేశించెదనని రైక్వుం
డు పలికిన నరేంద్రుండు హర్షసంఫుల్లలోచనుండై నా తీర్థత్రయంబున ససంభ్రమంబు
గా స్నానంబొనర్చి తత్తీర్థస్నానమాత్రంబున శుద్ధచిత్తుండై సంయుగ్వుం జేరి గురుంగా వ
లంచె నంత రైక్వుండును కృపాళుండై యా నరేంద్రునకు జ్ఞానముపదేశించె నిట్లా మునీం

త్రుండుపదేశించిన మాత్రంబున జానశ్రుతినృపుండు ఆబోధితాత్మభవయుతుండై బ్రహ్మరూపంబునొందె నంతనతనికి ఘటకుడ్యాదిసూపాత్మకంబగు ప్రపంచంబు స్ఫురింపకపోయి మాయాభేదనంబొనర్చిన కతంబున పరబ్రహ్మంబు సర్వమయంబై తోచె నోయిమునీంద్రులారా యిట్లాతీర్థత్రయస్నానప్రభావంబున జానశ్రుతినరేంద్రుండు యోగిబృందదుర్లభంబగు బ్రహ్మభూయంబునొందె తత్తీర్థవైభవంబు మీకెరుంగించితినని శౌనకాదిమునీంద్రులకు సూతుండువక్కాణించెను యెవ్వండైన నీతీర్థత్రయప్రభావంబగు నీయధ్యాయంబుపఠించువినునతండు జ్ఞానతిమిరధ్వంసంబుగావించి బ్రహ్మభూయంబునొందు.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు

యమునా గంగా గయా ప్రశంసయు జానశ్రుతిజ్ఞానవాప్తియను కథలంగల

ఇరువదియాఱవ యధ్యాయము సంపూర్ణము.



# ఇరువదియేడవ అధ్యాయము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు పౌరాణికోత్తముండగు సూతుండిట్లనియె. ఓయిమునీంద్రులారా, యమున గంగా గయాతీర్థంబుల స్నానంబొనర్చిన వారలందుండి కోటితీర్థంబునకుంబోయి యందుస్నానంబొనర్పవలయు నాతీర్థోత్తమంబు పుణ్యప్రదంబు సర్వలోకవిశ్రుతంబును సర్వసంపత్ప్రదంబును సర్వపాపనాశకరంబును మహావిఘ్నశమనంబును మహాశాంతికరంబును స్మృతిమాత్రంబున సకలాఘనిబర్హణంబును రామచంద్రధనుష్కోటివినిర్మితంబునునై ప్రకాశించు పూర్వంబున రఘునాయకుండు రావణుంబరిమార్చి తద్బ్రహ్మహత్యాది విమోచనంబునకై గంధమాదనపర్వతంబున లోకానుగ్రహంబుగోరి యొకలింగంబు ప్రతిష్ఠించి తదభిషేకార్థంబై వారింగోరి లింగాభిషేకార్హంబగు జలంబును పార్శ్వంబునంగానక జాహ్నవిందనమనంబునందలచుచు శీఘ్రంబున ధనుష్కోటిచే ధరణిరసాతలపర్యంతంబుభేదించె నావివరంబునంగంగ వొడమె నంతనృపోత్తముండాజలంబుచే లింగాభిషేకంబుగావించెం గాన నాతీర్థంబు కోటితీర్థంబను నామంబునొందె ప్రథమంబున నరుండు గంధమాదనంబునంగల తీర్థంబులనెల్లంగ్రుంకి విగతపాపుండయ్యును శేషపాపమోక్షంబు కొరకాకోటితీర్థంబున స్నానంబొనర్పవలయు నితరతీర్థస్నానంబునంబోని పాతకంబును అస్థిగతకల్మషంబును సర్వంబాకోటిస్నానంబుచే నశించు నిందుకుసందియంబులేదు మరియు ప్రథమంబున నాకోటితీర్థంబున స్నానంబొనర్చినవారలకన్యతీర్థంబులు వ్యర్థంబులనినవిని ఋషులిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా, మాకుంగల సందియంబు బోగొట్టుము కోటితీర్థంబున స్నానంబొనర్చిన మనుజునకన్యతీర్థంబులు వ్యర్థం

బులని వచించితివి జనంబులు చక్రతీర్థాదితీర్థంబులం బాసి యాకోటితీర్థంబున స్నానం బొనర్పక యెల్లతీర్థంబుల నేల స్నానం బొనర్చెద రవ్విధంబు వచింపుమనిన సూతుండిట్లనియె. ఓ భూసురేంద్రులారా యతిరహస్యవిషయం బడిగితి రవ్విధంబు నారదమునీంద్రునకీశ్వరుం డెఱింగించెన దివచించెద శ్రద్ధాయుతులగుచు వినుండు నరుండు తీర్థయాత్రకుం బోవుచుంగాని యదృచ్ఛచే నెక్కడకైనం బోవుచుంగాని మార్గంబున సంచరించుచు తీర్థంబునుంగాని దేవాలయంబుంగాని దర్శించి సేవింపవలయు మోహంబుచే నట్లొనర్పని నరాధముని పాపంబునకు నిష్కృతి గలుగనేరదు సేతుస్నానంబును జేయువారలు చక్రతీర్థాదుల స్నానంబుచేయక యుండిన తీర్థాతిక్రమదోషంబునొంది పండితబహిష్కృతులగుదురు గాన సర్వతీర్థంబులం గ్రుంకి పిమ్మట శేషశాపవిముక్తింగోరి కోటితీర్థంబున నియమోపేతులగుచు స్నానం బొనర్పవలయు మనుజుండు కోటితీర్థస్నానం బొనర్చి విగతపాపుండై యాక్షణంబ గంధమాదనంబు వదలి నిజదేశంబునకుం బోవలయు పూర్వంబున సీతామనోహరుం డాతీర్థంబున స్నానం బొనర్చి రామనాథాభిషేకంబు గావించి బ్రహ్మహత్యావిముక్తుండును సాపజుండగుచు తత్క్షణంబ పుష్పకారూఢుండై వానరులంగూడి యయోధ్యాపురికరిగెగాన నెల్లవార లట్లొనర్పవలయు నాతీర్థోత్తమంబు రామనాథాభిషేకార్థంబై రామచంద్రనిర్మితంబును సర్వతీర్థశ్రేష్ఠంబును సర్వలోకవిశ్రుతంబును నై వెలయుచుండు నచ్చట గంగాదేవి సన్నిహితయై యుండు తదియ్యమహిమాతిశయంబు వర్ణింప నెవ్వరికిం దరంబుగా దాతీర్థరాజంబున స్నానంబు గావించి శ్రీకృష్ణదేవుండు మాతులవధజనితంబగు దోషంబువలనం బాసెనని మునీంద్రులిట్లనిరి,

ఓ పౌరాణికోత్తమా యదునందనుండగు కృష్ణుండేల మాతులుండగు కంసుం బరిమార్చె పిమ్మట తద్దోషశాంతికై యెట్లు కోటితీర్థావగాహనం బొనర్చె నవ్విధంబు సవిస్తరంబుగా నెఱుంగింపుమనిన సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా పూర్వంబున యదుకులంబున ఖ్యాతవిక్రముండగు శూరసేనతనూజుండైన వసుదేవుండు దేవకీపుత్రికయగు దేవకింబరిణయంబై రథారూఢుండయి స్వపురంబునకుం బోవుచుండ కంసుండాతనికి సూతుండై రథంబు దోలుచుండ నశరీరవాణి కంసుం గాంచి యిట్లనియె. ఓ కంసా నీవీభగినింగొని రథంబు త్వరితంబునం దోలెదవు కొంతకాలంబున కీవనితాష్టమగర్భంబున జనించిన పుత్రుండు నిన్నుం జంపు నిందుకు సందేహంబు లేదని వచించిన యశరీరవాక్యంబులు విని కంసుండు కోపసంరక్తాంతలోచనుండగుచు ఖడ్గంబుగొని చెలియలిం జంపం బూనిన వసుదేవుండు డగ్గఱి యాకంసుని సాంత్వవచనంబులం బహూకరించుచు నిట్లనియె. వో నృపాలనందనా నీవీచెల్లెలిం జంపకుము దీనికిం జనించిన పుత్రులనీకొసంగెద భీతిం బాసి యుండుమనిన కంసుండు తన చెలియలిం జంపుటమాని వారలంగూడి స్వపురంబునకుం బోయి దేవకీవసుదేవులను సంకెళ్లవేయించి కారాగృహంబునను౦చె పిమ్మట కొన్నిదినం

బుల నాదేవకీదేవి యార్వురుపుత్రులం గ్రమంబునఁగాంచె వసుదేవుం డాశిశుజాలంగొని చని దయారహితుండగు కంసునకొప్పగింప నతండాబాలకులంజంపె నిట్లార్గురు నిహతులైన శేషుండా దేవకీగర్భంబున ప్రవేశించెనంత విష్ణుప్రచోదితయగు యోగమాయ యాగర్భంబుగొని నందగోపగృహంబుననుండు రోహిణియందుంచె. నంత సమస్తజనంబులు విష్ణుమాయా మోహితులగుచు యావిధంబెఱుంగక, దేవకీ సప్తమగర్భంబు పతితంబయ్యెనని దలంచిరంత విష్ణుదేవుండు దేవకీగర్భస్థుండై యుండ పదినెలలరిగె నంతవ్యయుండగు రమానాయకుండు శంఖచక్రగదాఖడ్గ విరాజిత చతుర్భుజుండగుచు కృష్ణనామంబు నొంది దేవకీగర్భంబునంజనించె నంత వసుదేవుండు పరమేశ్వరుండగు హరింగాంచి పరమసమ్మద పరిపూరిత హృదయుండగుచు నిట్లనిస్తుతించె ఓమాధవా నీవు విశ్వయోనివి ప్రధానుండవు విశ్వరూపుండవు విరాట్స్వరూపుండవు స్వరాట్స్వరూపుండవు జగత్కారణభూతుండవు మితవిక్రముండవు శార్ఙ్గచక్రగదాసిధారివి కృత్రిమ మానుషరూపుండవు నారాయణశబ్దవాచ్యుండవు నిన్నుంగొనియాడ నాతరంబె యని యనేకవిధంబులంబొగడిన ప్రీతుండై శ్రీకృష్ణుం డావసుదేవ దేవకులం బ్రీతినొందించుచు నిట్లనియె. ఓ తలితండ్రులారా నేకంసుంబరిమార్చెద భీతినొందకుండు పూర్వదినంబున సకలలోకమోహకారిణియైన మదీయంబగు యోగమాయ నందగోపభార్యయగు యశోదకుం బుత్రికయై యుదయించియున్నది ఓ వసుదేవా నన్నుఁగొనిపోయి యశోదా శయ్యయందుంచి యాబాలంగొనివచ్చి దేవకీసమీపంబున నుంచుమని వక్కాణించినవిని వసుదేవుం డొనర్చె నంతనామాయాబాలిక దేవకీశయనస్థితయై రోదనంబొనర్ప యారావంబువిని కంసుండు సంకులమానసుండై సూతికాగృహంబున కరుదెంచి నిర్దయుండు నిరత్రపుండగుచు యాబాలశిలాపాతంగావించి జంపబూన నదియూర్ధ్వంబునకెగసి సాయుధాష్టభుజయు నతికోపనియునగుచు కంసుంగాంచి యిట్లనియె.

ఓరిదురాత్మా త్వత్ప్రాణహారియగు బాలుండొకప్రదేశంబున వృద్ధిబొందుచున్నవాఁడాత్మమృత్యుండగు నతనివెదకుమనివచించి యాదేవి యనేక దివ్యస్థానంబుల ననేక నామంబులంబొంది సకలమనుజపూజితయై. సర్వాభీష్టదాయినియై వెలయుచుండెనంత కంసుం డాదేవివచనంబులాకర్ణించి యాకులచిత్తుండై స్వాంతకుండగు బాలుంబరిమార్ప గోరి సకలదేశంబులంగల బాలులమరణంబు నొందింపుండని పూతనాదులంబంప వారలు నందగోకులంబునకుంబోయి కృష్ణునిహతులయి యమసదనంబునకుం జనిరంత కొంతకాలంబున రామకృష్ణులు వృద్ధిబొందుచు ననేకవిధంబుల బాలక్రీడలంగావింపుచు కొంతకాలంబు వేణునాదంబొనర్చుచు గొన్నిదినంబులు గుంజాపింఛభూషితులగుచు బాలురంగూడి విహరింపుచుండ కంసుడక్రూరుంబంపి వారల నిజపురంబునకుంబిలిపింప రామకృష్ణులక్రూరసహితులై గోకులంబువెడలి స్వర్ణతోరణాలంకృతంబగు మధురాపురంబుజేరి అక్రూ

ముంత కంసునిసమీపంబునకుంజని తాబోయివచ్చిన తెరంగెరింగించి స్వగృహంబునకుం బోయెనంత నపరాహ్ణంబున రామకృష్ణులు గోపబాలురంగూడి సాలనిఘాత యుక్తంబును గోపురాట్టాలక సమేతంబగు మథురాపురింబోవుచు పురవనితాస్తోత్రంబు లాలింపుచు ధనుర్నివేశంబుజేరిరంత కృష్ణుండు రామసమేతుండై యచ్చట నతిదృఢంబగు శరాసనం బుగాంచి తద్రక్షకులంబిల్కుమార్చి యాచాపంబుగొని మార్విం బేర్చుచుండ నాకోదండం బు భగ్నంబయ్యె నంతనారవంబువిని యేతెంచినయభియాతుల రామకేశవులు ఖడ్గధారులై యమసదనంబున కనిచిరంత ద్వారస్థితంబగు కువలయాపీడంబనుగజంబును కమలనాథుం డు పరాక్రమంబునంబరిమార్చి తదీయదంతంబు భుజంబునంధరించె బలభద్రుండును నట్లొ నర్చెనంత ముష్టికచాణూరు లనేకమల్లసహితులై యుద్ధంబుగోరియేతెంచిన రామకృష్ణులు వారల యమసదనంబునకుం బంపి యత్యున్నతంబగు మంచంబుజేరిరంత కృష్ణుండు సిం హాసనస్థితుడగు కంసుని పాదంబులంబట్టి యంబరంబున వీచివైచిన నతండు సింహాక్రాం తంబగు క్షుద్రమృగంబుబోలె ప్రాణంబులంబాసెనంత కంసానుజులేతెంచిన వారల ముష్టి ఘాతంబుచే యమసదనంబునకుంబంపి యత్యంతదుఃఖితులగు జననీజనకుల నిగళంబులంబాపి యాశ్వాసంబుగావించి సబలుండై మధురంజేరి యుగ్రసేను రాజ్యాభిషిక్తుంజేసియుండ పూర్వంబున కంసబాధితులై మధురంబాసి విదేశంబులంజరించు బంధుజనులావృత్తంబువిని మరల నిజస్థానంబులకరుదెంచి సుఖంబుండిరిట్లు మాధవుండు మాతృపితృల కుపద్రవకా రియు దేవబ్రాహ్మణకంటకుండగు కంసుని సహితుండై వధియించి తన్నుజూడంగోరి యరు దెంచిన నారదాదిమునిజనంబులంగాంచి యిట్లనియె.

ఓ మునీంద్రులారా యతిపాపుండగు కంసుండు నాచే నిహతుండయ్యె మాతుల వధ జనితదోషంబునకుం బ్రాయశ్చిత్తంబు వచింపుండనిన నారదుండిట్లనియె. వో రమామ నోహర నీవు నిత్యశుద్ధుండవు సచ్చిదానందరూపుండవు బరమాత్ముండవు సనాతనుండ వుంగాన నీకుపాపంబులేదట్లైనను లోకశిక్షార్థంబై ప్రాయశ్చిత్తంబు విధిపూర్వకంబుగా జేయందగు గంధమాదనంబున రామసేతువునందు రామస్థాపితంబగు రామనాథంబను నొక లింగంబుగలదు రఘునాథుండాలింగాభిషేకంబు సేయంగోరి ధనుష్కోటిచే భూవిదళనం బొనర్చె నది కోటితీర్థంబని ఖ్యాతింబొందె నీవు పూర్వంబున రాముండవై యవతరించి బ్రహ్మహత్యావిశుద్ధిగోరి యట్లొనర్చితివిగాన నీవిపుడు పావనంబగు కోటితీర్థంబునకుం జని యందు స్నానంబుగావింపుము దాన మాతులవధదోషంబు నశించు మరియు నాకోటి తీర్థస్నానంబు బ్రహ్మహత్యాశోధనంబు స్వర్గమోక్షప్రదంబును ఆయురారోగ్యవర్ధనంబై ప్రకాశించుననిన నారదమునీంద్రుల వాక్యంబులువిని మాధవుండాక్షణంబ యారుషిస మూహంబులంజంపి స్వదోషశుద్ధింగోరి సబలుండై కతిపయదినంబుల కోటితీర్థంబుజేరి యందు సంకల్పపూర్వకంబుగా స్నానంబొనర్చి యనేకదానంబులంగావించి మాతులవధ

దోషంబుబాసి రామనాథుసేవించి మధురంజేరి సుఖంబుండె నో మునీంద్రులారా కోటితీర్థప్రభావం బిట్టిది తత్సదృశతీర్థంబులేదందు స్నానంబొనర్చిన మాత్రంబున బ్రహ్మవిష్ణు మహేశ్వరులు నితరదేవతలును ప్రీతింబొందుదు రింతకు విచారంబనిలేదు.

ఓయిమునీంద్రులారా కోటితీర్థప్రభావం బెరుంగించితి యెవ్వండైన నీయుపాఖ్యానంబాకర్ణించు నతండు బ్రహ్మహత్యాది సర్వపాతకంబులంబాయునని శౌనకాదులకు సూతుండెరుంగించెను.

ఇది స్కాందపురాణంబున సేతుమాహాత్మ్యంబునందు
కోటితీర్థప్రశంసయు శ్రీకృష్ణమాతుల వధదోషశాంతియునను కథలంగల
ఇరువదియేడవ యధ్యాయము సంపూర్ణము.

## ఇరువది యెనిమిదవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిముని శ్రేష్ఠులకు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా కోటితీర్థంబున స్నానంబొనర్చిన నరుండు సాధ్యామృతంబునకుం బోవలయు నాతీర్థంబు మహాపుణ్యఫలప్రదంబును సర్వదుఃఖశమనంబును సర్వపాపపరిహారకంబై వెలయుచుండు. అందు నరుండు స్నానంబుజేసి సర్వకామంబులంబొందు లోకంబున బ్రహ్మచర్యంబున యజ్ఞంబులదానంబులవేగతి సంభవించునది సాధ్యామృతస్నానంబువలనం గల్గునే నరునియంగంబు సాధ్యామృతజలస్పృష్టంబగు నతనిదేహగతపాపంబు తక్షణంబ నశించు నెవ్వండైన సాధ్యామృతజలంబులందఘమర్షణ స్నానంబొనర్చు నతండు పాపపుంజంబుల ధ్వంసంబొనర్చి విష్ణులోకంబునొందు నెవ్వండైన పూర్వవయఃకాలంబున పాపకర్మంబులంగావించి పిమ్మట పశ్చాత్తాపతప్తుండై సాధ్యామృతంబుజేరి స్నానంబుగావించిన ముక్తింబొందు నిందుకు సందియంబులేదు. మరియు పాపకారులగు మానవులా సాధ్యామృతజలంబులం దవగాహనంబొనర్చి అనేకక్లేశఘోరంబులగు నరకంబులంబొందరు సాధ్యామృతస్నానంబొనర్చిన మనుజునికేగతి లభించు నదియజ్ఞంబుల వేదంబుల సకలపుణ్యకర్మంబులం బొంద శక్యంబుగాదు యేనమని శల్యంబులు సాధ్యామృతజలంబులనేపర్యంతంబుండు నాపర్యంతంబామానవుండు దేవలోకంబునం బూజితుండై యుండు మరియు సాధ్యామృతస్నాతయగు నరుండు ప్రభాకరుండు తమోరాశియుంబోలె సకలపాపపుంజంబుల విరసించు ప్రకాశించు మరియు నాతీర్థంబున స్నానంబుగావించు వారలు సకలేప్సితంబులంబడయుదురు. పూర్వంబున పురూరవుండా తీర్థంబున స్నానంబొనర్చి తుంబురు శాపజన్యంబగు పూర్వశి విప్రయోగంబువలనం బాసెననిన ఋషులిట్లనిరి.

ఓ పౌరాణికోత్తమా మర్త్యుండగు పురూరవుండెట్లు యూర్వశీ సంయోగంబు గావించె. నారాజశ్రేష్ఠుం దుంబురుం డేలశపించె వారలెవ్విధంబున వియోగంబునొంది పిదప నెట్లు సాధ్యామృతంబున స్నానంబొనర్చి సంయోగంబునొందిర వ్విధంబు సవిస్తరంబుగా వచింపుమని వేడిన సూతుండిట్లనియె వోమునిపుంగవులారా శక్రతుల్య పరాక్రముండును సకలాగమపూజితుండగు పురూరవుండను నృపోత్తముండు ధర్మమార్గంబు ధరాపాలనం బొనర్చుచు బహుయజ్ఞంబులనేక దానంబులం గావింపుచుండ అప్సరశ్శ్రేష్టయగు యూర్వశి మిత్రావరుణ శాపంబున భూలోకంబున సంచరించుచు యాపురూరవు పురోపవనంబున కోకిలాలాపమధురంబగు వీణాగానంబొనర్చుచుండ నానృపోత్తముండు తురగారూఢుండును లలనాశతపరివృతుండు నగుచు యుపవనంబున కరుదెంచి తనుమధ్యమయగు నవ్వారమణిం గాంచి కామబాణపీడితుండయి వోవనితామణీ నేఁబురూరవుండను పృథివీపాలుండ నీవు నాకు భార్యవగుమనిననది యిట్లనియె. వోనృపాలోత్తమా నేనొకసమయంబు గోరెద నది నీకిష్టంబగునేని నీకుభార్యనై యభిమతంబులొనర్చెదననిన నతండో కామినీ నీయభిమతంబెయ్యది వచింపుము దానిం జేసెదననిన నదియిట్లనియె. వో పురూరవా పుత్ర సమానంబగు యీయురణకద్వయంబు రక్షింపవలయు మరియు నీవెప్పుడు నగ్నుండవై సంచరింపందగదు మరియు నీయుచ్ఛిష్టంబు నాకొసంగందగదట్లైన నీయభిమతంబులం గావించెదనన నతండియ్యకొని యావెలయాలిం గొని నిజగృహంబునకుం బోయి దానిం గూడి చైత్రరథాది వనంబులయందును పద్మషండమనోహరంబులగు సర్వస్వత్యాది నదీతీరంబులయందును విహరింపుచుండ షష్టివర్ష సహస్రంబులయ్యె నిట్లాతనుమధ్యమ పురూరవానురాగంబున దేవలోకంబునకుం బోవకయుండి నా స్వర్గంబు ప్రభారహితంబై యుండం గాంచి విశ్వావసుండగు గంధర్వుండా యూర్వశిం గొని వచ్చెదనని భూలోకంబున కరుదెంచి తదీయసమయం బెరింగి శయనోపాంతంబునకుం జని యచ్చటనుండెడు నొకయురణకంబుగొని యాకాశమార్గంబునకుం బోవుచుండ నారవంబాలించి యూర్వశి దీనయగుచు యెవ్వండో మత్సుతుం గొని చనుచున్నవాడె నేమిసేయుదు అనాథనై యెవ్వని శరణం బొనర్తునని విలపింప పురూరవుండా వాక్యంబులు వినియు నగ్నుండగు నన్నీయూర్వశి వీక్షించునని యూరకయుండె గంధర్వులు రెండవయురణకంబుం గొని చనిరంత యూర్వశి చోరులు మత్సుతుం గొని చనుచున్నవారు నేననాథనై యెవని శరణంబు నొందుదునని విలపింప పురూరవుండు క్రోధపరవశుండై ఖడ్గధారియై విగతాంబరుండగుచు యాతిమిరంబున చోరుల నన్వేషింపుచు బోవుచుండ నూర్వశియు సౌదామినీ ప్రభాపుంజంబుల నగ్నుండగు నరనాథుం గాంచి యాక్షణంబ జనియె నంత గంధర్వులా యురణకద్వయంబు వాని పురంబునకుం బోయిన్నృపుండా యురణకంబులం గొని హృష్టుండగుచు స్వభవనంబునకేతెంచి యందూర్వశిం గానక యున్మత్తుంబోలె భ్రమింబడి విలపించుచు కురుక్షేత్రంబునకుం బోయి యచ్చట పద్మసంకులంబగు తటాకతీరంబున అప్సరఃపరివృతయై విహరింపుచుండెడు యూర్వశిం గాం

చి యొంటియా నీవతికఠిన హృదయంబుగల దానవని యనేక విధంబుల విలపించిన యూర్వశి
యావాక్యంబులు విని యానృపాలకానేదౌర్హృదంబునొంది యన్నదానంగాన సంవత్సరాం
తంబున నీవిచటికరుదెమ్మప్పుడొక రాత్రియందు నీయభిమతంబొనర్చెద మరియు నతిశ్లా
ఘ్యకుండగు కుమారుంగాంచెదవనిన నృపుండు హృష్టమానసుండై స్వనగరంబునకుం బో
యె నూర్వశియు సఖీజనంబులకా నృపుచందంబెరిగింపుచు వారలంగూడి విహరింపుచుం
డనొకయబ్దంబయ్యె నంత నృపుండా తటాకాంతికంబునకే తెంచిన యూర్వశి యతనిం
గాంచి వోపార్థివోత్తమా నన్నుంగోరెదవేని గంధర్వుల బ్రార్థింపుము వారొసంగెదరనిన
నరనాయకుండు గంధర్వులంగాంచి యోనిలింపులారా నేవిజితారాతిమండలుండ స్వ
ర్ణకోశంబులు గలవాడనైన లోకంబుల నూర్వశింబాసి యితరంబొండెద్దియుంజూడనొ
ల్లంగాన నూర్వశింగూడి నెల్లకాలంబు విహరింపం గోరెదననిన గంధర్వులు ప్రహృష్టమాన
సులగుచు యారాజున కొకయగ్నిస్థాలియొసంగి యోనృపా దీనిచే యజ్ఞంబులొనర్పుము
పిమ్మటయూర్వశిం బొందెదవనిన నృపుండు దీనవదనుండై యేమూఢుండ నేమిసేయుదు
యూర్వశింబొందని జన్మంబేల నాకీయగ్నిస్థాలియేలయని దానియావనంబుననుంచి స్వనగ
రంబునకుంబోయి యర్ధరాత్రంబున నిట్లని వితర్కించె గంధర్వులుపూర్వశిం బొందుటకై
యగ్నిస్థాలియొసంగ నేదుర్మతినై దానింగొనిరాక వనంబుననుంచి వచ్చితినని దలంచుచు
యాక్షణంబ వనంబునకుంజని యచ్చట నాయగ్నిస్థాలింగానక శమీగర్భంబగు నశ్వత్థంబు
గాంచి దానినగ్నిస్థానంబుగానెరింగి యిట్లని తలంచె నేమూఢుండనై యగ్నిస్థాలివనంబున
నుంచితి నది యీశమీగర్భంబగు నశ్వత్థంబాయెంగాన వహ్నిరూపంబగు దీనింగొని పు
రంబునకుంబోయి యరణింగావించి తదుత్పన్నాగ్నిచే యజ్ఞంబులొనర్చెదనని పురంబున
కుంబోయి గాయత్రీవర్ణసంఖ్యగల యంగుళి ప్రమాణంబును రమణీయ్యంబగు నరణింగా
వించి తన్మథనోత్పన్నంబగు పావకత్రయంబునందు నూర్వశిలోకసంప్రాప్తింగోరి వేదాను
సారియైయజంబులొనర్చి తత్ప్రభావంబున గంధర్వలోకంబునకుంబోయి యూర్వశింగూడి
బహుకాలంబు విహరింపుచుండ నొకానొకసమయంబున పురందరుండు సకలామరసం
యుతుండయి పేరోలగంబుండి సురాంగనానృత్తంబు విలోకింపుచుండ పురూరవుండా
నృత్తంబువీక్షింపంగోరి యచటికింబోయియుండ క్రమంబున రంభాద్యప్సరస్సంఘంబులు
నర్తనంబు సలుప నూర్వశియు శచీపతి సమీపంబున నృత్తాభినయ సామర్థ్యంబు జూపుచు గ
ర్వంబుచే పురూరవుంగాంచి హాస్యంబొనర్చిన పురూరవుండును దరహసితముఖుండ
య్యె నంత నాట్యాచార్యుండగు తుంబురుండు వారలంగాంచి కోపంబున అనేక దేవసం
పూర్ణ సభాస్థలంబున నృత్తమధ్యంబున హాస్యంబొనర్చిన కారణంబున మీరలు వియోగం
బునొందుడని శాపంబిచ్చెనంత నృపుండతిదుఃఖితుండై పురుహూతు శరణంబునొంది
యిట్లనియె.

ఓ పురందరా నేనీయూర్వశిం గోరి యనేకయాగంబులొనర్చితి నెట్లు వియోగంబు నొందుదునని పాకశాసనుండు దయాళుండై పురూరవుం గాంచి వో నృపాలకా చింతింపకు మీశాపమోక్షంబునకొక యుపాయము వచించెద గంధమాదనంబున యోగిబృందసేవితంబును భుక్తిముక్తిప్రదంబును సర్వపాపవిమోచనకరంబును సకలైశ్వర్యకరంబగు తీర్థంబొం డుగల దందు స్నానంబొనర్చినవారల కమృతత్వంబు ప్రాప్తించుగాన సాధ్యామృతంబను నామంబుచే వెలయు నీ వచటికిం బోయి స్నానం బొనర్చితివేని యీశాపమోచనంబగు మరి యును మదియ్యలోక నివాసంబున్నుల గల్గునని నృపుండు సంప్రీతమానసుండగుచు యాక్షణంబ గంధమాదనంబునకుంబోయి సాధ్యామృతతీర్థంబున స్నానంబొనర్చి వాంఛి తార్థంబులం బొంది స్వర్గలోకంబునకుం బోయి సుఖంబుండె గాన నెవ్వండైన నాతీర్థం బున స్నానం బొనర్చు నతండు మోక్షంబు నొందు నెవరుండైన నీయధ్యాయంబు భక్తియు క్తుండై పఠించు నతండు వైకుంఠంబు నొందు. వో మునీంద్రులారా చతురాననుండు సన కాదిమునీంద్రుల కెరుంగించిన సాధ్యామృత తీర్థప్రభావంబును కెరుంగించితినని శౌన కాదిమునీంద్రులకు సూతుం డెరింగించెను.

ఇది స్కాందపురాణంబునందు సేతుమాహాత్మ్యంబున
సాధ్యామృత తీర్థప్రశంసయు పురూరవు శాపమోచనంబను కథఁగల
ఇరువదెనిమిదవ యధ్యాయము సంపూర్ణము.

---

## ఇరువదితొమ్మిదవ అధ్యాయము.

---

మహనీయ్యగుణగరిష్ఠులగు శౌనకాది మునీంద్రులకు సూతుం డిట్లనియె. ఓ భూసు రులారా పురూరవ శాపవిమోక్షణకరంబగు సాధ్యామృతతీర్థంబున స్నానంబుగావించిన వారలందుండి నియమాన్వితులగుచు సర్వతీర్థంబునకుం బోవలయు మహాపాతకంబు లొన ర్చిన వారలైన నందు స్నానంబొనర్చినమాత్రంబునం బరిశుద్ధులగుదురు నరుండే పర్యంతం బాతీర్థంబున స్నానంబుగావింపక యుండు నంతపర్యంతంబు పాపంబుల పీడింపంబడు ఓ మునీంద్రులారా సర్వతీర్థస్నానంబునకుం బోవు మానవుం గాంచి పాపపుంజంబు లాత్మ నాశనంబు గల్గునని భీతింబొందు లోకంబున మనుజుండు సకలతీర్థావగాహనంబులగా యత్యాద్రిది మహామంత్రంబుల చతుర్వేద పారాయణంబుల శివవిష్ణ్వాది దేవపూజనంబుల ఏకాదశీవ్రతాదుల యేఫలంబు నొందు నాఫలం బాతీర్థస్నానం బొనర్చిన మాత్రంబున నొం దునని ఋషులిట్లనిరి. వో పౌరాణికోత్తమా యాతీర్థంబునకు సర్వతీర్థంబను నామం బెట్లు గలిగె నావిధం బెరుంగింపు మనిన నతం డిట్లనియె.

ఓ మునీంద్రులారా పూర్వకాలంబున భృగువంశసంభూతుండును నియమోపేతుండును జరాపరివృతుండునగు సుచరితుండను మునీంద్రుండు దక్షిణసముద్రతీరంబున నుండు గంధమాదనంబున శంకరుంగూర్చి తపముగావింపుచు లోకమునంగల తీర్థములనెల్ల స్నానంబొనర్ప నంధుండుగాన నశక్తుండై చింతించుచు త్రికాలంబు నీశ్వరునర్చించుచు త్రిషవణస్నానముజేయుచు అతిథులంభూజింపుచు శిశిరములజలమధ్యస్థుండును గ్రీష్మంబున పంచాగ్నిమధ్యస్థుండును వాయుజలభక్షణుండగుచు భస్మంబుచే త్రిపుండ్రధారణం బొనర్చుచు జాబాలోపనిషత్ప్రకారంబున రుద్రాక్షలుధరించుచు యిట్టివిధమున ననేక వర్షంబులు దపముగావింప మహేశ్వరుండు ప్రీతుండై భూతబృందసేవితుండును, జటామండలమండితుండును, భస్మపాండరశరీరుండును, గిరిజార్ధశరీరుండును, కోటిసూర్యసమానతేజుండును, పినాకపాణియు, శూలాద్యాయుధధారియు, అనంతాదిమహానాగభూషణుండగుచు వృషభవాహనారూఢుండై స్వదేహకాంతులు సకలదిగంతంబుల తిమిరశూన్యంబుగావింపుచుండం బ్రత్యక్షుండై యామునీంద్రునకు లోచనంబులనొసంగిన నతండీశ్వరుంగాంచి ప్రీతుండై యిట్లనిస్తుతించె. ఓ మహాదేవా నీవు బ్రహ్మాదిసురసేవ్యుండవు త్రిపురనాశనుండవు యమనాశనకారివి కామారివి సంసారవైద్యుండవు భూతపాలకుండవు శివుండవ్యయుండవు త్రిలోచనుండవు భక్తరక్షణదీక్షితుండవు వ్యోమకేశుండవు కారుణ్యవిగ్రహుండవు నీలకంఠుండవు మహేశ్వరుండవు పరమానందవిగ్రహుండవు గంగాధరుండవు శర్వుండవు కైలాసనాథుండవు నిన్నుంగొనియాడ నాదరంబే నన్నుంగాంచి కృపాళుండవై రక్షింపుమని యనేకవిధంబులంబొగడిన నీలకంఠుండు ప్రీతుండై యామునింగాంచి వోభూసురవర్యా నీకు వరంబొసంగ నీయాశ్రమంబున కరుదెంచితిననిన మునీంద్రుండు ప్రసన్నుండగు చంద్రశేఖరుంగాంచి వో పార్వతీనాథా నేజరావలితదేహుండ సర్వతీర్థంబుల స్నానంబొనర్పనభిలాషగల్గియున్నది సకలతీర్థంబులస్నానంబొనర్చిన వారలొందు ఫలంబు నాకెట్లుగల్గు నట్లు ప్రసాదింపవేయని వేడిన మహాదేవుండిట్లనియె.

ఓ తపోధనా త్వత్ప్రీతికై లోకంబునంగల తీర్థంబులనెల్ల నీ గంధమాదనంబునకావాహనంబొనర్చితి నదియు సకలతీర్థసాన్నిధ్యంబుచే సర్వతీర్థంబనియు మన్ననంబుచే నాకృష్టంబగుటవలన మానసతీర్థంబనియుం బ్రకాశించు నీనీటంబున స్నానంబొనర్చి ముక్తుండవగు మీతీర్థంబు మహాపాతకసంఘదావానలంబును కామమోహభయక్రోధలోభాదినాశనంబును వేదాంతజ్ఞానంబులేకపోయినను నిర్వాణప్రదంబును సంసారార్ణతరంబునునై వెలయుననిన సుచరితుండు మహేశసాన్నిధ్యంబున యాతీర్థంబున స్నానంబొనర్చిలేచి యాక్షణంబుజరావిముక్తుండై తరుణుండగుచు నతిసుందరంబగు స్వరూపంబుగాంచి యాతీర్థంబనేకవిధంబులంబొగడుచుండ మహాదేవుండతనితో నిట్లనియె.

ఓ మునీంద్రా నీవీతీర్థంబున స్నానంబొనర్చుచు నన్నుం దలంచుచు తపంబొనర్పు మితరంబులకుం బోకు మీతీర్థస్నానప్రభావంబున మోక్షంబునొందెద వెవ్వరయిన నీతీర్థంబున స్నానంబొనర్తు రామనుజులు నన్నుం బొందుదురని వచించి యీశ్వరుండంతర్హితుండయ్యె నంత నామునిపుంగవుం డాతటంబునందు తపంబుగావించుచు ననేక కాలంబుండి దేహాంతంబున తత్స్నానప్రభావంబున సర్వబంధంబులం బాసి యీశ్వర సాయుజ్యంబు నొందె నిట్లు శంకరుం బొందె నో మునీంద్రులారా సర్వతీర్థవైభవం బెఱింగించితి నెవ్వండైన నీయుపాఖ్యానం బాకర్ణించు పఠించు నతండు సర్వపాపంబులం బాసి శుద్ధుండగు నని శౌనకాదిమునీంద్రులకు సూతుండు వక్కాణించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమాహాత్మ్యంబునందు
సర్వతీర్థప్రశంసయు సుచరితోపాఖ్యానంబను కథలంగల
ఇరువదితొమ్మిదవ యధ్యాయము సంపూర్ణము.



## ముప్పదియవ అధ్యాయము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు పౌరాణికోత్తముండగు సూతుం డిట్లనియె. ఓ మునీంద్రులారా యతిపావనంబగు సర్వతీర్థస్నానంబొనర్చిన వారలందుం డిధనుష్కోటికిం బోవలయు నెవ్వండైన ధనుష్కోటి స్మరణం బొనర్చిన మాత్రంబున ముక్తుండగు మరియును ఏమానవులైన నాతీర్థంబున స్నానంబొనర్చి తన్మహిమంబు గొని యాడుదురో వారలష్టావింశతిభేదంబులుగల నరకంబులం బొందరు అవియెవ్వియనిన తామిస్రంబును అంధతామిస్రంబును మహారౌరవంబు రౌరవంబు కుంభీపాకంబును కాలసూత్రంబును అసిపత్రవనంబును క్రిమిభక్షణంబు నంధకూపంబును వైతరణీనదియు సంసంశంబును శల్మలియు లాలాభక్షంబును ఊర్మిజాలంబును క్షారకర్దమపానంబును పూయాసృగ్భోజనంబును రక్షోగణాశనంబును దందశూకాశనంబును తిరోధానాభిధంబును సూచిముఖంబు విషాగ్నిపీడనంబును తప్తాంగారకంబును ప్రతప్తసికతాపానంబును తప్తాయఃపిండ భక్షణంబును తప్తాయఃపురుషాలింగంబును తప్తాయఃస్త్రీనిషేవణంబును ప్రతప్తశయ్యారోహణంబును క్రకచభేదనంబును అనునీనామంబులుగలిగియుండు నరుండు ధనుష్కోటిస్నానంబు గావించి నీయష్టావింశతి సంఖ్యాతనరకంబులం బొందడు మరియు నేమానవుండైన పరధనంబుల పరకామినులం గ్రహించువతండు భయంకరులగు యమభటులచే పాశంబులబంధింపంబడి ఘోరంబగు తామిస్ర నరకంబున త్రోయంబడి బహువత్సరంబులు బాధలనుభవించుచుండు నాతండయిన నాధనుష్కోటిస్నానంబొనర్చెనేని యాబాధలనొందఁడు యేమానవుండైనా.

కేన యజమానుంజంపి యతని ధనాదులం గ్రహించు నతండు మహాదుఃఖకారియగు అంధతామిస్రనరకంబునం బడునతండైన నాతీర్థంబున స్నానం బొనర్చెనేని యానరకంబునం బడండు యేజనుండైన భూతద్రోహంబులనొనర్చి స్వకుటుంబ పోషణంబుగావించు నాతరుండు యాకుటుంబంబుబాసి విషభీషణసర్పసంకులంబగు నరకంబున యమకింకరులచే ద్రోయంబడు నతండైన నాతీర్థంబునస్నానంబొనర్చెనేని యానరకంబునంబడడు యేమానవుండైన పశుపక్షిసమూహంబుల స్వపోషణంబునకై బరిమార్చు నతండు క్రవ్యాదపీడితుండై తైలతప్తంబగు కుంభీపాకనరకంబునం ద్రోయంబడు నానరుండైన నాతీర్థస్నానంబొనర్చెనేని యానరకబాధలనొందడు యెవ్వండైన వేదమార్గంబుల్లంఘించి కుపథంబునం బ్రవర్తించు నతండు ఘోరంబగు అసిపత్రవనంబున ద్రోయంబడు నట్టిపాపుండైనవాడు ధనుష్కోటియందవగాహనంబొనర్చెనేని యానరకబాధలకర్హుండుగాడు యేనృపుండైన దండార్హుండుగాని భృత్యుందండించు నానరనాథుండతిభయంకరంబును శరీరదండనకారియగు ప్రసూకరముఖనరకంబున యిక్షువుంబోలె పీడితుండై బాధలంబొందు నతండైన నాతీర్థంబున మజ్జనంబొనర్చెనేని యానరకబాధనొందడు యెవ్వండైన యీశ్వరారాధనపారీణులంబరిమార్చు నతండు వారలచే జూడంబడుచు భయంకరులగు యమభటులచే పీడింపంబడుచు మహాఘోరంబగు అంధకూపంబను నరకంబున ద్రోయంబడు నతండైన యాధనుష్కోటియందు స్నానంబొనర్చెనేని యానరకబాధలంబొందడు యేమనుజుండైన పఙ్క్తిభేదంబొనర్చి స్వాదుపదార్థంబులంభుజించుచు మోహంబున పంచయజ్ఞంబులొనర్పక చరించు నతండు యమభటనియ్యమానుండును క్రిమిశతభక్ష్యమానుండును క్రిమిసంచయ భోజనుండును క్రిమిభూతుండునునగుచు స్వపాపక్షయపర్యంతంబు క్రిమిభోజనంబను నరకంబున ద్రోయంబడి యనేకదుఃఖంబులంబొందు నతండైన నాతీర్థోత్తమంబున స్నానంబొనర్చెనేని యానరకబాధలననుభవింపడు మరియును యేనరుండైన యగమ్యయగు వనితనురాగంబునం బొందు నతండును యేయంగనయైనను మోహంబుచే నగమ్యపురుషుంబొందునదియును వారిరువురును తప్తాయఃకృతరూపంబుల నాలింగనంబులగావింపుచు సూచీముఖనరకంబున ద్రోయంబడి చంద్రదివాకరులుండుపర్యంతంబు బాధలంబొందుచుండుదురాపాపాత్ములైనను ధనుష్కోటి స్నానంబొనర్చిరేని యాబాధలంబొందరు మరియును యేనరుండైనసర్వజంతువధంబొనర్చు నతండు ఘోరంబగు శాల్మలీనరకంబునంబడి యమభటులచే పీడింపంబడుచుండు నాతండైనను ధనుష్కోటిస్నానంబొనర్చెనేని యానరకబాధననుభవింపడు మరియును యేమనుజుండైనను దుష్టుండై వృషలీసంగంబొనర్చి త్యక్తశీలుండును శౌచాచా చారరహితుండై పశుప్రాయుండై వర్తిల్లునతండు పూయవిష్టమూత్రాసృక్శ్లేష్మపిత్తాది పూరితంబగు అతిభీభత్సనరకంబునం ద్రోయంబడు నతండైన ధనుష్కోటియందవగాహనంబొనర్చెనేని యానరకబాధలంబొందడు మరియును నెన్నినరకంబులు గలవా నరకంబుల సేతుస్నానంబొనర్చిన నరుండా నరకములయందు పడడు మరియును ధనుష్కోటిస్నానంబొ

ర్చిన మనుజుండు అశ్వమేధఫలంబునొందు మరియు ధనుష్కోటిస్నానప్రభావంబున ఆత్మవిద్యయు చతుర్విధభక్తియుంగల్గు బుద్ధిపాపరహితంబుగానేరదు దుఃఖంబుగలుగదు మనీష ప్రకాశించు మరియు తులాపురుషగోసహస్రదానంబుల నరుండేఫలంబునొందునో నది ధనుష్కోటిస్నానంబునంబొందు మరియు నాతీర్థస్నానంబువలన బ్రహ్మహత్య సురాపానయుతంబును గురుదారగమనాయుతంబును స్తేయాయుతంబును తత్సంసర్గకోటులు తత్సమానదోషపుంజంబులు సకలంబును నాశనంబునొందు యీవిషయంబునకై సంశయంబువలదు జిహ్వాగ్రంబున తప్తంబగు పరశువుధరించి జెప్పంజాలదు యెవ్వండైన నీవాదం బర్థవాదంబని వక్కాణించు నతండు సర్వకర్మబహిష్కృతుండగు శంకరుండని చెప్పంబడు లోకంబున సర్వపాతకనాశంబును అద్వైతజ్ఞానప్రదంబును భుక్తిముక్తిదంబును యిష్టకామప్రదంబును అజ్ఞాననాశనంబగు ధనుష్కోటిగల్గియుండ మనుజాధముండాతీర్థంబుమాని యితరంబులసేవించుటయే వ్యర్థంబు మరియు నాతీర్థప్రభావంబేవచింపంజాల నందుస్నానంబొనర్చిన వారలకు నరకభయంబులేదు యెవ్వారైనను ధనుష్కోటియందు స్నానంబొనర్చినను స్మరించిన స్తుతించిన స్పృశించిన నమస్కరించినవారలు మరలజన్మంబునొంది మాతృస్తన్యపానంబొనర్పరనినవిని శౌనకాదిమునీంద్రులిట్లనిరి.

ఓ పౌరాణికోత్తమా, యాతీర్థంబునకు ధనుష్కోటియను నామంబెట్లుగల్గె నవ్విధంబు సవిస్తరంబుగ జెప్పవలయుననిన సూతుండిట్లనియె. ఓ మునిపుంగవులారా పూర్వంబున రఘునాయకుండు దేవకంటకుండను రావణుంబరిమార్చి తదనుజుండగు విభీషణు లంకారాజ్యంబునకభిషిక్తుంజేసి వైదేహీలక్ష్మణసుగ్రీవప్రముఖపరివృతుండై పుష్పకవిమానారూఢుండగుచు సిద్ధచారణులు పరివేష్టింప కిన్నరులు అప్సరసలు గొనియాడుచుండ లీలాధృతకోదండుడై త్రిపురనాశనకరుండగు సదాశివుంబోలె దేజరిల్లుచు గంధమాదనంబునకేతెంచి యచ్చటనుండుసమయంబున విభీషణుండు ప్రాంజలియగుచు నిట్లనియె ఓమహాత్మా లోకంబునంగలరాజన్యులు బలంబులంగూడి యీసేతుమార్గంబున మదీయనగరంబునకేతెంచి నన్నుంబీడింతురే నేమిసేయుదునని వేడిన రఘునందనుండు దయాళుండై ధనుష్కోటిచే నాసేతువునుభేదించెంగాన నాప్రదేశంబు ధనుష్కోటితీర్థంబని ప్రసిద్ధిబొందె యేమనుజుండైన రామధనుష్కోటికృతంబగు రేఖంగాంచు నానరుండనేకక్లేశసంయుక్తంబగు గర్భవాసంబునొందడు మరియు నారేఖాదర్శనంబువలన ముక్తిగల్గు నాతీరంబున స్నానంబొనర్పం గలుగుఫలంబువచింప [illegible]నెరుంగ నర్మదాతీరంబున తపంబు పాపనాశనంబగు గంగాతీరంబున మరణంబపవర్గప్రదంబగు కురుక్షేత్రంబున దానంబు బ్రహ్మహత్యాదివిశుద్ధంబగు నాధనుష్కోటియందు తపంబును మరణంబును దానంబును మహాపాతకనాశనంబై సమస్తంబులనొసంగు నిందుకుసందియంబులేదు నరుండేపర్యంతంబాతీర్థంబునాలోకింపడంతపర్యంతంబు సకలపాపపుంజపీడితుండగు దాన హృదయగ్రంధిభేదనంబగు మరి

యు సకలపాపనాశనంబును సర్వమంత్రాధికంబును సర్వదానఫలదంబునగు ధనుష్కోటిస్నానంబబ్బెనేని యానరునకు కాయక్లేశకరంబులగు నధ్వరంబులు తపంబులు వేదంబులు శాస్త్రంబులేల గంగాయమునాజలంబుల ప్రయోజనంబేమిగలదు కాశిస్థలంబున మరణంబునొందిన నిరర్థకంబు నరుండు ధనుష్కోట్యవగాహనంబొనర్పక దినత్రయంబున స్నానంబుగావింపక యచ్చట గోసువర్ణాదిదానంబులొసంగకపోయిన దారిద్ర్యంబునొందు నిందుకు సందియంబులేదు జనుండు ధనుష్కోటిస్నానంబున నేఫలంబునొందునో యాఫలంబు బహుదక్షిణాకంబులగు అగ్నిష్టోమాదియజ్ఞంబులచే బొంద శక్యంబుగాదు లోకంబుననెచ్చటనైన నేతీర్థంబుకైన ధనుష్కోటినామంబుగలదాతీర్థంబున సర్వతీర్థోత్తమంబని వచింపఁబడు మరియు నాధనుష్కోటితీర్థంబునందు బ్రహ్మవిష్ణుమహేశ్వరులును భుమాసరస్వతులును అష్టవసువులును ఆదిత్యసిద్ధసాధ్యగంధర్వవిద్యాధరాది నిలింపులును సంతతంబు సాన్నిధ్యంబు సేయుచుండుదురు పూర్వంబున సకలామరులు నాతీర్థతీరంబున స్వల్పతపంబొనర్చి సిద్ధింబొందిరి నరుండాతీర్థంబున స్నానంబొనర్చి పితృదేవాదితర్పణంబులొనర్చెనేని సర్వపాపనిర్ముక్తుండై బ్రహ్మలోకంబునొందు నచ్చటనరుండు భక్తియుక్తుండైయొకవిప్రునకు నన్నంబిడిన నది యిహపరంబుల ననంతసుఖంబులొసంగు యేనరుండైన శాసకాదులచే స్వవృత్తిజేయ సమర్థుండుగాడతండందు స్నానంబుజేసి యాఫలంబొందు నశ్వమేధంబుగావింప నసమర్థుండగు నరుండాతీర్థంబున స్నానంబొనర్చిన తత్ఫలంబునొందు బ్రాహ్మణుండైన క్షత్రియుండైన వైశ్యుండైన నాతీర్థంబున స్నానంబొనర్చిన నింద్యయోనులజనింపరు యెవ్వండైన మాఘమాసంబున సూర్యుండు మకరస్థుండైయుండ యాధనుష్కోటియందు స్నానంబొనర్చు నతనిపుణ్యంబింతయని వచింపంజాల నతండు గంగాదిసర్వతీర్థంబుల స్నానంబొనర్చినవాడని వచింపబడు పిమ్మట యక్షయలోకంబుల మోక్షంబునొందు యేనరుండైనయేమానినియైన నీమాఘమాసంబునం దాతీర్థంబున మజ్జనంబొనర్చి వారలుజన్మాదిగ నొనర్చినపాపంబులన్నియు నాశనంబునొందు సర్వసురబృందంబులోపల శ్రీనాథుండుం బోలె నాతీర్థంబు సకలతీర్థంబు అనుత్తమంబై ప్రకాశించు నరుండు పునర్భవంబుగోరి నియమోపేతుండు విజితేంద్రియుండగుచు యాతీర్థంబున స్నానంబొనర్చెనేని యీప్సితంబునొందు మరియును మాఘమాసంబున మానవుండాతీర్థంబున నేకచిత్తుండును జితక్రోధుండగుచు స్నానంబుగావించిన బ్రహ్మహత్యవలనంబాయు యేమనుజుండైన మాఘమాసంబున శివరాత్రియందాతీర్థంబున స్నానంబుగావించి నిరాహారుండును జితేంద్రియుండుగుచు రాత్రియందు ప్రతియామంబును మహాదేవునర్చింపుచు జాగరణంబుండి పరదినంబున సూర్యోదయకాలంబున నాతీర్థంబున నితరతీర్థంబులనెల్లం గ్రుంకి నియతమానసుండై కృతనిత్యకర్మకలాపుండగుచు రామనాథుంబూజించి దనకుంగలకొలది బ్రాహ్మణులకన్నంబిడి భక్తిపూర్వకంబుగ గోభూసువర్ణాదిదానంబులొసంగి వారలచే నను

జ్ఞనొంది పిమ్మట దానంభుజింపవలయు నట్లుగావించిన మానవునకు రామనాథుండు ప్రీతుండై సకలపాపనాశనంబుగావించి భుక్తిముక్తులనొసంగు గాన మనుజులు సర్వవిధంబుల మాఘమాసమునందాతీర్థంబున మోక్షంబుగోరి స్నానంబొనర్పవలయు నెవ్వండైన నాతీర్థోత్తమంబున నర్ధోదయపుణ్యకాలంబున స్నానంబొనర్చి సకలపాపంబులంబాయు నెవ్వండైన మహోదయకాలంబు నచ్చట స్నానంబొనర్చి భుక్తిముక్తి ఫలంబులంబొందు నేమనుజుండైన నాతీర్థంబున నర్ధోదయమహోదయకాలంబుల స్నానంబొనర్చు నతనికి బ్రహ్మవిష్ణుమహేశ్వరులు వశ్యులై యద్వైతజ్ఞానంబు లేకపోయినను సాయుజ్యప్రాప్తి నొసంగుదురు మరియు నతండుజేసినపాపంబులకు మన్వాదిస్మృత్యుక్తప్రాయశ్చిత్తంబులొనర్పకపోయినను దోషరహితుండగు మరియు నతండు యజ్ఞంబులొనర్పకపోయిన, నాఫలంబులంబొందు మరియునచ్చట చంద్రసూర్యగ్రహణకాలంబుల స్నానంబుజేసిన నరుండు బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తంబొనర్చినవాడగు నతని పుణ్యఫలంబువచింప నాదిశేషునకైనను దరంబుగాదు మరియు నాధనుష్కోటిస్నానం బఖిలతీర్థస్నానప్రదంబై సాయుజ్యప్రాప్తి కారణంబగు మరియు ముక్తింగోరువారర్ధోదయ మహోదయకాలంబులంగల్గు సూర్యచంద్రగ్రహణంబుల నచ్చటస్నానంబొనర్పవలయు గాన నోమునీంద్రులారా సర్వంబునుమాని భుక్తిముక్తిప్రదంబును పుణ్యంబగు ధనుష్కోటింబోయి స్నానంబుగావింపుడు నచ్చట పితృసమూహంబునకుం బిండదానంబుగావించిన కల్పాంతకాలపర్యంతంబు తృప్తినొసంగు మరియు శ్రీరామచంద్రుండు సేతుమూలంబును ధనుష్కోటియు గంధమాదనంబును నీత్రయంబును పితృప్రీతికరంబుగానొనర్చెద నందుస్నానంబొనర్చినవారలు పితృ ఋణముక్తులగుదురు మరియు నాత్రయంబు దేవనిర్మితంబై ఋణమోక్షంబని ఖ్యాతింబొందియుండు గాన మానవులు సర్వంబులంబరిత్యజించి యాధనుష్కోటి స్నానంబుగావింపవలయు పూర్వంబున ద్రోణాచార్యపుత్రుండగు యశ్వత్థామ యాతీర్థంబున స్నానంబొనర్చి యతిఘోరంబగు సుప్తమారణదోషంబువలనంబాసె నోమునీంద్రులారా భుక్తిముక్తిప్రదంబును సకలనాశనకారియగు ధనుష్కోటివైభవంబు మీకెరుంగించితినని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరుంగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు
ధనుష్కోటి ప్రశంసయను కథగల
ముప్పదియవ యధ్యాయము సంపూర్ణము.



## ముప్పదియొకటవ అధ్యాయము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులు సకలపురాణాభిజ్ఞుండగు సూతున కిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా యశ్వత్థామ యేలసుప్తమారణంబుగావించె పిమ్మట ధనుష్కో-

టి కరిగియందు స్నానంబొనర్చి యెట్లా పాపంబువలనం బాసె నవ్విధంబు సవిస్తరంబుగా కృ
పం జెప్పవె మా త్వద్వాక్యామృతంబులు గ్రోలు మాకుం దనివిగలుగదని శ్రద్ధాయుతుఁడై యడిగిన
సూతుం డిట్లనియె, పూర్వకాలంబున కౌరవపాండవులకు రాజ్యార్థంబై కలహంబు గలిగెన
పుడు దుర్యోధనుం డేకాదశాక్షౌహిణీయుతుండై ఖండనంబుగావింపుచుండ భీష్ముండు త
దీయ సేనాధినాథుండై పదిదినంబులాఘుంపబొనర్చి భూపతితుండయ్యె పిమ్మట గురుండై దు
దినంబులు కర్ణుండు దినద్వయంబు సేనానాథులై యుద్ధంబొనర్చి మృతులైరి. పిమ్మట నష్టా
దశదినంబున శల్యుండు సైన్యనాయకుండై యద్దినంబాయోధనంబొనర్చి విధనంబునొం
దె నంత రాజరాజగు సుయోధనుండు భీమంబగు గదాయుద్ధంబద్ధటనంబుగావించి వృకో
దరుగదాహతిచే భగ్నోరువగుచు భూమింబడెనంత ధృష్టద్యుమ్నాదులు సంప్రాప్తమానసు
లై పరివేష్టింప పాండవులు కృష్ణసహితులై షండవృక్షపటవేష్టితంబగు దుర్యోధన శిబిరం
బునకుంబోయి యందుండెడు మహార్హంబులగు ధనంబులంగొని సుఖంబుండిరంత ధృష్ట
ద్యుమ్నాదులు స్వవాసంబులకుం బోయిరి పిమ్మట శ్రీకృష్ణదేవుండు పాండవులంగాంచి ఓ
కౌంతేయులారా మనమిపుడు మంగళార్థంబై శిబిరబహిఃప్రదేశంబున నుండవలయుననిన
వాకలంగీకరించి కృష్ణసాత్యకి సహితులై వేగవతీ నదితీరంబునకుంబోయి యచ్చట నిహ
తశత్రువులగాన నారాత్రి సుఖంబుననుండిరంత కృపకృతవర్మాశ్వత్థామ లాదిత్యుండస్తగిరి క
రుగకమున్నె దుర్యోధనాంతికంబునకుంబోయి పాంసురూషితుండును భగ్నోరువురుధిరా
సక్తసర్వాంగుండును భూపతితుండగు నతనింగాంచి బాష్పపూర్ణావిలముఖులగుచు విల
పింపుచుండిరాసమయంబున గురునందనుండు క్రోధవిస్ఫారితేక్షణుండై మహానలుంబోలె
ప్రకాశింపుచు దుర్యోధనుతో నిట్లనియె ఓ నృపాగ్రణీ మజ్జనకుండు శత్రువులచే ఛలం
బున నిహతుండయ్యె నందుకు జింతింప నీవిపుడు భూపతితుండవగుటకుం జింతించెద మ
ద్వాక్యంబు నాలింపుము నేనిపుడీ రాత్రిసమయంబున పాండవుల శిబిరంబులకుంబోయి శేక
యస్సృంజయ పాంచాలాది సంయుతులగువారల యమసదనంబునకుం బంపెద ననుజ్ఞయొ
సంగుమనిన దుర్యోధనుండట్లొనర్పుమని వచించి కృపాచార్యానీతంబగు కలశజలంబు వల
న సైన్యాధిపత్యంబున కభిషేకంబుగావించె నంతనతండా నృపునాలింగనంబుగావించి కృ
పకృతవర్మసహితుండై దక్షిణోన్ముఖుండై పాండశిబిరసమీపంబునకుంబోయె నంత వారల
తిభీషణంబగు పాండవులయు శబ్దంబులవిని భీతింబొంది పూర్వాభిముఖులగుచు గొంత దూ
రంబుజని నానాతరులతావృక్షంబును అనేకమృగసంచారంబును క్రూరపక్షిగణాకులంబును
పద్మేందీవరకల్హారసగసీశతసంకులంబును నగు నొకవనంబుగాంచి యందొక తటాక తీరం
బున హయంబులడిగి జలంబులద్రావి అశ్వంబులంద్రావించి యచ్చటనొకన్యగ్రోధవృక్ష తీ
రంబుననుండ సూర్యుండస్తమితుండైన తిమిరావృతంబగు రాత్రి యరుదెంచెనంత నిశాచరం
బులగు క్రూరసత్వంబులు సంచరింపుచుండ సుఖాహర్హులగు కృపకృతవర్మలు ధరణిం

బడిపరాజయఖేదఖిన్నుండగుచు నిద్రంబొందిరి ద్రోణతనూజుండు నిద్రంబొందక కోపకలుషకృతమానసుండగుచు భుజంగంబుబోలె నూర్పులిగుడించుచు భయానకంబగు నరణ్యంబువీక్షించుచు న్యగ్రోధంబుంగాంచియుండు శాఖాసమూహంబుల గ్రుంచు కాకంబులబహువిధంబుల విచ్ఛిన్నచరణాద్యవయవంబులంగావించి మరణంబునొందించుచుండెడు భీషణరవంబైన యొకయులూకంబుగాంచి తత్కార్యంబువీక్షించి నాకీయులూకంబుపదేశకారియయ్యె నేనివ్విధంబున శత్రుసమూహంబుల మరణంబునొందించెద వారలు న్యాయమార్గంబున యుద్ధంబుగావించి జయింపనర్హులుగారు సుయోధనానంతరంబున శత్రువధంబునకై ప్రతిజ్ఞగావించితి లోకంబున క్షత్రధర్మానువర్తియగు నరుండు న్యాయంబున జయింపందగని శత్రువుల నన్యాయంబునైననం జయింపవలయునందుకు పురావిదులగు ఆర్యులభిహితుండు నిద్రితుండైన పరిశ్రాంతుండైన వివస్త్రుండైన భుంజానుండైనను నిరాయుధుండైనను సంభిన్నబలుండైనను రాజన్యునకు వధార్హుండగునని వచించిరని పలువిధంబుల ముహూర్తమాత్రంబు చింతించి సుప్తమారణంబొనర్ప నిశ్చయించి సాహసవంతుండై కృపకృతవర్మలంగాంచి ఓ స్నేహితులారా పరిశుద్ధుండగు సుయోధనుండు క్రూరకర్ముండగు భీమసేను పదాఘాతంబున నిహతుండయ్యెగాన నీయర్ధరాత్రంబున నిద్రితులును సైన్యసమేతులగు పాండవుల నానావిధంబులగు శస్త్రంబులమరణంబు నొందించెదననిన కృపాచార్యుండిట్లనియె.

ఓగురునందనా లోకంబున సుప్తమారణంబు గావించుట యుక్తంబు కాదది ధర్మంబుగాదు నరుండు దానవపూజితుండుగాదు సంత్యక్తరథవాహన శస్త్రులంజయింపందగదు మనమిప్పుడు ధృతరాష్ట్రగాంధారీ విదురుల సమీపంబునకుంబోయి వారలకు దుర్యోధన నిధనంబెరుంగించి పిమ్మట వారలువచించిన ప్రకారంబున గావింపవలయు మదీయవాక్యంబుల వినుము సాహసంబుమానుమని యనేక విధంబులంబలుకు కృపాచార్యునితో ద్రోణాచార్యతనూజుండిట్లనియె. ఓ మాతులా మహనీయుండగు శాంతనవునికపటంబున శిఖండింబురస్కరించుకొని యన్యాయంబున పార్థుండువధించె మరియు మదీయజనకుండు నిరాయుధుండైయుండ పాపుండగు ధృష్టద్యుమ్నుండువధించె మరియు పాండునందనులన్యాయంబు గావించి యనేకరాజన్యులంబంపి దుర్యోధను మరణంబునొందించిన మన్మనంబుల భేదించుచున్నది గాననే సుప్తమారణంబొనర్చెదనని రథారూఢుండై శత్రువులపైయరిగెడు అశ్వత్థామం గాంచి కృపకృతవర్మలు ఉద్యతాయుధులును రథారూఢులై శిబిరసమీపంబునకుంబోయి యచ్చట ద్వారదేశంబులనుండిరంత గురునందనుండీశ్వరప్రసాదలబ్ధంబగు ఖడ్గంబుధరించి యాశిబిరంబుప్రవేశించి యందు మహాయుద్ధశ్రాంతుండును మహార్హశయన సుఖప్రసుప్తుండగు ధృష్టద్యుమ్నుంజేరి పాదతాడనంబుగావించిన నతండుమేల్కాంచి వీరుండగు ద్రోణపుత్రుంగాంచె నంతబలవంతుడగు గురుసుతుండతని బాహువులచే కేశంబులంబట్టి ధ

రాతలంబున్నైద్రోణి పీడించి ధనుర్గుణంబుచే కంఠంబుఖండించుచు పశుమారణప్రకారంబున చిత్రవధంబొనర్చి మరియును యుధామన్యుండు మొదలగు వారలను ద్రౌపదీపుత్రుల సైన్యయుతంబుగ చంద్రఖడ్గంబుచే నిహతులంగావించుచుండ భయాతురులై పరుంగిడు వారలంబోనీయక ద్వారంబులనుండు కృపకృతవర్మలు హతంబొనరించిరి యివ్విధంబున నా ముగ్గురు శిబిరంబున గలవారనెల్ల హతులంగావించి పార్థభీతులై యతిత్వరితంబుగ యథేచ్ఛంబోయిన వారలతనింగాంచి రోగబలంబున సుప్తమారణంబొనర్చిన దుశ్చరితుంగా నెరింగి ఓరీ బ్రాహ్మణాధమా నీదర్శనంబుజేసిన పాపంబుగల్గు త్వత్సంభాషణ మాత్రంబున బ్రహ్మహత్యాయుతంబులు సంభవించు మాయాశ్రమంబున నుండకుమనిన నతండు లజ్జితుండై యచట్టింబాసి కాశ్యాదిపుణ్యతీరంబులకుంబోయి తత్రత్యమునీంద్రులచే నిందితుండై విచారంబునొంది తాజేసిన సుప్తమారణకృత్యంబునకుం బ్రాయశ్చిత్తంబొనర్పంగోరి బదరికాశ్రమంబునకు దపంబుగావించు ద్వైపాయనుంజేరి నమస్కరింప నా మునీంద్రుం డతిపాపుండగు నతనింగాంచి ఓ బ్రాహ్మణాధమా నీవిచటనుండకుము నీదర్శనంబొనర్ప మహాపాపంబునమ్ముంబొందుదుగాన శీఘ్రంబున బొమ్మనిన ద్రౌణియిట్లనియె. ఓ తపోధనా శేషర్వజనంబులచే నిందితుండనై నిన్నుశరణంబుజొచ్చితి నీవిటువచించిన నేనెచటికింబోదు కృపాళుండవై యనుగ్రహించి సుప్తమారణదోషంబునకుం బ్రాయశ్చిత్తంబు వచింపుమనిన వ్యాసుండు కొంతదడవు చింతించి యిట్లనియె. ఓ ద్రోణనందనా యీపాప శాంతికొరకుం బ్రాయశ్చిత్తంబు స్మృతిపుంజంబులలేదైన నొకనుపాయంబు వచించెద దక్షిణసముద్రతీరంబున పుణ్యంబగు రామసేతువునందు ధనుష్కోటియను నొకతీర్థంబుగలదది మహాపాతక నాశనంబును స్వర్గమోక్షప్రదంబును బ్రహ్మహత్యావిశోధకంబును సర్వమంగళదాయకంబును సర్వాభీష్టఫలప్రదంబును సకలతీర్థోత్తమంబునందు స్వప్ననాశనకారియు నరక క్లేశవిమోచనంబును అకాలమృత్యుశమనంబును దారిద్ర్యనాశనంబును ఆయుర్వర్ధన కారణంబును చిత్తశుద్ధిప్రదంబును నై వెలయుచుండు నీవచటికింబోయి మాసమాత్రంబు స్నానంబొనర్చిన యీసుప్తమారణ దోషంబువలనం బాసి పరిశుద్ధుండవగుదువుగాన శీఘ్రగమనంబునం బొమ్మనిన ద్రోణనందనుండాక్షణంబ రామసేతువునకుం బోయి ధనుష్కోటియందు మాసమాత్రంబు స్నానంబొనర్చి త్రిపథ్యంబు రామనాథు సేవింపుచు మాసాంతదినంబున స్నానంబొనర్చి యుపవాసంబుండి పంచాక్షరీమహామంత్రంబు జపించుచు రాత్రియందు రామనాథు సమీపంబున జాగరణంబుండి పరదినంబున సంకల్పపూర్వకంబుగా స్నానంబొనర్చి రామనామముస్తుతించుచు ఆనందాశ్రుపరిప్లుతుండై నర్తనంబొనర్చుచుండ మహాదేవుండు ప్రసన్నుండై ప్రత్యక్షంబయ్యెనంత ద్రోణనందనుండు పరమహర్ష పరిపూరిత హృదయుండగుచు నిట్లనిస్తుతించె.

ఓ మహాదేవా నీవు కృపామూర్తివి ధూర్జటివి నీలలోహితుండవు ఉమాకాంతుం

డవు విరూపాక్షుండవు చంద్రశేఖరుండవు మృత్యుంజయుండ వావధంబుధిమగ్న హితజ నాంబుజుండవు పార్వతీపతివి త్రిపురనాశకుండవు త్రినేత్రుండవు పినాకపాణి నశూలపాణి అనంతాది మహానాగభూషణవిభూషితుండవు గంగాధరుండ వవ్యయుం డప్రమేయుండవు నినుంగొనియాడ నాదరంబగునె నన్నిపాపపంజరంబునఁ బడనీక కృపాళుండవై రక్షింపు మని యివ్విధంబు స్తుతించెడు ద్రౌణింగాంచి హర్షితుండై మహాదేవుండిట్లనియె. ఓ ద్రోణనందనా యీధనుష్కోటి మజ్జనంబువలన గురుతల్పగమనదోషంబు నాశనంబునొందె మదీయదర్శనంబున జనంబులకలభ్యంబెద్ది యులేదు నీయభీష్టంబగు వరంబువేడుము సంగెద ననిన ద్రోణనందనుండిట్లనియె. ఓ మహేశ్వరా నేభవద్దర్శనంబున కృతార్థుండనైతి వు ణ్యంబొనర్పనివారలకనేకజననంబులనే భవద్దర్శనంబు లభ్యంబుగాదు నాకెల్లప్పడును భవ త్పాదంబులయందు నిశ్చలంబగు భక్తిప్రసాదింపుమని వేడిన నీశ్వరుండావరంబొసంగి యంతర్హితుండయ్యె పిమ్మట అశ్వత్థామయు ధనుష్కోటిస్నానవైభవంబున విధూతపా పుండును నిర్మలుండగుచు సంచరించుచుండె నెవ్వండైన నీయధ్యాయంబు సమాహితచి త్తుండై పఠించు వినునతం డఖిలపాపపుంజ విదళనంబుగావించి విష్ణులోకంబు వొందునని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరింగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు
ధనుష్కోటి ప్రశంసయు అశ్వత్థామ సుప్తమారణదోషశాంతియను కథలంగల
ముప్పదినొకటవ యధ్యాయము సంపూర్ణము.



## ము ప్ప డి రెం డ వ అ ధ్యా య ము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకలపురాణవ్యాఖ్యానవైఖరీ స మేతుండైన సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా ధనుష్కోటిమహాత్మ్యం బెరింగించెద వినుండు పూర్వంబున సోమవింశవివర్ధనుండగు నందుండను రాజేంద్రుం డనేకకాలంబు ధర్మమార్గంబున ప్రజాపాలనంబొనర్చి తృప్తుండై యాత్మపుత్రుండగు ధర్మగుప్తు రాజరక్షా విచక్షణుంగావించి జితేంద్రియుండును నిరాహారుండునగుచు వనంబునకుంజనితపంబుగా వింపుచుండెనంత ధర్మగుప్తుండు ధర్మజ్ఞుండును నీతితత్పరుండగుచు బహుయజ్ఞంబు లొన ర్చి యింద్రాదిదేవతలం దృప్తినొందించుచు భూసురుల కనేకదానంబులంగావింపుచు స్వ ధర్మనిరతుండై రాజ్యపాలనంబు గావింపుచుండ నాతని రాజ్యంబున చోరాదిసంభవంబు లగు బాధల జనంబులొందక ప్రమోదంబు నొందుచుండిరంత నాసరుండొక దినంబున మృగయావినోదార్థియై తమాలతాలహింతాలాది నానాతరుసంకులంబును సింహవ్యాఘ్ర

భయానకంబును పద్మకల్హారనీలోత్పల విభానీసంపూర్ణతటాకసంయుతంబును తపస్విజనపరి వేష్టితంబగు నొకవనంబునకుంబోయి యందుదైవయోగంబున భృత్యులంబాసి సంచరించు చుండ సూర్యుండస్తగతుండయ్యె నంత తమంబుచే భయంకరంబగు రాత్రియరుదెంచె న వ్వుడతండు సంధ్యావందనంబొనర్చి వ్యాఘ్రాదిమృగంబులకుభీతుండై యొకమహీరుహంబె క్కె నవ్వుడొకభల్లూకంబు సింహానుద్రుతంబై వేగంబున యావృక్షంబెక్క నతండాబుు క్షంబుంగాంచి భీతుండైయుండ యామృగంబామహీపతింజూచి యిట్లనియె.

ఓ నృపాలకా భయంబునొందకుము యేనును నీవును నీవృక్షంబున నీరాత్రివసించి యుండుదము మహాసత్వంబును భయంకరాకారంబగు పంచాస్యంబీనగమూలంబుననున్న యది నీవిప్పుడు సంశయంబుమాని కొంతదడవు నాయంకురంబుపై బవ్వళించి నిద్రించుము నీవు మేల్కొనినపిమ్మట నేనిద్రించెదనని భల్లూకరాజంబుపలికినవిని యానృపోత్తముండు నిద్రంబొందె నప్పుడు సింహంబాబ్బుక్షంబుగాంచి ఓయీ నీవీ సకలమృగహింసకుండగు నృపుని భూమింద్రోయుమనిన భల్లూకోత్తమంబిట్లనియె. ఓి మృగరాజంబా నీవు ధర్మరహ స్యంబెరుంగవు లోకంబున బ్రహ్మహత్యాది పాపంబులనెల్ల నిష్కృతిగలదుగాని విశ్వాసఘా తకపాపంబునకులేదు మరియు నాపాపంబనేకజన్మంబుల ననేకయజ్ఞంబు లొనర్చినంబోదు మహాత్తరంబగు మేరుమహీధరంబుకన్న భారంబై యుండునని దలంచెదనని వచించుచుండం గొంతప్రొద్దాయె నంతనరపాలుండు మేల్కొనిన బుుక్షంబునిద్రంబొందె నాతరి సింహం బు నృపుంగాంచి వోనృపాలకా యీాబుుక్షంబును భూమిపయిం ద్రోయుమనిన నతండు స్వాంకంబుపై శంకంబొందక నిద్రించెడు భల్లూకంబును భూమిపయింద్రోసె నంతనాభ ల్లూకంబతనిచేద్రోయంబడియు దైవయోగంబున భూమింబడక వృక్షంబువదలక కోపంబున నృపుంగాంచి యిట్లనియె. ఓయీ నేకామరూపధరుండ భృగువంశసంజాతుండ ధ్యాన కాష్టుండను నామంబుగలవాడ దైవయోగంబున నీబుుక్షరూపంబునొందితి నిరపరాధుండ నగు నీవృక్షంబుననుండిద్రోసితివిగాన వున్మత్తుండవై భూతలంబునంజరింపుమని రాజునకు శాపంబొసంగి సిహ్మంబుంగాంచి యిట్లనియె. ఓ మృగేంద్రా నీవు భద్రుండనునామంబుగల కుబేరసచివుండగు యక్షుండవుగాని సిహ్మంబుగావు నీవొకనాడు భార్యలంగూడి వివస్త్రుం డవై హిమవద్గిరియందు గౌతమసమీపంబున విహరింప నతండు నిర్లజ్జుండగు నిన్నుంగాం చి సిహ్మంబగుమని శాపంబొసగెం గాన నీరూపంబునొందితివి కుబేరుండును తద్భృత్యుల గుమీరును ధర్మశీలులరు తపస్వియగు నన్నేలహింసించెదవిదియంతయుధ్యానంబువలన నెరుం గుదుననివచించినవిని సిహ్మంబాక్షణంబున నారూపంబువిడిచి భద్రుండనుగంధర్వుండై ప్రాం జలియగుచు నాధ్యానకాష్టునితో నిట్లనియె.

ఓ తపోధనా ! నేనిప్పుడంతయు నెరింగితి పూర్వంబున గౌతముండు నాకుశావం

బొసంగి పిమ్మట కామరూపధారియు ఋక్షరూపుండగు ధ్యానకాష్ఠునితో నెప్పుడడు భాషించెదవో యప్పుడీశాపమోక్షంబగునని వచించె గాన నేనిప్పుడు యుష్మత్సంవాదంబువలన నీమ్మాత్వంబుబాసి బరిశుద్ధుండనైతి నిన్నునేనెరుంగుదునని యనేకవిధంబులంబొగడి దివ్యవిమానారూఢుండై యాతకాపురంబునకుంబోయె పిమ్మట ధ్యానకాష్ఠుండును యథేచ్ఛంబోయెనంత ధర్మగుప్తుండున్మత్తుండై నిజపురంబునకుంజనిన నతనింగొని మంత్రిసమూహంబులు తదీయజనకుండగు నందుకడకుంబోయి యావిధంబెరుంగింప నతండు జైమినిమునీంద్రుని సమీపంబునకు తనయుందోడ్కొనిచని ధ్యానకాష్ఠమునీంద్రుశాపంబుచే నున్మత్తుండగు నితనింగావవేయని వేడిన నాతపోధనుండు కొంత తడపుచింతించి యిట్లనియె ఓ నందరాజన్యా నీవీసుతుంగొని దక్షిణసముద్రతీరంబున పాపనాశనంబగు సేతువునకుంజోయి యందు పవిత్రంబును మంగళప్రదంబును శ్రుతిసిద్ధంబును మహాపుణ్యంబును బ్రహ్మహత్యాది నాశనకారియగు ధనుష్కోటితీర్థంబున స్నానంబు జేయింపుము దాన నీయున్మాదంబు నాశనంబగుననిన యామునీంద్రునకు నమస్కరించి నందుండాక్షణంబు పుత్రసహితుండై ధనుష్కోటికరిగియందు నియమపూర్వకంబుగ పుత్రునికిస్నానంబుజేయింప నతండు పున్మాదంబు మానె నంత నందుండును స్నానంబొనర్చి పుత్రసహితుండై రామనాథు సేవించి పుత్రుని వీడ్కొని తపోవనంబునకరిగె నంత ధర్మగుప్తుండు రామనాథునకు బహువిత్తంబులొసంగి భూసురులకు క్షేత్రాదిదానంబులుగావించి మంత్రియుతుండై నిజనగరంబునకుంబోయి ధార్మికుండై పితృపైతామహంబగు రాజ్యంబు నిహతకంటకంబుగ గావింపుచుండె గాన లోకంబున పున్మాదంబుచేతను ఆమస్మాకంబుచేతను దుష్టగ్రహంబుచేతనుం బీడితులగువారలు ధనుష్కోటియందు స్నానంబొనర్చిన తద్దోషముక్తులగుదురు యెవ్వండైన ధనుష్కోటింబాసి యితరతీర్థంబునకుంబోవు నతండు సిద్ధంబగు గోక్షీరంబువిడచి స్నుహీక్షీరంబుగోరువాడని తలంచవలయును యేనరులైన ధనుష్కోటియను నామంబు మూడుపర్యాయంబులు పఠించి యెచ్చటనైన తీర్థంబున స్నానంబొనర్చిరేని వారలు బ్రహ్మపదంబునొందుదురు యిందు సందియంబులేదు. ఓ మునీంద్రులారా! యేకథవినువారికి బ్రహ్మహత్యాదిదోషంబులన్నియు నశించు నట్టిధర్మగుప్తవృత్తంబు మీకెరుంగించితినని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరింగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు

ధర్మగుప్తోన్మాదమోక్షంబను కథగల

ముప్పదిరెండవ యధ్యాయము సంపూర్ణము.



# ముప్పదిమూడవ అధ్యాయము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా యత్యద్భుతంబును సకలలోక పావనంబగు ధనుష్కోటి మహాత్మ్యంబెరుంగించెద వినుండు పూర్వంబునపరావసుండను బ్రాహ్మణోత్తముండజ్ఞానంబున పితృవధంబుగావించి బ్రహ్మహత్యంబొంది పిమ్మట ధనుష్కోటియందు స్నానంబొనర్చి యాదోషంబుబాసి నిర్మలుండయ్యెననిన శౌనకాదిమునీంద్రులిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా బ్రాహ్మణోత్తముండగు పరావసుండేలజనకుంజంపె ధనుష్కోటియందెట్లు స్నానంబుగావించి ముక్తుండయ్యె నా విధంబంతయు వచింపుమనిన సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా చక్రవర్తియగు బృహద్యుమ్నుండను రాజేంద్రుండు సాగరాంతంబగు ధరంగాచుచు నింద్రాదులకుం దృప్తికరంబుగ సత్రయాగం బొనరించుచుండ ధార్మికుండగు రైభ్యుండను మునీంద్రుండు యాజికుండై యుండె నాభూసురునకు పరావసు అర్వావసులను నిర్వురుపుత్రులు గలరు వారలు షడంగవేదంబుల ప్రవీణులును శ్రౌతస్మార్తకోవిదులును తర్కవ్యాకరణాది సకల శాస్త్రవిచక్షణులునునై యొప్పుచు యాబృహద్యుమ్నునిచే సత్రయాగార్థంబై వరింపంబడి జనకాజ్ఞచే యాక్రతుకృత్యంబులంగావింపుచుండిరి. అపుడు రైభ్యుండు జ్యేష్ఠస్నుషయుదాను నాశ్రమంబుననుండె నివ్విధంబున సత్రయాగంబొనరించు బృహద్యుమ్నుసమీపంబున కాహుతులగుచు వశిష్ఠుండును గౌతముండును అత్రియు జాబాలియు కాశ్యపుండును క్రతువుదక్షుండును పులస్త్యుండును పులహుండును నారదుండును మార్కండేయుండును శతానందుండును విశ్వామిత్రుండును పరాశరుండును భృగుపుకుత్సుండును వాల్మీకియు వ్యాసుండును మొదలగు మునీంద్రులనేక శిష్యప్రశిష్యులంగూడి యేతెంచిరి మరియు నాసత్రయాగంబు వీక్షింపంగోరి బ్రహ్మక్షత్రవిట్ఛూద్రాది చాతుర్వర్ణులును పథాసహితులై యరుదెంచి రివ్విధంబున బ్రహ్మచారులునుగ్రహస్థులును వానప్రస్థులును భిక్షులు ననేకులేతెంచిరంత రాజసత్తముండగు బృహద్యుమ్నుండు వారల యథార్హంబుగబూజించి ఘృతసూపాది సమేతంబగు నన్నంబొసంగి వస్త్రసువర్ణహార రత్నాదులనిచ్చి మరియు ననేక విధంబులగు సత్కారంబులగావించె నంత వశిష్ఠాదిమునీంద్రు లాయర్వావసుపరావసువులు స్ఖలనంబులేక నొనర్చెడు క్రతుకర్మంబులంగాంచి ప్రహ్లాదంబునొందిరి. ఇట్లు క్రతురాజంబు జరుగుచుండ తృతీయసవనస్యాంతంబున పరావసుండు గృహకృత్యంబుల విచారించుటకై స్వకీయాశ్రమంబునకుంబోయె నర్వావసుండు క్రతుకార్యంబుల గావింపుచుండె నిట్లతండు నిద్రాకలుషితుండై అంధతమసంకులంబగు రాత్రింబోవుచు కృష్ణాజినావృతుండై వనంబున సంచరించుచు జనకుంగాంచి తన్నుంజంపనరుదెంచు మృగంబని శంకించి పాతకకారియై యతనింజంపి పిమ్మట నిజజనకుంగా నెరింగి వ్యథితేంద్రియుండగుచు ప్రేతకార్యం

బులుగావించి బృహద్యుమ్నుసమీపంబునకుంబోయి స్వానుజుండగు అర్వావసువునకాతెరంగెరుంగింపగ నతండు విలపింపుచుండ పరావసుండిట్లనియె.

ఓయీ అనుజా చింతింపకుము రాత్రియందు మూఢుండనై తండ్రింజంపితి యీ హత్యకు ప్రాయశ్చిత్తంబుగావింపవలయు నీబృహద్యుమ్ను యాగంబును నెరవేరవలయు నీవు బాలకుండ వీయాగకార్యంబుల నిర్వహింపజాలవుగాన మదర్థంబై బ్రహ్మహత్యా విశుద్ధింగోరి ద్వాదశాబ్దంబులు వ్రతంబుగావింపుమని నతండియ్యకొని యచటంబాసి సకల తీర్థసేవనంబుసేయుచు ద్వాదశాబ్దంబులు బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తకరంబగు వ్రతంబు గావించి మరల యాసత్రయాగంబున కరుదెంచిన పరావసుండతనింగాంచి బృహద్యుమ్ను సమీపంబుజేరి వో రాజేంద్రా యీయర్వావసుండు బ్రహ్మహత్యం గావించెగాన నితని నిచ్చటనుండనీయక వెడలంబంపుమితండుండిన యీయాగంబునకు ఫలహాని సంభవించునని నా రాజేంద్రుండట్లొనర్ప అర్వావసుండో రాజేంద్రా పరావసుండు బ్రహ్మహత్యం గావించె గాని నేజేసినవాడంగానమైనను నతనికై ప్రాయశ్చిత్తకారియగు వ్రతంబేనొనర్చితినని వచించినను రాజేంద్రుండావాక్యంబుల నంగీకరింపక అర్వావసుని నచట నుండనియ్యక వెడలంబంపె నిట్లతండు రాజన్యునిచేతనుం బ్రాహ్మణవచనంబులచేతను నిరాకృతుండై వనంబునకుంబోయి దివాకరుంగూర్చి యత్యుగ్రంబగు తపంబుగావింప తుష్టుండై సహస్రాంశుండు మూర్తిమంతుండై యావిర్భవించె అపుడింద్రాదిదేవతలును అతని తపంబునకు మెచ్చి యచటికరుదెంచి యాయర్వావసుంగాంచి యిట్లనిరి. ఓ తపోధనా నీతపంబునకు బ్రహ్మచర్యంబునకు వేదశాస్త్రప్రవీణతకుం బ్రముదితులమైతిమి పరావసువుచే నిరాకృతుండవయ్యును క్షమించితివి మరియు నతండొనర్చిన బ్రహ్మహత్యకై నీవు వ్రతంబొనరించితివిగాన నిన్నుస్వీకరించెదము పరావసుని స్వీకరింపము మరియు నీకిష్టంబగు వరంబు వేడుమనిననతండు మజ్జనకుండు మరల జీవింపవలయునని వేడిన యింద్రాదులావరంబొసంగి మరియు వరంబుగోరుమనిన అర్వావసుండు ప్రీతుండై, ఓ దేవశ్రేష్ఠులారా మద్భ్రాతయ పరావసుండ దుష్టుండగునట్లు బ్రసాదింపుండని వేడిన వారలిట్లనిరి. ఓ భూసురవర్యా లోకంబున పంచమహాపాతకంబుల ప్రాయశ్చిత్తంబు వలన శాంతిలేదంతును బ్రాహ్మణుండగుతండ్రింజంపిన వానిపాపంబునకు లేదుగావ పరావసుండుశేసిన పాపంబునకతండు వ్రతంబుజేసినను ప్రాయశ్చిత్తంబుగానేరదుగాన మేమతనికిదుష్టత్వం బొసంగమనిన అర్వావసుండిట్లనియె· ఓనిలింపులా మద్భ్రాతకెవ్విధంబుననైన భవచ్ఛ్రీభావాతిశయంబున యీహత్యదొలంగు నుపాయంబుగావింపుడని వేడిన వారలు కొంతదడవు చింతించియిట్లనిరి.

ఓ బ్రాహ్మణోత్తమా మహాపాతక నివారణంబగు నొకవుపాయంబు జెప్పెద వినుము దక్షిణసముద్రతీరంబున గంధమాదన పర్వతంబున సకల భువనవిఖ్యాతంబును బ్రహ్మహత్యా సురాపాన గురుతల్పగాది సకల పాపనాశనకరంబును అపవర్గఫలప్రదంబును నరక క్లేశనాశ

నకారియై కైలాసాది పదప్రాప్తికరంబును సర్వకామదంబగు ధనుష్కోటియను నొకతీర్థంబుగలదా తీర్థంబును ముమ్మారుస్మరించిన జనంబులకు ఋణదారిద్ర్యంబులు తొలంగి సకల సుఖంబులుం గల్గుగాననీయనుజుండగు పరావసుండచ్చటికిపోయి స్నానంబొనర్చిన బ్రహ్మహత్యవలనంబాయునని దేవతలు వచించిన అర్వావసుండాబ్రాహ్మణంబ జ్యేష్ఠుండగు పరావసుంగొని రామసేతువునకుంబోయె నపుడు పరావసుండు ధనుష్కోటియందు సంకల్పపూర్వకంబుగ స్నానంబొనర్చిలేచి నియతుండై యుండ యాకాశవాణి యిట్లనియె. ఓ పరావసు నీవొనర్చిన పితృవధంబునం గలిగిన బ్రహ్మహత్యనశించె చింతనొందకుమని పరావసుండను జనసమేతుండై ప్రీతుండగుచు భక్తిపూర్వకంబుగ రామనాథుం బూజించి విముక్తపాపుండై జనకాశ్రమంబునకుంబోవ నతండును పుత్రులంగూడి సంతుష్టుండై తపంబొనరించుచుండె. ఓ మునీంద్రులారా యివ్విధంబున ధనుష్కోటి స్నానవైభవంబున విగతపాపుండగు పరావసునఖిలమునులు నంగీకరించిరిగాన బ్రహ్మహత్యసురాపానాది పాపంబులన్నియుందాన నశించు నిందుకు సందియంబేల సత్యంబు భుజంబప్పళింప జెప్పంజాలరు యెవ్వండైన నీయధ్యాయంబు సావధానుండై పఠించు వినునతండు బ్రహ్మహత్యాది సకల పాపనాశనం బొనరించునని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరుంగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమాహాత్మ్యంబునందు
ధనుష్కోటి ప్రశంసయు పరావసు బ్రహ్మహత్యావిమోచనంబను కథలంగల
ముప్పదిమూడవ యధ్యాయము సంపూర్ణము.



## ముప్పదినాలుగవ అధ్యాయము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకల పురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా ధనుష్కోటి మహాత్మ్యకారియగు సృగాలవానరసంవాదం బెరింగించెద వినుండు పూర్వంబున చెలికాంద్రగు నిర్వురు బ్రాహ్మణులు పాపకార్యులై మరియొక జన్మంబున సృగాలంబును వానరంబై యవతరించి పూర్వజన్మ స్మరణంబుగలవారలగుచు పరస్పర స్నేహంబు గల్గియుండిరంత నొకనాడు వానరుండు రుద్రభూమియందుండెడు సృగాలంబుగాంచి ఓయీ నీవు పూర్వభవంబున మహాపాపంబొనర్చితివిగాన నీస్మశానంబున పూతిగంధాలిప్తంబులగు కుణపంబుల భక్షించెదవనిన సృగాలంబిట్లనియె. ఓ వానరోత్తమా నేపూర్వంబున దేవశర్ముండను బ్రాహ్మణుండ సకల వేదపారంగుడనై యుండియు నొకబ్రాహ్మణునకుపద్రవ్యం బొసంగెదనని పిమ్మట నివ్వక

పోతివి దానసీకుత్సితంబవు జన్మంబునొందితి యెవ్వండైన బ్రాహ్మణజనంబులకు విత్తం బొసంగెదనని వచించి పిమ్మట నొసంగకయుండు నతండతికుత్సితంబగు గోమాయురూపం బునొందు మరియు పూర్వజన్మంబుల నొనర్చిన పుణ్యంబులన్నియు షండప్రహంబువలె నిరర్థకంబులై నశించు మరియు నాపాపం బశ్వమేధశతంబులు గావించినంబోదిది నశించు కాలంబే నెరుంగనీవును నిరపరాధంబులగు వనచరంబుల హింసించితివిగాన తత్పాపశేషం బున వానరరూపంబు నొందితివనిన నామర్కటం బిట్లనియె. ఓ సృగాలంబా నేపూర్వభ వంబున వేదనాథుండను విప్రుండ మజ్జనకుండు విశ్వనాథుండను నామంబుగలవాడు మ జ్జననికమలాయయను నామధేయంబుచే వెలయు ప్రాప్తనంబున మనకిర్వురకు స్నేహంబు గల దు వేతపంబొనర్చి యీశ్వరప్రసాదంబు నొందితింగాన పూర్వజన్మజ్ఞానం బెరుంగ్గుదు నీ వెరుంగవు నేనొకబ్రాహ్మణుని యింట శాకంబపహరించితింగాన సకల నరక బాధలననుభ వించి యాపాపశేషంబున నీవానరత్వంబునొందితి లోకంబునగరళంబు పానంబుజేసిన వా నింజంపుబ్రహ్మస్వంబు హరణంబుగావించిన వానినిత్సువ్వంశంబును దహించుగాన బ్రహ్మస్వ హరణంబుకంటె నధికంబగు పాపంబులేదా పాపంబుగావించిన నరుండు కుంభీపాకాది నరకబాధలననుభవించి పిమ్మట వానరుండై జనించు మరియు బ్రాహ్మణులు బాలులైనను ద రిద్రులైనను వేదశాస్త్రవిహీనులైనను వారల నవమానింపందగదు వారలు గోపించిన యగ్ని తుల్యులగుదురు నేనీవివరంబెరుంగుదుంగాన యెట్లీవానరత్వంబు దొలంగునదియెరుంగ నీవు ను నెరుంగవేమి సేయుదను మనలనెవ్వండీపాపంబులనం బాపునని యివ్విధంబున ప్లవంగమ సృగాలంబులు జింతించుచుండ వారలపుణ్యవశంబున దైవయోగంబున యదృచ్ఛచేమహా తేజుండును భస్మోద్ధూళితసర్వాంగుండును త్రిపుండ్రాంకిత మస్తకుండును రుద్రాక్షమాలా ధరుండును శివనామపరాయణుండగు సింధుద్వీపుండను మునీంద్రుకచటికి కరుదెంచిన వారలామునింగాంచి ప్రముదితులగుచు నమస్కరించి యిట్లనిరి.

ఓ సర్వధర్మజ్ఞా మహాత్మా కృపాదృష్టినవలోకింపుము మాకెవ్విధంబున్న నీరూపంబులు తొలంగునందుకుం దగిన యుపాయంబు వచించిరక్షింపుము లోకంబునదీనరక్షకులగు సా ధువులు అనాథులను కృపణులను అజ్ఞులను రోగపీడితులను నిత్యంబును రక్షింపుచుందురు గదాయనియనేక విధంబులవేడిన నామునీంద్రుండు కొంతదడవు చింతించి యిట్లనియె. ఓ సృగాలంబా నీవుపూర్వంబున దేవశర్ముండను ద్విజుండవు నీవొకబ్రాహ్మణునకొకధనద్వయ ధాన్యంబొసంగెదనని వచించి పిమ్మట నివ్వకపోయినందున యీసృగాలయోనింజనించి తివి ఓ వానరుండా నీవు పూర్వంబున వేదనాథుండను విప్రుండవు నీవొక బ్రాహ్మణగృ హంబు శాకంబపహరించితివిగాన నీవానర రూపంబునొందితివి మీరిర్వురకుం బాపశాంతి కారియగు నొకవుపాయంబెరుంగించెదవినుండు. మీరలు దక్షిణసముద్రోపాంతంబున రామ సేతుపుణ్యమంను ధనుష్కోటి తీర్థంబునకుంబోయి యందు స్నానంబుగావింపుండు దాన

నీరూపంబులు దాలంగు పూర్వంబున సుమతియను విప్రుం డొకకిరాతీసంగంబొనరించి సురాపానంబును బ్రహ్మస్వహరణంబును బ్రహ్మహత్యయుం గావించి పిమ్మట ధనుష్కోటితీర్థమందు మజ్జనంబుజేసి యాపాపత్రయంబువలన విముక్తుండయ్యెననిన సృగాలవానరం బిట్లనియె ఓ తపోధనా సుమతియను విప్రుండెవనిపుత్త్రుండతండేల సురాపానం బొనరించి కిరాతీసంగంబుగావించె పిమ్మట ధనుష్కోటియందెట్లు స్నానంబుగావించి యాపాపంబులవలన ముక్తుండయ్యె నావిధంబు సవిస్తరంబుగా నెరింగింపుమనిన సింధుద్వీపుం డిట్లనియె.

ఓ సృగాలవానరంబులారా పూర్వంబున మహారాష్ట్రదేశంబునందు సకల వేదవేదాంగపారంగుండును దయాళుండును శివనారాయణార్చకుండగు యజ్ఞదేవుండను నొక విప్రుండు గలండతనికి సుమతియనుతనూజుండుదయించి విటగోష్ఠిపరాయణుండై పితృమాతృభార్యాపరిత్యాగంబుగావించి కాపిలదేశంబునకుంబోయి యందు సర్వజనంబుల మోహించి వారలవలన ద్రవ్యంబులు బరిగ్రహించుచుండె నొక కిరాతింగాంచి కామబాణపీడితుండై తద్గృహంబునకుంబోవ నదియు నిర్ధనుండగు సుమతిం బరిగ్రహింపక నిగ్రహించె నిట్లు కిరాతీతిరస్కృతుండయ్యును తత్సంయోగంబుగోరి చౌర్యం బొనరించి బహుద్రవ్యంబుల సంపాదించి దాని నాకిరాతింగూడి రమించుచు నొకపారపాత్రంబున దానింగూడి సురాపానం బొనర్చుచు నిట్లు బహుకాలంబు జననీజనకుల స్మరింపకనుండి యొకానొక సమయంబున కిరాతివేషధరుండై ఖడ్గహస్తుండగుచు చోరులంగూడి చౌర్యం బొనర్పం పాండ్యదేశంబునకుంబోయి యందొక విప్రు సాహసంబునం జంపి తదీయగృహంబుగల ధనంబులం గొని మరలికిరాతిగృహంబునకుం బోవుచుండ భీమంబున నీలవస్త్రధరయగు బ్రహ్మహత్య రోదసీకంపంబుగ గర్జనంబుగావింపుచు యతని ననుగమింప నతండు భీతుండై సకల దేశంబుల సంచరించి స్వగ్రామంబునకుంబోయి నిజజనకుం గాంచి హా తండ్రీ నన్ను బ్రహ్మహత్య పీడించుచున్నయది రక్షింపుము రక్షింపుమని వేడిన నతండు పుత్త్రుం గావ నుద్యుక్తుండై యుండ యాబ్రహ్మహత్య యిట్లనియె.

ఓ యజ్ఞదేవా యితండు సురాపాయియు స్వర్ణస్తేయియు బ్రాహ్మణహంతయు మాతృపితృద్రోహియు భార్యాత్యాగియు కిరాతీసంగదుష్టుండునుం గాన నిలుపనివిడుపుము నీ వట్లొనర్పక పోయిన నిన్నును నీభార్యను యీతని యీతనిభార్యను నీవంశంబునుం దహించెద నొకపుత్త్రునికై వంశనాశంబు గావింపకుమనిన యజ్ఞదేవుండు పుత్త్రస్నేహంబు నన్నుం బాధించుచున్నయది యేనేమి సేయుదునని పలుకుచుండ నాబ్రహ్మహత్య యీతండు వర్ణాశ్రమబహిష్కృతుండై మహాపాతకకారి గాన నితనియందు విశ్వాసంబునుం చకు మితనిదర్శనంబు జేయందగదనుచు యజ్ఞదేవుండు చూచుచుండ నాసుమతిని కరతలంబుచే బ్రహారింప నతండు విహ్వలుండై భూమిం బడి, ఓ తండ్రీ నన్నుం గావవేయని విన్నపింప యజ్ఞదేవుండు భార్యయుం దానును దుఃఖించుచుండ నపటికి దైవయోగంబున శంకరాంశసంభూతుం

డగు దూర్వాసుండేతెంచిన నాభూసురుండామహర్షికి వందనంబుగావించి ఓతపోధనా నీవు శంకరావతారుండవు పుణ్యంబొనర్పనివారలకు నీదర్శనంబుగల్గుట దుర్లభంబు మదీయపుత్రుండు బ్రహ్మహత్య సురాపాన స్వర్ణస్తేయంబులనొనర్చిన వాడితని బ్రహ్మహత్య బాధించుచున్నది నాకితండుదప్ప మరియొకపుత్రుండులేడు యీతండుమరణంబునొందిన మద్వంశంబుసమూలనాశనంబగు గాన దయాళుండవై యీబ్రహ్మహత్యానాశనంబై యీతండుపాపవిముక్తుండెట్లగు నట్లుప్రసాదించి రక్షింపవేయని వేడిన కొంతదడవుచింతించి దూర్వాసుండిట్లనియె. ఓవిప్రోత్తమా నీతనయుండు గావించిన పాతకత్రయంబును నుకరంబుగాదిందుకయుక్తప్రాయశ్చిత్తంబొనర్చినను శాంతిగలుగదు గాన నొకవుపాయంబు వచించెద వినుము దక్షిణసముద్రతీరంబుననుండు శ్రీరామధనుష్కోటి తీర్థంబున నీతండు స్నానంబొనర్చేని యాక్షణంబ నీపాపపరిశుద్ధుండగు పూర్వంబున దుర్వినీతుండను విప్రుండు దుస్త్రీగమనంబుగావించి యాధనుష్కోటికరిగి యందుస్నానంబొనర్చి తత్పాపంబుబాసి నిర్మలుండయ్యెనని దూర్వాసుండు యజ్ఞదేవుని కెరుంగించెనని సూతుండు శౌనకాదిమునులకుం జెప్పెను.

ఇది స్కాందపురాణంబున సేతుమాహాత్మ్యంబునందు
ధనుష్కోటి ప్రశంసయు సృగాలవానరసంవాదంబును సుమతిమహాపాతక
మోక్షోపాయకథనంబను కథలంగల
ముప్పదినాలుగవ యధ్యాయము సంపూర్ణము.

## ముప్పదియైదవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా యివ్విధంబున వచించిన దూర్వాసుంగాంచి యజ్ఞదేవుండిట్లనియె. ఓ తపోధనా దుర్వినీతుండను వాడేల గుర్వంగనాగమనంబుగావించె నతండు జనకునినామంబెయ్యది నతండెట్లు ధనుష్కోటి స్నానంబుగావించి పరిశుద్ధుండయ్యె నావిధంబంతయు నెరుంగింపుమని వేడిన దూర్వాసుం డిట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా పాండ్యదేశంబున బహుశ్రుతుండగు ఇధ్మవాహుండను నామంబుగల భూసురుండు రుచియనువనితంబరిణయంబై దానియందు దుర్వినీతుండను పుత్రుంగాంచి యాతనయు బాల్యంబున పంచత్వంబునొందెనంత నాబాలుండు పితృకృత్యంబులుగావించి పతివిహీనయగు జననింగూడి కొంతకాలంబుండ ద్వాదశాబ్దంబులు దుర్భిక్షంబయ్యె నంతనతండు బహుధాన్య సమృద్ధంబగు గోకర్ణంబునకుంబోయి యందు బహుకాలంబు జననీసమేతుండై వాసంబొనరించియుండి యొకసమయంబున పూర్వదుష్కర్మపరిపాకంబున తల్లింగాంచి అనంగబాణపీడితుండై రాగాంధీకృత మానసుండగుచు

బలాత్కారంబున రతంబొనర్చి పిమ్మట పాపపరిక్షుభిత మానసుండై దుఃఖించుచు నేసకల పాపకారుల కధికుండ కామబాణపీడితుండనై మాతృగమనంబొనర్చితినని పశ్చాత్తాపంబు నొందుచు మహామునులసమీపంబునకుంబోయి యిట్లనియె. ఓ సర్వశాస్త్రప్రవీణులారా నేగురుస్త్రీగమనంబొనర్చితిని నాపాపంబునకు ప్రాయశ్చిత్తంబు వచింపుండది మరణాంతమైన ననితరంబైనదొనర్చెద నిందుకుసందియంబులేదనిన నతనింగాంచి వారలలో గొందఱితండు మహాపాతకుండితనితో భాషించినమాత్రంబున దోషంబుగలుగునని యూరకయుండిరి గొందఱత్యంత కోపనులై ఓరీ దురాత్మా నీవతిపాపుండ విచటనుండకు మెచటికైనం బొమ్మనివచించి రంత కరుణానిధియగు కృష్ణద్వైపాయనుండు వారలవారించి దుర్వినీతుం గాంచి యిట్లనియె.

ఓయీ నీవీజననింగూడి రామకృతంబగు ధనుష్కోటికరిగి మాఘమాసంబున సూర్యుండు మకరగతుండై యుండ నిరంతరంబును క్రోధవర్జితుండవు జితేంద్రియుండవు నిరాహారుండగుచు మాసమాత్రంబు స్నానంబొనర్పుము దాన గురుస్త్రీగమన దోషరహితుండవై పూరుండగుదువు లోకంబున శ్రుతిస్మృతిపురాణాదులయందు ధనుష్కోటివైభవం బనేకవిధంబులజెప్పియున్నది యందుస్నానంబొనర్చినం బోనిపాపంబులేదు మహాపాతకకోటులైన నాతీర్థంబున స్నానంబొనర్చినవానికి లక్ష్యంబులుగావు మన్వాదిస్మృతులయందు ప్రాయశ్చిత్తాంతరంబు జెప్పంబడియెను తద్వాక్యంబు వేదసమానంబుగనెంచి త్వరితంబుగ జననీసమేతుండవై యచ్చటికింబోయి యందుస్నానంబొనర్పుమని వ్యాసుండుపదేశింప దుర్వినీతుండాక్షణంబ ధనుష్కోటికరిగి వ్యాసోక్తప్రకారంబున ధనుష్కోటి స్నానంబొనర్చుచు జితేంద్రియుండును నిరాహారుండగుచు జననియుం దానును మాసంబువసించి మాసాంతంబున పారణంబొనర్చి కృష్ణద్వైపాయను సమీపంబునకుంబోయి నమస్కరించి యిట్లనియె. ఓ తపోధనా, నే మీరలువచించినప్రకారంబున ధనుష్కోటియందు మహేశ్వరవందనంబు గావింపుచు మాసంబు స్నానంబొనర్చితి నింకిటజేయందగిన కార్యంబెద్ది దయాళుండవైవచింపుమనిన నారాయణాంశజుండగు వ్యాసుండిట్లనియె. ఓ దుర్వినీతా మాతృసంగమ జన్యంబగు దోషంబు ధనుష్కోటిప్రభావంబున నశించె నీవును బరిశుద్ధుండవైతివి సమస్తజనంబులు నిన్నుం బరిగ్రహింతురు నిందుకు సందియంబులేదు నీవింక దారసంగ్రహంబు నొనర్చి గార్హస్థ్య ధర్మంబునొంది భక్తియుక్తమానసుండవై సజ్జనులసేవించుచు సంధ్యోపాసనాది నిత్యకర్మంబులు గావింపుచు నిర్జితేంద్రియుండవగుచు హరహరులం బూజించుచు పరులకు తాపంబొనర్పక పరాభ్యుదయంబునకు చింతింపక పరదారలమాతృసమానులుగానెంచుచు సకల వేదశాస్త్రంబుల నభ్యసించి యొకానొకప్పుడైన విస్మరణంబు నొందక యుండుము మఱియు నతిథుల నవమానింపకుము పితృదినంబుల శ్రాద్ధంబొనర్పుము యెల్లప్పుడు నితరవైగుణ్యంబు నెంచకుము జాబాలోపనిషదుక్త ప్రకారంబున త్రి

పుండ్రోర్ధ్వపుండ్ర ధారణంబొనర్చి హరిహరప్రియంబుగ తులసీమణిమాలారుద్రాక్షల ధరియించుచు తులసీ బిల్వపత్రాదులచే యేకకాలంబైన ద్వికాలంబైనవారలం బూజింపుచు తత్పాదోదకసిక్తంబును తులసీదళ మిశ్రితంబగునై వేద్యాన్నంబుభుజింపుచు వైశ్వదేవాఖ్యబలింగావించి యతులకు బ్రహ్మనిష్ఠుల కన్నంబొసంగుచు మరియు నర్భకులను వృద్ధులను రోగులను బ్రహ్మచారులను నిత్యంబు పూజింపుచు మాతృపితృపూజనంబుగావింపుచు ప్రణవసమన్వితంబులు పంచాక్షరాష్టాక్షర ద్వాదశాక్షరాత్మకంబులగు మంత్రంబుల ప్రియతుండై జపింపుచు తత్తన్మంత్రాధిదైవతంబుల ధ్యానించుచు మరియు విద్యుక్త సకలధర్మంబులగావింపుచుండుము పిమ్మట దేహాంతంబునముక్తింబొందెదవని వ్యాసుండుపలికిన దుర్వినీతుండవ్విధంబున సకల ధర్మంబులొనర్చుచు దేహాంతంబున ముక్తింబొందె నతని జననియు కాలధర్మంబునొంది ధనుష్కోటిస్నాన ప్రభావంబున అపునర్భవదాయియగు ముక్తింబొందెనని దూర్వాసుండువచించి, ఓ యజ్ఞదేవా నీవీపుత్రుం గొని బ్రహ్మహత్యావిశుద్ధింగోరి ధనుష్కోటికరిగియందు స్నానంబొనర్పుమనిన యాభూసురుం డాక్షణంబ ధనుష్కోటికరిగి యందు షాణ్మాసంబులు పుత్రసహితుండై స్నానం బొనర్ప నశరీరవాణి యతనితో నిట్లనియె.

ఓ యజ్ఞదేవా నీసుతుండొనర్చిన బ్రహ్మహత్యాదిపాపంబులెల్ల ధనుష్కోటి స్నానవైభవంబున నశించె నిందుకుసంశయింపకుమని యూరకయుండె నావాక్యంబువిని యజ్ఞదేవుండు ప్రీతుండై పుత్రసహితుండై రామనాథుసేవించి ధనుష్కోటికివందనం బొనర్చి స్వగ్రామంబునకుంబోయి సదాచారుండై సుఖంబుండెగాననోజంబుకా వానరంబులారా నుమతిపాపమోచనంబెరుంగించితి మీరలునాతెరంగున ధనుష్కోటికరిగి స్నానంబొనర్చి పరిశుద్ధులగురదిగాక యితరప్రాయశ్చిత్తంబు లెన్నియొనర్చిన మీపాపశుద్ధిగానేరదని సింధుద్వీపుండెరుంగించిన యాక్షణంబ సృగాలవానరంబులచటికింపోయి యందుస్నానంబొనర్చి తజ్జలపానంబునుంగావించి యాక్షణంబ పాపవిముక్తులును దివ్యవిమానారూఢులును కుసుమవర్ష కీర్యమాణులును హారకేయూరమకుటకటకాదశోభితులును దేవబృందవీజ్యమానచామరవిరాజితులగుచు దేవనగరంబునకుంబోయి మహేంద్రార్ధాసనంబున నధివసించియుండిరి. ఓ మునీంద్రులారా ధనుష్కోటి మహాత్మ్యంబున సృగాలవానరంబులకు పాపమోక్షణంబుగల్గిన తెరంగెరుంగించితి యెవ్వండైన నీయధ్యాయము భక్తియుక్తుండై పఠించు విను నతండు ధనుష్కోటిస్నానఫలంబునొంది పిమ్మట యోగిబృందదుర్లభంబగు మోక్షంబునొందునని శౌనకాదిమునీంద్రుల్కు సూతుండెరింగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు
ధనుష్కోటి ప్రశంసంబగు సృగాలవానరమోక్షణంబను కథలంగల
ముప్పదినైదవ యధ్యాయము సంపూర్ణము.



# ముప్పదియాఱవ అధ్యాయము.

పూజనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా ధనుష్కోటిమాహాత్మ్యము నెఱుంగించెద వినుండు పూర్వంబున దురాచారుండను విప్రుండు దుస్సంయోగంబువలన బ్రాహ్మణ్యహీనుండై భేతాళగ్రస్తుండగుచు ధనుష్కోటియందుస్నానంబొనర్చి పాపవిముక్తుండయ్యెననిన మునీంద్రులిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా దురాచారుండేపాపం బొనర్చి పిమ్మట ధనుష్కోటికరిగియెట్లువిముక్తుండయ్యె నావృత్తాంతంబంతయు నెఱుంగింపుమనిన నతండిట్లనియె. ఓవిప్రోత్తములారా గౌతమనదీతీరంబున దురాచారుండను విప్రుండువాసంబుచేయుచు బ్రహ్మఘ్నసురాపస్వర్ణస్తేయగురుతల్పగాది పాపకారులంగూడి చరించుచుండ నాబ్రాహ్మణునకు దుస్సంసర్గదోషంబువలన బ్రాహ్మణ్యంబునశించె యెవ్వండైనను పాపకారులంగూడి యొకవత్సరంబునందుచరించిన నతని బ్రాహ్మణ్యచతుర్థాంశంబు నశించు దినద్వయంబున ద్వితీయాంశంబునశించుదినత్రయంబైన తృతీయభాగంబునశించుదినచతుష్కంబైన సకలంబు నశించు పిమ్మట వారలంగూడిశయనాసన భోజనాదులంగావించిన తత్తుల్యపాతకుండగు నిందుకుసందియంబులేదుగాన నాదురాచారుండిట్లు బ్రాహ్మణ్యహీనుండై పాపబాహుళ్యంబువలన భేతాళగ్రస్తుండై తనశరీరంబు దానెఱుంగక సకలదేశంబులవనంబుల సంచరించుచు పూర్వపుణ్యపరిపాకంబున దైవయోగంబుచే రామధనుష్కోటికరిగియందు భేతాళప్రవేశితుండై మునింగిలేచి యాక్షణంబ భేతాళవిముక్తుండై స్వస్థచిత్తుండును పాప పరిశుద్ధుండగుచునే గౌతమీతీరవాసుండ నిదిజలధితీరంబిచటికేలయరుదెంచితినని మనంబునందలంచుచు యాసమీపవర్తియు మహాయోగిప్రవరుండగు దత్తాత్రేయుండను మునీంద్రుంగాంచి నమస్కరించి యిట్లనియె. ఓ మహాత్మా నేదురాచారుండను నామంబుగలవాడ గౌతమీతీరనిలయుండ నిచటికెట్లరుదెంచితి కృపాళుండవై యెఱుంగింపుమనివేడిన నతండు ముహూర్తమాత్రంబుచింతించి యిట్లనియె.

ఓయీ నీవు మహాపాతకి సంయోగంబుజేసిన కారణంబున బ్రాహ్మణ్య రహితుండవైతివి నిన్నుభేతాళుండు వాంచెంగానవివశుండవు మూఢచిత్తుండవై చరించెదవిపుడా భేతాళుండు నిన్నుధనుష్కోటియందనేకవారంబులు ముంచెంగాన పాపపంజర విముక్తుండవైతివి మహాపాతకి సంసర్గదోషంబునశించె నిన్ను బాధించిన భేతాళుండు పూర్వంబు నశోకవిప్రుండతండు భాద్రపదమాసకృష్ణపక్షంబున పితృసంగంబుగూర్చి పార్వణవిధానంబున శ్రాద్ధంబొనర్పని కారణంబున పితృశప్తుండై భేతాళత్వంబునొందె నతండును ధనుష్కోట్యవలోకనమాత్రంబున భేతాళరూపంబువిడచి విష్ణులోకంబు నొందెగాన సర్వమానవులును ధనుష్కోటియందు సకల పాపవిలయంబుగోరి స్నానంబుగావింపవలయు నో.

నరులైన భాద్రపదకృష్ణపక్షంబున పిత్రులంగూర్చి
మరు వారలు ప్రేతాళరూపంబు నొందు శంబున ద్రోయంబడు. ఏ మనుజుండైన ఆశ్వి
నకృష్ణపక్షంబున పిత్రుసమూహ నతనికి రతినాయకుండు ప్రీతుండై ఆ జన్మమరణాం
ణులం బూజించియన్నం వ భోగంబులగలుగంజేయు పిత్రుదేవతులును సహస్రకల్పసహ
సుగుణంబుగన్న శ తుల్యాభివృద్ధింగావింతు రట్లానర్పని మానపునకు కందర్పుండు భి
నరకంబు కామినీభోగాదిసౌఖ్యంబులు తొలంగించు పిమ్మట నతండంగారశయ్యాభ్రమణ
బున ద్రోయంబడు యేమానవుండైన నాచతుర్దశియందు మహాలయ శ్రాద్ధంబుగావిం
చునతండీశ్వరప్రసాదంబున అభీష్టములనెల్ల నొంది సదాశివజ్ఞానంబుచే వెలయుచు సురా
పానాయుతంబును స్వర్ణస్తేయాయుతంబును చండాలవృషలీసంగదోషంబును నాశనంబు
గావించి అశ్వమేధసహస్రఫలంబును పౌండరీకాయుతఫలంబునొంది దేహాంతంబున యీ
శ్వరసాయుజ్యంబునొందు పిత్రులును లక్షకోటిశతకల్పంబులు లక్షకోటిసహస్రకల్పంబులా
మోదంబునొంది యస్వయాభివృద్ధిం జేయుచుందు రట్లుగావింపని మానవుండు కనకా
పహరణంబు సేయకపోయినను సురాపానంబుజేయకయును స్వర్ణస్తేయ సురాపానదోషం
బులంబొందునతండు విధివిధానంబున యజ్ఞంబులొనర్చినను నిష్ఫలంబులగు మరియు నతం
డు శరీరాంతంబునందు సంసారాంధమహాకూపనరకంబునంబడి కోటిసహస్రకల్పంబులు కో
టిశతకల్పంబులు సకల బాధలంబొందు మరియు నాయమావాస్యయందేమానవుండైన మ
హాలయశ్రాద్ధంబుగావించిన వానిపిత్రుగణంబులెల్ల సుధాపానసమంబుగ అనంతకాలంబు
ప్రీతింబొందుచు బ్రహ్మలోకనివాసంబునొంది సంతానవృద్ధిగలుగజేయుచుందురు మరియునా
మహాదేవుండును రమానాయకుండును ప్రీతులగుచు సకలైశ్వర్యంబుల నొసంగుదురు బ్ర
హ్మహత్యాది దోషంబులెల్ల నాశంబునొందుసనాతన సకలధర్మఫలంబులుగల్గు నతండు దే
హాంతంబున బ్రహ్మైక్యజ్ఞానంబుచే సాయుజ్యంబు నొందునట్లుగావింపనివాని వంశంబు
నశించు పితరులును బ్రహ్మలోకంబునొందినవారలైనను దుర్గతింబొందుదురు భాద్రపదమా
సంబే తెంచిన పిత్రుదేవతలు మత్పుత్రులు ద్విజోత్తములకన్నంబిడుదురు దానదారుణంబ
గు నరకక్లేశంబు తొలంగు నావంశతారకంబుగా స్వర్గనివాసంబుగలుగునని సమ్మోదం
బుచే నర్తనంబు గావింపుచుందురు జనులు పిత్రుప్రీతికరంబగు భాద్రపదంబే తెంచిన ప్ర
త్యహంబు భక్తియుతుండై యొక విప్రునకన్నంబిడిన నతని పిత్రుమాతృకుల సంభూతులగు
వారలు తృప్తింబొందుదురే మనుజుండైన భాద్రపదకృష్ణపక్షంబున బ్రాహ్మణోత్తములకర్ఘ్యం
గంబుగావించి ఘృతసూపాదిసమేతంబగు నన్నంబొసంగు నాతని పిత్రుగణంబులుకల్పకా
లంబు సుధాపానంబుగావింతురు మనుజుండా కృష్ణపక్షసప్తమి మొద లమావాస్యపర్యంతం
బు ప్రత్యహంబును వేదవిదులగు మున్నూర్వురబ్రాహ్మణుల యథార్థంబుగ విత్తలోభంగావింపక
బూజించి భక్ష్యభోజ్యాదులచే తృప్తింబొందింపవలయునట్లు గావించుట శక్తుండయ్యేనే
నిద్వాదశ మొదలు కొనయైన మున్నూర్వురబ్రాహ్మణుల కన్నంబిడవలయునట్లు గా
వించిన బ్రహ్మవిష్ణుమహేశ్వరులు పిత్రుదేవతలు తృప్తింబొందుదురు.

ముప్పది యారవ అధ్యాయము.

బహుభాషణంబులేల భాద్రపదకృష్ణ ౧౦౯

త్రయంబునతృప్తిబొందు నిందుకుసందియంబులేదు సంతానవిచ్ఛేదంబుగావించుచుండు మరియు డెల విత్తలోభంబుగావింపందగదు యజ్ఞంబులకెల్ల దివ్యులైనరుంద్రైన నాకు ప్రతిదినంబునను కంబుగ నాశ్రాద్ధంబుగావించిన పూర్వకాయుహీనుండగు జిహ్వాద్యాదులనొసంగు పితృలును నోపు తెరంగున ఫలంబొసంగ నేరదు లోకంబునపతిహీనులును పుత్రకల నిడుదురతండెల్ల లా శ్రాద్ధంబు భర్తృణ ప్రీతికరంబుగ జేయవలయునట్లు గావింపని వారలకెల్ల సరోగాదుల లోకంబున మహాలయశ్రాద్ధంబుగావించు వారలకెల్ల సంతాననాశనంబుగల్గనేర దైశ్వర్యంబులుంగల్గు నాశ్రాద్ధంబు కల్యాణంబులకెల్ల నాస్పదంబగుటంజేసి మహాలయరేరం పేరం బ్రసిద్ధినొందెంగాన మర్త్యుండు కల్యాణంబుగోరి యాశ్రాద్ధంబుగావింప వలయున ట్లుగావింపనివారలు సంపద్విహీనులగుదురు యేజనుండు మాతాపితురుల మృతదినంబున శ్రాద్ధంబుగావింపక పోవునాతండైన భక్తియుక్తుండై మహాలయంబుగావించిన తద్దోషంబు వలసంబాయు లోకంబున మహాలయంబుగావింపవలయు శక్తిహీనుండగువాడు శిష్టులగు బ్రాహ్మణజనంబుల యర్థించి ధనధాన్యాదులగ్రహింపవలయు వారొసంగక పోయిన క్షత్రియజనంబులను వారలును నొసంగనిరవైశ్యజనంబును యాచించి యాశ్రాద్ధంబుజే యవలయు వారలందరు నొసంగకపోయిన పితృప్రీతిగోరి గోగ్రాసంబిడి యరణ్యంబునకు బోయి స్వకీయోదరంబును పాణులచేపీడించుచు అశ్రుసంసిక్తలోచనుండగుచు ఓపితు రులారా నేదరిద్రుండ కృపణుండ నిర్లజ్జుండ క్రూరకర్మకరుండ ప్రీతికరంబగు భాద్రపదం బేతెంచెనే మహాలయశ్రాద్ధంబుజేయ శక్తిహీనుండనై లోకంబునంతట సంచరించితి స్వ ల్పధనంబైన ప్రాప్తంబుగాకపోయెగాన మహాలయశ్రాద్ధంబుగావింప శక్తుండంగానే నేమి సేయుదు మీరలుదయాపరులై క్షమింపవలయునని రోదనంబుగావించిన నతని పితృలెల్ల సుఖాహ్వానంబుజేసిన నిర్ఝరులచందంబున తృప్తులగుదురు లోకంబున మహాలయార్థంబు విప్రజనంబులకన్నంబెట్టి పితృగణంబెల్లు తృప్తినొందుదురట్లుగో గ్రాసారణ్యరుదితంబుల తృప్తింబొందుదురు.

మరియును భాద్రపదంబున మహాలయంబుగావింప సూతకాదులచే విఘ్నంబుగల్గె నేని పిమ్మట నాశ్రాద్ధంబు వృశ్చికాంతంబులోపల గావింపవలయు బుధుండు పితృర్థంబైయొ కవిప్రుని పితామహార్థంబైయొకనిని ప్రపితామహార్థంబైయొకనిని మాతామహార్థంబైయొక ని మాతుఃపితామహార్థంబైయొకని మాతుఃప్రపితామహార్థంబైయొకని వైశ్వదేవార్థంబై ని ర్వర విష్ణ్వర్థంబయి యొకని నిట్లు వేదవిత్తములగువిప్రుల మహాలయార్థంబయి యావర ణంబొనర్పవలయు అట్లు వొనర్పకపోయినను పితృవర్గంబుగూర్చియొకనిని మాతామహ వర్గంబుగూర్చియొకనిని విశ్వేదేవార్థంబయి యొకనిని విష్ణ్వర్థంబయియొకని నిట్లునన ల్పాగనైన వరణంబుజేయవలయు వేదసంపన్నులగు విప్రులవరణంబుజేయవలయుగాని దు

శ్చరితులగువారల వరింపదగు నట్లుగావింపఁ శ్రాద్ధంబులఫలంబగు భాద్రపద కృష్ణపక్షంబున నెవ్వండైన భక్తియుతుండై మహాలయ శ్రాద్ధంబుగావించునతండు సకలతీర్థసేవాఫలంబును సకలయజ్ఞఫలంబును తులాపురుషాది దానఫలంబును చాంద్రాయణాదివ్రతఫలంబును సాంగంబులగువేదంబులు పారాయణంబుజేసినఫలంబును గాయత్ర్యాదిమహామంత్రజపఫలంబును సేతిహాసపురాణపారాయణఫలంబునుంబొందు మహాలయశ్రాద్ధంబునకుసమంబగు వ్రతంబెద్దియును లేదది బ్రహ్మవిష్ణుమహేశలోకప్రాప్తికారణంబును సకలేప్సితప్రదంబునై యొప్పుచుండు మహాలయశ్రాద్ధంబుగావించిన భూతభేతాళాదులు అపస్మారపిశాచాదులన్నియు నశించు సకలసంపదగల్గు నదియొనర్పకపోయిన మహత్తరంబగు ప్రత్యవాయంబగు నిందుకు సంశయంబులేదు పూర్వకాలంబున సూర్యవంశసంభవుండగు దశరథుండు వసిష్ఠోపదేశంబువలన భాద్రపదమాసంబున మహాలయశ్రాద్ధంబుగావించి లోకవిశ్రుతులయి వెలయు రామాదులగు నల్వురపుత్రులంగాంచి యతిశయైశ్వర్యంబును శాశ్వతకీర్తియునుం బొందె పూర్వంబున రాజసత్తముండగు యయాతినరేంద్రుండు మహాలయశ్రాద్ధంబుగావించి వంశవర్ధనులగు యదుప్రభృతిపుత్రులంగాంచి యనన్యదుర్లభంబగు స్వర్గంబునొందె నట్లు దుష్యంతుండును గావించి భరతుండను సుపుత్రుంబడసె దమయంతి మనఃప్రియుండగు నలావనీవిభుండట్ల మహాలయంబుగావించి సకలకష్టంబులుబాసి ఘోరంబగుకలిని నిగ్రహించి స్వకీయంబగు రాజ్యంబునొంది యింద్రసేనాభిధుండగుపుత్రుంగాంచె సత్యసంధుండగు హరిశ్చంద్రుండును మహాలయంబుగావించి విశ్వామిత్రకృతంబులగు దుఃఖంబులనెల్ల నిరాకరించి భార్యాపుత్రసమేతుండయి సకల సౌఖ్యంబులంబొందె మరియును మహాబలశాలియగు కార్తవీర్యార్జునుండును మహాలయశ్రాద్ధంబుగావించి యష్టాదశద్వీపాధిపత్యంబునొందె. మరియును శ్రీరామచంద్రుండు దండకారణ్యంబున మహాలయశ్రాద్ధంబుగావించి లోకకంటకుండగు రావణుంబరిమార్చి సీతాదేవింబొందె.

మరియును ధర్మనందనుండును మహాలయశ్రాద్ధంబుగావించి దుఃఖసాగరంబు నిరసించి ధార్తరాష్ట్రాది శత్రుజయంబునొందె మరియును వసిష్ఠుండును అత్రియు భృగువు గౌతముండును కుత్సుండును ఆంగీరసుండును కాశ్యపుండును భరద్వాజుండును విశ్వామిత్రుండును కుంభజుండును పరాశరుండును మృకండువు మొదలగు ఋషిప్రవరులందరు మహాలయశ్రాద్ధంబులు విధివత్ప్రకారంబుగనొనర్చి అణిమాద్యష్టసిద్ధులుబొంది జీవన్ముక్తులై వెలసిరిగాన భూతింగోరువారు మహాలయంబుగావింప వలయు నట్లుగావింపని వారలు భేతాళత్వంబు నొందుదురు. ఓ దురాచారుండ నీవు పూర్వంబున మహాలయంబుగావింపనికతంబున భేతాళగ్రస్తుండవై శరీరంబెరుంగక సంచరించెదవు. ఈ భేతాళుండును పూర్వంబున భరద్వాజమునిసత్తమపుత్రుండగు వేదనిధియను విప్రుండు యితండు కుశస్థలియను గ్రామంబున నివాసంబుగావింపుచుండి శాస్త్రోక్తక్రమంబున మహాలయంబుగావింపక

పోయెంగాన నీభేతాళరూపంబునొందె, నీవింక భాద్రపదమాసంబున వేదవిదులగు బ్రాహ్మణులం బూజించి మహాలయంబు గావింపుము దానదారిద్ర్యంబులు దొలంగి సుఖంబునొందెదవు మహాపాతకిసంసర్గంబు గావింపకుము భేతాళగ్రహణంబువలనం గలిగిన దుఃఖంబు ధనుష్కోటిస్నానమహాత్మ్యంబున నాశనంబునొందె స్వదేశంబునకుం బోయి సుఖంబునొందియుండుమని దత్తాత్రేయుం డనుడివిన దురాచారుండా మహామునికి వందనంబొనర్చి కృతార్థుండై స్వగృహంబునకుం బోయి విముక్తభేతాళభయుండును సంత్యక్తమహాపాతకిసంసర్గదోషుండును స్వాశ్రమాచారనిరతుండును సంప్రీతమానసుండునునై వెలయుచు రామచంద్రధనుష్కోటితీర్థమజ్జనగౌరవంబుచే దేహాంతంబున ముక్తింబొందె.

ఓ మునీంద్రులారా దురాచార పాపవిమోచనకరంబై పుణ్యంబగు వృత్తాంతం బెరుంగించితి యెవ్వండైన ప్రాయశ్చిత్తంబులు లేని పాపంబులం గావించినను ధనుష్కోటికరిగి స్నానంబు జేసిన బరిశుద్ధుండగు లోకంబున శూద్రుండు శివలింగంబును విష్ణుప్రతిష్ఠయు జేయందగదని మన్వాదిస్మృతికర్తలచే వచింపంబడె దానిం గావించిన పాపంబునకు నిష్కృతి కలుగదు. అదియును ధనుష్కోటిస్నానంబున నశించు మరియును బ్రాహ్మణజనంబుల నిందించుటయు శూద్రాన్నంబు భుజించుటయు శ్రుతుల నిందించుటయు కన్యావిక్రమంబు జేయుటయు హయవిక్రమంబుల గావించుటయు వేదదేవ విక్రయంబులు గావించుటయు విశ్వాసఘాతకంబు జేయుటయు భాతృభార్యాసమాగమనంబును ధర్మవ్రతంబుల విక్రయించుటయు తీర్థంబుల విక్రయించుటయు మాతృపితృద్రోహంబు గావించుటయు యతుల గురుల నిందించుటయు శివసత్కథానింద జేయుటయు నివి మొదలగు పాతకంబుల కెల్లప్పుడును నిష్కృతి గలుగనేరదా పాతకంబు నొనర్చినవారలైనను ధనుష్కోటితీర్థంబునకుం బోయి స్నానంబు గావించిన సకలపాపంబులం బాసి పరిశుద్ధులై యుందురని సూతుండు శౌనకాది మునీంద్రుల కెరుంగించె.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు
ధనుష్కోటి ప్రశంసయు దురాచారసంసర్గదోషశాంతియను కథలంగల
ముప్పదియాఱవ యధ్యాయము సంపూర్ణము.

## ముప్పదియేడవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకలపురాణవ్యాఖ్యానవైఖరీ సమేతుండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా రామసేతువునంగల తీర్థంబులలో ముఖ్యంబులై వెలయు చక్రతీర్థాదులగు నిరువదినాలుగుతీర్థంబుల నెరంగెరుంగించితి నిక మీద

నేదివినంగోరెద మెరుంగింపుండనిన శౌనకాదులిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా చక్రతీర్థసమీపంబుననుండు క్షీరకుండతీర్థంబునకా నామధేయంబెట్లుగల్గె తద్వైభవంబేలాగు సవిస్తరంబుగా నెరుంగింపుమని వేడిన సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా దేవీపురపశ్చిమంబున ఫుల్లగ్రామంబుననొక ప్రదేశంబుగలదచటనుండి శ్రీరఘునాయకుండు లవణార్ణవంబున సేతుబంధనంబుగావించె తత్తీరంబున దర్శనస్పర్శనకీర్తన ధ్యానంబులొనర్చిన మాత్రంబున సకలపాపనాశనకరంబై వెలయు క్షీరకుండంబను నొకతీర్థంబుగలదా తీర్థప్రభావంబెరుంగించెద శ్రద్ధాయుతులరై వినుండు పూర్వంబున వేదోక్తాచార సంపన్నుండగు ముద్గలుండను మునీంద్రుండు దక్షిణసముద్రోపాంత స్థితంబగు ఫుల్లగ్రామ సమీపంబున నారాయణప్రీతికరంబుగ యజ్ఞంబుగావింపుచుండ రమానాథుండు ప్రీతుండై యావిర్భవించిన ముద్గలుండు లక్ష్మీవిరాజితోరస్కుండును కాలమేఘసమప్రభుండును పీతాంబరవిరాజితుండును కౌస్తుభాలంకృతుండును శంఖచక్రగదాపద్మవిరాజిత చతుర్భుజుండును వినతానందరోహుండగు పుండరీకాక్షుంగాంచి భక్తిపరవశుండై పులకాంకితవిగ్రహుండగుచునిట్లనిస్తుతించె. ఓ రమానాయకా నీవు సకలజగన్నిర్మాతవు తత్పాలకుండవు తత్సంహర్తవు మత్స్యరూపివి కమఠావతారుండవు వరాహ నారసింహ వామన జామదగ్న్య రాఘవ బలభద్ర కల్క్యాది రూపధారివి విజ్ఞానస్వరూపుండవు నిన్నుంగొనియాడనాదరంబే నిలజ్జుండ కృపణుండ క్రూరుండ పిశునుండ దాంభికుండ పరదార పరద్రవ్య పరక్షేత్రలోలుపుండ నన్నుంగరుణాదృష్టినవలోకించి రక్షింపుమని వేడిన నారాయణుండు ప్రీతుండై మేఘగంభీర రవంబుగా నిట్లనియె.

ఓ మునీంద్రా నీయజ్ఞంబున ప్రత్యక్షరూపంబున హవిర్భోజనంబు గావింపనేతెంచితిననిన ముద్గలుండు సంతోషంబునొందియిట్లనియె. ఓ రమానాయకా నేధన్యుండనైతి మత్పత్నియుసుతులును కృతార్థులైరి నాజన్మంబును తపంబును వంశంబును ఆశ్రమంబును సాఫల్యంబునొందె యోగీంద్రులు మనంబున నిరంతరంబును దలంచుచుండు నీవు సాక్షాత్కారంబునొందితివి మదీయ క్రతురాజంబు సఫలంబయ్యెననుచు ఆవాహనాసనాది షోడశోపచారంబులంబూజించిన హరియునా ప్రీతుండై హవిస్సును భుజించె తృప్తింబొందె నంతనగ్నియు సకలామరసంఘంబులు చరాచరాత్మకంబులగు జగంబులన్నియు తృప్తింబొందె నాసమయంబున లక్ష్మీకాంతుండు ముద్గలుంగాంచి ప్రీతుండై వరంబువేడుమనిన నతండిట్లనియె. ఓ రఘునాయకా నీవు ప్రత్యక్షంబునొంది భుజించుటవలనం గృతార్థుండనైతి నింకవరంబొండెద్దిగలదైనను నీయందు నిశ్చలంబును నిష్కపటంబగు భక్తిం బ్రసాదింపుము మరియును ప్రతిదినంబును ప్రాతస్సాయంకాలంబుల పయోహోమంబు గావించుట శ్రుతిచోదితంబుగాన నేత్వత్ప్రీతింగోరి సురభిక్షీరంబున నిత్యంబు హోమంబుగావింపంగోరెద నేనిర్ధనుండ నాకెట్లు సురభిక్షీరంబుగల్గు నట్లు ప్రసాదింపుమని వేడిన

నారాయణుండు అమృతాశనుండగు విశ్వకర్మ నారావించి స్ఫటికశిలాభేదంబుల నొకసరోవరంబు నిర్మింపుమని యాజ్ఞాపింప నతండట్లొనర్ప సురభి రావించి యితండు మర్త్యుండు మత్ప్రీతింగోరి నిరంతరంబు పయోహోమం బొనర్పం గోరెడుం గాన నీవీ సరోవరంబును సాయంప్రాతఃకాలంబుల సరుదెంచి పయఃపూరంబుల పూరింపుమితండు దాన హోమంబు గావించుచుండు ననిన సురభియు నంగీకరించె నంతమాధవుండు ముద్గలుం గాంచి యిట్లనియె.

ఓ తపోధనా నీవీసరోవరస్థితంబగు సురభిక్షీరంబుచే నిత్యంబును సాయంప్రాతఃకాలంబుల మత్ప్రీతింగోరి హోమంబు గావింపుము దాన నేతుష్టింబొందెద నీతీర్థంబు క్షీరకుండంబని లోకంబున ఖ్యాతింబొందు నీతోయంబున స్నానంబు గావించిన వారలు పంచమహాపాతకంబులవలన నుపపాతకంబులవలన నువాసి పరిశుద్ధులగుదురు నీవును దేహాంతంబున ముక్తబంధనుండవై నన్నుం బొందెదవని యానతిచ్చి తిరోహితుండయ్యె నంతనా మునీంద్రుండును నారాయణుంగూర్చి ప్రియతుండై యనేకశతసంవత్సరంబులు సురభిక్షీరంబున హోమంబు గావించుచు దేహాంతంబున విష్ణుసాయుజ్యంబు నొందె వో మునీంద్రులారా క్షీరకుండతీర్థంబున కానామంబు గల్గిన తెఱంగెఱుంగించితి పూర్వకాలంబున కాశ్యపుని భార్యయగు కద్రువు కపటంబు జేసి సపత్నియగు వినతం బరాజితం గావించి దోషంబు నొంది పిమ్మట భర్తృవాక్యచోదితయై యాతీర్థంబున స్నానంబొనర్చి పరిశుద్ధురాలయ్యె నెవ్వరైనను పరిశుద్ధమానసులగుచు నందు స్నానంబు జేయుదురో వారలకు వేదశాస్త్రంబులు యోగజపతపోనియమంబులు తీర్థంబుని షేవణంబులేల. నా తీర్థబిందు సంయుక్తంబగు గాలిసోకినను బ్రహ్మలోకప్రాప్తింబొందుదురు మరియు నాతీర్థోత్తమంబున స్నానంబు జేసినవారలు సూర్యాగ్ని సమానతేజులై వెలయుదురు యెన్నడును వైతరిణ్యాదినరకంబులం బొందరు యేనరుండైన కామధేనుసమంబగు నాతీర్థంబు గల్గియుండియు నితరతీర్థంబుల సేవింపం బోవుట గోక్షీరంబు సిద్ధంబై యుండ యర్కక్షీరంబు గోరుటకు సమానంబగు నేభుజాస్ఫాలనంబు గావించి వచించెద వినుండా తీర్థంబునందు స్నానంబు గావించిన వారల కలభ్యంబేదియును లేదు ముక్తియుం గరస్థంబై యుండు సత్యంబు సత్యంబు యేనరుండైన నీయధ్యాయంబు పఠించు విను నతండు క్షీరకుండ తీర్థస్నాన ఫలంబు నొందు నిశ్చయంబని శౌనకాదిమునీంద్రులకు సూతుండెఱుంగించె.

ఇది స్కాందపురాణంబునందు సేతుమాహాత్మ్యంబున
క్షీరకుండ స్వరూపకథనంబను కథంగల
ముప్పదియేడవ యధ్యాయము సంపూర్ణము.



## ముప్పదియేనిమిదవ అధ్యాయము.



మహానీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులు సకలపురాణార్థ విశారదుండగు సూతున కిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా కద్రూవినత లెవరితనూజలు కద్రూవేల ఛలంబున సపత్నిబరిభవించె పిమ్మట క్షీరకుండ తీర్థంబునస్నానంబుజేసి యెట్లు ఆదోషంబువలన విముక్తయయ్యె నాతెరంగంతయు సవిస్తరంబుగా నెరుంగింపుమనిన సూతుం డిట్లనియె. ఓ మునీంద్రులారా పూర్వంబున ప్రాజాతిపుత్రికలగు కద్రూవినతలు కశ్యపుంబరిణయంబై తత్ప్రసాదంబునొంది యుండిరందు కద్రువు శేషవాసుక్యాద్యనేక పన్నగంబులంబడసె వినత అరుణగరుడులను పుత్రులనిర్వురంగాంచె యిట్లుండ కద్రు ఒకసమయంబున నంతికంబున సంచరించు నుచ్చైశ్శ్రవుంగాంచి కపటంబుజేయందలంచి వినతంబిలిచి ఓవినతా యీ యశ్వంబు నీలవాలంబై ప్రకాశించెడు జూడుమాయనిన నాబిడ ఓకద్రూ యీయశ్వరాజంబు శ్వేతవాలంబై యుండ నీలవాలంబని యేలపచించెదవనియె నిట్లాయిర్వురు వివాదంబుజేసి పరాజయంబునొందినవారలు దాసీభావంబునొందునట్లు పణంబుగావించిరంత కద్రువు నిజతనూజులగు సర్పరాజంబులకడకుంబోయి ఓ పుత్రులారా నేదాసింగాకసుండునట్లు శ్వేతంబగు నుచ్చైశ్శ్రవువాలంబు నీలంబుగాజేయుండన వారలంగీకరింపయుండ కద్రువురోషమూర్ఛితయై జనమేజయుండు సేయు సర్పయాగంబున నాశనంబునొందుండని పుత్రులకుశాపంబొసంగ వారలలో కర్కోటకుండనువాడు దీనుండై జననిపాదంబులపయింబడి ఓతల్లీ నేను నుచ్చైశ్శ్రవువాలంబు నీలంబుగాజేసెద భీతిబొందకుమని యాక్షణంబ స్వభోగంబుచే నుచ్చైశ్శ్రవువాలం బంజనప్రభంబుగాజేసెనంత కద్రూవినతలు యుగాంతకాలంబున యోగనిద్రావిరాజితుండగు ఆదినారాయణునకుశయనంబును శశాంకశంఖమాణిక్యముక్తైరావణకారణంబగు సముద్రోపాంతంబుననుండు నుచ్చైశ్శ్రవుంజేరిరంత వినతకృష్ణవాలంబగు దేవరాజవాహనంబుగాంచి దుఃఖితయై కద్రువుకు దాసియై యుండ తార్క్ష్యుండండంబువెడలి గిరిమాత్రశరీరుండై హుతాశనుంబోలె దేజరిల్ల నాతని దేహమాహాత్మ్యంబున కచ్చెరువంది నిర్జరులనేకవిధములబొగడిరి. భువనత్రయంబును భీతిబొందెనంత నతండు నూరుబృష్ఠంబునెక్కించుకొని మాతృసమీపంబుజేరిన కద్రువు వినతంగాంచి ఓ చేటికా నే నాగాలయంబునకు బోవంగోరెద నీవునునన్నువహింపుము నీపుత్రుండగు గరుడుండు మత్పుత్రులవహించునని యాజ్ఞాపింప వినతగరుడుంగాంచి యోనందనా నీవీసర్పంబుల మోయుమనిన నతండు జననీవాక్యంబులంగీకరించి యాసర్పములవహించె వినతయు కద్రువనువహించె నంత తార్క్ష్యుండు సహస్రాంశు రథసమీపమునకు వేగంబునంబోయిన చండకిరణు రశ్మిమండలంబులవేడిమికోర్వనోపక నురగంబులు నుర్విం గూలిన కద్రువు సహా

స్రోత్రము ననేకవిధములం బొగడి తత్ప్రసాదాసాదిత జలాసారంబుల పుత్రుల కెల్ల శాంతి గావించె నంత సరీసృపంబులు గరుడుం గాంచి యిట్లనిరి.

ఓరీ చేటిపుత్రా ద్వీపాంతరములం జూడ మాకభిప్రాయము గలదు గాన మము వహించి యచటికిం బొమ్మనిన నాతం డట్లు గావించి యొక సమయమున వినతం గాంచి యిట్లనియె. ఓ జననీ నే యురగంబుల మోయుటకును నీవీ కద్రువను మోయుటకును గారణం బేమి మరియు నన్నీ యురగంబు లేల చేటీపుత్రుం డాయని వచించెద రిదియంతయు నిజంబెరుంగింపు మనిన వినత యిట్లనియె ఓ తనయా నే పూర్వంబున క్రూరయగు భగినిచే ఛలమున పరాజితనై దాసినైతి తత్కారణమున నీవును చేటీపుత్రుండని పిలువంబడుచు నీయురగముల మోసెదవు నే నీకద్రువను మోయుచున్నదాన నే నేమి సేయుదునని ఖిన్నయై యెరుంగించిన తార్క్ష్యుండీ దాస్యం బేలాగున బాయు నిందుకు జేయందగిన కార్యం బెట్టిదియనిన వినత నీ విప్పుడ సర్పములకడకుం బోయి యీ దాస్యవిమోచనంబున కుపాయం బడుగుమనిన నతం డాక్షణంబ సర్పములకడకుం బోయి ఓ యహీంద్రులారా మీ రేదియైనం గోరిన నది దెచ్చి యిచ్చెద మాకీ దాస్యవిమోచనము గావింపుండనిన పన్నగము లమృతంబు గోరిన నాతం డట్ల దెచ్చి యిచ్చెదనని వచించి జననీసమీపమునకుం బోయి యా తెరంగంతయు నెరుంగించి యమృతాపహరణమునకుం బోయెద నాకలివాడమెడు భక్ష్యంబొసంగుమనిన వినత యో పుత్రకా సముద్రమధ్యమునసుండు దుశ్చరిత్రులగు శబరులం భుజింపుము వారలయందొక విప్రుండు శబరీసంగకౌతుకియై యుండు నతం డగ్నియుంబోలె బ్రహ్మతేజమున కంఠంబు దహించువాని నెరింగి పరిత్యజించుము నీశరీరంబంతయు మరుదాది దేవతలు రక్షింతురుగాక యని యాశీర్వదించి యనిపిన గరుడుం డాక్షణంబ శబరాలయమునకుం బోయి వారల నెల్ల భక్షించుచుండ నొక బ్రాహ్మణుండు గిరిధరింప్రవేశించు విహంగముల విధంబున వివృతంబగు గరుడుని కంఠబిలంబునం బ్రవేశించు శబరులలోనుండి కంఠంబు దహింప వైనతేయుం డెరింగి ఓ విప్రుండా నీవు పాపకారివియైనను వధ్యుండవుకావు కాన త్వరితముగ కంఠము వెడలుమనిన నతండు మద్భార్యయగు శబరిని వెడలింపుమని వేడిన గరుడుం డట్లానతిచ్చె నంత నా విప్రుండు నిషాదీసహితుండై యథేచ్ఛం జనియె నంత ఖగోత్తముం డా శబరుల నెల్ల భక్షించి యతివేగమున నిజజనకుండగు కశ్యపముని యింద్రుం జేరి యో తపోధనా మదీయమాతృదాస్యనిరాసార్థమై యమృతంబు దేరంబోయెద నాకాహారం బొసంగుమని వేడిన కశ్యపుం

ఓ వైనతేయా పూర్వంబున బ్రాహ్మణవంశసంభవులగు సుప్రతీకవిభావసులను భ్రాతలిర్వురు విత్తవిరోధంబుచే పరస్పర శాపంబులం బొందిరి వారలలో సుప్రతీకుండు షడ్యోజనోచ్ఛ్రాయంబున తద్ద్విగుణాయామవిస్తార సంయుతంబగు గజంబయ్యె విభావసుండు త్రియోజనోచ్ఛ్రాయంబును దశయోజనవిస్తృతంబును కూర్మంబయ్యె నిట్లా యిర్వురు పూర్వవై



దంబున పరస్పరజయంబుగోరి యాసరోవరంబున యుద్ధంబుగావించుచున్నవారు వారల భక్షించి తృప్తుండవై యమృతంబుదేరంబొమ్మనియాజ్ఞాపింప గరుడుండాక్షణంబ మహాకాయంబులగు గజకచ్ఛపంబుల నఖంబులంగొని యొకతీర్థసమీపంబునకుంబోవ తత్తీరజంబును మహోన్నతంబగు రౌహిణేయంబను నగంబాగరుడుంగాంచి యోయీ శతయోజనాయతంబగు మదీయశాఖపై యుగ్రజకచ్ఛపంబులభుజింపుమనిన నతండట్లొనర్ప యాశాఖపయింగూర్చుండ నది భగ్నంబయ్యెనంత నాశాఖనవలంబించి యధోముఖులై తపంబొనర్చు వాలఖిల్యమునీంద్రులంగాంచి యిదిభూమింబడిన యీమునిసంఘంబులకు బాధయగునని దానింగొనియంబరంబునంబోవుచు జనకాజ్ఞచే నిజాసనంబగు నగంబున నాశాఖవిడిచి గజకచ్ఛపంబులభక్షించి తృప్తుండై యమృతాహరణార్థంబై బోవుచుండ దివంబున మహోత్పాతంబులయ్యెనంత నింద్రుండు బృహస్పతింగాంచి యోతపోధనా యీయుత్పాతంబులకుంగారణంబెరుంగింపుమనిన నతండిట్లనియె. ఓ పాకశాసనా పూర్వంబున భవజ్జనకుండగు కశ్యపుండుజన్నంబుగావింప సకల సురసంఘంబులు మునీంద్రులును యజ్ఞభారంబులంగొని యరుదెంచుచుండ నీవాసమయంబున గోష్పదజలంబులమజ్జనంబుగావించు వారలును అంగుష్ఠప్రమాణదేహులును యజ్ఞసంభారయుతులగు వాలఖిల్యమునీంద్రులంగాంచి పరిహాసంబుజేసితివిగాన నామునీంద్రులు క్రోధజ్వలితాననులై యింద్రశత్రుండగు పుత్రుండుకశ్యపునకుదయించునని హోమంబుగావించిరి గాన గరుడుండు పుత్రుండై యుద్భవించి యిప్పుడు సుధాహరణంబుగోరి యరుదెంచుచున్నవాడు గాన నీయుత్పాతంబులయ్యెడునని వాచస్పతియెరుంగించిన యింద్రుండాక్షణంబ యమృతరక్షకులరావించి గరుడుండమృతంబుగోరివచ్చుచున్నవాడు మీరలతిప్రయత్నంబున రక్షింపుండని యాజ్ఞాపింప వారలియ్యకొని యాయుధపాణులై యుండ పక్షీంద్రుండును నచటికిమహావేగంబునంబోవ వారలుభీతిల్లి యస్త్రశస్త్రంబులంగొని యుద్ధంబు సేయుచుండ సుపర్ణుండు కొందరతుండాగ్రంబున కొందరపక్షంబులఖండించుచు పక్షవిక్షేపంబుగావింప ధూళి యాకసంబుగప్పెనంత త్రిదశప్రేరితుండగు పవమానుండాధూళీపుంజంబునిరసించిన ఖగేంద్రుండుక్రోధప్రదీప్తుండై రుద్రవసుమరుదాది సురసంఘంబులనెల్ల పక్షతుండంబులంబీడింప వారలును భీతులై పలాయనంబునొందిరంత పురోభాగంబున జ్వలించునగ్నింగాంచి నదీజలంబుచే శాంతింబొందించి యొకభ్రమచ్చక్రంబు జూచి సంక్షిప్తాంగుండై తదంతరాళంబున బ్రవేశించి నతిభయంకరరూపంబులై జనంబులదర్శనమాత్రంబున భస్మంబుగావింపనోపు యహీంద్రద్వయంబుగాంచి వానిశిరంబుల కాలంద్రొక్కి యమృతంబెత్తుకొని యంతరిక్షంబునంబోవుచుండ రమానాథుండేతెంచి యోవైనతేయా నీప్రతాపంబునకుమెచ్చితి వరంబువేడుమనియ్యానతిచ్చిన ఖగేంద్రుండు ప్రీతుండగు రమానాథుంగాంచి యోకమలామనోహరా నాకెల్లప్పుడు జరామరణంబులు లేకయుండునట్లును సేసవాహనంబును కేతనంబగునట్లును ప్రసాదింపవేయనివేడిన నారాయణుండంగీ

కరించి యావరంబొసంగి యంతర్ధానగతుండయ్యెనంత నాఖండలుండే తెంచి యాగరుడుని వక్షంబులపై కులిశంబు వేచిన నతండు నవ్వుచు పాకశాసనునుం గాంచియిట్లనియె యోపురుహూతా త్వత్కులిశపాతంబువలన నాకు వేదనగలుగనేరదు అయిన నొకపర్ణంబొసంగెద దానినిది సఫలోద్యోగంబగునని యొకపర్ణంబొసంగ సకల సురమునిసంఘంబులాతపవర్ణంబులసుస్థిరత్వంబునకు మెచ్చి సుపర్ణుండని పొగడిరంత గరుడుండింద్రునితో మరలనిట్లనియె యో పురందరా నేసచరాచరాత్మకంబులగు సకలలోకంబుల వహింపంజాలుదు భవాదృశసహస్రంబులైనను నాకుయుద్ధంబున లక్ష్యంబుగావు నీవేమిసేయఁవో వుడుననిననిర్జరనాయకుం డతనిసామర్థ్యంబున కాశ్చర్యంబునొంది శాంతంబుగా నతనితో నిట్లనియె.

ఓ ఖగేంద్రుడా అజరుండనమృతుండవగు నీకమృతంబేల దీనినొరులకిచ్చిన వారలు జరామరణవర్జితులై మాకంటెనధికులై మమ్ముబాధింతురుగాన మరలనాకిమ్మన వతండింద్రుంగాంచి యో సురనాయకా నేయమృతంబుగొనిపోయి యురగులకిచ్చి నామాతృదాస్యంబువాపెద పిమ్మట వారలుపయోగింపకమున్న నీవాయమృతంబుగొనుమన దేవేంద్రుడు ప్రీతుడై వరంబువేడుమనిన సుపర్ణుండు కపటంబుచే మజ్జననిదాసింగాజేసిన యురగంబులెల్ల నాశనంబగునట్లుగావింపుమని వేడిన నింద్రుండావరంబొసంగె నంత గరుడుండమృతంబుగొని యురగులకడకుంజని యోపన్నగంబులారా యమృతంబుతెచ్చి కుశంబులపైనుంచితి మీరలింకమజ్జనంబుగావించి పానంబొనర్పుండు మజ్జననీదాస్యంబుబాపెననిన సర్పరాజంబులంగీకరించె నింద్రుండాతరియమృతంబుగొని దివంబునకుబోయి యథాస్థానమునందుంచె నాసమయమున భుజంగంబులమృతంబుగానక నదియుంచినదర్భల నాకుటవలన జిహ్వాంబులకుశాగ్రతాడితంబులై ద్వివిధములయ్యె నాటంగోలె పాములెల్ల ద్విజిహ్వాలనబరగె నమృతస్థితింజేసి దర్భలుపవిత్రంబులయ్యె నివ్విధమున గరుడుండు జననీదాస్యమువాపి కపటమున నిజజననిదాసింగాజేసుకొనిన కద్రువుంగాంచి కోపమునభర్తృపరిచర్యకపహూగాకయుండునని శాపంబొసంగి యథేచ్ఛంబోయెనంత కద్రూవినతలుభర్తృసమీపమునకుబోవ నామునిపుంగవుండు కద్రువుంగాంచి కోపసంరక్తలోచనుండై వోదురాత్మికా వినతంగపటమునంబరాజితంజేసితివిగాన మత్పరిచర్యకుందగవు యేమనుజుండైనను యేయంగనయైననుపరులంగపటముగావించి జయమునొందుదురో వారలు మహాపాతకులనంబడుదురు తత్సంభాషణముగావించిననరుండు బ్రహ్మహత్యాసురాపాన స్వర్ణస్తేయాదిదోషములంబొందు పిమ్మట నరకమునంబడుదురు మరియును ఖలజేత్రుపజంభుజించువాడతి దారుణనరకమునొందుమరియు నతనిదర్శనముగాంచిన నరుండు పాపశాంతికై సూర్యునైన జలమునైన పావకునైన విలోకింపవలయు యచటనతండువర్తించు నచట నివాసముగావించిన వారలెల్ల నరకప్రాప్తులగుదురుగాన మత్సమీపమున నుండకుమని కద్రువనుధిక్కారముజేసి స్వచ్ఛశీలయగువినతంబరిగ్రహించె నిట్లుకశ్యపమహామునీంద్రుచేనిరసింపంబడి యతని పాదపతితయై విలపింపు

చున్నను నతండంగీకరింపకపోయిన వినతయిట్లనియె. ఓ మునీంద్రా మద్భగినిం దయాళుండవై రక్షింపు మజ్ఞానమున పాపముగావించె క్షమింపుము లోకమున భవాదృశులగు సాధువు లెల్ల దయాళువులై యుందురుగదా యని వేడిన వినతంగాంచి కశ్యపుండిట్లనియె.

ఓ వినతా యీపాపమునకు శాంతియొనర్చినంగాని యీదురాచారిం గైకొన నే ముష్కరు వచించెద నిశ్చయంబనిన వినతయిట్లనియె. ఓమునీంద్రా యీపాపమునకు నిష్కృతిగావించి త్వత్పరిచర్యార్హ యెట్లగునది వచింపవేయని వేడిన నతండు కొంతదడవు చింతించియిట్లనియె. దక్షిణాసముద్రతీరమున విముక్తిదంబగు ఫుల్లగ్రామమున పాపవినాశనంబగు క్షీరసరంబను నొకతీర్థముగలదు కద్రువచటికింబోయి స్నానంబొనర్చిన మాత్రమున దోషవిముక్తయగు నట్లుగావింపక ప్రాయశ్చిత్తాయుతము లొనర్చిన నీదోషము నశింపదని కశ్యపుండువచించిన కద్రువు పుత్రసహాయినియై కతిపయదినముల క్షీరసరంబునకుంబోయి విజితేంద్రియయు ప్రయతయునై సంకల్పపూర్వకముగా స్నానంబొనర్చి దినత్రయంబుపవాసముండి చతుర్థదివసమున ఆదరపూర్వకముగ స్నానముజేయుచుండ అశరీరవాణి యిట్లనియె. ఓవనితా యీతీర్థమున స్నానముజేయుటంజేసి గరుడోక్తశాపము నశించె. భర్తృశుశ్రూషణమునకనర్హురాలవై తివి ఛలజేత్ర దోషము నశించెనింక భర్తృసమీపమునకుం బొమ్మతండు నిన్నుబరిగ్రహించునని వచించిన కద్రువు యాయశరీరవాణికి వందనము గావించి యాతీర్థమునకు ప్రదక్షిణము జేసి పుత్రసహితయై భర్తృసమీపమునకుంబోయె నంత నామునీంద్రుండు క్షీరసరోజముల స్నానముగావించి ధూతపాపయగు కద్రువం గాంచి ఆత్మశుశ్రూషణమునకంగీకరించెను. ఓ మునీంద్రులారా కద్రూపాపవిమోక్షణంబగు వృత్తం బెరుంగించితి యెవ్వండైన క్షీరసరోవరమున స్నానంబొనర్చిన ముక్తిం బొందు మరియును యేమనుజుండయిన యీయధ్యాయము భక్తియుక్తుండై పఠించు వినునతండు క్షీరకుండ స్నానఫలమును అశ్వమేధాదియజ్ఞఫలమును గంగాది సర్వతీర్థఫలమునుం బొందు నిశ్చయంబని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరుంగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమాహాత్మ్యంబునందు
క్షీరకుండ ప్రశంసయు - కద్రూఛలదోషశాంతియను కథలంగల
ముప్పదియెనిమిదవ యధ్యాయము సంపూర్ణము.

## ముప్పదితొమ్మిదవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకల పురాణాభిజ్ఞుండగు సూతుం డిట్లనియె. ఓమునీంద్రులారా పూర్వంబున రావణాదులగు నక్తంచరులు మరణంబునొందిన

పిమ్మట వానరులందరు గంధమాధనంబుకరుగుదెంచి సర్వలోకోపకారార్థంబై యొక తీర్థంబునిర్మించి యీతీర్థంబున స్నానంబుగావించిన మానవులువిధూతపాపులయి నరక దారిద్ర్యంబులనొందక ముక్తిబొందుదురు యీతీర్థంబునెవ్వండైననిరంతరంబు స్మరించుచుండు నతండీప్సితపరంపరలనొంది పిమ్మట పరమపదంబునొందు నీతీర్థంబునకు సదృశంబులేకయుండునని వరంబులొసంగి రామచంద్రు కడకుంజని నమస్కారపూర్వకంబుగా ఓ రఘునాయకా యీతీర్థంబునకు నుత్తమంబగు వరంబొసంగవేయని వేడిన రామచంద్రుండు ప్రీతుండై యీకపితీర్థంబున స్నానంబొనర్చినవారలు గంగాదిసర్వతీర్థస్నానఫలంబును అగ్నిష్టోమాది యజ్ఞఫలంబును గాయత్ర్యాది మహామంత్రజప ఫలంబునుం బొందుదురని వరంబొసంగె నంత శశిశేఖరుండును నలువయుసహస్రాక్షుండును యముండును వరుణుండును ఆదిత్యుండునుమరియునుంగల నిలింపులును అత్రియుభృగువు కుత్సుండును గౌతముండును పరాశరుండును కణ్వుండును అగస్త్యుండును సుతీక్ష్ణుండును విశ్వామిత్రుండును నారదుండునుమొదలగుమహామునులందరు యారామదత్తవరంబగు తీర్థంబనేకవిధంబులం గొనియాడి యందుస్నానంబొనర్చి యీతీర్థంబు కపీంద్రులచే నిర్మితంబగుటంజేసికపితీర్థంబను ఖ్యాతింబొందునని వచించిరిగాన నదిసకలతీర్థోత్తమంబై వెలయుచుండు నాకపితీర్థంబున ముక్తింగోరువారందరు స్నానంబొనర్పవలయు పూర్వంబున రంభ కౌశికశాపంబున శైలరూపమునొంది యాతీర్థమున స్నానంబొనర్చి మరలనిజరూపంబు బొందెననిన శౌనకాది ఋషులిట్లనిరి.

ఓ పౌరాణికోత్తమా విశ్వామిత్రుండేల రంభను శైలయగునట్లుశాపంబొసంగె పిమ్మట శిలాభూతయగు యాసురాంగనయట్లాతీర్థంబునకుంబోయి స్నానంబొనర్చె నదియంతయు సవిస్తరంబుగా నెరింగింపుమని వేడిన సూతుండిట్లనియె. పూర్వంబున కుశికాన్వయంబున విశ్వామిత్రుండను భూపలలాముండుదయించి యొకానొక సమయంబున సేనాపరివృతుండై సకలదేశంబుల సంచరించుచు వసిష్ఠాశ్రమంబునకుంబోవ నామహాత్ముండు కామధేను ప్రభావంబున నతనికాతిథ్యంబొసంగిన తృప్తుండయి కామధేను ప్రభావంబెరుంగి దానిం దనకిమ్మనివేడిన వసిష్ఠుండంగీకరింపకపోయె నంతకౌశికుండు బలాత్కారంబున కామధేను పుగ్రహింపంబోయి తద్విసృష్టులగుమ్లేచ్ఛాదులచే పరాజయంబునొంది మహాదేవునారాధించితత్ప్రసాదంబున సకలదివ్యాస్త్రంబులంబడసి మరలవసిష్ఠాశ్రమ సమీపంబునకుంబోయి. బ్రహ్మాస్త్రాదిదివ్యాస్త్రంబులనెల్ల ప్రయోగింప నామునీంద్రుండు బ్రహ్మదండంబుచేనవియెల్లవారించిన విశ్వామిత్రుండుపరాజితుండగుచు బ్రాహ్మణ్యంబునకై తపంబొనర్పగోరి పూర్వదక్షిణపశ్చిమదిక్కులయందు ఘోరంబగు తపంబొనర్చి యచ్చటవిఘ్నంబునొంది యుత్తరాశంబునకుంజని హిమవత్పర్వతంబున పాపవినాశినియగు కౌశికనదీతీరంబున జితేంద్రియుండును నిరాహారుండును జితశ్వాసుండును జితక్రోధుండును గ్రీష్మంబున పంచాగ్నిమధ్యస్థుండు

ను వర్షాకాలంబుల ఆకాశగుండును శిశిరంబులజలమధ్యస్థుండునునై యత్యుగ్రంబగు
తపంబుదివ్య వర్షసహస్రంబులు గావింపుచుండ యింద్రాదులగు నిర్జరులు భీతింబొంది
రంభంగాంచియిట్లనిరి. ఓ కామినీమణీ హిమవచ్ఛైలంబున కౌశికీనదీ తీరంబునందుగ్రతపం
బొనర్చు విశ్వామిత్రుకడకుంజని తత్తపంబునకు విఘ్నంబొనర్చుమనిన నదిసురలంగాంచి
వో త్రిదశపుంగవులారా విశ్వామిత్ర మహామునీంద్రుండతి క్రూరుండు నన్నుంగాంచి శాపం
బొసంగుగాన నేభయంబునొందెద మీరలుభయాపహులై నన్నీ కార్యంబున నియోగింపక ర
క్షింపుండనిన జంభారియిట్లనియె. ఓవనితా భీతింబొందకుము నీవతిసుందర రూపంబునొంది
యామునీంద్రు మోహింపంజేయుము నేనును నీవెంటనరుదెంచెద యీమన్మథుండును కోకి
లాలాపమధురుండగు వసంతుండును నరుదెంతురనిన రంభయు విశ్వామిత్రాశ్రమంబునకుం
బోయి మనోహరవిచేష్టితంబులుగావింప మదనుండును మనంబున నానందంబుగావించె
నంతమునిపుంగవుండా రంభంగాంచి సంశయంబునొంది శతక్రతుకృతంబు విఘ్నంబుగా
నెఱింగి క్రోధసంరక్తలోచనుండై యిట్లనియె.

ఓ రంభా నీవతిదారుణంబగు శిలారూపంబునొంది వర్షశతాయుతంబులుండుము
పిమ్మట నొకబ్రాహ్మణునిచే రక్షింపంబడి స్వరూపంబునొందెదవని శాపంబొసంగె నాక్ష
ణంబనదియు శిలారూపంబు నొంది బహుకాలంబు విశ్వామిత్రాశ్రమ సమీపంబుననుండె
నంతనామునీంద్రుండును మహత్తరంబగు తపంబుగావించి వసిష్ఠవాక్యంబున రాజన్యదు
ర్లభంబగు బ్రాహ్మణ్యంబునొందె నాయాశ్రమంబున నగస్త్యశిష్యుండగు శ్వేతుండను
మునీంద్రుడు చిరకాలము మోక్షముగోరితపంబుగావింపుచుండ నంగారకయనునొకరక్క
సి మేఘస్వనమహాస్వనయగుచు మూత్రరక్తపురీషాదులవర్షింపుచు మఱియు ననేకవిధంబు
లనామునీంద్రునిబాధింప నతండు క్రుద్ధుండై కుశికసుత శాపంబునొందిన శిలంగొనివాయ
వ్యాస్త్రసంయోగ్యంబు గావించి యారక్కసిపైవైవ నదియు నానిశాచరిననుగమించె నా
నక్తంచరియు భీతింబొంది దక్షిణసముద్రతీరంబుననుండు కపితీర్థంబునమునింగిన నాశిల
యునద్రుతమై యచటికింబోయి యారాక్షసి శిరంబునంబడియె, నంతరంభయు కపితీర్థ
మజ్జనప్రభావంబున శిలారూపంబువిడిచి నిజరూపంబునొంది కుసుమధారావర్షితయు
దివ్యవిమానారూఢయు దివ్యాంబరవిరాజితయు హారకేయూరకటకవరాభరణభూషితయు
నూర్వశ్యాది సఖిపరివృతయునగుచు నాకపితీర్థమహాత్మ్యంబనేక విధంబులంబొగడి శశి
భూషణుండగు రామనాథుసేవించి యమరావతికింబోయె నారాక్షసియు పూర్వంబునఘృ
తాచియను వేశ్యారత్నంబదియును కుంభజన్మశాపంబున రాక్షసీ రూపంబునొందియుండి
యప్పుడాతీర్థంబున స్నానం బొనర్చినకతంబున నిజరూపంబునొందె. ఓ మునీంద్రులారా
యివ్విధంబునఘృతాచీ రంభలిరువురు నగస్త్యశిష్యుండగు శ్వేతమునీంద్రు ప్రసాదంబున
రాక్షసీశిలరూపంబులవిడిచి కపితీర్థప్రభావంబున నిజరూపంబులంబొందిరిగాన జనులు

సకలప్రయత్నంబుల నందుస్నానంబుగావింప వలయునని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరుంగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు
కపితీర్థప్రశంసయు రంభాశాపవిమోచనంబును కథగల
ముప్పదితొమ్మిదవ యధ్యాయము సంపూర్ణము.

---

## నలువదియవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకల పురాణవ్యాఖ్యానవైఖరీ సమేతుండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా గంధమాదనపర్వతంబున గాయత్రీ సరస్వతీక్షితంబగు తీర్థద్వయంబుగల్గదందువారలెల్లప్పుడు సన్నిధానంబుగావింపుచుందురుగాన గాయత్రీతీర్థంబనియు సరస్వతీతీర్థంబనియు నాతీర్థద్వయంబు ఖ్యాతింబొందె లోకపావనంబును సకల నరకక్లేశ నివారణంబగు తత్ప్రభావంబెరుగించెద వినుండు పూర్వంబున సకలలోకనిర్మాతయైన చతుర్ముఖుండాత్మతనూజయగు సరస్వతింగామంబునమోహించిన నాదేవియు నాతని యభిప్రాయంబెరింగి లజ్జితయై హరిణీరూపంబునొంది పరుంగిడిన నలువయుహరిణంబై ననుగమించెనంత నిలింపులీపితామహుండు పుత్రీగమనసాహసుండయ్యెనని పరస్పరంబునువచించిరంత నిషిద్ధకృత్యనిరంతరుండగు పరమేష్ఠింగాంచి వ్యాధరూపధరుండగు హరుండాకర్ణపూర్ణాకృష్టంబై వెలయు పినాకధనుర్విసృష్టంబగు శరణంబు ప్రయోగించిన తచ్ఛరవిద్ధుండై చతుర్ముఖుండు భూమింబడియెనంత నాతనిదేహంబువెడలి మహాప్రభంబగుజ్యోతిస్స్వరూపంబు మృగశీర్షాఖ్యనక్షత్రంబై యాకాశంబునందేజరిల్లుచుండ హరుండార్ద్రానక్షత్రరూపంబునొంది దానిబాధించుచుండె ఓమునీంద్రులారా యంబరంబున మృగశీర్షాంతికంబున మృగవ్యాధరూపుండగు త్రిపురాంతకుండిప్పుడును స్పష్టంబుగనగుపడుచున్నవాడివ్విధంబున చతురాననుండు శంభునిహతుండైన నాతనిభార్యలగు గాయత్రీసరస్వతులిరువురు శుచిసమన్వితలై భర్తృజీవనంబుగోరి యన్యోన్యంబును విచారించుచు సర్వోత్కృష్టంబును శివస్థానంబగు గంధమాదనపర్వతంబుజేరి యందుసదాశివుం గూర్చితపంబుగావింపుచు స్నానార్థంబై తీర్థద్వయంబు నిర్మించి యందుప్రత్యహంబును మజ్జనంబుగావింపుచు బహుకాలంబు నిరాహారులును జితక్రోధలును అత్యుగ్రనియమసంయుతలును శివధ్యానపారీణలును పంచాక్షరీమహామంత్ర జపనిరతలునై మహాదేవుంగూర్చి యాత్మపతిజీవనంబుగోరి తపంబుగావింపం గృపామూర్తియగు మహేశుండు వారల తపంబునకుమెచ్చి గణేశకార్తికేయాది సంయుతుండై వరంబొసంగ నావిర్భవించిన వారలు సంతోషంబునొంది యిట్లని స్తుతించిరి. ఓ పార్వతీనాథా నీవు దుర్వారసంసారనాశనకారివి

జ్వలజ్జ్వాలావళీ భీమకాలకూటవిషాదివి జగత్క్షోభన పంచాస్త్రదేహ నాశనకారివి జగదంతకరప్రహారయమాంతకుండవు గంగాతరంగ సంపృక్తజటామండలధారివి విరూపాక్షుండవు రాకాశీతాంశుధరుండవు పినాకభీమటంకార త్రాసితత్రిపురాసురుండవు వివిధాకార జగత్స్రష్ట్రుశిరఃఛేదివి శాంతామలకృపాదృష్టిసంరక్షితమృకండుతనూజుండవు నీప్రభావంబు వర్ణింపమాదరంబే మమ్ము గరుణాదృష్టినవలోకించి రక్షింపుమనిన మహేశ్వరుండు ప్రీతుండై యిట్లనియె.

ఓ గాయత్రీ సరస్వతులారా మీకుంబ్రీతుండనైతి మీ మనంబునంగల వరంబువేడుం డనిన వారలిట్లనిరి. ఓ పార్వతీ మనోహరా నేమిర్వురము మీకుంబుత్రికలము మమ్ముంగాంచి మాదయితు ప్రాణంబులొసంగి రక్షింపవేయుని వేడిన మహాదేవుండు నందిభృంగాది మహాభూతానీతంబులగు శిరంబులచే నాపితామహు శరీరంబు సంయోగంబుజేయ నాతండును సుప్తోత్థితుని చందంబునలేచి భార్యాద్వయసమేతుండై శశిభూషణుండగు శంకరునివ్విధంబునంబొగడె. ఓ దేవదేవాకరుణాకర విగ్రహానన్నునిషిద్ధ కృత్యంబులవలనంబాపి మరియు నెన్నండిట్లకార్యంబులయందు ప్రవృత్తిలేకయుండునట్లు ప్రసాదించి రక్షింపవేయని వేడిన నుమాకాంతుండట్లయగునని వరంబొసంగి ఓ చతురాననా యికమీదనెన్నండును ప్రమాదంబునొందకుము ఉత్పదప్రతిపన్నులను వారలనే శిక్షించుచుండుమని వచించి తత్పత్నులంగాంచి యిట్లనియె. ఓ గాయత్రీ సరస్వతులారా మత్ప్రసాదంబున నీపితామహుండు ప్రాణంబులంబొందె నితనింగూడి బ్రహ్మలోకంబునకుంబొండి యీతీర్థద్వయంబున స్నానంబుగావించిన వారలకు ముక్తిగల్గు మరియు నీతీర్థద్వయంబు యుష్మత్కృతంబగుటంజేసి భవన్నామాంకితంబై శాశ్వతంబగు ఖ్యాతింబొంది సర్వతీర్థంబులలో శుద్ధిప్రదంబును మహాపాతకనాశనకరంబును మహాశాంతికరంబును సర్వాభీష్టప్రదంబును మత్ప్రసాదజనకంబును విష్ణుప్రీతికరంబునునై వెలయుచుండు నీతీర్థద్వయంబునకు సమానంబగు తీర్థంబులేదిందు స్నానంబుగావించిన వారలు సర్వాభీష్టంబులంబొందుదురు మరియును గాయత్ర్యుపాసనంబుజేయనివారలును వేదాభ్యాసవివర్జితులును ఔపాసనవిహీనులును పంచయజ్ఞశూన్యులైన నిందు స్నానంబుజేసిన యాఫలంబులం బొందుదురు మరియు నితరపాతకంబులు జేసిన వారలైననిందు స్నానంబుజేసిన పరిశుద్ధులగుదురని గాయత్రీసరస్వతులంగూర్చి వచించి మహాదేవుండంతర్ధానంబునొందె వారలును పతింగూడి బ్రహ్మలోకంబునకుంబోయిరి. ఓ మునీంద్రులారా గాయత్రీసరస్వతులు గంధమాధనంబున సన్నిధానంబుగావించిన కారణంబెరుంగించితి నెవ్వండైన భక్తియుతుండై యీయధ్యాయంబు పఠించు వినునాతండా తీర్థద్వయ స్నానఫలంబునొందు నిందుకు సందియంబులేదని శౌనకాదిమునీంద్రులకు సూతుండెఱింగించెను.

ఇది స్కాందపురాణంబునందు సేతుమాహాత్మ్యంబున
గాయత్రీసరస్వతీతీర్థప్రశంసయు గాయత్రీసరస్వతీసన్నిధానకథనంబను కథలంగల
నలువదియవ యధ్యాయము సంపూర్ణము.

# నలువదియొకటవ అధ్యాయము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు పౌరాణికోత్తముండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా గాయత్రీసరస్వతీ తీర్థద్వయప్రభావంబువినుండు కాశ్యపుండను విప్రుండతిమహత్తరంబగు పాపంబుజేసి యాతీర్థద్వయంబునందు స్నానంబు గావించి పరిశుద్ధుండయ్యెననిన మునీంద్రులిట్లనిరి. ఓ సూతనందనా కాశ్యపుండే పాపంబు గావించి యాతీర్థద్వయంబున స్నానంబాచరించి ముక్తుండయ్యె, నదియంతయుశ్రద్ధాసహితులమగు మాకుంగృపనెఱుంగింపవే త్వద్వచోమృతపానంబునం జేయుచుండెడు మాకుం బిపాసలేకయున్నదియదియనిన సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా పూర్వంబున అభిమన్యుసుతుండగు పరీక్షిద్భూరమణుండు ధర్మమార్గంబుగ ధరాపాలనంబుజేయుచు షష్టివర్షవయోగతుండై యొకదినంబునందు మృగయారతుండై యరణ్యంబున మృగంబులనరయుచుం జనియందొక మృగంబునుం దరుముచుబోవువాఁడు ముందరధ్యానారూఢుండును చీరవసనుండగు నొకమునీంద్రుంగాంచి యోతపోధనా మద్బాణభగ్నంబై భయంబునొందియొక మృగంబేతెంచె దానింజూచితివేయనిన నామునీంద్రుండు ధ్యాననిష్ఠుండైయున్నవాఁడుగాన నుత్తరంబు వచింపకపోయిన నృపుండుకుపితుండై యామునీంద్రస్కంధమున మృతంబగు నొక సర్పంబువైచి స్వనగరంబునకుంబోయి పిమ్మట తాజేసినకార్యంబు జింతించి నేఁడురాచారుండ కోపకలుషీకృతమానసుండ యజ్ఞానంబున యామహామునిస్కంధంబుపై సర్పంబువైచితినని పశ్చాత్తాపసంతప్తచిత్తుండయియుండె, నంత కుశాఖ్యుండను విప్రుండాశమీకపుత్రుండగు శృంగింగాంచి వోచెలికాఁడా భవజ్జనకుని స్కంధంబున మృతంబగు నొక సర్పంబువ్రేలుచున్నయది దానిం జూడక నీవేలగర్వించెదవనిన శృంగియు కోపంబునొంది యాకృత్యంబు పరీక్షన్నరవరుండు జేసినవాఁడనియెఱింగి యానృపుండు సప్తాహంబుల తక్షకాహిదష్టుండై యమసదనంబున కరిగెడునని శాపంబొసంగెనంత శమీకమహామునీంద్రుండు పుత్రుంగాంచి యిట్లనియె.

ఓ తనయా సర్వలోకరక్షకుండగు నృపునకేల శాపంబొసంగితివి లోకంబరాజకంబైన మనకెవ్విధంబుననుండును కోపంబుతపంబునాశనంబునొందించు సకల సిద్ధులందొలగించు సకల ధర్మంబులనశింపజేయుగాన నెవ్వండును దానినొందందగదు క్షమాయుక్తలగువారలు సకల సౌఖ్యంబులంబొందుదురని వచించి యాత్మశిష్యుండగు గౌరముఖుండను వానింగాంచి, ఓ శిష్యా నీవిపుడాపరీక్షద్భూరమణు సమీపంబునకరిగిమత్పుత్ర శాపంబెఱుంగింపుము శీఘ్రింబునంబొమ్మనిన నతండాక్షణంబ హాస్తినపురంబునకుంబోయి యాతెఱంగంతయునెఱింగింప నృపుండును శోకతప్తుండై గృహమధ్యంబున అభ్రంలిహంబును మహోత్తుంగంబగు నొకస్తంభంబుగావించి యందు మహాగరుడమంత్రజ్ఞులును సకలౌషధ

జ్ఞులును దేవర్షి బ్రహ్మర్షి రాజర్షి ప్రవరులును దన్నుం బరివేష్టించియుండ విష్ణుభక్తుండై యుండె నా సమయంబున దరిద్రుండగు కాశ్యపుండను నొక మాంత్రికోత్తముండా వృత్తాంతంబు విని విషానలంబున యారాజుం గాచి ధనంబుల సంపాదించెదనని సప్తమదినంబున త్వరితంబుగ వచ్చుచుండ మార్గంబున విప్రరూపధరుండగు తక్షకుండా కాశ్యపుం గాంచి ఓ బ్రాహ్మణోత్తమా నీ వెచటికరిగెదవనిన నా మునీంద్రుండిట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా తక్షకుండనువాడు విషాగ్నిచే పరీక్షితుం జంపునట నే నా నరేంద్రు గావం బోయెదననిన తక్షకుండు నవ్వి వో బ్రాహ్మణపుంగవా తక్షకుండ నేన మద్దష్టుండగు నృపుం గావ మంత్రాయుతంబులొనర్చియు శక్తుండవు గావు మహోమ్రచ్ఛాయంబగు యీ వటవృక్షంబు వే విషంబునచే భస్మంబు జేసెద నీవు సమర్థుండవైన దీని మరల పూర్వంబువలెనుండునట్లుగా జేయుము అట్లొనర్చిన నృపుం గావ శక్తుండవగుదువని తక్షకుండా వృక్షంబుఁ గరచిన నదియు భస్మంబయ్యె నందొక విప్రుండుండి తక్షకవిషోల్కాపాతంబుచే తప్తుండయ్యె నంత మాంత్రికోత్తముండగు కాశ్యపుండు స్వమంత్రప్రభావంబున నావృక్షంబు పునర్జీవితంబు జేసిన యందున్న విప్రుండును బ్రతికె నంత తక్షకుండా మునిం గాంచి యిట్లనియె.

ఓ మునీంద్రా నృపుడొసంగు ధనంబునకంటె ద్విగుణంబొసంగెద స్వదేశంబునకుం బొమ్ము నీ వెంత సమర్థుండవైనను మునిశాపతప్తుండగు నృపుండు మరల జీవితుండుగా నేరండనిన కాశ్యపుండును జ్ఞానదృష్టిచే నృపునల్పాయువుం గా నెరింగి యాతక్షకువలన ననర్ఘంబులగు రత్నంబులం గొని స్వాశ్రమంబునకుం బోయె నాతక్షకుండును సర్పంబులం గాంచి మీరలు మునివేషధారులై ఫలంబులను ఫలహారంబులుగా గొని యానృపుసాన్నిధ్యంబు జేరి వానినొసంగుండనిన వారట్లొనర్ప తక్షకుండు కృమివేషధరుండై యొక బదరీఫలంబున బ్రవేశించియుండ పరీక్షితుండును సర్పరూపులగు బ్రాహ్మణులచే దత్తంబులగు ఫలంబులం గొని మంత్రవిదులకు కొన్ని నొసంగి దానును నొకఫలంబు గరంబున గ్రహించె నా సమయంబున సూర్యుండస్తాద్రిం జేరెనంత సకల జనంబులు ఋషివాక్యంబు మిథ్యయయ్యెననుచుండ తక్షకుండు క్రిమియై యాఫలంబుననుండి బయలువెడలి రాజదేహంబంతయుం జుట్టుకొనిన సకల జనంబులు భయాతురులై పరుంగిడిరంత నృపుండు తక్షకవిషాగ్నిచే దగ్ధుండయ్యె నాతని తనయుండగు జనమేజయుండు జనకునకౌర్ధ్వదైహికంబు గావించి మంత్రి పురోహిత ప్రార్థనంబున రాజ్యాభిషిక్తుండై సుఖంబుండె నా కాశ్యపుండును సర్వజన నిందితుండై నిఖిలదేశంబుల సంచరించుచు ఋష్యాశ్రమంబులకరిగి వారలచేతను నిందితుండై పశ్చాత్తాపతప్తుండై శాకల్యుండను మునిం జేరి యిట్లనియె. ఓ మహాత్మా నే స్తేయం బొనర్చిన వాడం గాను సంసర్గదోషంబు నొందినవాడం గాను మరియు నే దురితంబులం జేయనన్నేల జనంబులు నిందించెద రీకారణం బెరుంగుదేని వచింపవే యనిన కొంతదడవు చింతించి శాకల్యుండిట్లనియె. ఓ కాశ్యపా నీవు మహారాజగు పరీక్షితు తక్షకు విషంబువలన గావం బోయి మార్గమధ్యంబున

లోభంబున తక్షకనివారితుండవైతివి నీ జనుండైన తాసమర్థుండైనను విషరోగాదులచే బీడితుల వారలలోభంబునంగాని క్రోధంబునంగాని మాత్సర్యంబునంగాని రక్షింపకయుండు నాతండు బ్రహ్మహత్యా సురాపానగురుతల్పగాది దోషంబులంబొందు నెల్ల పాపంబులకు నిష్కృతిగలదుగాని యాతనిపాపంబున కెన్నండును ప్రాయశ్చిత్తంబులేదు సుకృతియగు జనుండాతని వర్జింపభుజింపందగదు భాషింపం దగదట్లుగావించిన వాడు మహాపాతకుండగు మరియును పరీక్షిద్భూరమణుండు పుణ్యశ్లోకుండతి ధార్మికుండు విష్ణుభక్తుండు చాతుర్వర్ణ్యరక్షకుండు వ్యాసపుత్రుండగు శుకమహర్షివలన హరికథలసమగ్రంబుగ విన్నవాడా మహామహుంగావక లోభంబున తక్షకవచనంబునని వృత్తుండవైతివిగాన బంధుజనంబులు మునీంద్రులు నిన్ను దూషించెదరు పరీక్షితుండు మరణంబునొందు పర్యంతంబును బుధజనంబులచే చికిత్స జేయనర్హుండు లోకంబున ముమూర్షువగు మానవునకు ప్రాణంబులు కంఠగతంబులగు పర్యంతంబు చికిత్సఁజేయందగునని భిషద్విద్యాపారగులు వచింతురని శాకల్యుండు పలికిన కాశ్యపుండిట్లనియె.

ఓ తపోధనా యాపాపంబునకు శాంతియెట్లుగల్గు బాంధవులు సకల జనంబులు నన్నే లాగునం గ్రహింతురు యిందుకు దగినయుపాయంబు దయాళుండవై యెరుంగింపవే యనిన నతండిట్లనియె. ఓ కాశ్యపా దక్షిణసముద్రోపాంతంబున గాయత్రీసరస్వతీ నామవిరాజితంబగు తీర్థద్వయంబొకటిగలదందలి గాలిసోకిన మనుజులు సకల పాపవిదళనంబుగావించి నిర్మలులై స్వర్గమునొందుదురు నీవచటికింబోయి స్నానంబొనర్చిన మాత్రమున శుద్ధుండవగుదువుగాన శీఘ్రగమనంబునంబొమ్మని శాకల్యమునీంద్రుండు వచించిన కాశ్యపుండచటికింబోయి యచటనుండు భైరవునకు నాతీర్థద్వయంబునకును వందనముగావించి యందు సంకల్పపూర్వకంబుగా స్నానంబుజేసి యాతీర్థస్నాన ప్రభావంబున విముక్తపాపుండై యాతీర్థతీరంబునంగొంతకాలంబుండ గాయత్రీసరస్వతీ దేవతలిర్వురు మూర్తీభవించి సర్వాభరణభూషితులై ప్రసన్నలైన వారలంగాంచి కాశ్యపుండు ప్రీతుండై భక్తిపూర్వకంబుగ నమస్కరించి, ఓ దేవతులారా మీరెవ్వరెరుంగింపుండని వారలిట్లనిరి. ఓ మునీంద్రా మేమిర్వురము హిరణ్యగర్భుని భార్యలము గాయత్రీసరస్వతులనువారము మేమీతీర్థద్వయరూపంబుల నిత్యంబునుండు మిందునీవు స్నానంబొనర్చిన కతంబున ప్రీతచిత్తలమైతిమి మోవలన మీకిష్టంబగు వరంబువేడుమనిన నాతండావించి వారల నిట్లనిస్తుతించె ఓ గాయత్రీసరస్వతులారా మీరలు విద్యాస్వరూపులరు సృష్టిస్థిత్యంత కారణభూతులరు వేదమాతృకలరు హవ్యకవ్యరూపకులరు చంద్రాదిత్యవిలోచనలరు సర్వదేవాధిపత్యంబు బొందినవారలు గిరిజయు కమలయును మీరయుష్మద్దర్శనమాత్రంబున జగంబులు సృష్టంబులగు యుష్మన్నిమేషణమాత్రమున ప్రళయంబునొందు మీవర్ణనమునం గృతార్థుండనైతి యాతీర్థద్వయంబున స్నానంబుచేసి కతంబునం బాపశుద్ధుండనైతి. నన్నింకబంధువులు

మొదలగు వారందరు ననుగ్రహింతు రికమీదమదీయంబగు బుద్ధి పాపకృత్యంబునం బ్రవేశింపక యుండునట్లు వరంబొసంగుడని వేడిన వారలట్లయగునని యనుగ్రహించి యాతీర్థద్వయంబునం దిరోధానంబునొందిరంత కాశ్యపుండును విధూతపాపుండై స్వదేశంబునకుం బోయిన సర్వజనంబులాతనిం గ్రహించిరి. ఓ మునీంద్రులారా గాయత్రీసరస్వతీ తీర్థద్వయస్నానప్రభావంబున కాశ్యపమునీంద్రునకు పాపమోక్షంబు గల్గిన తెరంగెరుంగించితి యెవ్వండైన నీయధ్యాయంబు భక్తియుక్తుండై పఠించు వినునతండు గాయత్రీసరస్వతీ తీర్థద్వయస్నానఫలంబునొందునని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరింగించెను.

ఇది స్కాందపురాణంబునందు సేతుమహాత్మ్యంబున
గాయత్రీసరస్వతీతీర్థద్వయప్రశంసయు కాశ్యపపాపశాంతియనుకథలంగల ..
నలువదొకటవ యధ్యాయము సంపూర్ణము.

## నలువదిరెండవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకల పురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా సేతుమధ్యమునంగల తీర్థంబులలో యనుత్తమంబులగు తీర్థంబుల ప్రభావంబువచించెద వినుండచట మహాపుణ్యప్రదంబగు ఋణవిమోచనంబను తీర్థంబొండుగలదందు స్నానముగావించిన వారలకు ఋణత్రయంబులునశించు మానవుండు బ్రహ్మచర్యంబు గావింపకంబోయెనేని ఋషిఋణంబు నొందుయజ్ఞాదులంగావింపకంబోయిన దేవఋణంబునొందు పుత్రులంబడయపోయెనేని పితృఋణంబునొందు ఎవ్వండైన బ్రహ్మచర్యయాగంబులం జేయక పుత్రులంబడయక పోయిన నందు స్నానంబుజేసి ఋణవిముక్తుండగు ఋషిదేవపితృసంఘంబు లాతీర్థంబున స్నానంబుజేసిన తృప్తింబొందునట్లు బ్రహ్మచర్యయజ్ఞపుత్రోత్పాదనంబులచే దృప్తింబొందరు ఏకారణంబున నాతీర్థము ఋణంబులంబాపుదానంజేసి ఋణమోక్షంబని ఖ్యాతింబొందె. నందు స్నానముజేసిన మనుజుడు దారిద్ర్యదుఃఖములనొందక ధనప్రాప్తింబొంది సకల సుఖములబొందు నతీర్థమునకు సదృశతీర్థము లేదు మరియు ధర్మపుత్రాది పంచపాండవులచే నిర్మితమగు తీర్థమొక్కటిగల దాతీర్థతీరమున పూర్వమునందు ధర్మనందనాదులు యజ్ఞములంగావించిరి అందులోకమునగల తీర్థములన్నియు సన్నిహితములై యుండు ఆదిత్యవసురుద్రసాధ్యాది మరుద్గణములును సన్నిధానముజేయుచుందురు ఎవ్వండైన నాతీర్థమున స్నానముగావించి పితృదేవతర్పణములంజేయు నాతండు సర్వపాపవిముక్తుండై బ్రహ్మలోకసుఖమునొందు ఏనరుడైన నాతీర్థతీరమున నొకబ్రాహ్మణునకన్నంబొసంగు నాతండితాపరములను మోదమునొందు బ్రాహ్మణుండైనను క్షత్రియుండైనను

వైశ్యుండైనను శూద్రుండైనను యెవ్వండైన నాతీర్థంబున స్నానంబుగావించు నతండె న్నండు నరకంబులంబొందడు కుయోనిసంభవుండును గానేరడు యేజనుండైన సాయం ప్రాతఃకాలంబుల నాతీర్థంబు స్మరించునతండు గంగాదితీర్థంబులనెల్ల స్నానంబు జేసిన ఫలంబునొందు సంశయంబులేదు మరియును పాకశాసనాదినిర్జరులేప్రదేశంబున దైత్య జయంబుగోరి యజ్ఞంబులు గావించిరదియ దేవతీర్థంబని ఖ్యాతింబొందె నరుండందు స్నానంబుగావించిన సకల పాపనిర్ముక్తుండై సర్వకామప్రదంబులగు యక్షయలోకంబులం బొందు యేమానవుండైన మానినియైనను జన్మప్రభృతిపాపంబులంజేసి పిమ్మట పశ్చాత్తాపతప్తులై యాతీర్థంబునకరిగి స్నానంబొనర్చిరేని పరిశుద్ధులగుదురు సకల సురసంఘంబులందు రమానాథునిచందంబున నాతీర్థం బెల్లతీర్థంబులకు నుత్తమంబై ప్రకాశించుచుండు వర్షశతంబులగ్నిపూజనంబుగావించువాడును నాతీర్థంబున సకృత్ స్నానంబుజేసిన వాడును వీరిరువురును సమానఫలంబునొందుదు రింతకుసందియంబులేదు దేవతీర్థస్నానంబును తత్తీరనివాసంబును దానంబును జనంబులకు దుర్లభంబు యేనరుండైన దేవర్షి పితృసేవితంబగు యాతీర్థంబుజేరిన మాత్రంబున అశ్వమేధఫలంబును విష్ణులోకంబునొందు ద్విత్రిచతుర్థపంచదినంబులైన నాతీరంబున వాసంబుజేసిన జనుండు సకలసిద్ధులంబొంది మరల జన్మంబునొందడాతీర్థంబు స్మరించిన మాత్రంబున సకల పాపంబులు నశించు నాతటంబునం బితృసమూహంబుల దేవసంఘంబులం బూజించు మానవుం డఖిలసమృద్ధింబొంది సర్వయజ్ఞఫలంబునుంబొందు నాదేవతీర్థసదృశంబెచటను లేదుగాన ఐహికాముష్మికఫలంబులగోరువారందరు స్నానంబుగావింపవలయు నాతీర్థమాహాత్మ్యంబు వచింప నేశక్తుడంగాను మరియును విముక్తిదంబగు రామసేతువునందు సుగ్రీవతీర్థంబని యొక తీర్థంబుగలదందుస్నానంబుగావించిన నరుండు బ్రహ్మహత్యాదిపాపంబుల నాశనంబుగావించి గోసహస్రదానఫలంబునుంబొంది పిమ్మట సూర్యలోకంబునొందు ఏమానవుండైనను సుగ్రీవతీర్థంబుస్మరించిన వేదపారాయణఫలంబునొంది జాతిస్మరణంబుగలవాడగు మరియు నాతీర్థంబు సర్వాభీష్టప్రదంబై వెలయుచుండు తన్మాహాత్మ్యంబువచించితి మరియు నాసేతువునందు నళతీర్థంబను తీర్థంబొండుగలదందు స్నానంబొనర్చిననరుం డఖిలపాపవిమోచనంబునొంది యగ్నిష్టోమాతిరాత్రఫలంబులంబొంది స్వర్గలోకంబునొందు నాతీర్థతటంబునందిరాత్రంబులుపితృసంఘంబులకుం బిండంబడినవారలు సూర్యసన్నిభ తేజోవంతులగుదురు అశ్వమేధఫలంబునుంగల్గు మరియునచ్చట మహాపాతకనాశనకారియు అగ్నిపుత్రుండగు నీలునిచేరచింపంబడినదియు విముక్తిదంబగు నీలతీర్థంబను తీర్థంబొండుగలదందు నరుండు స్నానంబొనర్చి సర్వపాపవిమోచితుండై బహుసువర్ణంబగు యాగంబునకు శతగుణఫలంబునొందు జనుండు సర్వాభీష్టప్రదంబయిన యాతీర్థంబునంగ్రుంకి సర్వకామంబులంబొంది యగ్నిలోకంబునొందు మరియు నాసేతువునందు గవాక్షకృతంబగు తీర్థంబొండుగలదందుస్నా

నంబుజేసిన నరుండు నరకంబువీక్షింపండు మరియు నంగదకృతంబగు తీర్థంబొండుగల దందుస్నానంబుజేసిన నరుండుదేవేంద్రత్వంబునొందు మరియు నారామసేతువునందు గజ గవయశరభకుముదహరపనసాది వానర కృతంబులగు తీర్థంబులనేకంబుగలవందు మజ్జనం బుజేసిన నరుండమృతత్వంబునొందు మరియు నారామసేతువునందు విభీషణ కృతంబగు తీర్థంబొండుగలదది మహాదుఃఖప్రశమనంబును మహాపాతక కాష్ఠానలోపంబును కుంభీ పాకాది నరకనివారణంబును దుస్స్వప్ననాశనంబును మహాదారిద్ర్యశమనంబునునై వెలయు నందుస్నానంబుజేసిన మానవుండు పునరావృత్తివర్జితంబగు వైకుంఠంబునొందు మరియు విభీషణమంత్రులచే నిర్మితంబులగు నాలుగు తీర్థంబులుగలవు వానియందు మనుజుండు స్నానంబుజేసి సర్వపాపంబులవలనంబాయు మరియు సరయూనది రామనాథుసేవింపం గోరి గంధమాదనంబున కరుదెంచి యందు వర్తించియున్నదాతీర్థంబున మజ్జనంబు జేసిన వారలు సర్వయజ్ఞతపస్తీర్థసేవాఫలంబులనొందుదురు మరియు నాగంధమాదనంబున దశ కోటిసహస్ర తీర్థంబులుగలవు మరియును గంగాది నదులును సప్తసాగరంబులును సకల ఋష్యాశ్రమంబులును పుణ్యవనంబులును హరిశంకరక్షేత్రంబులు నివియన్నియు నాగంధ మాదనపర్వతంబున సాన్నిధ్యంబుజేయుచుండు మరియు త్రయస్త్రింశత్కోటి దేవతలును పితృగణంబులు సిద్ధసాధ్యకిన్నరాదులు సకల మునిగణంబులు శ్రీరామచంద్రుని యాజ్ఞచే నందువసించి యుందురు. ఓ మునీంద్రులారా సర్వతీర్థంబుల వైభవంబు మీకెరుంగించితి యెవ్వండైన నీమహాత్మ్యంబు పఠించు వినునతండఖిల దుఃఖంబులంబాసి పునరావృత్తివర్జి తంబగు కైవల్యంబునొందునని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరింగించెను.

ఇది స్కాందపురాణంబునందు సేతుమాహాత్మ్యంబున
సర్వతీర్థప్రశంసయను కథగల
నలువదిరెండవ యధ్యాయము సంపూర్ణము.

## న లు వ ది మూ డ వ అ ధ్యా య ము.



మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకల పురాణవ్యాఖ్యానవైఖరీ సమేతుండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా శ్రవణమాత్రంబున సకల పాపంబుల నాశనంబుజేయు రామనాథమాహాత్మ్యంబెరుంగించెదవినుండు ఎమనుజుండైన రామప్ర తిష్ఠితంబగు లింగంబు సకృన్మాత్రంబు వీక్షించునతండుశివసాయుజ్యరూపిణియగు ముక్తిం బొందు లోకంబున మనుజుండు కృతయుగంబున దశవర్షంబులార్చిన పుణ్యఫలంబును త్రే తాయుగంబున నొక వర్షంబునంబొందు ద్వాపరంబున నొక మాసంబునంబొందు కలి యుగంబున నొకదివసంబునంబొందు నాఫలంబునకు కోటిగుణితంబు నిమిషమాత్రంబున

రామనాథు సేవించినంబొందు రామేశ్వర మహాలింగంబున సకల తీర్థంబులు నివసించి యుండు సకలదేవతలును పితృగణంబులును మునీంద్రులు నధివసించి యుండుదురు యేన రులయిన యేకకాలంబయినను ద్వికాలంబయినను కాలత్రయంబయినను నెల్లప్పుడైనను రామనాథుస్మరింపుచు కీర్తింపుచుందురో వారలు పాపపంజరవిముక్తులై సచ్చిదానందరూపుండును అద్వయితుండును సగురుత్రుంబొందుదురు జనంబులకు రామచంద్రపూజితంబగు రామేశ్వరలింగశ్రవణమాత్రంబున యమపీడాది బాధలుగలుగవు యేనరులైన రామేశ్వరమహాలింగంబును సక్తస్తోత్రంబు నర్చింపుదురో వార్లకు దానవ్రతయజ్ఞతపంబులేల ఏ మనుజుండైన రామేశ్వరమహాలింగంబును క్షణకాలంబైన స్మరింపకపోవునతండజ్ఞానియు పాపియు మూకుండును బధిరుండును జడుండును అంధుండుననగు నాతనికెల్లప్పుడు సకల ఛిద్రంబులు ధనక్షేత్రదారాదిహానియుం గలుగు.

ఓ మునీంద్రులారా రామేశ్వరమహాలింగంబు సక్తస్తోత్రంబైన వీక్షించువారికి కాశికయాత్రయాగలవలనం గార్యంబులేదు యేమానవుండు రామనాథునను నమస్కరించి పూజింపుచుండు నాతండు కృతార్థుండు వానిజన్మంబుసఫలంబు అట్లుజేయని మానవులు కృతార్థులుగారు రామేశ్వరలింగంబును పూజించువారలకు బ్రహ్మవిష్ణుశక్రాద్యఖిలామరులవలనం గార్యంబేమియులేదు రామనాథుంబూజింపక యుండువారికి సకల దుఃఖంబులు నరకంబునుం గలుగు రామేశ్వరలింగదర్శన మాత్రంబున బ్రహ్మహత్యా సురాపానాది దోషంబులును జన్మాంతర కృతంబులగు సకల పాపంబులును నశించు యేనరులైన సకల భోగంబుల రాజ్యంబును త్రిదశాలయంబునుం గోరుదురో వారలు రామనాథు సేవింపవలయు మెవ్వండైన సంపత్కౌతుకలోభభయంబులవలననైన రామనాథుస్మరించు నతండిహపరంబుల దుఃఖభాజనుండుగాడు నరుండు నిరంతరంబు రామేశ్వరమహాలింగంబు నర్చించుచు కీర్తించుచునుండెనేని దేహాంతంబున రుద్రసారూప్యంబునొందు సందియంబులేదు రామేశ్వరదర్శనంబు వీతిహోత్రుండింధనపుంజంబులంబోలె సకలపాపంబుల భస్మంబుజేయు రామేశ్వర మహాలింగ విషయకంబగు భక్తియష్టవిధంబై యుండు నదియెట్లనిన తద్భక్తజన వాత్సల్యంబును తత్పూజాపరితోషణంబును స్వయంతత్పూజనంబును తదర్థదేహచేష్టితంబును తన్మాహాత్మ్యకథాశ్రవణాదరంబును స్వరనేత్రశరీర వికారస్ఫురణంబును తల్లింగస్మరణంబును తల్లింగాశ్రయజీవనంబునునై వెలయుచుండు ముక్తిక్షేత్రంబులకెల్ల నాక్షేత్రంబదయాభాజనంబై యుష్మదాదియతులకు బ్రహ్మజ్ఞానంబువలనను వేదాంతశాస్త్రంబువలనను ముక్తియవిఘ్నంబునంగలుగునది వేదాంతశాస్త్ర శ్రవణంబులేకపోయినను యత్యాశ్రమంబువలన విరక్తింగాంచకపోయినను సకలాశ్రమవంతులగు వర్ణంబులకెల్ల రామేశ్వరసందర్శనంబునం గలుగు నాక్షేత్రంబున దేవతలును మునులును క్రిమికీటాది జంతువులు సర్వంబును రామనాథప్రసాదంబున సమంబై యుండు మానవుండు పాపంబొనర్చితి

నని భయంబునొందఁదగదు పుణ్యంబొనర్చితినని గర్వంబునొందఁదగదు రామేశ్వరమహాలింగంబెవ్వండైన భక్తిపూర్వకంబుగ దర్శనంబుగావించు నాతనికి చతుర్వేదంబుల నభ్యసించువాఁడునుం దుల్యుండుగాఁడు లోకంబున రామనాథభక్తుండగు శ్వపచునకైన దానంబులొసంగందగు యాభక్తిలేని మానవుండు త్రయీవిదుండైన దానార్హుండుగాఁడు యోగయుక్తులును నూర్ధ్వరేతస్కులైన మహామునీంద్రులకేగతిగల్గు నాగతి రామేశ్వరమహాలింగసందర్శనంబుగావించు సకలజంతుజాలంబునకుం గల్గు యేనరులైన రామనాథశివక్షేత్రంబున నెల్లప్పుడు నివసించెదరా నరులు త్రినేత్రులును భస్మదిగ్ధాంగులునుం బంచవక్త్రులు చంద్రాలంకృతమస్తకులును నానాభరణాన్వితులును వృషభధ్వజులునై మహాదేవసారూప్యంబునొందెద రిందుసందియంబులేదు యేమానవులైనను భక్తియుక్తులగుచు రామేశ్వరంబునకుం బోయెదరో వారలు ప్రతిపదంబునం దశ్వమేధయజ్ఞఫలంబుం జెందెదరు ఎవ్వండేనియు రామనాథతుష్టింగోరి వి ప్రునకొక గ్రామంబొసంగు నాతం డఖిలమహీమండలదానంబుగావించినవాఁడగు నెవ్వండేనియు రామనాథునకుం బత్రపుష్పఫలతోయంబుల సభక్తికంబుగ సమర్పించు నతనికి రామనాథుండు ప్రీతుండై యహర్నిశంబులు రక్షించుచుండు కరుణాకరుండగు రామనాథునందు భక్తిగల్గుటయు పూజించుటయు స్తుతించుటయు స్మరించుటయు నతిదుర్లభంబగు ఏ మనుజులైనను ద్రిలోచనుండగు రామనాథు శరణంబునొందెదరో వారలిహపరంబులందునలాభజయంబులనొందెదరు యేనరునికైన రామనాథవిషయకంబగు బుద్ధినిరంతరంబుగలిగి యుండెడు నతండతిధన్యుండు నెవ్వండైన రామనాథుంబూజింపకయుండెడు నతండు భుక్తిముక్తిరాజ్యంబులకుం బాత్రుండుగానేరఁడు రామనాథు నెవ్వండేని బూజించు నతండు భుక్తిముక్తిరాజ్యంబులం బొందు రామనాథార్చనాసమంబునధికంబును నగు పుణ్యంబన్యంబెద్దియు గలుగదు రామనాథేశ్వరు నెవ్వండేని మోహితుండై ద్వేషించు నాతం డయుత బ్రహ్మహత్యలొనరించినవాఁడగు వానితోడ సంభాషించువాఁడును నరకప్రాప్తుండగు, లోకంబున సకలదేవతలు సర్వరంబులు సర్వంబును రామనాథపరంబులగుచుండు రామనాథునకన్యం బెద్దియులేదుగావున నరుండు సర్వంబునకుం బాసి రామనాథు నాశ్రయింపవలయు నట్లొనరించినవానికి దుర్గతిగలుగదు, శివలోకంబు ప్రాప్తంబగు రామనాథుని సేవించుటవలన ననేకయజ్ఞదానతపస్తీర్థనిషేవణంబులకన్నం గోటిగుణితంబగు ఫలంబుగల్గు, నెవ్వండైనను మధ్యాహ్నకాలంబున రామనాథదర్శనంబొనరించు నతనికి సురాపానదోషసహస్రంబులు నశియించు, సాయంకాలంబునం దేనరుండేని రామనాథుని దర్శించు నతండు గురుదారగమనపాతకంబులం బొలంగు, నెవ్వండైనను సాయంకాలంబున రామనాథుని స్తోత్రంబుసల్పు నతండు స్వర్ణస్తేయసహస్రంబు నిరసించు, ఏ మనుజునకైన ధనుష్కోటితీర్థస్నానంబును రామనాథసందర్శనంబునుగల్గు నతనికి గంగాస్నానంబువలన కార్యంబులేదు, యేమానవుండైన ఘటి

కాద్వయకాలంబు రామనాథునిం జింతించునతం డిరువదియొకకులంబులనుద్ధరించి శివలోకమునను౦డు, నెవ్వండేని యొకదినంబున రామనాథునిదర్శించునతం డిహంబున ధనవంతుడై యుండి యంతమున రుద్రత్వంబునొందు, రామనాథ మహాలింగసేవవలన గలుగని ఫలం బితరధర్మంబుల నెన్నడైనను గలుగదు, ఎవ్వడైన జీవితకాలమధ్యంబున నొకానొకప్పుడైన రామనాథదర్శనము సేయనినతండు పితృబీజసంభవుండుగాడు సంకరుండని చెప్పంబడు, యేమనుజుడైన ప్రాతఃకాలమున శయనోత్థితుండై త్రివారంబులు రామనాథుని స్మరించునాతండు పూర్వదినంబున చేసిన పాపము నశించు, భక్తరక్షణదీక్షితంబును ప్రసన్నంబగు రామనాథలింగంబు గల్గియుండు జనులు మూఢులై యాతనల నేలం బొందెదరు, రామనాథమహాలింగ సేవవలన సకలక్లేశంబులు సూర్యోదయంబైన హిమంబునుంబోలె నశించు, ఏమానవుండైన ప్రాణోత్క్రమణవేళయందు రామనాథుస్మరించెనేని యతండు మరల జన్మంబునొందక శంకరుం జేరు, యేమనుజుండైన నిరంతరమును వచించుచుండు నాతండు సకలబాధలం బొందడు. మరియు రామనాథునామంబుల స్మరించు మానవుండు కామక్రోధపీడితుండుగాక పాపశుద్ధిం బొందు యేమనుజుండైన రామనాథాలయంబు దారువులచే నొనర్చునతండు త్రికోటికులసంయుతుండై స్వర్గసుఖంబులం బొందు, యెవ్వండైన యిష్టకంబులచే గావించునతండు వైకుంఠంబునొందు, శిలాసమూహములనొనర్చునతండు బ్రహ్మపదంబునొందు, యెవ్వండైన స్ఫటికాదిశిలాభేదంబులం గావించునతండు విమానవరంబునొంది శివలోకసుఖంబులం బొందు, యేమనుజుండైన తామ్రంబులనొనర్చునాతండు శివధ్యానస్థితుండై శివసామీప్యంబునొందు, యేమనుజుండు రజితంబుల నొనర్చునతండు శివసామీప్యంబునొంది మహాదేవు చెంతంబున నిరంతరంబు మోదించుచుండు, యెవ్వండైన భక్తియుతుండై స్వర్ణంబుచే నొనర్చునతండు శివసాయుజ్య రూపిణియగు ముక్తిం బొందు, లోకంబున హేమంబున నాశివాలయంబు నొనర్చిన ధనాఢ్యుండును మృత్సమూహంబుల నాయాలయంబు గావించిన దరిద్రుండును వీరిరువురును సమానఫలంబునొందుదురు, యేమానవుండైన రామనాథమహాలింగస్నానకాలంబున త్రిసంధ్యంబును నాట్యంబును కాహళాదివాద్యంబులం గావించునాతం డఖిలపాపవిముక్తుండై రుద్రలోకంబు నొందు, యెవ్వండైన రామనాథాభిషేక సమయంబున రుద్రాధ్యాయంబును చమకంబును పురుషసూక్తంబును త్రిసుపర్ణంబును పంచశాంతియు పావమానాదికంబును జపించునతండు నరకంబునొందడు యేనరుండైన పంచగవ్యంబుల రామనాథమహాలింగ స్నానంబు గావించునతం డాక్షణంబున కల్పజన్మార్జిత పాపంబులం బొలంగు, మధుస్నానంబు జేయించిన మనుజుండు పాపరాశిం బాసి బ్రహ్మలోకంబునొందు, ఘృతస్నానంబు గావించిన మనుజుం డఖిలజన్మకృతపాపసమూహంబులం బాయు, క్షీరస్నానంబు గావించిన మర్త్యుం డేకవింశతికులోద్ధారణం బొనర్చి శివలోకంబునొందు, దధిస్నానంబు జేయించిననరుం డఖి

లపాపవినిర్ముక్తుండై విష్ణులోకంబునొందు, తిలతైలాభ్యంగనంబొనర్చిన మానవుండు కుబేరగృహంబునవసించు, ఇక్షురసంబుల స్నానంబుచేయించిన మనుజుండు చంద్రలోకంబునొందు, లికుచామ్రరసాసారంబున మజ్జనంబుజేయించిన నరుండు పితృలోకంబునొందు, నారికేళజలంబుల స్నానంబుగావించిన మానవుండు బ్రహ్మహత్యాదిమహాపాతకంబుల నాశనంబుజేయు, రంభాపక్వవిమర్దిత స్నానంబుచేయించిననరుం డఖిలపాపంబులంబాసి వాయులోకంబునొందు, వస్త్రపూతతోయంబున మజ్జనంబుజేయించినజనుడు వరుణలోకంబునొందు, చందనధారాసమూహంబుల స్నానంబుచేయించిన మానవుండు గాంధర్వలోకసుఖంబులంబొందు, పుష్పవాసితతోయంబుల స్నానంబుజేయించిన నరుండు మహేంద్రసింహాసనంబునొంది దేవేంద్రుంగూడి మోదించుచుండు యేనరుండైన పాటలోత్పలకల్హారపున్నాగకరవీరకాది పుష్పవాసితంబగు జలంబుచే స్నానంబుచేయించునతం డఖిలపాతకంబులం బాయు, మరియు నితరపుష్పవాసితంబులగు తోయంబుల మజ్జనంబుచేయించినమానవుండు శివలోకంబునొందు, యేమనుజుండైన విశుద్ధబుద్ధియై గోలాకర్పూరలామజ్జ వాసితంబులగు జలంబుల రామేశ్వరమహాలింగాభిషేకంబు గావించునతం డఖిలకామంబులంబొంది యాగ్నేయలోకంబునొందు, మరియు రామనాథాభిషేకార్థంబై మృద్ఘటం బేనరుండొసంగునతం డిహంబున శతాయువై సకలసమృద్ధులంబొందు, తామ్రకుంభంబొసంగినమనుజుండు దేవేంద్రత్వంబునొందు, రౌప్యకుంభప్రదానంబుగావించిన జనుండు పరమేష్ఠిలోకంబునొందు, హేమకుంభదానంబుచేసిననరుం డీశ్వరలోకంబునొందు, రత్నకుంభదానంబుగావించిన మానవుండు శివసారూప్యంబునొందు, ఏమనుజుండైన గోదానంబుగావించునతం డశ్వమేధఫలంబునొంది దేహాంతంబున ఈశ్వరలోకంబునకరిగి శివరూపభాజియై వెలయు, నేమనుజుండైన రామసేతువునందు ధనుష్కోటితీరంబునం దెచటనైన రామనాథుందలంచుచు స్నానంబుసేయునతండు సేతుస్నానఫలంబునొందు, రామనాథాలయంబును మఘాత్తలిప్తంబుగాచేయు నతనిపుణ్యంబు వచింప నేవర్షశతంబులకైనం జాల నూతనంబుగాచేయునతండు బ్రహ్మహత్యాదిపాపంబుల నిరసించి తత్తత్కృత్యశతగుణఫలంబునొందు, రామనాథపురోభాగంబున దీపారోపణంబు సేయునతం డవిద్యాపటలంబుభేదించి సనాతనంబగు బ్రహ్మత్వంబునొందు, రామనాథునకు ఘృతతైలదుగ్ధశర్కరతండులాదులనొసంగునాతండు దేవేంద్రపదంబునొందు, రామనాథమహాలింగదర్శనస్పర్శనంబులం జేసినపాపంబులు తత్క్షణంబ నశించు, రామనాథునకు మహాఘంటయు దర్పణంబును నొసంగువాడు దివ్యవిమానారూఢుండై సంచరించుచు దివ్యభోగంబులంబొందు అనేకయుగపర్యంతం బీశ్వరలోకంబున వసించు, యెవ్వడైన రామనాథుంగూర్చి స్వల్పంబేనియొసంగిన అనంతఫలంబుగల్గు, యెవ్వడైన మహాక్షేత్రంబగు రామేశ్వరంబున రామనాథసన్నిధియందు వసించునతండు ముక్తింబొందు, జనంబులకాయువు త్వరితంబుగ

నరుగు, యౌవనమును సంపదలును దారాపుత్రాదులన్నియుంబోవు గృహక్షేత్రాదికంబులన్నియు నృపాదులచే బాధితంబులు, సర్వంబును క్షణభంగురములుగాన నరుండు సర్వంబునుమాని ఆపన్నార్తిహరంబగు రామమహాలింగంబు సేవించి కీర్తింపవలయు వినవలయు స్మరింపవలయు రామేశ్వరుంగూర్చి గ్రామములనొసంగువాడు ప్రారబ్ధదేహాంతంబున శివరూపంబునొందు, లోకంబున సర్వపాత్రములయందు రామనాథుం డుత్తమపాత్రుండై వెలయుగాన ద్విజుండా రామనాథునకు స్వల్పంబైననొసంగిన యనంతసుఖంబునొంది సార్వభౌముండగు రామనాథుని సేవించునందాక పాపంబులుండు పిమ్మట నాశనంబునొందు, ఏనరులైన రామనాథునకు తాళవృంతధ్వజ ఛత్రచందనాదుల తామ్రకాంస్య రజత హేమమయఘటమ్ముల నొసంగువారలు భవాంతరంబున మండలాధిపతులై యుదయింతురు, యేమానవులైన రామనాథపూజార్థంబై పుష్పోత్పాదంబుజేయుదు రానరులశ్వమేధాదియాగఫలములంబొందుదురు, లోకంబున రామనాథమహాలింగంబు బూజించి వీక్షించిన వినిన స్మరించినవారలకు దుర్లభంబెద్దియులేదు, రామనాథు సేవింపంబోవుచుండు మనుజుంగాంచిన సకలపాపములు క్షీణింబొందు, రామనాథువీక్షించువారికి వేదములు శాస్త్రములు తీర్థయాత్రలేల, ఏనరుండైన చందనకుంకుమకోష్ఠ కస్తూరి గుగ్గులు సరళాదులనొసంగునతండు ధనాఢ్యుండగు ముక్తాభరణవస్త్రాదుల నొసంగువాడెన్నండును దౌర్గత్యంబునొందడు, యెవ్వండైన సమాహృతంబులగు గంగాతోయంబుల రామనాథమహాలింగాభిషేకంబుజేయునతం డీశ్వరునకుం బూజ్యుండు నిందుకు సంశయంబులేదు, ఏపర్యంతంబు మనుజులకు జరామరణంబుగల్గు నందాక సకలలోకవంద్యుండును పూజ్యుండును స్తుత్యుండునునగు రామనాథుని భజింపవలయు, సకలపురాణంబుల శ్రీశాస్త్రాదులందు రామనాథపూజాసదృశంబగు ధర్మంబులేదు గాన భక్తియుక్తులై మహాకారుణికుండగు రామనాథేశ్వరుభజించువారలు భూలోకంబున పుత్రదారయుతులై బహుభోగంబులం బొంది దేహాంతంబున శాశ్వతంబగు ముక్తింబొందుదురు. ఓ మునీంద్రులారా రామనాథప్రభావం బెరుంగించితి ఎవ్వండైన నీయధ్యాయంబు నిత్యంబును భక్తియుక్తుండై పఠించు వినునతండు రామనాథసేవాఫలంబును ధనుష్కోటిస్నానఫలంబునుంబొందు.

ఇది స్కాందపురాణంబునం గల సేతుమాహాత్మ్యంబున
నలువదిమూడవ యధ్యాయము సంపూర్ణము.

## నలువదినాలుగవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులు సకల పురాణార్ణవపారగుండును వ్యాసపాదాంబుజ ద్వంద్వసమర్చనరతాశుభుండగు సూతుంగాంచి యిట్లనిరి. ఓ మహాత్మా సేతుమాహాత్మ్యశ్రవణంబువలన మేము కృతార్థులమైతిమి పూర్వంబున దశరథా

త్మజుండగు శ్రీరామభద్రుండేల లింగప్రతిష్ఠ గావించె నావిధంబంతయు వినంగోరెద మెరుంగింపుమనిన సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా గంధమాదనపర్వతంబున రఘునాయకుండు లింగస్థాపనం బొనర్చిన తెరంగెరుంగించెద వినుండు పూర్వంబున దశరథనందనుండు బలియుండగు రావణుచే హృతభార్యుండై కపిసేనలంగూడి సౌమిత్రిసమేతుండై మహేంద్రగిరి సమీపంబునకరిగి భీషణంబగు వారిధిం గాంచియందు సేతుబంధనంబు గావించి యామార్గంబున రావణపాలితంబగు లంకాపురింజేరి నిశాముఖంబున కపిసేనలంగూడి సువేలాగిరిపై వసియించియుండ వానరేంద్రుండు సౌధోపరిస్థితుండగు లంకేశ్వరుం గాంచి యాతనిమకుటంబు భూమిం బడ మోదిన నతండు భగ్నకిరీటుండయి గృహంబునకుంబోయె నంత శ్రీరామచంద్రుండు సానుజుండై యాగిరిపై సేనానివేశనంబు గావించె నంత నిశాచరానీకంబులు రావణప్రేరితులై మహాకాయులును సైన్యసమేతులునగుచు యుద్ధంబునకేతెంచిరంత మహాతేజులగు వానరులా నిశాచరానీకంబులంగూడి యుద్ధంబు గావించి వారలనెల్ల విగతాసులం జేయ రావణుండు క్రోధప్రదీప్తుండై యరుదెంచి యా వానరులనెల్ల సాయకసమూహంబుల విదళించుచుండ రఘునాయకుండు కోదండంబుగొని యారావణుపై నడరె నంత యారాక్షసవానరానీకంబులకు ద్వంద్వయుద్ధంబయ్యె నదియెట్లనిన దశాననుతో శ్రీరామచంద్రుండును మేఘనాథుతో లక్ష్మణుండును విరూపాక్షుతో సుగ్రీవుండును తారేయుతో కర్పటుండును పౌండ్రునితో నలుండును పుటకునితో పనసుండును మరియు ననేకులంగూడి ద్వంద్వయుద్ధంబు చేయుచుండ భీమబలులగు వానరులచే పీడింపంబడి నక్తంచరులు భీతిం బొంది రావణుపాలితంబగు లంకకు బరువిడిన రాక్షసేంద్రుండు స్వపుత్రుండగు మేఘనాథు రణంబునకుం బంప నాతండతిదారుణంబులగు నాగపాశంబులచే రామలక్ష్మణులం బంధించె నంత వైనతేయుండరుదెంచి నామహామహులకు బంధవిమోచనంబు గావించిచనియె నంత రావణప్రేరితుండై ప్రహస్తుండరుదెంచి యతి భయంకరంబగు గదచే విభీషణు మోదిన నతండు హిమవంతుంబోలె చలింపక అష్టఘంటాభీషణంబగు శక్తిం గొని యాప్రహస్తుపై వైవ నతండు భగ్నోత్తమాంగుండై వాయురుగ్ణవృక్షంబుకరణి భూమిం బడిన యాతనిం గాంచి ధూమ్రాక్షుండేతెంచిన వాయునందనుండు ద్రుమంబుగొని యమసదనంబునకుం బంపె నంత హతశేషులగు నిశాచరులు పలాయమానులై రావణసమీపంబునకుంబోయి యావెరం గెరుంగింప నతండు కుంభకర్ణుని దనివారించి యుద్ధంబునకు బంప లక్ష్మణుండాతనిపై బ్రహ్మాస్త్రంబు వైవ నతండు గతాసుండై భూమిం బడె నయ్యవసరంబున రావణసదృశులగు దూషణానుజు లిర్వురు హనుమన్నీలులచే నిహతులైరి నలుండు వజ్రదంష్ట్రుం వధించె కుముదుండకంపనుసంహరించె నంత పషియుండు దశవదనుండు పరాజితుండై స్వపురంబునకరిగె నంత లక్ష్మణుచే నతికాయుండును త్రిశిరుండును నిహతులైరి సుగ్రీవుండు కుంభకర్ణపుత్రుల యమనికేతనంబు

నకుంబంపె. విభీషణుండు మకరాక్షుంజంపె నంత రజనీచరనాయకుండు మేఘనాధుం బంప నతండు వానరులనెల్ల స్వకీయాశుగంబులచే బీడించి రామలక్ష్మణ దృష్టిగతుండుగాక యంతర్థానగతుండయ్యె నంత విభీషణుండు రామచంద్రు సమీపంబుజేరి ప్రాంజలియై యిట్లనియె.

ఓ మహాత్మా రాజరాజ శాసనంబున తద్భృత్యుం డొకండు జలంబుగొని త్వత్సకాంబునజేరె నీజలంబుచే స్పృష్టనయనుండవైతివేని అంతర్హిత భూతంబులం గాంచెదవనిన శ్రీరాముం డంగీకరించి లక్ష్మణసహితుండై యావారింగొని నేత్రశౌచంబుగావింప సుగ్రీవుండును జాంబవంతుడును హనుమంతుండును మొదలగువానరులంద రాజలంబుచే శుద్ధలోచనులై యంతర్హితుండగు రావణతనూజుంగాంచి రంత లక్ష్మణుండు క్రుద్ధుండై కుబేరమంత్రితజలపవిత్రీకృతలోచనుండై యాయింద్రజిత్తుపై గవియ నాయిర్వురకు శక్రశంబరులకుంబోలె నత్యాశ్చర్యకరంబగు యుద్ధంబయ్యెనంత తృతీయ దినంబున మేఘనాధుండు లక్ష్మణునిచే నిహతుండయ్యె నాతరి రామచంద్రుండు మూలబలంబును నాశనంబుగావించె నంత దశగ్రీవుండు క్రుద్ధుండై రథారూఢుండును సైన్యపరివృతుండునునై విధివశంబున రామచంద్రుంజేరె నంత శక్రప్రేరితుండై మాతలిరథంబుగొని రఘునాధసమీపంబుజేరినతన్నృపశ్రేష్ఠుడగు రామచంద్రుండు రథారోహణంబుగావించి బ్రహ్మాస్త్రంబుచే నాదశవదను శిరంబులఖండించి వధించెనంత సిద్ధవిద్యాధరాది సకల సురసంఘంబులు మునీంద్రులునేకవిధంబుల నారామచంద్రుంబొగడి పుష్పవర్షంబుల వర్షించి రంత శ్రీరామచంద్రుండు సీతాసౌమిత్రిసహితుండును కపిసేనాయుతుండును పుష్పకారూఢుండునునగుచు విభీషణు లంకారాజ్యంబునకభిషిక్తుంజేసి గంధమాదనపర్వతంబుజేరి యందు సీతంబరిశోధించి యుండు సమయంబున వానరేంద్రుసమీపంబున నగస్త్యాది మునీంద్రులరుదెంచి యివ్విధంబున బొగడిరి. ఓ రఘునాయకా నీవు లోకానుగ్రహకారివి రావణవధంబు గావింప భూతలంబునం జనించినవాడవు తాటకాదేహసంహారివి గాధిజాధ్వర రక్షకుండవు మారీచసుబాహుప్రాణహారివి అహల్యాముక్తసంధాయి పాదపంకజరేణుండవు హరకోదండభంజనుండవు మైథిలీపాణిగ్రహణోత్సవశాలివి రేణుకాపుత్రపరాజయకారివి పితృవచనంబు సత్యంబుగావింప వైదేహీలక్ష్మణసహితుండవై యరణ్యంబున కరుదెంచితివి భరతునకు పాదుకాయుగళంబొసంగి శరభంగ మహామునీంద్రునకు కైవల్యంబొసంగితివి విరాధప్రాణనాశనంబుగావించితివి గృధ్రరాజసఖుండవైతివి మాయామృగమారీచగర్వంబు వారించితివి కబంధుంబరిమార్చితివి శబరీపూజనంబంగీకరించితివి సుగ్రీవసఖ్యంబుగావించి వాలింబరేతనిలయంబ కనిచితివి మహాగంభీరంబగు సముద్రంబున సేతుబంధనంబుగావించి రావణాది సకల రాక్షసపుంజంబులవధించి లోకత్రయంబునుం గాచితివి, మఱియును సంసారాంబుధి సంతారపోతః పాదాంబుజద్వయుండవు భక్తార్తిసంహారివి సచ్చిదానంద రూపుండవు సు

ర్వలోకసృష్టిస్థిత్యంత హేతుభూతుండవు కరుణామూ ర్తిసభ క్తరక్షణదీక్షితుండవు మమ్ము రావవేయని పలువిధంబులం బ్రార్థించి యగస్త్యాదులూరకయుండిరి. ఓ మునీంద్రులారా మహర్షికృతంబగునీస్తోత్రంబుపఠించినవాడు భుక్తిముక్తులంబొందు ప్రయాణకాలంబునం బఠించువానికి భయంబుగల్గదు యీస్తోత్రపఠనంబువలన భూతభేతాళాదులు సకల రోగంబులు సర్వపాపంబులు నశించు మరియు పుత్రుంగోరినవాడు సత్పుత్రుంబొందు పతింగోరి నవనితసత్పతింబొందు మోక్షంబుగోరి పఠించినవాడు మోక్షంబునొందు ధనంబుగోరినవాడు ధనంబునొందు సర్వకామంబులంగోరిన మనుజుండీప్సితపరంపరలంబొందు. ఓ మునీంద్రులారా యాసమయంబున శ్రీరామచంద్రుండు అగస్త్యాది మునులంగాంచి ప్రాంజలియై యిట్లనియె.

ఓ తపోధనులారా నేసగ్వమానవులచే విశుద్ధికొరకు సేవనీయుండను దృష్టిగోచరంబగు జంతువు మోక్షభాజనంబగు అట్లైనను శాంతులు నిరహంకారులును యథాలాభసంతుష్టులును సర్వభూతదయాళులును ఊర్ధ్వరేతులగు మునీంద్రులకు నిరంతరంబు నమస్కరింపుచుండుగాన బ్రహ్మణ్యదేవుండనైతి మిమ్మేకకార్యంబువేడెద రావణవధంబునం గలిగిన పాతకంబునకుం బ్రాయశ్చిత్తం బెరుంగింపుండనిన మునీంద్రులిట్లనిరి. ఓ జగన్నాథా ఓ సత్యవ్రతా మహాపుణ్యంబును విముక్తిదంబగు నీగంధమాదనపర్వతంబున లోకోపకారార్థంబై శివలింగ ప్రతిష్ఠంగావింపుము దాన నీదశాననవధదోషంబు నశించు లింగస్థాపన పుణ్యంబువచింప చతుర్ముఖుండైన సమర్థుండుగాడు యీగంధమాదనంబున నీచేస్థాపితంబగు శివలింగదర్శనంబున జనంబులకు కాశీలింగావలోకన ఫలంబుకన్న కోటిగుణిత ఫలంబుగల్గు నిందుకుసందియంబులేదు మరియు నాలింగంబు భవన్నామంబుచే రామలింగంబని ఖ్యాతింబొంది కాష్ఠపుంజంబుల దహనుండుంబోలె సకల పాపంబుల నాశనంబుజేయుచుండు గాననోకరుణాకర విగ్రహలింగస్థాపనంబున కాలస్యంబుజేయకుమని మునీంద్రులు పలికిన రామచంద్రుండు ద్విముహూర్తంబగు పుణ్యకాలంబునిశ్చయించి మహాబలుండగు హనుమంతుంగాంచి యిట్లనియె. ఓ అంజనీపుత్రుండా త్వరితంబుగ కైలాసంబునకుంబోయి శివలింగంబుదెమ్మని యాజ్ఞాపింపనతండాక్షణంబ సర్వదేవమునీంద్రులు చూచుచుండవియన్మార్గంబున కెగసి కైలాసంబుజేరి మహాదేవుంగూర్చి కుశాగ్రసమాసీనుండును ఊర్ధ్వబాహుండును నిరాలంబుండును నిరుచ్ఛ్వాసుండును జితేంద్రియుండగుచు, దపంబుగావింప మహేశుండుప్రీతుండై లింగంబొసంగ దానింగొని మారుతపుత్రుండేతెంచుచుండె నాసమయంబున అగస్త్యాదిమునీంద్రులు శ్రీరామచంద్రుంగాంచి యిట్లనిరి. ఓ రఘుప్రవరాహనూమంతుండు రాకమసలె పుణ్యకాలంబరిగెడు గాన శీఘ్రంబున జానకీకృతంబగు సైకతలింగస్థాపనంబు జేయుమనిపలికిన రామచంద్రుడును కృతకౌతుకమంగళుండై జ్యేష్ఠశుక్లపక్షంబునదశమియందు బుధవారంబున హస్తానక్షత్రంబున గరజీవ్యతీపాతలయందు నిశాకరుండు క

న్యాగతుండై యుండ విభావసుండు వృషగతుండై యుండ యిట్టివశయోగంబున మహాపుణ్య ప్రదంబగు గంధమాదనపర్వతంబున కృత్తివసనంబును చంద్రకళాధారియగు మహాదేవలింగ స్థాపనంబుజేసి పూజింపనాలింగస్థుండగు మహాదేవుండుప్రీతుండై పార్వతీసహితుండై ప్రత్య క్షంబొసంగి సర్వలోకశరణ్యుండగు రామచంద్రుంగాంచి, ఓ రఘూద్వహ నీచేస్థాపింపం బడిన యీమహాలింగంబే మనుజులైన వీక్షింతురో వారల సకల పాపంబులు నశించు మరి యు నీధనుష్కోటిస్నానంబుజేసినను పాపసంఘంబులు నశించు నిందుకుసందియంబు లేదని వరంబొసంగి యంతర్హితుండయ్యెనంతరామచంద్రుండు తదగ్రంబున నందికేశస్థాపనంబు జేసి లింగాభిషేకార్థంబై ధనుష్కోటిచే నొక కూపంబునిర్మించి తజ్జలంబుల లింగాభిషే కంబుగావించె గాన నాకూపంబు కోటితీర్థంబని ఖ్యాతింబొందె తదీయమై భవంబు పూర్వం బున మీకెరుంగించియున్నవాడ పిమ్మట సకల సురసంఘంబులు మునిగణంబులు వానర స మూహంబులు వారువారొక లింగస్థాపనంబు జేసిరి. ఓ మునీంద్రులారా యివ్విధంబున శ్రీ రామచంద్రుడు లింగస్థాపనంబుగావించె నేమానవుండైన నీలింగప్రతిష్ఠ భక్తియుక్తుండై పఠించు వినునాతండు రామనాథప్రసాదంబున రామేశ్వర మహాలింగసేవాఫలంబును శివ సాయుజ్యంబునొందునని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరుంగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు
రామనాథ ప్రతిష్ఠావిధిగల
నలువదినాలవ యధ్యాయము సంపూర్ణము.

---

## నలువదియైదవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకలపురాణవ్యాఖ్యానవైఖ రీసమేతుండగు సూతుండిట్లనియె ఓ మునీంద్రులారా యివ్విధంబున శ్రీరామచంద్రుం డు లింగస్థాపనంబుజేసినయనంతరంబ నాంజనేయుండు లింగద్వయంబుగొని యరుదెం చి శ్రీరామచంద్రునకు వందనంబుగావించి వైదేహిలక్ష్మణ సుగ్రీవాదులకెరగి పీతాకృత సైకతలింగంబుభూజించు రఘూద్వహుంగాంచి క్రోధపరవశుండై అత్యంతఖేదఖిన్నుండు ను వృథాకృతపరిశ్రముండగుచు సర్వశరణ్యుండగు రామచంద్రునితో నిట్లనియె ఓదేవా నేదుర్జాతుండ లోకంబున క్లేశంబునకైజనించితినే క్రూరకర్ములగు నక్తాంచరానీకంబులచే ననేకవిధంబుల ఖిన్నుండనైతి నావంటిపుత్రునేవనితయుంగాంచకయుండిన నేలునే భవ సాగరనిమగ్నుండనై భవదీయసేవచేతను యుద్ధంబుచేతను బహుప్రకారంబుల ఖిన్నుండ నై యనంతదుఃఖంబులనొందితి సుగ్రీవుండు భార్యార్థంబై విభీషణుండు రాజ్యార్థంబై నిన్ను సేవించిరినే నిర్హేతుకంబుగ నిన్ను సేవించుచున్నవాడ యనేకవానరానీకంబులో

నన్ను కైలాసంబునకుంబోయి లింగంబుదెమ్మని యాజ్ఞాపించితివి నేనునుత్వరితంబుగ కైలాసంబుజేరి పినాకింబొగడి తత్ప్రసాదప్రాప్తంబగు లింగంబుగొనియరుదెంచితి నీవిప్పుడు సైకతలింగస్థాపనంబుజేసి దేవమునిప్రభృతులంగూడిపూజించెదవు నేకైలాసంబుననుంచి దెచ్చినలింగంబు వ్యర్థంబయ్యె నేమందభాగ్యుండ భూభారంబునకైజన్మించితి యీదుఃఖంబుసహింపంజాల నేనేమిసేయుదు నీచేనవమానితుండనైతి శరీరంబువిసర్జించెదనని యనేకవిధంబులవచించి క్రోధశోకాకులుండైనమస్కరించిన రఘునాథుండు నవ్వుచు సర్వదేవమునీంద్రులుసూచుచుండ నాతనినాశ్వాసింపుచు నిట్లనియె ఓ ఆంజనేయా నేను సర్వంబునెరుంగుదు జాతుండును జాయమానుండు మృతింబొందుదురు సర్వజంతువులు స్వకర్మంబులమృతింబొంది నరకంబునొందుదురు పరమాత్ముండు నిర్గుణుండై ప్రకాశించుగాన నీతత్వంబెరింగి శోకింపకుము లింగత్రయనిర్ముక్తంబును నిరంజనంబును నిరాశ్రయంబును నిర్వికారంబునగు పరమాత్మనెరుంగుము తత్వజ్ఞానబాధకంబగుశోకంబునొందకుము యెల్లప్పుడు జ్ఞానంబునొందియుండుము సంతతంబును స్వయంప్రకాశంబగు పరమాత్మంభజింపుము తత్వజ్ఞానవిరోధకంబగు దేహాదులయందు మమతయుంచకము నిరంతరంబు ధర్మంబుభజింపుము ప్రాణిహింసగావింపకుము సజ్జనులసేవింపుము ఇంద్రియంబులనిగ్రహింపుము ఇతరదోషంబులెంచకుము శివవిష్ణ్వాదులంబూజింపుము అశుభంబులమాని సత్యంబనిరంతరంబు పలుకుము ప్రత్యగ్బ్రహ్మైక్యతాజ్ఞానంబులేకపోవుటవలన వస్తుజాలంబులయందు మోహంబుగల్గెడు శోభనాశోభనంబులభ్రాంతి యథార్థంబుగ గల్పింపబడు పదార్థంబులందెల్ల మోహాతిశయంబున శోభనంబులధ్యాస్తంబులగు భ్రాంతచిత్తులగువారలకు రాగంబుజనించు దేవతిర్యఙ్మనుష్యాదులలో రాగద్వేషాదులంగూడు మానవులు ధర్మాధర్మవశంగతులై నిరయంబునొందుదురు అతిశోభనంబులగు చందనాగరుకర్పూరాదులే శరీరస్పర్శంబునమలినంబునొందు నాశరీరందెట్లు సుఖకరంబగు మరియు భక్ష్యభోజ్యాది పదార్థంబులే శరీరసంగంబువలననిష్టంబగు నాశరీరంబెట్లు సుఖకరంబగు మరియు సుగంధియు శీతలంబగు తోయంబే యంగస్పర్శంబున మూత్రంబగు నాగాత్రంబెట్లు సుఖకరంబగు అత్యంతధవళంబులు పరిశుద్ధంబులగుతోయంబులే వపుస్సంయోగంబున స్వేదంబులగు నాశరీరంబెట్లు సుఖకరంబగు.

ఓ వాయునందనా పరమార్థంబెరుంగించెదవినుము. సంసారగర్తంబున కించిత్సౌఖ్యంబైననులేదు మానవుండజ్ఞానంబునంజేసి జన్మంబునొంది పిమ్మట వార్ధక్యంబును మరణంబునుంబొంది మరలంబుట్టుచుండు అజ్ఞాననివృత్తిగల్గెనేని సుఖంబుగల్గునది జ్ఞానంబువలనంగలుగుగాని కర్మాదులవలనంగలుగనేరదు వేదవాక్యజంబగు జ్ఞానంబె పరబ్రహ్మంబనియెరుంగుము ఆజ్ఞానంబు విరక్తునకుంగలుగుగాని యితరునకుంగలుగదు ఆచార్యప్రసాదంబువలన యాజ్ఞానంబుగలుగు యేమనుజునకైనను మనంబునకామాదులు వర్జించు

చుండు నతండు మృతుండగు యెవ్వండైన జ్ఞాననిష్ఠుండై యుండునందు పరబ్రహ్మంబు
నొందు లోకంబున మేలుకొనియున్నవానిని నిద్రించువానిని భుజించువానిని చరించువా
నిని కృతాంతుండు క్రూరుడై సంహరింపుచుండు సర్వంబును క్షయాంబులగు ఉద్ధితంబు
లగునవియెల్లను పతనంబునొందు సంయోగంబులు వియోగంబునొంగు జీవితంబు నిధ
నంబునొందు లోకంబున పక్వఫలంబునకు పతనంబుకంటె భయంబెట్లు లేకయుండు నట్ల
సకలజనంబులకు మరణంబుకంటె మరియొక భయంబుగలుగదు మరియును దృఢస్తంభంబ
గు గృహంబెట్లు కొంతకాలంబునకు జీర్ణంబై నశించునట్ల మానవులు జరామృత్యువశంగ
తులై నాశనంబునొందుదురు లోకంబున సకలమానవుల కహోరాత్రగమనంబున నాయు
ర్క్షయంబగుచుండు ఆత్మంగూర్చి శోచింపు మితరులనై శోచింపనేల లోకంబున మనుజుం
డెచటనున్నను యెక్కడికిబోయినను మృత్యువనుసరించి వధించు శరీరంబునవయఃపాతంబ
గుచుండ శిరోరుహంబులు శ్వేతంబులగు జరయుశ్వాసకాసలునాక్రమించు అంభఃపంబు
న కాష్ఠద్వయంబు సంయోగంబునొంది కొంతకాలంబునకు పిమ్మట వియోగంబునొందు
కరణి నిమార్గంబునమందు మనుజుండును చరించువాడును తిగలనికొంతదవ్వరిగి పిమ్మట
యథేచ్ఛజనవిధంబునమ భార్యాపుత్రక్షేత్ర ధనాదికంబులు సంయోగవియోగంబులం
బొందుచుండునది స్థిరంబుగాదందుకు చింతింపందగదు మనుజుండు జన్మించిన మృత్యువుం
జనించి కాలంబెరింగివధించు నందుకేమియుం బ్రతికారంబులేదు దేహియుకర్మవశంబున
నొకశరీరంబువిడిచి మరియొకశరీరంబునొందుచుండుగాని యొకశరీరంబునందైన స్థిరంబుగ
నుండదు శరీరంబులు జన్మమరణంబులునొందుచుండుంగాని యాత్మనొందదుగాన నీకప
ప్రపరా శోకంబుమాని యద్వయంబగు జ్ఞానంబుచే దివానిశంబును స్వరూపంబగు పరబ్ర
హ్మంబుజింతింపుము నేగావించినకర్మంబు నివానర్చినదిగాన నేప్రతిష్ఠించినలింగంబు నీచే
స్థాపింపంబడినదియని భావింపుము సుముహుర్తాతిక్రమణంబైన సైతకృతసైకతలింగస్థాప
నంబుజేసితిని నిందుకు శోకింపకుము బ్రహ్మరాక్షసయూథంబుల నాశనంబులుగావించితిగా
న కైలాసంబుననుండి నీవుదెచ్చినలింగం బీశుభదినంబున స్థాపింపుము యీలింగంబు లోక
త్రయంబున హనూమల్లింగంబని ఖ్యాతింబొందు నినరుండైన మహాదేవదర్శనంబును భవన్నా
మాంకితంబగు నీలింగంబువీక్షించునతండు కృతకృత్యుండగు యెవ్వండైన యోజనసహస్రం
బులనుండియైన నీలింగంబును మల్లింగంబును స్మరించెనేని సకలతీర్థఫలంబులంబొంది ఈ
శ్వరసాయుజ్యంబునొందు నీశ్వరుండు మదీయంబగు లింగంబును భవల్లింగంబును జానకీ
లింగంబును లక్ష్మణకృతలింగంబును సుగ్రీవలింగంబును నలకృతలింగంబును అంగదలింగంబు
ను జాంబవత్కృతలింగంబును విభీషణస్థాపితరత్నలింగంబును ఇంద్రాదికృతలింగంబును
శేషాదిమహానాగప్రతిష్ఠితలింగంబును యీయేకాదశలింగంబులయందు నేకాదశరూపంబు
లంబొంది సన్నిహితుండై ప్రకాశించుచుండు గాన విరితంబుగ స్వకీయహావశాంతింగోరి

లింగస్థాపనంబుజేయుము అట్లుచేయనభీష్టంబులేకపోయిన సీతాకృతంబై నాచేస్థాపింపంబడిన యీలింగోత్పాటనంబుజేసితివేని నీవుదెచ్చిన లింగస్థాపనంబుగావించెద నాచేస్థాపింపంబడిన యీలింగంబు పాతాళ సుతల వితలతలాతలంబుల భేదించియున్నయది దీనిభేదింపనెవరికిందరంబుగాదు శీఘ్రంబున నీలింగోద్వాసనంబుగావించి త్వదాహృతలింగంబు స్థాపింపుము లెమ్మనిన హనూమంతుండు శ్రీరామునకు వందనంబుగావించి తనలావుతానెరుంగక యీసైకతలింగంబుభేదించుట నాకెంతపనియని మనంబునందలంచుచు సకలదేవమునీంద్రులును శ్రీరామచంద్రుండును లక్ష్మణుండును సీతాదేవియు సుగ్రీవాదివానరులందరుజూచుచుండ యనేకప్రయత్నంబుల స్వహస్తంబులచే నాసైకతలింగంబుబట్టి పెకలింపుచు కిలకిలాశబ్దంబుగావింపుచు గదలింపనేరక వాలంబుజుట్టి యనేకవిధంబుల గదలింపంబోయి చలింపంజేయంజాలక గగనంబునకెగసి సకలచరాచరసహిత భూకంపంబుగనార్చుచు యనేకప్రయత్నంబులుజేసియుం బెకలింపనేరక రుధిరంబుగ్రక్కుచు యాలింగంబునకు క్రోశమాత్రంబున మూర్ఛితుండై ధరాతలంబునంబడిన నాతని వక్త్రనయన నాసాపుటాదిరంధ్రంబుల రుధిరౌఘంబుస్రవించి రక్తకుండంబని నామంబునొందె నంత దేవాసుర మానుషంబగు జగంబంతయు హాహాకారంబునొందె నాతరి రామలక్ష్మణులును సీతయు సుగ్రీవాది కపులును చూర్ణీకృతకళేబరుండై మూర్ఛనొంది భూమింబడి రుధిరంబుగ్రక్కుచున్న వాయునందనుండగు హనుమంతుంగాంచి పలువిధంబుల విలపించి రాసమయమున సీతాదేవి సదయహృదయయగుచు నాంజనేయుంగాంచి యో బాలుడా నీకీయవస్థగల్గెంగదాయని కరంబులచే నాతనిశరీరంబు స్పృశించె శ్రీరామచంద్రుండును భూపతితుండగు హనుమంతుంగాంచి దయాళుండై స్వాంకంబుపై నిడికొని కరంబుచే నాతని శరీరంబునిమురుచు కన్నీరిడుచు యివ్విధంబునంబలికెనని శౌనకాదిమునీంద్రులకు సూతుండెఱింగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమాహాత్మ్యంబునందు
శ్రీరామచంద్రుండాంజనేయునకు జ్ఞానోపదేశంబుజేసెడు కథగల
నలువదయిదవ యధ్యాయము సంపూర్ణము.

## నలువదియాఱవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకల పురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా యివ్విధంబున మూర్ఛితుండగు ఆంజనేయుంగాంచి శ్రీరామభద్రుండిట్లనియె. ఓ వానరోత్తమా నేపంపాతీరంబుననుండు తరి నీవు వచ్చెంచి యనేకవిధంబుల నూరడించి సుగ్రీవుతో సఖ్యంబుగావించితివి నిన్నుంగాంచి

బంధుమిత్రులను తల్లిదండ్రులను స్మరింప నాకనేకవిధంబుల నుపకారంబుజేసితివి నాకొఱకై బహుయోజనాయతంబగు సాగరంబుదాటి తల్ప్రహారంబున మైనాకుంబీడించి నాగమాతయగు సురసమర్థించి ఛాయాగ్రాహిణివధించితివి పిమ్మట సువేలాద్రిరోహణంబుగావించి సాయంకాలంబున లంకిణిజయించి రావణగృహంబుజేరి రాత్రియందు గతభయుండవై జానకిన న్వేషింపుచు పురంబెల్లగ్రుమ్మరియశోకవనంబునవై దక్షిణంగాంచి నమస్కరించి యభిజ్ఞానంబొసంగి సీతాదత్తంబగు చూడామణింగొని యాయశోకవనంబంతయు ధ్వంసంబుగావించి రావణప్రేరితులును సత్యశ్వరథసంయుతులగు అనేక సహస్రకింకరుల నాయోధనంబున మదర్థంబై వధించితివి పిమ్మట ప్రహస్తతనయుండగు జంబుమాలియు మంత్రితనయసప్తకంబును సేనాపరివృతులై యేతెంచిన వారలంజంపిన క్రౌంచరేశ్వర వందనుండగు అక్షకుమారుని యమనికేతనంబునంబంపి మేఘనాధుంగూడి మహాయుద్ధంబుగావించి తద్గృహీతుండవై రాక్షసేంద్రసభాసదనంబుజేరి యందు లంకేశ్వరుంద్తృణీకరించి లంకాదహనంబుజేసి ప్రతినివృత్తుండవై ఋశ్యమూకంబుజేరి సీతావృత్తంబు నాకెఱుంగించితివి మఱియు ననేక విధంబులగు దుఃఖంబుల నాకొఱకై యనుభవించితివి వత్సా నీవిప్పుడు శోకంబుగలుగంజేయుచు భూతలంబున శయనించెదవు నీవు హతుండవైతివేని నేప్రాణంబులంబాసెద నీవు లేకపోయిన నాకీసీతతో కార్యంబేమికలదు అనుజులగు లక్ష్మణాదులేల రాజ్యంబేలగాన శీఘ్రింబునలెమ్ము భూతలంబున నేలశయనించెదవు నాకిప్పుడు నిద్రార్థంబై శయ్యంగావింపుము కందమూలాదుల నాహారంబునకై దెమ్ము బ్రహ్మాస్త్రంబున లక్ష్మణుంగూడి నేబద్ధుండనైనంగాచితివి లక్ష్మణుండు మూర్ఛితుండైయుండ నౌషధజాలంబుగొనితెచ్చి రక్షించితివి పౌలస్త్యదర్పధ్వంసంబుజేసితివి మఱియు నేనీసహాయంబున రావణాదిరాక్షసులంజంపి సీతంబొందితి. ఓ ఆంజనేయుండా నన్నును సీతను లక్ష్మణుని అయోధ్యం జేర్చకయెచటికరిగితివని యివ్విధంబున ననేకవిధంబుల వాయునందనుముఖంబు జూచుచు శ్రీరామచంద్రుండు విలపించుచుండ తదీయాశ్రుజాలసేచనంబున వాయుపుత్రుండు మూర్ఛంబాసి లేచిపౌలస్త్యభయంకరుండును లోకరక్షార్థంబై మానుషభావంబునొందిన వాడును నారాయణుండును అజుండును విభుండును జానకీలక్ష్మణ సుగ్రీవాదివరిసేవితుండును కాలాంభోధర సంకాశుండును రణధూళిసముచ్ఛ్రితజటామండలుండును పుండరీకాయతేక్షణుండును దేవర్షిపితృకిన్నరసేవితుండునునగు రఘునాయకుంగాంచి తత్కరస్పర్శ పరిపూర్ణగాత్రుండై నమస్కరించి కృతాంజలియైశ్రుతిమనోహరంబుగ నివ్విధంబున స్తుతించె.

ఓజానకీరమణా నీవాదిదేవుండవు పురాణపురుషుండవు గదాధారివి విష్ణుండవు ప్రభవిష్ణుండవు మహాత్ముండవు ప్రహృష్టవానరానీకతుష్టపాదాంబుజుండవు నిష్పిష్టరాక్షసేంద్రుండవు జగత్సృష్టివిధాయివి సహస్రశిరస్కుండవు సహస్రాక్షుండవు సహస్రపాదుండవు శుద్ధుండవు రాఘవుండవు భక్తార్తినాశనుండవు సీతాపతివి నారసింహరూపుండవు దైత్య

భూజన్విదారివి వరాహరూపుండవు త్రివిక్రమావతారుండవు బలియజ్ఞవిభేదివి మహామందరధారివి మత్స్యరూపుండవు త్రయీసంరక్షకుండవు పరశురామావతారంబున క్షత్రవంశంబెల్ల నాశనము గావించినవాడవు శ్రీరాఘవరూపధారివి సకల రాక్షసనాశనకారివి మహాదేవధనుఃకోదండవిభేదివి క్షత్రియాంతకరక్రూరభార్గవత్రాసకారివి అహల్యాసంతాపహారివి పాపమోచనుండవు మైథిలీమానసాంభోజ భానుండవు లోకసాక్షివి రాజేంద్రుండవు జానకీనాథుండవు తారకబ్రహ్మస్వరూపుండవు రాజీవలోచనుండవు సుభాత్మకుండవు విశ్వామిత్రైకరక్షకుండవు ఖరాసురమర్దనుండవు దేవదేవేశుండవు భక్తాభయప్రదాయకుండవు వేదవాగగోచరుండవు కరుణాసింధుండవు నిన్నుశరణంబునొందెద నన్నుగావుము మోహవనోదంబుజేయుము జాగ్రత్స్వప్నసుషుప్తులయందును సర్వకాలములయందును సర్వకార్యములయందును రక్షింపుము నీమహిమ నీవయెఱుంగుదువుగాని యెవ్వండును నెఱుంగడు నేనొకండ నెంతవాడనని హనుమంతుండు రామచంద్రు ననేకవిధంబులం బొగడి జానకీదేవి నిట్లని స్తుతించె ఓ మైథిలీ నీవు సర్వపాపహరణంబు గావించెడిదానవు దారిద్ర్యఋణసంహారిణివి భక్తాభీష్టప్రదవు విదేహరాజతనయవు రాఘవానందకారిణివి భూపుత్రికవు విద్యాస్వరూపరాలవు ప్రకృతిరూపంబును శివారూపంబునొందినదానవు పాలప్ప్యైశ్వర్యవిదారిణివి విభూతియు సరస్వతియు దుర్గయు నీవ పతివ్రతధురీణవు అనుగ్రహస్వరూపరాలవు హరిప్రియురాలవు ఆత్మవిద్యాస్వరూపరాలవు ఉమయు లక్ష్మియునీవ చంద్రభగనివి సర్వాంగసుందరివి ధర్మస్వరూపురాలవు వేదంబులకెల్లమాతవు విష్ణువక్షస్థలవాసివి లోకజననివి రామచంద్రప్రియురాలవు నిన్ననేకవిధంబులం గొనియాడెద. నన్నురక్షింపుము. అని యివ్విధంబున హనూమంతుండు భక్తిపూర్వకంబుగ సీతారాములం బొగడి యాసందాశ్రుకరిక్లిన్నుండై పూరకయుండె ఓ మునీంద్రులారా పాపనాశనంబను హనూమత్కృతంబగు యీసీతారామస్తోత్రంబు నిరంతరంబు భక్తియుక్తుండై పఠించువిను నతండు మహైశ్వర్యంబును అనేకక్షేత్రధాన్యాదులను పయస్వినులగు గోవులను ఆత్మవిద్యను బహుపుత్రులను మనోహరయగు భార్యను బొంది సకలసుఖంబుల ననుభవింపుచు బ్రహ్మహత్యాది పాపంబులెల్ల నాశనంబు గావించు మెన్నండును నరకంబునొందక దేహాంతంబున ముక్తిం బొందు నంత జగన్నాథుండగు శ్రీరామచంద్రుండు వాయుతనయుం గాంచి యిట్లనియె ఓ వానరోత్తమా అజ్ఞానంబున సాహసంబుజేసితివి బ్రహ్మయు విష్ణువు శక్రాదులైననాచే స్థాపింపంబడిన నీలింగంబు భేదింప సమర్థులుగారు మహాదేవాపరాధంబు గావించితివి గాన మూర్ఛితుండవైతి వింక నెన్నండు నీశ్వరునకు ద్రోహంబొనర్పకుము నీవుపడినప్రదేశంబు భవన్నామాంకితంబై హనూమత్కుండంబని. భువనత్రయంబున ఖ్యాతిం బొందు నందు స్నానంబు గావించినజనంబులకు మహాపాతకంబు నశించు లోకంబున మహాదేవజటాజాతయగు గౌతమునదియందు స్నానంబుజేసిన నశ్వమేధసహస్రఫలంబుగల్గు నాఫలంబునకు

శతగుణంబు గంగా యమునా సరస్వతులయందు స్నానంబుజేసినంగల్గు యీనదీత్రయం బెచటజేరిప్రవహించు నచట స్నానంబుచేసిన సహస్రగుణితఫలంబబ్బు నాఫలంబీకుండంబున స్నానంబుగావించినవారలకుంగల్గు సందియంబులేదు లోకంబున దుర్లభంబగు మానుష్యంబునొంది హనూమత్కుండతీరంబున శ్రాద్ధంబుజేయనివాని పితరులు నిరాశులై కోపింతురు మరియును సకలదేవతలును రోషింతురు యెవ్వండైన హనూమత్కుండతీరంబున తిలోదకంబులు సకలదానంబులంగావించునాతనికి పితృదేవతలు ప్రీతులై తృప్తకుల్యంబుల భుజింపుచుందురు అట్లుగావింపనివానిజన్మంబు నిరర్థకంబాతండు దుఃఖభాజనుండగు ఓమునీంద్రులారా శ్రీరామచంద్రుండు సేతువునందు లింగప్రతిష్ఠగావించిన తెరంగెరుంగించితిని ఎవ్వండైన నీయధ్యాయంబు సమాహితచిత్తుండై పఠించు నాకర్ణించునతండు సకలపాపంబుల విడిచి శివలోకంబునొందు.

ఇది స్కాందపురాణంబునందు సేతుమాహాత్మ్యంబున
శ్రీరామచంద్రుండు గంధమాదనంబున లింగప్రతిష్ఠగావించిన కథగల
నలువదియాఱవ యధ్యాయము సంపూర్ణము.

---

## నలువదియేడవ అధ్యాయము.

---

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులు సకల పురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండగు సూతునకిట్లనిరి ఓ పౌరాణికోత్తమా మహాత్ముండగు రామచంద్రునకు క్రూరుండగు రావణవధంబున బ్రహ్మహత్యయేలగలిగె లోకంబున బ్రాహ్మణవధంబుగావించిన బ్రహ్మహత్యగలుగు దశగ్రీవుండు బ్రాహ్మణుండుగాడు నదియెట్లుగలిగె నవ్విధంబు కరుణాయుతుండవై యెరుగింపుమని వేడిన సూతుండిట్లనియె ఓమునీంద్రులారా పూర్వంబున బ్రహ్మతనూజుండగు పులస్త్యుండను విప్రుండొకండుగలండామునీంద్రునకు విశ్రవుండను పుత్రుండుద్భవించి సకలమహత్తరంబగు తపంబుగావింపుచుండె నాకాలంబున సుమాలియను నక్తంచరుండు హేమనిష్కాంగదధరుండును కాలమేఘ వినిభ ప్రభుండనగుచు పాతాళలోకంబుననుండి భూలోకంబునకరుదెంచి పద్మవాసినీసదృశయగు తనూజంగూడి సంచరించుచు నొక ప్రదేశంబున పుష్పకవిరాజితుండగు ధనేశుగాంచి మనంబున సిగ్గునొందుచుండగు పుత్రి మనకుంగలిగిన నిర్భయులమై మనమందరము రాజ్యంబొసంగదగునని నిశ్చయించి నిజపుత్రికయగు కైకసింగాంచి యిట్లనియె.

ఓపుత్రికా యిప్పుడు నీకు యౌవనంబు ప్రాప్తంబయియున్నయది వరునకొసంగు కాలంబు లోకంబున మనుజులు నిజతనూజలందగిన వరులకొసంగిక పోయిన దుఃఖమునొందుదురు మానవంతులగు వారలకుం బుత్రికలుగలుగుట దుఃఖంబు కొరకు నీకుందగిన వరుం

గాన నీవిపుడు పితామహకులోద్భూతుండును పులస్త్యతనయుండగు విశ్రవసుం జేరి వరింపుము తత్ప్రసాదంబున కుబేరసదృశులగు తనయులు నీకుంగల్గెదరని సుమాలివచించిన కైకసియు పితృవాక్యం బంగీకరించి సంధ్యాకాలంబున విశ్రవః పర్ణశాలకుం బోయి శుచిస్మితయు పూర్ణచంద్రనిభాననయు అధోముఖియు నగుచు నామునీంద్రు సమీపంబున నిలిచి అంగుష్ఠకోటిచే భూమిపై లిఖించుచుండ నా ఋషివర్యుం డాతనుమధ్యనుం గాంచి సదయహృదయుండై యిట్లనియె. ఓ మనోహరాంగీ నీ వెవరి తనూజవి చటికే యరుదెంచియున్న దానవు నిజం బెఱుంగింపుమనిన యావనిత బద్ధాంజలియు వినయసంయుత యగుచు నిట్లనియె. ఓ మహాత్మా తపఃప్రభావంబున మదభిప్రాయం బెఱుంగుదువు ఐన నన్నడిగితివి గాన నెఱుంగించెద వినుము నేను సుమాలియను నక్తంచరేంద్రుని తనూజను కైకసియను నామంబుగల దాన మజ్జనకుండు త్వదంతికంబునకుం బొమ్మనిన నరుదెంచితి శేషంబు జ్ఞానదృష్టిచే నెఱుంగ నర్హుండవనిన మునీంద్రుండు క్షణకాలంబు చింతించి యాకైకసీ మనోభిప్రాయం బెఱుంగి యిట్లనియె. ఓ వనితా పుత్రులం గోరి మత్సమీపంబు జేరితివి ఐన నతిదారుణం బగు సాయంకాలమున వేతెంచితివి గాన దారుణాకారులును క్రూరకర్ములగు పుత్రులం బడసెద వనిన కైకసి పులస్త్యనందను గాంచి, ఓ మహాత్మా నీవలన దుష్టులగు పుత్రుల నెట్లు బొందుదునని వేడిన మునీంద్రు డిట్లనియె." ఓ కామినీ నీకుం జనించిన పుత్రులయందు కడపటివాడు రాక్షస కర్మంబులం బొందక మద్వంశానుగుణంబుల ధర్మగుణంబులం బొంది శాంతుండును శాశ్వతుండగు ననియె నంత కైకసి యామునీంద్రు ప్రసాదంబున గొంతకాలంబునకు రక్షోరూపుండును యాకరాకారుండును దశవదనుండును కుమతియు వింశతిభుజుండును తామ్రోష్ఠుండు కృష్ణవదనుండును రక్తశ్మశ్రుశిరోరుహుండును మహాదంష్ట్రుండును లోకసంత్రాసకారియగు రావణుని అతిభయంకర రూపుండగు కుంభకర్ణుని యతిక్రూరయగు శూర్పణఖ గనుంగొని పిమ్మట లోకవిశ్రుతచారిత్రుండును ధార్మికుండును వేదశాస్త్ర సంపన్నుండగు విభీషణుం గాంచె.

ఓ మునీంద్రులారా యివ్విధంబున విశ్రవస్సునకు రావణాదులు జనించిరి రావణ కుంభకర్ణవధంబున యక్లిష్టచరిత్రుండగు శ్రీరామచంద్రునకు బ్రహ్మహత్యగల్గెంగాన గంధమాదనంబున శివలింగప్రతిష్ఠం గావించె. ఓ మునీంద్రులారా యివ్విధంబున జానకీనాథుండు లింగప్రతిష్ఠ గావించి సీతాసౌమిత్రిసహితుండై దన్ను గృతార్థుం గాదలంచె నెచ్చట నా నృపునకు బ్రహ్మహత్య నశించె నచ్చట బ్రహ్మహత్యావిమోచనం బను తీర్థం బయ్యె యెవ్వరైన నందు స్నానముచేసిన బ్రహ్మహత్య నశించు నచ్చట నీదినంబు వరకు రావణుండు ఛాయారూపుండై యగుపడుచున్నవాడు తత్తీర్థాగ్రంబున నాగలోక పర్యంతం బొక లింగంబుగలదందు శ్రీరామచంద్రుండా బ్రహ్మహత్యం ద్రోసి యాబిలంబుపై నొకమంటపంబుగావించి యందు రక్షార్థంబై భైరవస్థాపనము గావించెం గాన నాభయంకర రూపం బగు

బ్రహ్మహత్యాభిరవభీతరై యాబిలంబునుండి పైలువెడలుటకుం జాలక యందడగియున్నయది ఓ మునీంద్రులారా రామనాథమహాలింగంబునకు దక్షిణంబున శివార్ధశరీరిణియగు పార్వతియు పార్శ్వంబుల సూర్యచంద్రులును పురోభాగంబున నందికేశ్వరుండును నున్నవారలు మరియు నారామనాథ మహాలింగంబునకు దూర్పున శతక్రతుండును ఆగ్నేయంబున వైశ్వానరుండును దక్షిణంబున యముండును నైఋతిదశయందు నైఋతియు పశ్చిమంబున .వరుణుండును వాయువ్యదిగ్భాగంబున వాయువుత్తరంబున ధనదుండును యీశానంబున మహేశుండును వీరలు సేవకులై నిరంతరంబు సేవింపుచున్నవారు మరియు వినాయకకుమారులును వీరభద్రాదిగణేశ్వరులును నచ్చటచ్చట రామనాథు సేవకులై యున్న వారలు మరియును సిద్ధగంధర్వాది సకల సురసమూహంబులును రామనాథుసేవార్థంబై యచ్చట యథేష్టంబుగయున్నవారు ఓ మునీంద్రులారా శ్రీరామచంద్రుండు రామేశ్వరంబున రామనాథపూజార్థంబై యనేక బ్రాహ్మణజనంబులనుంచి వారలకనేక గ్రామంబులొసంగి రామనాథమహాదేవ నైవేద్యాదులకై యనేక గ్రామంబులిచ్చి హారకేయూరకటకాద్యాభరణంబులనేకంబు లొసంగె. ఓ మునిపుంగవులారా రామచంద్రస్థాపితంబగు నారామనాథమహాలింగంబును నిరంతరంబు గంగయు యమునయు సరస్వతియు మొదలగు తీర్థంబులు[illegible] యు స్వకీయ పాపశాంతిం గోరి యరుదెంచి సేవింపుచుండు నీయధ్యాయం బేమనుజుండైన భక్తియుక్తుండై పఠించువినునతం డఖిల పాపంబులంబాసి విష్ణుసాయుజ్యంబు నొందు ననని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరింగించెను.

ఇది స్కాందపురాణంబునందు సేతుమహాత్మ్యంబున
బ్రహ్మహత్యానిరూపణంబను కథగల
నలువదియేడవ యధ్యాయము సంపూర్ణము.

## నలువదియెనిమిదవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకల పురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా రామనాథుంగూర్చి పాపనాశనంబగు వృత్తంబెరుంగించెద పూర్వంబున పాండ్యదేశంబున శంకరుండను నృపుండు సత్యసంధుండును ధార్మికుండును యజ్వయు వేదవేదాంగతత్వజ్ఞుండును పరసైన్యవిదారణుండునునగుచు ధర్మమార్గంబుదప్పక చాతుర్వర్ణ్యజనంబులంగాచుచు వైదికాచారంబులొనర్చుచు స్మృతిపురాణంబుల పఠించుచు శివవిష్ణ్వాదిదేవతాపూజలు సేయుచు మహాత్ములగు బ్రాహ్మణులకు సకల దానంబులుగావింపుచు రాజ్యంబుసేయుచుండి యొకానొక

సమయంబున సింహవ్యాఘ్రాది క్రూరసర్వభయానకంబును ఝిల్లికాభీషణ రవంబును సరీసృపసమాకులంబును భీమశ్వాపద పూర్ణంబును దావానలభయంకరంబును నగు మహారణ్యంబును మృగయారతుండై ఆఖేటకుల సమూహంబులంగూడి యనేక సైనికోపేతుండై పాదుకాగూఢచరణుండును రక్తోష్ణీషపరిచ్ఛదుండును మహాఖడ్గధారియు అనేక పదాతి పరివృతుండునునై శ్వేతాశ్వశ్రేష్ఠంబునెక్కి సంచరించుచుండ యీమృగంబు వేగంబునం బరువిడుచున్నయది దీనింజంపుము జంపుండని యన్యోన్యంబు సైన్యంబులు పలుకుచుండని లేశుండు సింహవరాహమహిషాది మృగంబులం జంపుచు ఒకానొక ప్రదేశంబున నొకదరియందు వ్యాఘ్రచర్మంబు గప్పుకొని శాంతుండై దపంబు గావింపుచున్న యొక మునీంద్రుం గాంచి వ్యాఘ్రంబనిదలంచి శరంబుపైవ నాయాశుగంబావిప్రుని తత్పత్నిని . యాయిరువుర నిహతులంగావించె నంత వారితనూజుండు నిహతులగు మాతాపితరులంగాంచి యిట్లని విలపించె. ఓ తండ్రీ నాకికమీద వేదంబులు శాస్త్రంబులును యెవ్వండుపదేశించు ఆచార్యుం డెవ్వండెరింగించు. ఓ జననీ నాకికమీద సోపదంశకంబగు భోజనంబెవ్వరిడుదు రెవ్వరులాలనంబుగావింపుదు రేమిసేయుదురు నిరపరాధులగు మీయిరువుర నే పాపుండు సాయకంబున హింసించెనని యాబాలుండు ముక్తకంఠుండై రోదనంబుగావించె నంత నాధ్వనివిని నృపుండచటికరుదెంచి వారలంజూచుచుండ యాసమీపంబున నుండు మునీంద్రులందరు శరహతులై భూమింబడియున్నవారలను ధనుర్ధరుండై యున్న నరేంద్రుని విలపించుచున్న బాలకుం గాంచి దయాళువులై యాబాలకు ననేక విధంబుల నూరడింపుచు నిట్లనిరి.

ఓ బాలకా ఆఢ్యుండైనను దరిద్రుండైనను మూర్ఖుండైన పండితుండైనను దీనుండైనను కృపణుండైనను యెవ్వండైన సమవర్తి సంహరించు పట్టణంబులను గ్రామంబులను పర్వతాశంబులను యచటనుండినను మృత్యువేతెంచు మరియును గర్భస్థులు జనించువారలు వటిప్ర దేహావంతులు వృద్ధులు వర్ణాశ్రమాచారవంతులు మరియు నెటువంటివారలైనను యమపట్టణంబునకు బోవుదురుగాని స్థిరంబుగనుండరు మరియు బ్రహ్మాదిసురమునిసంఘంబులును సకలజంతునిచయంబులను సర్వంబును నాశనంబునొందు నిందుకు చింతింపకుము సచ్చిదానందంబును ఉపనిషద్గతంబగు పరబ్రహ్మమొక్కటియ శాశ్వతంబై యుండు దాని కెన్నండును నాశనంబులేదు మరియును మలభాండంబును నవద్వారంబును మాంసాస్రుక్శోణితాలయంబును బుద్బుదాకారంబును క్రిమియూథసమాకులంబును కామలోభభయక్రోధమోహ మాత్సర్యకారియు పరదార పరద్రవ్య పరక్షేత్ర లోలుపంబును హింసాసూయాది వ్యాప్తంబును విణ్మూత్రభాజనంబును నగుఛిద్రంబగు నీదేహంబు శోభనంబని యెవ్వండుదలంచు నతండు మూఢుండు యీశరీరంబున ప్రాణంబులు స్థిరంబుగనుండవు యిది నిశ్చయంబుగాన తల్లిదండ్రులంగూర్చి చింతింపకుము వారలు స్వకర్మవశంబున దేహంబు విడిచిరి నీవును కర్మవశంబున భూతలంబుననున్నవాడవు నీవును కర్మక్షయం

కైనను మరణంబునొందెదవు మీజననీజనకు లెపుడుజనించిరి నీవెపుడుత్పన్నుండవైతివి వారలకును నీకును గతిభిన్నంబయ్యె వారలు మరణంబునొందిరి నీకును గతి తుల్యంబైన వారలతోగూడి జనుదువు లోకంబున మృతులగువారలంజూచి బంధువులు కన్నీరిడుచు దుఃఖించినం బ్రయోజనంబేమికలదు గాన నీవు శోకంబువిడిచి ధైర్యంబునొంది సమాహితచిత్తుండవై జననీజనకులకుం బ్రేతకార్యంబులం గావింపుము మరియును నీతల్లిదండ్రులు శరాఘాతంబుచే మరణంబునొందిరిగాన యపమృత్యుదోషశాంత్యర్థంబై వారియస్థులంగొని విముక్తిదంబగు రామనాథశివక్షేత్రంబునకుంబోయి. యందుస్థాపించి యచ్చట సపిండీకరణాదికృత్యంబులంగావింపు మట్లుగావించితివేని భవజ్జననీజనకులపమృత్యుదోషంబునుం బాయుదర్ని మునీంద్రులు పలికిన జాంగళుండును నాబాలకుండియ్యకొని జననీజనకులకుం పిత్రృమేధకర్మంబులుగావించి పరదివసంబున వారియస్థులంగొని హాలాస్యక్షేత్రంబునకుంబోయి యచటనుండి రామేశ్వరంబుజేరి మునిప్రోక్తవిధానంబునయందస్థిస్థాపనంబును బ్రథమాబ్దికపర్యంతంబుజేయందగిన శ్రాద్ధంబులనుగావించి ఆబ్దికాంతదినంబున రాత్రియందు స్వప్నంబున శంఖచక్రగదాధరులును గరుడోపనివిష్టులును పద్మమాలా విరాజితులును తులసీదామశోభితులును కౌస్తుభాలంకృతారస్కులును పీతాంబరవిరాజితులునైయొప్పు నిజజననీజనకులంగాంచి సంతుష్టచిత్తుండై యామునిపుత్రకుండు స్వాశ్రామంబునకేతెంచి యచటి బ్రాహ్మణజనంబుల కాతెరంగంతయు నెరింగించి సుఖంబుండె పిమ్మట నాయాశ్రమంబుననుండు మునీంద్రులు శంకరనరేంద్రుంగాంచి యిట్లనిరి వోరి పాండ్యాధమా నీవు మహామూర్ఖుండవు క్రోధంబున బ్రహ్మహత్యయు స్త్రీహత్యయుంగావించితివిగాన నగ్నియందు శరీరపరిత్యాగంబుజేయుము ప్రాయశ్చిత్తాయుతంబులుచేసినను నీకు శుద్ధిగలుగదు త్వత్సంభాషణంబుజేసిన పాపంబుగలుగునుగాన మాసమీపంబుననుండకు మెచటికైనంబొమ్మని మునీంద్రులుపలికిన నృపుండు వారలంగాంచి ఓమునీంద్రులారా నే బ్రహ్మహత్యావిశుద్ధ్యర్థమై భవత్సన్నిధానంబున హవ్యవాహనునందు దేహత్యాగంబుజేసెద ననుగ్రహంబుజేయుండని పలికి తనమంత్రివరులంగాంచి యిట్లనియె.

ఓమంత్రిపుంగవులారా నేయజ్ఞానంబున బ్రహ్మహత్యయు స్త్రీహత్యయుంగావించితింగాన మునివచనంబున యీపాపనాశనంబునకై ప్రదీప్తంబగు హుతాశనునందు దేహంబువిడిచెద కాష్ఠంబులంగొనిరండు యగ్నింబ్రజ్వాలింపంజేయుండు మత్పుత్రునకు రాజ్యాభిషేకంబుజేయుండు శోకంబునొందకుండు దైవంబు దురతిక్రమంబియుండునని శంకరధరాధిపుండుపలికిన సచివోత్తములతనింగాంచి యిట్లనిరి ఓ పాండ్యమహీనాథా నీవు మహారాజవు శత్రువులయందైన వాత్సల్యత్వంబుగలవాడవు మేమునిరంతరంబు పుత్రులంబోలె మీచేబరిపాలింపంబడితిమి నిన్నుంబాసి పురంబునకుంబోవనేరము నీతోడన నేమును యగ్నింబ్రవేశించెదమని మంత్రివరులు దుఃఖించుచుండ వారలననునయించుచు ఓ

యమాత్యులారా నేమహాపాతకంబులంగావించితి సింహాసనంబెక్క నర్హుండగాను
ముత్పుత్రకు చతురర్ణవధరాపాలనంబునకై యభిషేకంబుగావింపుడు శీఘ్రంబునంబాం
డు కాష్ఠంబులందెం డాలస్యంబుగావింపకుండసిన యాతనియాజ్ఞచే మంత్రులట్లొనర్చిరంత
త శంకరభూనాయకుం డాచమనంబుజేసి విశుద్ధాత్ముండై యామునీంద్రులకును బ్రజ్వలిం
చు నగ్నిహోత్రునకును బ్రదక్షిణంబుజేసి నమస్కరించి మహాదేవుమనంబునదలంచుచు
ధైర్యంబువదలక యగ్నింబ్రవేశించుట కుద్యుక్తుండయ్యె నాసమయంబున సకలమునీంద్రులు
వినుచుండ నశరీరవాణి మహానాదంబుగ నిట్లనియె ఓమహీపాలా యనలంబు బ్రవేశించకు
ము బ్రహ్మహత్యకై భీతినొందకుము వేదసంహితంబగు రహస్యంబెరింగించెద నవహితుం
డవై విని దానింగావింపుము దక్షిణసముద్రతీరంబున గంధమాదనపర్వతంబున రామసే
తువునందు శ్రీరామచన్ద్రప్రతిష్ఠితలింగం బొకటికలదు నీవచట నొకసంవత్సరంబుండి త్రి
కాలంబుల భక్తియుక్తుండవై ప్రదక్షిణనమస్కారంబులుగావింపుచు మహాభిషేకంబుజే
యుచు రామనాథు సేవింపుము మరియునాలింగంబునకు దినదినంబును వివిధంబులగు నై
వేద్యంబులొసంగుము చందనాగరుకర్పూరాదులం బూజింపుము గవ్యంబును భారద్వాయ
పరిమితంబగు ఆజ్యంబునభిషేకింపుము మరియును ద్విభారసమ్మితంబగు గోక్షీరంబు నభి
షేకింపుము మరియును మధుద్రోణంబుచే నభిషేకింపుము ప్రత్యహంబును పాయసాన్నం
బు నైవేద్యంబునొసంగుము తిలతైలంబుచే దీపారాధనంబుగావింపుము ఇట్లొనర్చిన
రామనాథుండు ప్రీతుండగు దానని బ్రహ్మహత్యయు స్త్రీహత్యయునశించు రామనాథు
దర్శనంబుచే భ్రూణహత్యాశతంబులు బ్రహ్మహత్యాయుతంబులు స్వర్ణస్తేయాయుతంబు
లుగురుస్త్రీగమనాయుతంబులు తత్సంసర్గకోటులు సకలంబునునశించు లోకంబున జనం
బులకు మహత్తరంబగు రామనాథసేవకలిగెనేని గంగాగయాప్రయాగాధ్వరంబుల కార్యం
బేమిగలదు గాన శీఘ్రంబున నీవచటికింబోయి దివానిశంబు రామనాథుసేవింపుమని యశ
రీరవాణిపలికినవిని మునీంద్రులు శంకరభూపతింగాంచి ఓమహారాజా రామనాథప్రభా
వంబెరుంగక అగ్నింబ్రవేశంబుజేసి దేహత్యాగంబుజేయ నియోగించితిమి నీవిపుడు
శీఘ్రంబున విముక్తిదంబగు రామసేతువునకుంబొమ్మనిపలికిన నరేంద్రుండు ప్రహృష్టాంత
రంగుండయి సైన్యపరివృతుండై బహుధనంబుగొని కతిపయదివంబుల గంధమాదనంబు
జేరి యచటరామసేతువునందు ఏకభుక్తుండును జితేంద్రియుండగుచు త్రివంధ్యంబు రా
మనాథుసేవింపుచు పూజంగావించుచు ప్రతిదినంబును ధనుష్కోటియందు స్నానంబుగా
వింపుచు బ్రాహ్మణులకన్నంబొసంగుచుండి రామనాథదేవునకు దశభారధనంబొసంగి యి
ట్లుండ వర్షంబయ్యె నంతవర్షాంతంబున అశరీరిణీ ప్రోక్తప్రకారంబునపూజంగావించి
తుష్టమానసుండగు కృపానిధియగు మహేశ్వరునిట్లనిపొగడె ఓ రామనాథా ఓ యుమా
నాయకా నన్నుంగావుము కృపాళుండవై బ్రహ్మహత్యనివారింపుము స్త్రీహత్యాపాపనము

జేయుము ఓత్రిపురనాశకా నీవుమహాదేవుడవు కాలకూటవిషాశివి దయాసింధుండవు స్త్రీహత్యంబాపుము ఓవిరూపాక్షా నన్నుంగృపాదృష్టింనవలోకించి మదియ్యంబులగు పాపంబుల నాశనంబుజేయుము ఓకామాంతకా ఓరాఘవేశ్వరాత్వత్కటాక్షవీక్షణంబున నన్నుం బరిశుద్ధగాజేయుము ఓమార్కండేయభయత్రాణా ఓమృత్యుంజయా ఓయవ్యయా నన్ను నిష్పాపుంజేయుము వోశంకరా నన్నువేదోక్తాచారయోగ్యుంగాజేయుము వోదేవా నీవు సూర్యదంతంబులహరించితివి రామదేవుండవు దేవదేవుండవు అనంతసచ్చిదానంద రూపుండవు వృషభధ్వజుండవు రామనాథుండవు నీకనేకవందనంబులుగావించెద మదియ్య పాతకంబులహరించి నన్నుంగావవేయని స్తుతించు నాభూపాలకుముఖంబుననుండి యతిభయంకరరూపంబును రక్తశిరోరుహయు నీలవస్త్రధరయు క్రూరయగు బ్రహ్మహత్యవెడలినం గాంచి భైరవుండు రుద్రశాసనంబున శూలంబుగొని దానినిర్జించె నంత రామనాథుండు ప్రీతుండయి యానృపునకుం బ్రత్యక్షుండయి యిట్లనియె వోపాండ్యమహీపాలా నీవొనర్చిన స్తోత్రంబునకు బ్రీతుండనయి వరంబొసంగనేతెంచితి నీవొనర్చినస్త్రీహత్య బ్రహ్మహత్యలు నశించె నీకిష్టంబగువరంబువేడుము విశుద్ధపాపుండవైతివిగానే రాజ్యపాలనంబు పూర్వంబు వలెజేయుము యెవ్వరైన భక్తియుక్తులై నన్నుసేవింపుదురో వారల బ్రహ్మహత్యాది సకల పాపంబుల నాశనంబుగావించి సాయుజ్యంబునొసంగుదు నింతకు సందియంబులేదు యే మానవులైన భక్తిపురస్సరంబుగా నీస్తోత్రంబుపఠింపుదురో వారలపాపంబులనెల్ల నాశనంబుజేయుదు నీస్తోత్రంబునకు భక్తికిమెచ్చితి నిష్టంబగువరంబులువేడుమని మహాదేవుండుపలికిన నృపపుంగవుండిట్లనియె.

ఓశంకరా వోకరుణాకరా నేయుష్మద్దర్శనమున కృతార్థుండనైతి ప్రార్థనీయంబగు వరంబేమిగలదు మరియును మృకండుభయసంతాపహారియగు త్వత్పాదయుగళము గాంచితి దీనికంటె వరంబేమికలదు త్వత్పాదయుగళమున నిశ్చలంబగు భక్తినొసగి పునర్జన్మములేకయుండునట్లు గ్రహింపుము యేనరులైన మత్కృతంబగు నీస్తోత్రము పఠింపుదురో వారలకుపాపనిర్ముక్తులై త్వత్సేవాఫలమునొందునట్లు అనుగ్రహింపుమనివేడిన రామనాథుండట్లయగునని వరంబొసంగి తిరోహితుండయ్యె. వో మునీంద్రులారా యివ్విధమున శంకరభూనాయకుండు రామనాథానుగ్రహమునొంది యాదేవదేవునకు నమస్కరించి కృతార్థుండయి స్వసేనాపరివృతుండగుచు స్వనగరముజేరి యాముసీంద్రులకు దనవృత్తాంతంబెరుంగింపవారలును బ్రీతచిత్తులయి యానరేంద్రునకు రాజ్యాభిషేకము జేసిరి అంత శంకరభూనాయకుండును మంత్రిసహితుండై పుత్రదారయుతుండై యనేక దినములు పృథివీపాలనము జేయుచుండి యొకానొకవసంతకాలమున రామేశ్వరుమనమునదలంచుచు సంత్యక్తదేహుండై రామనాథ సాయుజ్యమునొందె. వో మునీంద్రులారా శంకరభూపాలకు చరిత్ర

ము మీకెరుంగించితి యెవ్వండైన నీయధ్యాయము భక్తియుక్తుండై పఠించు వినువతండు సర్వపాపనిర్ముక్తుండై రామనాథుంజేరునని శౌనకాదిమునీంద్రులకు సూతుండెఱుంగించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు
రామనాథప్రశంసయు పాండ్యశంకర బ్రహ్మహత్యా
స్త్రీహత్యా దోషశాంతియను కథలంగల
నలువదియెనిమిదవ యధ్యాయము సంపూర్ణము.

## నలువదితొమ్మిదవ అధ్యాయము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకల పురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా స్తోత్రాధ్యాయం బెరుంగించెద శ్రద్ధాయుతులరైవినుండు శ్రీరామచంద్రునిచే ప్రతిష్ఠింపంబడిన రామనాథునిజానకీజాలియు లక్ష్మణుండును సుగ్రీవాదివానరులును బ్రహ్మాద్యమరులును కుంభజాది మహామునులును ప్రత్యేకప్రత్యేకంబుగా ననేకవిధంబుల స్తుతించిరని విస్తరించెద వినుండు శ్రీరామచంద్రుండిట్లని బాగడె. ఓ మహాత్మా శ్రీరామనాథా నీవుమహామయుండవు స్వపదాంబుజ భక్తార్తిహారివి దేవాదిదేవుండవు వేదాంతవేద్యుండవు యోగీంద్రతత్త్వదాయకుండవు సర్వానందపూర్ణుండవు విశ్వనాథుండవు భక్తభయఛేదవఖిలనాథుండవు పరాత్పరుండవద్భుతవీర్యుండవు మహాపాతకనాశకుండవు కాలకాలుండవు కాలాతీతుండవు విద్యానిహంతవు సంసారతాపత్రయనాశకుండవు బ్రహ్మహత్యానాశనకారివి విషనాశకుండవు పార్వతీనాథుండవు కైలాసనిలయుండవు గంగాధారివి విరూపాక్షుండవు పినాకహస్తుండవు మదనహారివి నీకనేక వందనంబులు జేసెద నన్నునిరంతరంబుగాపుమని స్తుతించె లక్ష్మణుండిట్లనియె వో రామనాథా త్రిపురనాశకుండవు శంభుండవు ఉగ్రుండవు భీముండవు మహాదేవుండవు సర్వజ్ఞుండవు పరేశ్వరుండవు వరదుండవు శ్రీకంఠుండవు పంచపాతకఛేదివి సత్యజ్ఞానరూపుండవు భవరోగవిదారివి తస్కరపతివి గణపతివి మార్కండేయ భయవిదారివి సృష్టిస్థిత్యంత హేతుభూతుండవు నాకనారతంబును ద్వత్పాదయుగళంబందు భక్తిం బ్రసాదించి యనన్యాగమంబునొందనీయక వైదికాచారనిరతుంగాపింపుమని వేడెను శ్రీసత్యాదేవియిట్లనియె. ఓ ధూర్జటీ మహేశంకరా నీవు పార్వతీస్తనకుంకుమ పరిశోభితుండవు గంగాధరుండవు నీలలోహితుండవు కరుణానిధివి దేవదేవుండవు భవభీతిభీతివిమర్దనుండవు త్వత్పదాంబుజదంతనంబున మార్కండేయుండు యముని వలన భయంబుబాసి నిత్యుండయ్యె నిన్నాశ్రయించు వారల కలభ్యంబెద్దియునులేదు నాకెల్లప్పుడు పాతివ్రత్యంబును త్వత్పాదభక్తియుం బ్రసాదింపుమని ప్రార్థించెను అంగదుండిట్లనియె ఓ రామనాథా నిజగంబుల

న్నియు నీకాంతిచే బ్రకాశింపుచున్నది నది లేకపోయిన జనంబులు శూన్యంబులగు అట్టి నీ
కువందనంబొనర్చెదననియె జాంబవంతుం డిట్లనియె. ఓ రామనాథా సర్వానందుండవు ప
రమానందరూపుండవగు నీకు నమస్కరించెదనని వేడెను నీలుండిట్లనియె. ఓ రామనాథా
దేశకాలాది భేదములవలన భిన్నంబును నిరంతరంబద్వయంబగు రూపుహొందిన నీకు నమ
స్కరించెదననియె నలుండిట్లనియె. ఓ రామనాథా నీవు బ్రహ్మవిష్ణుపూజితుండవు విద్యాని
జృంభితుండవు విద్యావిహీనుండవు నీకు అనేక వందనంబులనియె కుముదుం డిట్లనియె
ఆస్తికమంతావలంబులగు తార్కికులు భవత్స్వరూప పరిజ్ఞానంబువలన కార్యంబులకు బర
మాణురూపంబులు గలిగింతురట్టి పరమానందస్వరూపుండవగునీకువందనంబనియెగవాక్షుం
డిట్లనియె ఓరామనాథా అజ్ఞానపాశబద్ధులై పశుప్రాయులగువారల పాపంబులనెల్ల వారిం
చెడు శాంతమూర్తి నన్నుంగావవేయని వేడెను గవయుండిట్లనియె ఓపార్వతీనాథా
నీవుచంద్రచూడుండవు సమస్తజగదాధారుండవు సంసారవినాశకుండవు నన్నుగావవే
యనివేడెను శరభుండిట్లనియె ఓరామనాథా పరమాత్మయగునీకు నమస్కరించెద లో
కంబున అజ్ఞానమోహితులగువారలు నినుంగానక అంతఃకరణంబే పరమాత్మయని వచిం
పుదురు నన్నుంగావవేయనిప్రార్థించెను గంధమాదనుండిట్లనియె ఓరామనాథ ఓ ఉమాపతీ
ఓగణనాథా సర్వపాపములనివర్తించి నన్నుంగావుమనివేడెను సుగ్రీవుడిట్లనియె వోరా
మనాథా ఓగిరిజాపతీ జన్మమృత్యు జరాప్రవాదంబును పుత్రదారవీచిమాలాసమాకులంబును
నగు సంసారాంబుధియందుమునిగి విషయవ్యాళభీతుండనయి విలపించెదునన్నుంగావుము
నీకనేకవందనములొనర్చెదనని వక్కాణించెను విభీషణుండిట్లనియె ఓరామనాథా
వ్యాధిఘోరయుతంబును సింహాభిజన్మవ్యాఘ్రానలోరగంబును బాల్య యౌవన వార్ధక్య
మహాభీష్మాంధకూపమును క్రోధేర్ష్యాభయవహ్నియు విషయక్రూర పర్వతమునునగు సం
సారవనమధ్యమున నివిష్టుండనై మార్గంబుగానక అనాథుండనై భీతుండనగునాకు శుభ
కరంబైనమార్గంబొసంగి రక్షింపుమనివేడెను సర్వవానరులిట్లనిరి ఓరామనాథా ఓశం
కరా ఓదేయానిధీ నింద్యానింద్యంబులగు అనేకయోనులం జనించి కుంభీపాకాది
నరకంబులంబడి మరలంబుట్టుచు జచ్చుచు సంసారపతితులమై యనాథులమగు మమ్ముంగా
వవేయనివేడిరి బ్రహ్మదేవుండిట్లనియె ఓరామనాథా ఓలోకనాథా ఓసర్వేశా అవిద్యా
నాశనంబుగావించి నన్నుంగావవేయని వినుతించెను ఇంద్రుండిట్లనియె వోరామనాథా
వోపార్వతీపతీ జగన్మాతయగు పార్వతీదేవి నీశక్తియై వెలయు నీవు మహాదేవుండవు అను
స్తుతించెను యముండిట్లనియె వోరామనాథా నీవు సదాశివుండవు గణేశ్వర స్కందు లి
రువురు యుష్మత్పుత్రులు నీకు వృషభము వాహనమైయుండు నిమంబూజించినకతంబున
మార్కండేయమహామునీంద్రుండు మృత్యువుంజయించె అట్టినీవు నన్నుంగావవేయని ప్రా
ర్థించెను కుబేరుండిట్లనియె వోరామేశ్వరమహాదేవా నీవు అఖిలవిలసత్కారుణ్యుండవా

ధరుండవు లాక్షారుణశరీరుండవు నన్నుంగావవేయని వినుతించెను ఆదిత్యుండిట్లనియె
హోరామనాథా హోదక్షాధ్వరవినాశకా నన్నుంగావవేయనివేడెను సోముండిట్లనియె హో
రామనాథా నీవు భస్మోద్ధూళితాంగుండవు మహాశూలివి దయాసింధుండవు శ్మశాననిలయుం
డవు నన్నుంగావవేయని ప్రార్థించెను అగ్నియిట్లనియె హోరామనాథా హోదిగంబరా నీవు
శుద్ధస్వరూపివి ఇంద్రాద్యమరపూజితపదాంబుజుండవు నన్నుంగావవేయనివేడెను వా
యుదేవుండిట్లనియె హోహరా నీవువ్యాఘ్రచర్మధరుండవు మదీయాభీష్టంబులనొసంగి న
న్నుగావవేయనివేడెను బృహస్పతియిట్లనియె హోరామనాథా ప్రత్యగద్వయవస్తురూపుండవు
లోకహంతవు లోకసాక్షివి నీకువందనంబులు నాయజ్ఞానంబువారింపవేయనివేడెను శు
క్రుండిట్లనియె ఓరామనాథా నీవుమహామంత్రార్థరూపివి శంభుండవు తత్వవిహీనుండవు
నంతకాలఘ్నుండవు నీకు వందనంబులనియె అశ్వినీదేవతలిట్లనిరి ఓరాఘవేశ్వరా నీవుని
రంతరంబును యోగీంద్రులమనంబుల ఆత్మరూపంబుచే వసింతువు అనన్యభావవేద్యుడవు
నీకనేకవందనములనియె అగస్త్యుండిట్లనియె ఓరామనాథా నీవు ఆదిదేవుండవ్యయుండవు
విశ్వేశుండవు అంబికాపతివి వృషభధ్వజుండవు నాయపరాధసహస్రంబులవహించి పు
త్రాదులయందలిమోహంబువారింపుమనివేడెను సుతీక్ష్ణుండిట్లనియె హోరామనాథా క్షేత్ర
ములు రత్నములు ధనములు దారలు మిత్రులు పుత్రులు వస్త్రగృహాదులన్నియు నస్థిరం
బులుగాన నీకనేకవందనములు విరక్తింబ్రసాదింపవేయని ప్రార్థించెను విశ్వామిత్రుడిట్లని
యె హోరామనాథా సకలవేదములు సకలశాస్త్రములభ్యసించినను నీయందు భక్తిలేకపో
యిన నిష్ఫలంబులగునట్టి నీకువందనములనియె గాలవుండిట్లనియె హోరామనాథా నీకునమ
స్కారంబులుజేయనిమానవులు దానములు యజనములు నియమములు తపములు గంగాది
తీర్థనిషేవనంబులుజేసినను నిష్ఫలంబులని వక్కాణించెను వసిష్ఠుండిట్లనియె హోరామ
నాథా నీయందుభక్తిగలమానవుం డఖిలపాపంబులొనర్చినను సూర్యుడంధకారపుంజంబు
లంబోలె సకలపాపముల నిరసించుననివేడెను అత్రియిట్లనియె హోరామనాథా యెవ్వండై
న నొకానొకసమయంబునందైన నినుంగాంచినను స్పృశించిన నమస్కరించిన మరల
గర్భంబునొందక అద్వయంబగు నీస్వరూపంబునొందునని వేడెను అంగీరసుండిట్లనియె
హోరామనాథా యేమనుజుండైన బంధుపరివృతుండై నిన్నుంగూర్చి నమస్కరించునాతని
బంధుయుక్తంబుగాబ్రోతువని వక్కాణించెను గౌతముండిట్లనియె హోరామనాథా యే
మనుజులయిన త్వత్పాదభజనంబుసేయుదురో వారలసేవించినవారలుధన్యులిదిగూఢంబు
ను అవ్యక్తభూతంబునునగు పరమేశ్వరతత్వంబనియె శతానందుండిట్లనియె హోరాఘవేశ్వ
రా వేదాంతవిజ్ఞానరహస్యవేదులగు ముముక్షువులకెల్ల సకలశాస్త్రఫలంబని నిన్నుసే
వించుటయే ముఖ్యంబని వక్కాణించెను భృగుమహామునియిట్లనియె హోరామనాథా త్వ
త్పాదకమలభజనుండగు నరుండు విధూతపాపుండై స్వయంప్రభుండును నిర్భయుండు

ను అద్వయుండును చిద్ఘనస్వరూపుండునునగు నిన్నుం బొందుననియె కుత్సుండిట్లనియె వో రామనాథా భోగమోక్షవరదంబును రౌరవాదినరకప్రకాశకంబునునగు భవత్పాదసేవనం బేమనుజుండు గావించకయుండు నతండు వ్యర్థుండనియె. కాశ్యపుండిట్లనియె వో రామనాథా త్వత్పాదంబులు సేవించువారలకు వ్రతములు తపము లధ్వరములు వేదశాస్త్రములు స్వర్గసింధుజలంబులేలననియె అంగిరసుండిట్లనియె వో రామనాథా నీవుసుత్రాణో త్క్రమణకాలంబున భవానీసహితుండవై యరుదెంచి మోహంబును విశోకంబును చిత్స్వరూపంబునునగు త్వత్పాదకమలంబులు జేర్చుకొనవేయని వేడెను గంధర్వులిట్లనిరి వో రామనాథా అపారంబును దుఃఖకల్లోలంబగు భవసాగరంబునమునింగెడు మాకు నీవుదప్ప గతిలేదన్నిరి కిన్నరులిట్లనిరి వో రామనాథా వ్యాధివ్యాఘ్రభయానకంబగు భవారణ్యమునందు నీవుదప్ప పదవీదర్శకుడెవడులేడని వక్కాణించిరి యక్షులు వో రామనాథా యతిదుస్సహంబును బాధకంబగు యింద్రియారాతిసమూహంబు జయింప మాకుసహాయుడవగుమని వేడిరి నాగులు వో రామేశ్వరా అల్పబుద్ధులమగుమే మచింత్యమహిమంబుగల నిన్నుస్తోత్రంబొనర్ప నెట్లుసమర్థులమగుదుమని స్తుతించిరి కింపురుషులు రామనాథా యజ్ఞానంబున నానాయోనులందు జననమరణంబులంబొందెడు మాయజ్ఞానంబుబాపి మమ్ముగావవేయని ప్రార్థించిరి విద్యాధరులు ఓయంబికానాయకా యసంకాయసంగుండవగునీవు మమ్ముబ్రోవవేయనివేడిరి విశ్వేదేవులు ఈశాజ్ఞప్తిమాత్రైకనిష్ఠులగు యోగివరులకు ముక్తినొసంగుచు నంబాసహితుండవై వెలయు నీవు వమ్ము గాచుమని పితరులు ఓ రామనాథా గణేశా గంగాధరా శర్వా మమ్ముంగావవేయని వేడిరి మరుతులు ఓ రామనాథా నీవు స్వస్వభావుండవు పరతత్వరూపుండవు మహాత్ముండవు మీకు వందనంబనివేడిరి. సాధ్యులు వో రామనాథా, నీవు స్వాతిరిక్తవిహీనుండవు జగత్సృష్టిదాయకుండవు దేవాదిదేవుండవు అవిద్యాభేదివి మమ్ముంగావవేయని నమస్కరించిరి. సకలవానరులు వో రామనాథా నీవు సచ్చిదానందసంపూర్ణుండవు ద్వైతవస్తురహితుండవు బ్రహ్మాత్ముండవు స్వయంభానుండవు ఆదిమధ్యాంతరహితుండవు అవిక్రియుండవు అసంగుండవు పరిశుద్ధుండవు సనాతనుండవు ఆకాశాదిప్రపంచసాక్షిభూతుండవు పరావృతుండవు ప్రమాణాతీతుండవు బోధప్రదాయకుండవు అవిద్యావతిరోధానకోచరహితుండవు నీయందుండు ప్రపంచంబునకు సాక్షివి నిర్లేపుండవు పరమానందుండవు నిరస్తసకలక్రియుండవు మహాత్ముండవు ఛిద్రూపుండవు భోగవర్జితుండవు సంసారనివారివి స్వకీయ్యంబగు మాయచే బ్రహ్మవిష్ణ్వాదిరూపంబుల విభిన్నుండవైయొప్పు మిమ్ము నిరంతరంబు సేవించెదము. మమ్ము సకలపాపంబులంబాపి రక్షింపవేయనినమస్కరింపిరి. విభీషణమంత్రులు వో రామనాథేశ్వరా నీవు వరదుండవు వరేణ్యుండవు త్రినేత్రుండవు శూలధారివి యోగిధ్యేయుండవు నిత్యుండవు నీకు వందనంబులని ప్రార్థించిరి, యివ్విధంబున రామాదులనేకవిధంబుల స్తుతించిన సంప్రీతుం

డై పాలింగాంచి రామనాథుండిట్లనియె. హో జానకీనాథా హో సౌమిత్రీ హో సుగ్రీవాది వానరులారా హో బ్రహ్మాదిసురమునీంద్రులారా శ్రద్ధాయుతులరై వినుండు యెవ్వారైనను రమ్మత్కృతంబగు నీస్తోత్రాధ్యాయం బాదరంబుగ పఠింపుదు రాకర్ణింపుదు రామను జాలు వన్మం బూజించిన ఫలంబును రామచంద్రధనుష్కోటిస్నానఫలంబును రామసేతువునందొకవర్షంబుండిన ఫలంబును గంధమాదనసిద్ధతీర్థస్నానఫలంబునుబొంది జరామరణనిర్ముక్తులయి సకలదుఃఖంబులంబాసి మదియ్యసాయుజ్యంబునొందుదు రిందుకు సందియంబులేదనివచించి యంతర్హితుండయ్యెనని శౌనకాదిమునీంద్రులకు సూతుండువక్కాణించెను.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమాహాత్మ్యంబునందు
శ్రీరామచంద్రాదులు శ్రీరామనాథస్తోత్రంబుగావించిన కథగల
నలువదితొమ్మిదవ యధ్యాయము సంపూర్ణము.

---

## ఏ బ ది య వ అ ధ్యా య ము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సూతుండిట్లనియె. ఓమునీంద్రులారా పుణ్యంబును పాపహరణంబును శుభకరంబగు సేతుమాధవవైభవం బెఱింగించెద శ్రద్ధాయుతులరై వినుండు పూర్వంబున పుణ్యనిధియను నరేంద్రుండు సోమకులంబున జన్మించి హలాస్త్యైశ్వర భూషితంబగు మధురంబాలింపుచు యొకానొకసమయంబున చతురంగబలంబులంతఃపురజనంబులుతోడరా నిజపుత్రు రాజ్యధురంధరుంగావించి రామసేతువునకుంబోయి యచట గంధమాదనంబున నివసించి ధనుష్కోటియందును మరియుంగల తీర్థంబులందును నిత్యంబును స్నానము గావింపుచు బహుకాలంబుండి పిమ్మట విష్ణుప్రీతికరంబగు యజ్ఞంబుజేసి తదంబునందవభృథస్నానంబొనర్చి సపరివారుండును భార్యాసమేతుండై రామనాథుం బూజింపుచుండె నాకాలంబున నిందిరాదేవి విష్ణుదేవునితో వినోదకలహంబుగావించి యొక సమయముజేసి యాపుణ్యనిధినరేంద్రుభక్తిబరీక్షింపంగోరి విష్ణుప్రేరితయై వైకుంఠంబునుండి గంధమాదనంబున నేతెంచె యష్టవర్ష కన్యారూపంబునొంది ధనుష్కోటితీరంబున సంచరించుచుండె నాసమయమున నరేంద్రుండు ధనుష్కోటిస్నానంబుజేయంగోరి సబలుండై యరుదెంచి స్నానంబుజేసి తులాపురుషాది దానంబులుగావించి మరలిస్వకీయగృహంబునకుంబోవుచుండి అష్టవర్షయుతశుచిస్మితయు చారువిలోచనయు బింబోష్ఠియు తనుమధ్యమయునగు నొకకన్యకంగాంచి, ఓ బాలికామణీ నీవెవరిహాతుర వేలయిచటనున్నదాన వెరుంగింపుమని యడిగిన నాకన్యయిట్లనియె. ఓ నరేం

ద్రా నాకుం దల్లిదండ్రులు బాంధవులులేరు నేను భర్తృరహితనైయున్నదాన నెవ్వండైన
నన్నుం బలాత్కారంబున గ్రహించునాతని శిక్షించెదవేని నీగృహంబున నిన్ను జనకుంగా
దలంచుచు బుత్రికనై యుండెదననిన నృపుండట్లొనర్చెదనని నంగీకరించి నాకొకపుత్రుండు
గలడుగాని పుత్రికలులేరు ఓకన్యామణీ మద్గృహంబునకరుదెంచి యంతఃపురంబున నాభా
ర్యకుం బుత్రికవై యుండు మేపురుషునియందు నీకిష్టంబుగల్గు నాతనికొసంగెదనని యాకన్య
నలోచనదొడంబరచి స్వగృహంబునకుంగొనిపోయి వింధ్యావళియను స్వభార్యాహస్తంబున
నిడి యోపత్నీ నీవీకన్యను నిరంతరంబును మనకుం బుత్రికయని భావించి రక్షింపుమనిన నది
యునంగీకరించె నిట్లాకన్య పుణ్యనిధినరేంద్రునిచే రక్షింపంబడుచు సుఖంబుండె నంత
గొంతకాలమునకు జగన్నాథుండగు విష్ణుదేవుండు గరుడారూఢుండై వైకుంఠంబు వెడలి
రమాదేవిని వెదకుచు సకలదేశంబుల సంచరించి ఎందుంగానక గంధమాదనంబుజేరి సేతు
సమీపంబున సంచరించుచుండె నపుడా కన్యారత్నంబు సఖీసమేతయగుచు యాభవనో
ద్యానంబున పుష్పంబులంగోయుచుండంగాంచి విష్ణుదేవుండు విప్రరూపమునొంది గంగా
జలము స్కంధంబునందును దక్షిణకరంబున కుశగ్రంథిపవిత్రంబును ఛత్రంబును వహింపు
చు భస్మోద్ధూళితసర్వాంగుండును త్రిపుండ్రావళిశోభితుండును ధృతరుద్రాక్షమాలికుండు
ను శివనామపారాయణుండును సోత్తరీయుండునునగుచు గంగాస్నానంబు గావించు విప్ర
వేషంబు ధరించి యచటనుండ నాకన్య యావిప్రుంగాంచి భీతినొందె నంత వాసుదేవుం
డు పుష్పంబులం గోయుచున్న నిజవల్లభంగాంచి సత్వరుండై కరంబుల గ్రహింప నాకన్య
యు సఖీపరివృతయై యాక్రోశింప నారవంబాలించిన నరేంద్రుండు పరివారసమేతుండై
యేతెంచి యాకన్యంగాంచి యోకన్యామణీ సఖులంగూడి యేల విలపించెద వెవ్వడు నిన్ను
బరిభవించె నెరుఁగింపుమనిన నాకన్యక కన్నీరొడుచు నోతండ్రీ నన్నీవిప్రుండు బలాత్కారంబు
న గ్రహించి నిర్భయుండై వృక్షమూలంబున నున్నవాడు వీనిం జూడుమనిన నృపుండావి
ప్రుంగాంచి యాతని మహిమం బెరుంగక బలాత్కారంబున రామనాథాలయంబునకుం
గొనిపోయి యచట మంటపంబున నిగళపాశబద్ధుంజేసి యాత్మపుత్రి నూరడించి యంతః
పురంబుజేరి యారాత్రి నిద్రంబొంది స్వప్నంబున నావిప్రుని శంఖచక్రగదాపద్మవనమాలావి
రాజితుండును కౌస్తుభాలంకృతోరస్కుండును పీతాంబరధారియు కాలమేఘఛవియు
గరుడోపరిసంస్థితుండును చారుస్మితుండును మకరకుండలవిరాజితుండును విష్వక్సేనప్ర
భృతిపరిచారసేవితుండును శేషశాయియు నారదాదిసంస్తుతుండును నైన విష్ణుంగాంజూచి నిజ
పుత్రికను ధృతపంకజహస్తయు నీలకుంచితమూర్ధయు విష్ణువక్షస్థలయు సమున్నతపయోధర
యు దిగ్గజాభిషిక్తాంగియు శ్యామయు పీతాంబరావృతయు స్వర్ణపంకజమాలాలంకృతమూర్ధ
యు అనర్ఘ్యరత్నఖచిత దివ్యాభరణవిరాజితయు హారతారభూషితయునై వెలయు రమా
దేవింగాగాంచి తల్పంబుననుండి లేచి కన్యాగృహంబుజేరి తాను స్వప్నంబుగనినవిధంబున

సుందు పుత్రింగాంచి సూర్యోదయంబున మంటపంబుజేరి యచట హరిరూపుండగువిప్రుం గాంచి యాదేవదేవు నివ్విధంబునంబొగడె.

ఓరమానాయకా నీవుగరుడధ్వజుండవు శార్ఙ్గపాణివి పుండరీకాక్షుండవు శ్రీపతివి కౌస్తుభాలంకృతుండవు శ్రీవత్సలక్షణుండవు దైత్యసంఘవిదారివి అశేషభువనావాసనాభి పంకజశాలివి మధుకైటభవిదారివి రావణాంతకుండవు ప్రహ్లాదరక్షకుండవు ధరిత్రీపతివి నిర్గుణుండవప్రమేయుండవు బుద్ధిసాక్షిని శ్రీనివాసుండవు పరాత్మకుండవు నారాయణశబ్దవాచ్యుండవు పంకజనేత్రుండవు పంకజశాలివి పంకజాంఘ్రివి సకలలోకనాథుండవు దయామూర్తివి నిన్నేరుంగకనిగళపాశబద్ధుంజేసి యపరాధంబుగావించితి దయాళుండవై రక్షింపుమని యనేకవిధంబులవేడి రమాదేవి నిట్లనిస్తుతించె. ఓ దేవీ నీవువిష్ణువక్షస్థల నివాసినివి అబ్ధిజవు హరిప్రియురాలవు సిద్ధిపుష్టిస్వధాస్వాహాప్రభాధాత్రీభూతిరూపురాలవు శ్రద్ధయుమేధయు సరస్వతియు నీవయజ్ఞవిద్యాగుహ్యవిద్యాత్మవిద్యారూపిణివి ముక్తిదాయినివి త్రయీరూపవు జగన్మాతవు సృష్టిస్థిత్యంతకారిణివి నీకనేకవందనంబులు నన్నురక్షింపుమని రమాదేవిం బ్రార్థించి విష్ణుదేవుంగాంచి యిట్లనియె. ఓరమానాయకా యజ్ఞానంబున నిగళపాశబద్ధుంజేసి యపరాధంబొనర్చితి లోకంబులెల్ల నీశిశువులు సుతాపరాధంబు క్షమింపందగు మఱియును నీకపరాధులగు దైత్యులకు స్వరూపంబొసంగితివి నిన్నుం జంపవరుదెంచిన పూతనంగాచితివి నాయపరాధంబుసహించి నన్నుకృపాదృష్టిచే రక్షింపుమని యనేకవిధంబులంవేడినం బ్రీతుండై విష్ణుదేవుండు మేఘగంభీరరవంబుగా నిట్లనియె. ఓరాజేంద్రా నన్నుబంధించినందుకై భీతిబొందకు నేభక్తుల వశ్యుండనై యుండుదు నీవు మచ్ప్రీతికరంబగు యజ్ఞంబుగావించి నాభక్తుండవైతివిగాన నీకు వశ్యుండనై పాశబద్ధుండనైనెనిరంతరంబుభక్తాపరాధంబుల సహించియుండుదునీభక్తిబరీక్షింప నీలక్ష్మింబంపితి నీవురక్షించితివిగాన నీకుబ్రీతుండనైతి యీదేవి మత్స్వరూపయై యుండు నెవ్వడీలక్ష్మింకింభక్తుండాతండు మద్భక్తుండు నెవ్వండు విముఖుండగు నాతండు మద్ద్వేషియగు నీవుభక్తియుతుండవై యీరమంబూజించితివిగాన నాకపరాధముజేసియు నన్నుంబూజించినవాడవు పూర్వంబు నాకును నీదేవికిని యొకసంకేతంబుగలదు దానలక్ష్మీదేవింభవత్సవిలాసంబునకుం బంపితి నీవును సంరక్షించితివి భీతింబొందకు ప్రీతింబొందితి మీవనిత సత్యంబుగ లక్ష్మీదేవియని వచించె నంత రమాదేవియు సుప్రీతచిత్తయై నరేంద్రుంగాంచి యిట్లనియె.

ఓరాజేంద్రా నేనీకుంబ్రీతనైతిత్వద్భక్తిశోధనార్థంబై వినోదకలహవ్యాజంబున నేనును విష్ణుదేవుడును నరుదెంచి నీభక్తికిమెచ్చితిమి నీకు మత్కృపచే సకలశుభంబులు సర్వభూమండలైశ్వర్యంబును మదీయపాదభక్తియు గలిగి దేహాంతంబున అస్మత్సాయుజ్యంబునుం గల్గు నెన్నడును పాపకార్యంబులయందు బుద్ధికలుగదు నిరంతరంబును ధర్మకార్యంబు

లందు భక్తిగలుగునని వచించి లక్ష్మీదేవి విష్ణువక్షస్థలంబుఁజేరె వో మునీంద్రులారా యా సమయంబున విష్ణుదేవుండు రాజునుఁగాంచి మరల నిట్లనియె. వో నరేంద్రోత్తమా నీవెట్లు నన్ను నిగళంబుసంబంధించితివట్లు రూపంబునొంది నిరంతరంబును సేతుమాధవ సంజ్ఞుండనై యీ ప్రదేశమున పూర్వమున నాచే నిర్మింపఁబడిన సేతురక్షార్థమై నిరంతరంబు భూతరాక్షస సంఘంబులవలన జనంబులకు భయంబుల నుపశాంతిఁబొందింపుచు వసించి యుండెద చతుర్ముఖుండును సేతురక్షార్థం బచటనయుండు శంకరుండును రామనాథాఖ్యుండై యుండు ఇంద్రాది లోకపాలకులు నిచట నివసించి యుండుదురు యెవ్వరైన నిగళబద్ధుండగు నన్ను సేవింపుదురో వారలు పాపనాశనంబును సర్వాభీష్టంబులంబొంది మత్సాన్నిధ్యంబు నొందుదురు యేమనుజులైన మదీయచరిత్రంబును లక్ష్మీచరిత్రంబును భవత్కథయు పఠింపుదురో వారలు దరిద్రంబులంబొందక సకలైశ్వర్యంబులఁబొందుదురు ఎవ్వండైన నీచే జేయంబడిన లక్ష్మీస్తోత్రంబును మదీయస్తోత్రంబును నిత్యంబున పఠించినను స్మరించిన నువినినను లిఖించినను నతండు పునరావృత్తిరహితంబగు మదీయలోకంబునొందునని రమానాయకుండు వచించి యామంటపంబున సేతుమాధవరూపంబునుండె. ఓ మునీంద్రులారా పిమ్మట పుణ్యనిధియు నా సేతుమాధవరూపియగు విష్ణుదేవునకు నమస్కరించి యనేకవిధంబులం బూజించి రామనాథునకు పూజావందనాదులొనర్చి స్వభవనంబునకుంబోయి నిజపుత్రు మధురారాజ్యధానిరక్షకుంగావించి యా సేతువునం దనేకదినంబులు నివసించి దేహాంతంబున ముక్తింబొందె పిమ్మట తత్పత్నియగు వింధ్యావళియు కొన్నిదినంబులకు దేహము విడిచి సద్గతింబొందె. ఓ మునీంద్రులారా నిరంతరంబు రామనాథు సేవించుచుండు వారలు కైలాసంబున నిరంతరంబును నుందురు యేమనుజులైన సేతుమాధవుం బూజింపక పోదురో వారలు రామనాథసేవాఫలంబు బొందఁజాలరు యెవ్వండైన గంగాస్నానము జేయఁగోరునాతండు సేతుమాధవ సన్నిధానంబున సంకల్పంబుగావించి యరిగెనేని నాయాత్ర సఫలంబగు వో మునీంద్రులారా సేతుమాధవప్రభావం బెరుంగించితి యెవ్వండైన నీయధ్యాయంబు భక్తియుక్తుండై పఠించు వినునతండు వైకుంఠంబు నొందునని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరింగించెను.

ఇది స్కాందపురాణంబునందు సేతుమాహాత్మ్యంబున
సేతుమాధవప్రభావప్రశంసయు పుణ్యనిధిచరిత కథనంబుగల
ఏబదియవ యధ్యాయము సంపూర్ణము.



## ఏబదియొకటవ అధ్యాయము.

మహానీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకలపురాణవ్యాఖ్యానదక్షుండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా సకల పాపహరంబగు సేతుయా

ప్రాక్రమంబెఱుంగింతవరకుండు మానవుండు స్నానముజేసి యాచమనంబుగావించి నిత్యకృత్యంబులు నివర్తించుకొనినవాఁడై రామనాథప్రీత్యర్థంబును రామచంద్ర ప్రీత్యర్థంబునుంగా దన కుంగలకొలంది వేదపారగులగు విప్రులకన్నంబిడి భస్మోద్ధూళిత సర్వాంగుండును త్రిపుండ్రాంకిత మస్తకుండును గోపీచందనలిప్తుండును ఊర్ధ్వపుండ్రాంకితుండును రుద్రాక్షమాలాభరణుండును సపవిత్రకరుండును శుచియునై భక్తిపూర్వకంబుగ సేతుయాత్రకుం బోయెదనని సంకల్పంబొనరించి స్వగృహంబువెడలి మౌనియై పంచాక్షరమంత్రంబయిన అష్టాక్షరమంత్రంబయిన నియతుండై జపించుచు ఏకవారంబు హవిష్యాశియు జితక్రోధుండును జితేంద్రియుండును పాదుకాఛత్రరహితుండును తాంబూలతైలాభ్యంగస్త్రీసంగాది హీనుండును శౌచాద్యాచారయుక్తుండును సంధ్యోపాస్తిపరాయణుండును నిరంతరంబు రామచంద్రచింతకుండునునై పోవుచు మార్గమధ్యంబున నాదరంబున సేతుమాహాత్మ్యంబును పఠింపవలయును మరియును రామాయణంబయిన పురాణాంతరంబులనైన పఠింపుచుబోవలయుగాని వ్యర్థవాక్యంబు లాడంజనదు మరియు శిష్టాచారంబుల విడువంజనదు ప్రతిగ్రహంబు జేయంగూడదు మార్గంబున యథాశక్తిగ శివవిష్ణ్వాది పూజనంబును వైశ్వదేవాద కర్మంబులను బ్రహ్మయజ్ఞాదులను నగ్నిపూజనంబును అతిథి అభ్యాగత పూజనంబును యతిభిక్షయును విత్తలోభంబులేకంజేయుచుంబోవలయు యతులకు స్వర్ణంబును వానప్రస్థునకు వసనంబులు గృహస్థునకు భిక్షయు బ్రహ్మచారికి తాంబూలంబును నొసంగదగదు అట్లువిచారించక నొసంగిన మానవుండు నరకంబునొందు మరియును మార్గంబున శివవిష్ణ్వాదుల నామస్తోత్రంబుజేయవలయు నెల్లప్పుడు ధర్మంబుగావింపవలయు నిషిద్ధకర్మంబుల నివర్తించవలయు నివ్విధంబు నియతుండై సేతుమూలంబుజేరి యచ్చట సమాహితచిత్తుండై ప్రథమంబున పాషాణదానంబుజేసి యందు సముద్రావాహనంబు గావించి నమస్కారంబొనరించి యనుజ్ఞంగొని మహోదధియందు స్నానంబుజేసి మనంబున హరిం దలంపుచు ఋషిదేవకపిపితృతర్పణంబులుం గావింపవలయు వోమునీంద్రులారా పాషాణంబొక్కటైన సప్తకంబైన నొసంగవలయు పాషాణదానంబు గావించినంగాని స్నానంబుసఫలంబుగా నేరదు. పాషాణదానమంత్రము ॥ పిప్పలాదిసముత్పన్నేకృత్యే లోకభయంకరి । పాషాణాంతేమయాదత్త మాహారార్థంప్రకల్పితం ॥ అను మంత్రంబు పఠించి పాషాణదానంబు జేయవలయు॥ సాన్నిధ్యప్రార్థనమంత్రము ॥ విశ్వాచీత్వం ఘృతాచీత్వం విశ్వయోనేవిశాంపతే । సాన్నిధ్యంకురుమేదేవ సాగరేలవణాంభసి ॥ అను మంత్రంబు పఠింపుచు సాన్నిధ్యప్రార్థనంబు జేయవలయు॥ నమస్కారమంత్రము ॥ నమస్తే విశ్వగుప్తాయ నమోవిష్ణ్వపాంపతే । నమోహిరణ్యశృంగాయ నదీనాంపతయేనమః ॥ సముద్రాయతయునాయేతి ప్రోచ్చార్య ప్రణమేత్తదా॥ అనుమంత్రంబుపఠింపుచు నమస్కారంబొనర్పవలయు॥ అర్ఘ్యమంత్రః॥ సర్వరత్నమయశ్రీమన్ సర్వరత్నాకరాయథ । సర్వరత్నప్రధా

తస్త్వంగృహాణార్ఘ్యం మహోదధే॥ అనుమంత్రోచ్చారణంబుజేసి యర్ఘ్యంబొసంగవల
యు॥ అనుజ్ఞాపనమంత్రః॥అశేషజగదాధార శంఖచక్రగదాధర। దేహిదేవమమానుజ్ఞాం
యుష్మత్తీర్థనిషేవణే॥ అనుమంత్రంబుజపించుచు అనుజ్ఞాపనంబుగావింపవలయు॥ ప్రార్థ
నామంత్రః॥ప్రాచ్యాందిశిచసుగ్రీవం దక్షిణస్యాంనళంస్మరేత్॥ప్రతీచ్యాంమైందనామానము
దీచ్యాంద్వివిదంతథా। రామంచలక్ష్మణంచైవ సీతామపియశస్వినీం। అంగదంవాయుతన
యం స్మరన్మధ్యేవిభీషణం। పృథివ్యాంయానితీర్థాని ప్రావిశంస్త్వాంమహోదధే! స్నాత
స్యమేఫలందేహి సర్వస్మాత్త్రాహిమాంహసః। హరిణ్యశృంగమిత్యాభ్యాం ధ్యాభ్యాంనారా
యణస్మరేత్। ధ్యాయేన్నారాయణందేవం స్నానాదిషుచకర్మసు। బ్రహ్మలోకమవాప్నోతి
జాయతేనేహవై పునః। సర్వేషామపిపాపానాం ప్రాయశ్చిత్తంభవేత్తతః॥ ప్రహ్లాదంనారదం
వ్యాస మంబరీషంశుకంతథా। అన్యాంశ్చభగవద్భక్తాన్ చింతయేదేకమానసః. అను మం
త్రంబుపఠింపుచు ప్రార్థనంబుజేయవలయు॥ స్నానమంత్రః॥ వేదాదయోదేవవసిష్ఠయో
నిస్సరిత్పతిస్సాగరోరత్నయోని। అగ్నిశ్చవాయుశ్చయిళాచతేజో రేతోభవిష్ణోరమృతస్య
యోనిః॥ ఇత్థంతేఽన్యాధికశమానమద్భిర్యాఃకాశ్చసింధుం ప్రవిశంత్యాపః। సపోజీర్ణ
మివత్వచంజహామిపాపంశరీరాత్సశరీరస్థ అభ్యుపేత్య. అని స్నానంబుజేయవలయు॥
అందు ప్రథమస్నానమంత్రః॥ సముద్రాయవయునాయేతి నమస్కుర్యాత్పునర్ద్విజాః।
సర్వతీర్థమయంశుద్ధం నదీనాంపతిమంబుధిం॥ అను మంత్రంబుపఠింపుచు ప్రథమస్నానంబు
జేయవలయు॥ ద్వితీయస్నానమంత్రః॥ధ్యాసముద్రావితిపునః ప్రోచ్చార్యస్నానమాచరేత్।
బ్రహ్మాండోదరసంస్థానికరస్పృష్టానితేరవే॥ తేనసత్యేనమేసేతో తీర్థందేహిదివాకర॥
అను మంత్రంబుపఠింపుచు ద్వితీయస్నానంబు జేయవలయు॥ తృతీయస్నానమంత్రః॥
ప్రాచ్యాందిశిచసుగ్రీవ మిత్యాదిక్రమయోగతః। స్తుత్వాభూయోద్విజాస్సేతౌ తృతీ
యంస్నానమాచరేత్॥ అనుచు తృతీయస్నానంబుజేయవలయు॥ దేవీపట్టణమార్గంబు
నబోయిన మానవుండును దర్భశయ్యామార్గంబున బోయినవాడును స్వపాప విశు
ద్ధికై సేతువునందు నవపాషాణమధ్యంబున సముద్రంబున స్నానంబుజేయవలయు॥
యివ్విధంబున స్నానత్రయంబుజేసి॥ తర్పణమంత్రః॥ పిప్పలాదంకలింకణ్వం కృతాం
తంజీవితేశ్వరం। మన్యుంచకాళరాత్రించ విద్యాంచాహార్గణేశ్వరం। వసిష్ఠంవా
మదేవంచ పారాశర్యముమాపతిం। వాల్మీకంనారదంచైవ వాలఖిల్యాన్మునీన్తథా। నలం
నీలంగవాక్షంచ గవయంగంధమాదనం। మైందంచద్వివిదంచైవ ఋషభంశరభంతథా। సు
గ్రీవంచహనూమంతం వేగదర్శినమేవచ। రామంచలక్ష్మణంసీతాం మహాభాగాంయశస్వి
నీం॥ అనుమంత్రంబుపఠింపుచు ముమ్మారు తర్పణంబుజేయవలయు॥ తర్పణంబుజేయునె
డల తత్తన్నామంబుల ద్వితీయాంతంబులుగాని చతుర్థ్యంతంబులుగాని వచింపుచు దేవ
ఋషి పితృతర్పణంబులం గావింపవలయు తర్పణంబుజేయునెడల సపవిత్రుండును
ప్రసన్నబుద్ధియునైన తీర్థస్నానఫలంబునొందు యివ్విధంబున తర్పణంబుజేసి నమస్క

రించి యార్ద్రవస్త్రంబువిడిచి శుష్కవస్త్రంబుగట్టుకొని యాచమనంబుజేసి విధిప్రకారం బున తిలతండులాదులచే పితృదేవతకు శ్రాద్ధంబుజేసి పిండదానంబుజేయవలయు, అట్లుగా వింప నశక్తుండయ్యేనేని ధనాఢ్యుండగువాడు షడ్రసోపేతాన్నదానంబు జేయవలయు, గో భూ తిల హిరణ్యాది దానంబులనైనను జేయవలయు ఓమునీంద్రులారా యివ్విధంబున మనుజుండు సేతుమూలంబున పాషాణదానపూర్వంబుగు తర్పణాంతంబులగు కర్మంబుల విధిపూర్వకంబుగ గావించి పిమ్మట చక్రతీర్థంబునకుంబోయి యందు స్నానంబుచేసి సేతు నాయకుండగు నారాయణుంబూజించి పశ్చిమమార్గంబునంబోవు మనుజుండు సర్వశయ నుండగు దేవుంబూజించి పిమ్మట కపితీర్థంబుచేరి యందు స్నానంబుచేసి సీతాసరంబును చేరి మజ్జనంబొనరించి యనంతరంబ ఋణమోచనతీర్థంబుజేరి యందు స్నానంబుగావిం చి రామచంద్రునకెరగి లక్ష్మణతీర్థంబుజేరి కంఠంబుమీద వపనంబుగావించుకొని పూర్వం బున తానొనర్చిన దుష్కృతంబులం దలంచుచు స్నానంబుచేసి రామతీర్థంబున కరిగి పిమ్మట రామేశ్వరాలయంబుచేరి యచ్చట పాపవినాశనంబునందును గంగా యమునాతీ ర్థంబులందును సావిత్రీ సరస్వతీ గాయత్రీ తీర్థంబులయందును హనూమత్కుండంబు నందును బ్రహ్మకుండంబునందును విధిపూర్వకంబుగ స్నానంబుచేసి యనంతరంబ సకలపా పనాశనకరంబగు నాగకుండంబుచేరి యందు స్నానంబుగావింపవలయు నాతీర్థోత్తమం బనంతాదినాగశ్రేష్ఠులచే నిర్మింపంబడియె నందు గంగాదిసర్వతీర్థంబులు స్వాభిలాషం తింగోరి వసించియుండు పిమ్మట మనుజుం డందుండి యగస్త్యతీర్థంబునకుంబోయి యం దుస్నానంబుచేసి యచటనుండి యగ్నితీర్థంబుచేరి సంకల్పపూర్వకంబుగ స్నానంబుచేసి విధివత్ప్రకారంబుగా పితృదేవతలకు శ్రాద్ధంబుగావించి బ్రాహ్మణజనంబులకు దనకుంగల కొలది గో భూ హిరణ్య ధాన్యాది దానంబులం గావింపవలయు. మనుజుండగ్నితీర్థతీరం బున దానంబుచేసిన సర్వపాపవిముక్తుండగు. ఓ మునీంద్రులారా సకలపాపహరంబులు చక్రతీర్థప్రముఖంబులు అనుక్రాంతంబులగు తీర్థంబులనెల్ల ననుపూర్వకంబుగ స్నా నంబుచేసి పిమ్మట రామేశ్వరంబుచేరి రామనాథుంబూజించి సేతుమాధవుం గొనియాడి యచ్చటనుండు తీర్థంబులందెల్ల స్నానంబుచేసి రామలక్ష్మణ సీతా హనుమదాదులనెల్లం గొనియాడి ధనుష్కోటింజేరి పాషాణదానపూర్వక పూర్వోక్త నియమప్రకారంబున స్నా నంబుచేసి విత్తానుసారంబున భూసురులకు క్షేత్రాదిదానంబుచేసి పిమ్మట కోటితీర్థం బుచేరి యందు స్నానంబుచేసి రామనాథుంబూజించి ధూపదీపనైవేద్యాదులొసంగి బ్రా హ్మణజనంబులకు విత్తలోభంబులేక సకలదానంబులుగావించి రామేశ్వరదేవునకువందనం బులుచేసి స్తుతించి తదనుజ్ఞగొని సేతుమాధవసన్నిధిం చేరి యాదేవునకు ధూపదీపాదులొ సంగి పూర్వోక్తనియమోపేతుండై మరలి స్వగృహంబుచేరి బ్రాహ్మణజనంబులకు షడ్రసో పేతాన్నం బొసంగవలయు నివ్విధంబునం గావించిన మానవునకు రామనాథుండు ప్రీతుండై

సర్వాభీష్టంబుల నొసంగు, నాతని కెన్నండును దారిద్ర్య నరకంబులు లేవు సంతతి వృద్ధి నొందు సాయుజ్యప్రాప్తియుం గల్గు నిట్లు గావించుటకు జనుం డశక్తుం డయ్యెనేని శ్రుతిస్మృతి పురాణంబులయందుండు సేతుమాహాత్మ్యంబును భక్తిపురస్సరంబుగా బఠించిన దాన సేతుస్నానఫలంబు నొందు నిందుకు సందియంబు లేదు ఈ విషయంబు పాదహీనులగు వారలకు నెరుంగవలయు. ఓ మునీంద్రులారా సేతుయాత్రాక్రమం బెరుగించితి ఏ మనుజుండైన నీ యధ్యాయంబు బఠించు విను నాతండు సర్వదుఃఖంబుల బాయునని శౌనకాదిమునీంద్రులకు సూతుం డెరుంగించెను.

ఇది స్కాందపురాణంబునందు సేతుమాహాత్మ్యంబున
సేతుయాత్రాక్రమంబుగల
ఏబదియొకటవ యధ్యాయము సంపూర్ణము.

## ఏ బ ది రెం డ వ అ ధ్యా య ము.

మహనీయగుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకల పురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండగు సూతుం డిట్లనియె, ఓ మునీంద్రులారా సేతువైభవం బెరుంగించెద నాదరంబుచే వినుండు సకల తీర్థస్నానంబుల కెల్ల నచ్చట స్నానంబు శ్రేష్ఠంబా సేతువునందు జప తపో హోమ దానంబు లక్షయఫలదంబులగు నా మహాస్థానంబున ధనుష్కోటియందు స్నానంబబ్బిన కాశీస్థలంబున దశసంవత్సరంబులు వాసంబు జేసిన ఫలము గల్గు నరుం డా ప్రదేశంబున ధనుష్కోటియందు త్రిదినంబులు భక్తియుక్తుండయి స్నానము జేసి రామేశ్వరమహాదేవు నర్చించెనేని పుండరీకపురంబున దశసంవత్సరంబు లుండిన ఫలంబు గల్గు సకల పాపంబులు నశించు మరియు నా సేతువునందు ఆద్యంబగు త్ర్యంబకమహామంత్రంబష్టోత్తరసహస్రంబు జపించిన నరుండు శివసాయుజ్యంబు నొందు మరియు మనుజుం డా సేతువున ధనుష్కోటియందు మాఘమాసమున స్నానం బొనర్చిన మధ్యార్జునంబు కుంభకోణంబు మాయూరంబు శ్వేతకాననంబు హాలాస్యంబు గజారణ్యంబు వేదారణ్యంబు నైమిశంబు శ్రీపర్వతంబు శ్రీరంగంబు వృద్ధాచలంబు చిదంబరంబు వల్మీకంబు శేషాద్రియు నరుణాచలంబు నీపక్షిణ కైలాసంబు వెంకటాద్రియు కాంచీపురంబు బ్రహ్మపురంబు వైద్యనాథంబు మొదలగు శివవిష్ణుస్థానంబులయందెల్ల వర్షాకాలంబు వాసంబు జేసిన ఫలము నొందు, ఓ బ్రాహ్మణోత్తములారా సనాతనంబగు ద్వ్యాసముద్రావలియను స్మృతియు యుపాదరణియును తద్విష్ణోఃపరమం పదమను శ్రుతియు సకల స్మృతీతిహాసపురాణంబులు సర్వమునందును నేకవాక్యంబుగ సేతుమహాత్మ్యం బెరుంగించియున్నయది మరియును చంద్రసూర్యగ్రహణకాలముల నచ్చట స్నానము జేసిన నరుండు వీము క్తిక్షేత్రంబున దశవర్షములుండి గంగాస్నానము జేసిన ఫల

మను కోటిజన్మకృతపాపనాశనమును అశ్వమేధ సహస్రఫలంబునుం బొందు, ఓ మునీంద్రులారా విషువాయనంబును సంక్రాంతియు శశివారమును పర్వంబునుం జేరిన దినంబున నా సేతుదర్శనము గావించిన మనుజుండు సప్తజన్మార్జితపాపంబుల నాశనము జేసి స్వర్గలోకము నొందు మరియును మాఘమాసమున సూర్యుండు మకరగతుండై యుండ సూర్యోదయకాలంబున ధనుష్కోటియందు త్రిదినంబులు స్నానము జేసిన మనుజుండు విపాతకుండై గంగాది సర్వతీర్థస్నాన ఫలమును అశ్వమేధపుణ్యంబునుం బొందు మరియును మాఘమాసమునం దాక్షేత్రంబున ధనుష్కోటియందు దశదినములు స్నానం బొనర్చిన మనుజుండు చాంద్రాయణాది కృఛ్రవ్రతానుష్ఠానఫలంబును చతుర్వేదపారాయణ ఫలంబునుం బొందు పంచదశదినములు స్నానము జేసిన బ్రహ్మహత్యాయుతంబు నశించు వైకుంఠవాసంబునుం బొందును మరియు నిర్వదిదినములు స్నానం బొనర్చిన శివసారూప్యంబునొంది శివుంగూడి మోదించు నిరువదియైదుదినంబులు స్నానం బొనర్చిన శివసామీప్యంబు నొందు ముప్పది దినంబులు స్నానం బొనర్చిన శివసాయుజ్యంబు నొందు సందియంబు లేదు గాన వో మునీంద్రులారా పండితుండగు జనుండు మాఘమాసంబునం దవశ్యంబు నా ధనుష్కోటియందు స్నానము జేయవలయు మరియును చంద్రసూర్యోపరాగంబులయందును అర్థోదయ మహోదయ పుణ్యకాలములయందును సేతుస్నానము జేసిన జనుండు సకల పాపనాశనంబు గావించి నరకబాధలం బొందక ఇంద్రాదిసర్వలోకభోగంబులం బొందు మరల జన్మంబు నొందడు మానవుండెచటనైన తటాకాదులయందు రావణ వినాశార్థంబై శ్రీరామచంద్ర నిర్మితంబును సిద్ధచారణ గంధర్వకిన్నరోరగసేవితంబును బ్రహ్మర్షిదేవర్షిరాజర్షిపూజితంబును బ్రహ్మాదిసేవితంబును పుణ్యంబగు రామసేతువు మనంబునం దలంచుచు స్నానము జేసెనేని యాతని కెన్నండును దుష్కృతంబు కలుగదు మరియు సేతుమధ్యతీర్థంబుల ముష్టిమాత్రంబేనియు దానము జేసిన సకలరోగంబులు భ్రూణహత్యాదిపాపంబులం బాసి పునరావృత్తిరహితంబగు వైకుంఠము నొందు యేమనుజుండైన నాతీర్థమున స్నానము జేసి భక్తియుక్తుండై బ్రాహ్మణజనంబులకు గోభూతిలతండుల ధాన్యవస్త్రభూషణదానములు మాషాపూదనదధిఘృతవారిశాకాదిదానములు శర్కరసస్యమధుమోదకాపూపాదిదానములు జేసిన సర్వాభీష్టంబులం బొందు రామసేతువునందు ధనుష్కోటితీరంబున జపతపోహోమంబులు గావించిన మనుజుండనంతఫలము నొందు నాతనికి బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతలును నాగకింపురుషయక్షాదులును పితృదేవతలును, ప్రీతులై యుందురు మరియు నాధనుష్కోటి దర్శనంబు జేసిన మానవుండు తత్క్షణంబున పంచమహాపాతకంబుల నాశనంబు చేసి పరిశుద్ధుండై యనేక క్లేశసంపూర్ణంబగు గర్భవాసంబు నొందడు సీతాదేవియే ప్రదేశంబునయందుం బ్రవేశించె నచ్చట స్నానము జేసిన జనుండు భ్రూణహత్యాది పాపంబులనెల్ల నాశనంబు జేయు రామచంద్రుని విధంబున సేతువును హరికరణిగంగయును ప్రకాశింపుచుండు యేమనుజుం

డైన సాగంగారామసేతువుల స్మరింపుచు నచ్చట నేతీర్థంబునందైన స్నానముజేయు న
తండు పరమగతిం బొందు.

ఓ మునీంద్రులారా అర్ధోదయకాలమున నచ్చట పితృదేవతలంగూర్చి యేనరులయిన
సర్షపమాత్రంబులగు పిండంబులదానంబుజేసిన పితృదేవతలు చంద్రదివాకరులుండు పర్యం
తంబు తృప్తింబొందుదురు మరియు శమీపత్రసమానములగు పిండంబులిడిన పితరులు స్వర్గ
గతులై యుండరేని ముక్తింబొందుదురు నరకగతులై యున్నదివంబునొందుదురు సేతువునం
దును పద్మనాభక్షేత్రంబునందును గోకర్ణపురుషోత్తమంబులయందును సింధుస్నానంబు
సర్వకామంబుల నొసంగు శుక్రాంగారక భానువాసరంబులయందు సేతువునందు లవణా
ర్ణవమున సంతానముగోరువారలు స్నానముజేయవలయు నితర ప్రదేశములయందెల్ల
నొకానొకప్పుడు జేయవలయుంగాని నెల్లప్పుడు జేయందగదు మరియును పితృకార్యంబు
లంజేయనివారు గర్భిణీపతియు సముద్రస్నానంబున కర్హులుగారు వారలును సేతువు
నందు స్నానము జేయందగుదురు సేతువుదప్ప నితర ప్రదేశంబులయందు వారతిథ్యాదినియం
బులుగల నచ్చట నెల్లప్పుడు స్నానము జేయందగు మనుజుండు స్నానము జేయునెడల ప్ర
సన్నమానసుండై కుశప్రకృతింగావించి కుశోసియను మంత్రముపఠింపుచు గ్రంథిస్నానము
చేయించి తాననుమునుంగవలయు సేతువునందును సింధ్వబ్ధిసంయోగంబునందును గంగా
సాగరసంగమంబునందును గోకర్ణంబునందును పురుషోత్తమంబునందును నీప్రదేశంబు
లనిరంతరంబు స్నానముజేయందగదు నితర ప్రదేశంబుల జేయందగదు శ్రీరామచంద్రుండు
సకలదేవమునీంద్రులు వినుచుండ నేజేసిన సేతువునందు స్నానముజేసిన వారలు విధూతపా
పులై మత్ప్రసాదంబున నూరల జన్మంబులంబొందరు రామనాథమహాత్మ్యంబును మత్సేతు
వుకన్ననధికంబై యుండు దానింబోగడ నేవర్షశతంబులకైన జాలనని ప్రతిజ్ఞాపూర్వకం
బుగవచించిన విని సురముని సంఘంబులనేక విధంబులం బ్రశంసించిరి. ఓ మునీంద్రులారా
రామనాథాజ్ఞచే చతుర్ముఖుండును పద్మనాభుండును గంధర్వాది నిలింపులును సకల
మునిసంఘంబులును సేతుమధ్యమున వసించియున్నవారుగాన నాసేతువు సకల పాపంబు
ల హరించు మరియు నచ్చట నర్ధోదయ పుణ్యకాలంబుల స్నానంబొనర్చిన మానవుండు సకల
నరకబాధలంబొందక ఆనందకారిణియగు ముక్తింబొందు పుష్యమాఘసంధియందు సూ
ర్యుండుదయించుచుండ వ్యతీపాతయు భానువాసరంబును శ్రవణక్షంబునుంగూడ నర్ధో
దయంబనియు నిందుకొంకించుక గొరంతయయ్యెనేని మహోదయంబని వచింపంబడు వ్యతీ
పాతసహస్రంబులకొక యమావాస్యతుల్యంబగు దర్శాయుతంబులలోపల భానువారయుతం
బగు నమావాస్యయుత్తమంబునందును శ్రవణక్షంబుజేరిన నధికంబనోన్యసంయోగంబున ని
దియొకటొకటి పుణ్యప్రదంబగు మరియును సకలక్షంబులయందు శ్రవణంబును తిథులయం
దమావాస్యయు యోగంబులలో వ్యతీపాతయు వారంబులయందెల్ల రవివారంబును ఉత్త

మంబులివినాలుగు మకరంబునంజేరిన అర్ధోదయ మహాయోగంబగు నిది సకల పాపంబుల నిరసించునట్టి కాలమున రామసేతుమజ్జనంబుగావించిన నరుండు మరల జన్మంబునొందడు మహోదయకాలమును నట్లపుణ్యప్రదంబై వెలయు లోకంబున ఆచారంబును తపంబును వేదాంత శ్రవణంబును పురాణార్థప్రవర్తనతయు శివవిష్ణ్వాదిపూజనంబులుగలద్విజుండు దానార్హుండు, ఓ మునీంద్రులారా సేతువునందు మనుజుండట్టి సత్పాత్రంబువిచారించి దానంబుగావింపవలయు నట్టి పాత్రంబు లభించకపోయెనేని సత్పాత్రంగూర్చి సంకల్పం బొనరించి స్వగ్రామంబుజేరి పిమ్మట నొసంగవలయుంగాని అసత్పాత్రంబునకొసంగం దగదిందుకొక యితిహాసంబెరుంగించెద వినుండు రవివంశజుండగు దిలీపుండు చతురానన నందనుండగు వసిష్ఠుంగాంచి దానపాత్రంబెరుంగంవలంచి, ఓ మహాత్మా లోకంబున నెట్టివా నికి దానంబుసేయందగు నెరింగింపవేయనిన మునీంద్రుండిట్లనియె.

ఓ నృపాలకా దానార్హులలో వేదాచారపరాయణుండు త్తముండు వానికన్న శూద్రాన్నంబు భుజింపని మానవుండధికుండు వేదములు పురాణములు మంత్రములు శివ విష్ణ్వాదిదేవతాపూజలు వర్ణాశ్రమాద్యనుష్ఠానంబులు గలిగి దరిద్రుండును కుటుంబియగు విప్రుండు సత్పాత్రంబని వచింపంబడునట్టి వానికి పుణ్యస్థలములనొసంగిన విశేషఫలప్రదం బగునట్టి దానంబు సేయక దుర్దానంబుజేసిన మానవుండు కృకలాసుండై పదిజన్మంబులు పి మ్మట జన్మత్రయంబుగార్దభంబును రెండు జన్మంబులు మండూకంబునునై పుట్టి మరల చండాల శూద్రవైశ్యక్షత్రయోనులందవతరించి పిమ్మట బ్రాహ్మణుండై పుట్టి దరిద్రుండును బహురోగియగు నిట్టిదోషంబులు దుష్పాత్రదానంబునంగల్గుగాన సత్పాత్రదానంబుజేయ వలయు సత్పాత్రంబు పుణ్యస్థలంబుల లభింపకపోయెనేని సత్పాత్రంబుగూర్చి సంకల్పం బొ నరించి పిమ్మట నొసంగవలయు నతండు మరణంబు నొందెనేని యాతనిపుత్రున కొసంగ వలయు నతండునుపంచత్వంబునొందిన నాద్రవ్యంబు మహాదేవార్పణంబు జేయవలయునని వసిష్ఠమహామునీంద్రుండు దిలీపధరాధిపున కెరుంగించెగాన ఓ మునీంద్రులారా నెవ్వరైన పుణ్యస్థలంబుల సత్పాత్రదానంబె జేయవలయు నట్లుగావించిన మనుజులదు దీర్ఘాయువు బొంది పిమ్మట శివసాయుజ్యమునొందు కుంభకోణమును సేతుమూలమును గోకర్ణంబు ను నైమిశంబును అయోధ్యయు దండకారణ్యంబును విరూపాక్షంబును వేంకటాచలంబు ను సాలగ్రామంబును ప్రయాగయు కాంచియు ద్వారావతియు మధురయు పద్మనాభంబు ను కాశియు మొదలగు క్షేత్రములయందెల్ల ఉపవాసంబును ముండనంబునుగావింపవలయు నట్లు మోహంబున జేయక స్వగృహంబునకేతెంచిన మానవుంగూడి పాపంబులరుదెంచు గం ధమాదనంబునగల చతుర్వింశతి తీర్థంబులలో లక్ష్మణతీర్థతీరంబున శివాజ్ఞచే శిరోమాత్రము వపనంబుజేసి లక్ష్మణేశ్వరదర్శనంబుజేసిన మానవుండు సర్వపాపవిముక్తుండై శంకరుంజేరు ఓ మునీంద్రులారా యర్ధోదయపుణ్యకాలమున సేతువునందు స్నానముజేయవలయు నాసే

తుపునకు తీర్థతపోదానాది పుణ్యంబులెవ్వియు సమంబులుగావు ఉపరాగసహస్రంబుల కర్ధోదయంబు సదృశంబగు నాకాలంబుకన్న సంసారమోచక పుణ్యకాలంబులేదట్టికాల మున సేతుపునందు స్నానముజేసిన వానిపుణ్యంబునకు సదృశంబెద్దియునులేదు షష్టివర్ష సహస్రంబులు భాగీరథీస్నానంబుగల్గుఫలం బేకవారంబు రామసేతుస్నానంబునంగల్గు నిశ్చ యంబు మరియు మాఘమాసంబున సూర్యుండు మకరగతుండైయుండ ప్రయాగక్షేత్రం బున సహస్రవారంబులు స్నానంబుచేసిన పుణ్యంబు త్రైలోక్యంబునంగల తీర్థంబులయం దెల్ల స్నానఫలంబు సేతుపునం దర్ధోదయకాలంబున స్నానంబుచేసినంగల్గు బ్రహ్మజ్ఞానహీ నులును కృతఘ్నులును దురాత్ములును మరియును సకలపాపకారులును సేతుపునం దర్ధోద యకాలంబున స్నానంబుచేసిన శుద్ధింబొందుదురు. మరియును కృతఘ్నులగువార లెట్టిక్షే త్రంబులకుంబోయిన నేప్రాయశ్చిత్తంబుచేసిన నిష్కృతిగలుగదు అట్టివారలు సేతుపునం దర్ధోదయకాలంబున స్నానంబుచేసిన పాపశాంతింబొందుదురు. యేనరులైన మూఢులయి యర్ధోదయకాలంబున నచ్చట స్నానంబుచేయకపోవుదురో వారలు నిరంతరంబు సంసార కూపంబున మునుంగుచుందురు. స్నానంబుచేసినవాడు భాస్కరమండలంబుభేదించి బ్రహ్మ లోకంబుచేరు నిందుకు సందియంబులేదు. మనుజుం డర్ధోదయకాలంబున విముక్తిదంబగు రామసేతుపుచేరి స్నానంబుచేసి సీతాసమేతుండగు శ్రీరామచంద్రుని రామేశ్వరమహాదే వుని సుగ్రీవాదికపులను మనంబులం దలంపుచు దారిద్ర్యవిముక్తింగోరి దేవమునిపితృతర్ప ణంబులాచరించి అర్ధోదయాఖ్యుండగు జగన్నాథుం బూజించి దివాకరయమంత్రంబు పఠించి యఘ్యప్రదానంబుగావించి పదునలుగురినైన పన్నిద్దరునైన నెనిమిదిమందినైన నేగురినైన నార్వురినైన నైదుగురినైన యథాశక్తిప్రకారంబుగ విప్రులంబూజించి వారి యుపకంఠంబున పయఃపూరితంబును సఫలంబును సగుడంబును యజ్ఞోపవీతసహితంబును సతాంబూలంబునునగు కాంస్యపాత్రంబెడి నవత్స్యయగు ధేనువు నొసంగి శ్రవణార్కయ ను మంత్రంబుపఠించి పార్వణశ్రాద్ధంబైనను ఆవశ్రాద్ధంబైనను పాకశ్రాద్ధంబైననుం గా వించి వస్త్రభూషణాదులచే నాచార్యుంబూజించి యాతనికిం బ్రతిమను గోభత్రోవాహ నంబుల నొసంగవలయు. ఇవ్విధంబున నర్ధోదయకాలంబున వ్రతంబుచేసినవాడు కృతకృ త్యుండగు వానికి పిమ్మటచేయందగినకార్యం బెద్దియునులేదు. ఎవ్వరైనను స్థలాంతరంబు లనైన స్నానకాలంబున రామకృతంబగు సేతుపును స్మరింపుదురో వారలు తత్క్షణంబున సకలపాపంబుల నాశనంబుచేసి యచ్యుతపదంబునొందుదురు. మరియును నిమిషంబయిన నిమిషార్ధంబయిన యేమనుజుండు సేతుపునవసించు నాతనికి యమకింకరులు దృష్టిగోచ రులుగారు. యెవ్వండైన నిరంతరంబును రామసేతుపును ధనుష్కోటిని రామచంద్రసీతా లక్ష్మణులను రామనాథుని హనుమత్సుగ్రీవాదివానరులను విభీషణనారద విశ్వామిత్రఘటో ద్భవ వసిష్ఠవామదేవ జాబాలికశ్యపాది రామభక్తులను స్మరించుచునతండు సర్వదుఃఖంబులం

శాని పరమగతిం బొందు. ఓ మునీంద్రులారా సత్యక్షేత్రంబు నైమిశంబు సాలగ్రామంబు బదరికావనంబు హస్తిశైలంబు వృషాచలంబు శేషాద్రియు చిత్రకూటంబు లక్ష్మీక్షేత్రంబు కుంభకోణంబు మోహనీపురంబు వింధ్యంబు శ్వేతాచలంబు పద్మనాభంబు ఫుల్లాఖ్యంబు ఘటికాద్రియు సారక్షేత్రంబు శ్రీనివాసంబు ఆళిందాఖ్యంబును మధురయు శ్రీరంగంబు పురుషోత్తమంబు యివి మొదలగు పుణ్యక్షేత్రంబుల స్నానంబుచేసినం బోని పాతకంబులు సేతుస్నానంబున నశించు నిశ్చయంబు. నచ్చట స్నానంబుగావింపనివారలకు సంసారని వృత్తి గలుగనేరదు. యెవ్వారైనను పంచాక్షర షడాక్షర అష్టాక్షర మహామంత్రంబుజపిం పక స్మరింపకయుందురో వారలయిన సేతుస్నానంబుచేసినం బరిశుద్ధులగుదురు. యేమను జులైన నేకాదశ్యుపవాసంబుచేయక జాబాలోపనిషదుక్తక్రమంబున త్రిపుండ్రధారణం బుచేయక శివకేశవాదిదేవతల ధూపదీప చందన పుష్పాదులం బూజింపక శ్రీరుద్రాదులచే నభిషేకింపక ప్రదక్షిణనమస్కారంబులు సేయక ధనుర్మాసంబున నుషఃకాలంబున శివ విష్ణ్వాదులకు నైవేద్యంబొసంగక వారలనామంబులం గొనియాడకయుందురో అట్టివారలు సేతుస్నానంబుచేసినం బరిశుద్ధులగుదురు. యెవ్వారైనను సాలగ్రామంబులం బూజింపక రుద్రాక్షతులసీకాష్ఠలధరింపక ప్రాతఃకాలంబున సంధ్యావందనాదులంజేయక గాయత్రీజపం బుచేయక ఔపాసనములు చేయక బ్రహ్మయజ్ఞంబుగావింపక అతిథిపూజనంబుచేయక యతులం బూజింపక అధీతవేదంబుల వేదాంగంబుల స్మరింపక మాతృపితృ సమూహంబులకు నిత్యనైమిత్తికాది శ్రాద్ధంబులం జేయక లోభంబున చైత్రమాసంబున పానకాదులచే చిత్రగుప్తతుష్టిం జేయకయుందురో వారలపాపములెల్ల ధనుష్కోటిమజ్జనమున నశించు. మను జుండు వృత్తుండైన సువృత్తుండైన సేతుసేవకుండైన నాతనికి సంసారవృత్తిగల్గుంగాన సంసారసాగరంబుదరింపంగోరువాడు ధనుష్కోటికిం బోవలయు నందు స్నానముజేయక ముక్తిగల్గనుపాయంబెద్దియునులేవందుస్నానంబొనర్చిన వారలు యత్నంబుజేయక సంసారభయము నాశనముజేసి సనాతనంబగు పరబ్రహ్మంబు నొందుదురు నిందుకు సందియంబు లేదు ఓ మునీంద్రులారా మహాపుణ్యప్రకాశనంబును మహారోగనివారణంబును దుస్స్వప్న నాశనంబును అపమృత్యునివారణమును మహాశాంతికరమును స్వర్గాపవర్గప్రదంబును పుణ్యమును సర్వతీర్థఫలప్రదంబగు సేతుమహాత్మ్యం బెఱుఁగించితి నెవ్వండైన నీయుపాఖ్యానంబు సమాహితచిత్తుండై పఠించు వినునతండు అశ్వమేధాదియజ్ఞంబుల ఫలమును సాంగంబులగు వేదంబుల శతావృత్తిపారాయణముజేసిన ఫలమునుబొందు మరియు నీసేతుమహాత్మ్యమున నొకయధ్యాయంబు పఠించిన వినిన నతండశ్వమేధఫలంబు నొందు అధ్యాయద్వయంబు పఠించిన మానవుండు గోమేధాఖ్యఫలంబునొందు దశాధ్యాయపాఠకుండు వినినవాడు స్వర్గలోకమునొంది శక్రుంగూడి సకల సుఖములబొందుదురు మానవుండు నిరువదియధ్యాయంబుల పఠించిన వినిన విష్ణులోకంబునొందు నలువదియధ్యాయం

బులు పఠించినమనుజుండు రుద్రలోకంబున రుద్రుంగూడి మోదించుచుండు యేబదియ
ధ్యాయంబులు పఠించినను వినినమనుజుండు చంద్రార్ధశేఖరుంబొందు యేనరుండైన నీ
సేతుమాహాత్మ్యంబు సమగ్రంబుగ పఠించు వినునతండు శివసాలోక్యంబునొందు ద్వివా
రంబులుపఠించువాడును వినునతండు విమానవరసంస్థితులై శివసామీప్యంబునొందుదురు
త్రివారంబులు పఠించిన వినినజనుండు శివరూపంబునొందు చతుర్వారంబులు పఠించిన
వినినమానవుండు శివసాయుజ్యంబునొందు ఏ మనుజుండు దినదినంబును శ్లోకంబైన శ్లో
కార్థంబయిన పాదంబయిన నొకపణంబయిన పఠించెనేని యాదినకృతపాపంబు నశిం
చు మానవుండు సమగ్రమంబుగ సేతుమాహాత్మ్యంబు పఠనంబుజేసిన వినిన నాగ్రంథంబు
నె నెన్నివణకింబులుగలవన్ని బ్రహ్మహత్యా సురాపానాదిదోషంబులు నశించు లోకంబు
నంగల సకలపుణ్యంబులు సేతుమధ్యస్థిత చతుర్వింశతి తీర్థస్నానఫలంబునుంగల్గు నిందు
కు సందియంబులేదు యెవ్వండైన భక్తియుతుండై నీసేతుమాహాత్మ్యంబు లిఖించునతం
డజ్ఞానహీనుండై శివసాయుజ్యంబునొందు యేనరుని గృహంబున నీసేతుమాహాత్మ్య పు
స్తకంబుండు నాతనికి భూతభేతాళాది భయంబు వ్యాధిపీడలు చోరబాధలు శన్యంగారక
కాది గ్రహోపద్రవంబులు గలుగవు నాతనిగృహంబు రామసేతుసమంబని యెరుంగుండు
నందు చతుర్వింశతితీర్థంబులు గంధమాదనపర్వతంబులు బ్రహ్మవిష్ణుమహేశాది దేవగణం
బులు వసించియుండుదురు బహుభాషణంబులేల యాతనిగృహంబున లోకత్రయంబువసిం
చు యెవ్వండైన శ్రాద్ధకాలంబున నీమాహాత్మ్యంబునం దధ్యాయంబైన శ్లోకంబైన వినిన
నాతండు జేయుశ్రాద్ధంబునకు వైకల్యంబులుగదు పితృదేవతలును ప్రీతులగుదురు యెవ్వం
డైన పర్వకాలంబున నీమాహాత్మ్యంబునందొక యధ్యాయంబైన నొకశ్లోకంబైన విప్రు
నివలన వినునతని కెన్నండు నుపద్రవంబుగలుగవు సకల సమృద్ధులుంగల్గు వోమునీంద్రు
లారా యీమాహాత్మ్యంబును దేవాలయంబునందైన నదితటాకతీరంబులనందైన అర
ణ్యంబునందైన శ్రోత్రియగృహంబునందైన మరియెచటనైన పఠనంబుజేయవలయు మరియు
ను విషువాయన సంక్రాంతులయందును పుణ్యంబగు హరివాసరంబునందును అష్టమీచ
తుర్దశిదినంబులయందును శ్రావణభాద్రపద ధనుర్మాసములయందును ఉత్తరాయణంబున
ను నియమపూర్వకంబుగ పఠనంబుజేయవలయు వినువారలును నియమసంయుతులై యుం
డవలయు నీమహాత్మ్యంబున బ్రహ్మవిష్ణు మహేశులుకీర్తింపబడియున్నవా రీమాహాత్మ్యం
బు సకలశ్రుతిబృంహోప బృంహితంబును సకలధర్మ సమ్మతంబును కృష్ణద్వైపాయన ము
నీంద్ర విరచితంబునై వెలయుచుండుగాన శ్రేయంబుగోరువారలందరు పఠనంబుజేయవల
యు వినవలయు ఓమునీంద్రులారా యీగ్రంథంబు వినువారలు శ్రావకునకు స్వశక్తిలో
పంబుజేయక గోభూహిరణ్యాది దానంబులుగావించి పూజింపవలయు నతండు పూజితుం
డయిన త్రిమూర్తులు పూజింపంబడుదురు వారలుపూజితులయిన లోకత్రయంబును పూ

జితంబగు లోకంబున యీమాహాత్మ్యంబు పఠనంబుజేయువారలకును వినువారలకును శ్రీరామచంద్రుండు ప్రీతుండై సకలసుఖంబులనొసంగి యంతంబును ముక్తియునిచ్చు పూర్వంబున ధర్మనందనుండు వ్యాసమునీంద్ర ప్రణీతంబగు నీమహాగ్రంథంబు వారియ నుజ్ఞచే నిరంతరంబును స్వపురోహితువలన వినుచుండు.

ఓమునీంద్రులారా సకలశ్రుతి సమ్మతంబును పుణ్యంబగు సేతుమహాత్మ్యంబెరుం గించితి మీరలు నియమయుతులరై నిరంతరంబు సాదరంబుగా బఠింపుచు శిష్యులకుపదే శింపుచు నుండుండు అని యివ్విధంబున పౌరాణికోత్తముండగు సూతుండుపలికి మనం బున వ్యాసమహామునీంద్రుం దలంపుచు రోమాంచితకళేబరుండైయుండె నాసమ్మయం బున శ్రీకృష్ణద్వైపాయనుండు శిష్యానుగ్రహాకాంక్షచే నచటికరుదెంచిన సూతుండును నైమిశారణ్యవాసులగు మునీంద్రులంగూడి వ్యాసచరణాంభోజంబులకెరగి యానందాశ్రు పరిప్లుతనేత్రుండైయుండ సత్యవతీసుతుండును ప్రియశిష్యునాలింగనంబుజేసి యాశీర్వ దించి నైమిశారణ్యవాసులచే పూజితుండై యాసనంబునంగూర్చుండియుండి వారలనెల్ల గూర్చుండనియమించి యిట్లనియె. ఓ నైమిశారణ్యవాసులారా మచ్ఛిష్యుండగు నీసూ తుండు సేతుమాహాత్మ్యంబు సమగ్రంబుగ మీకెరుంగించె యీమాహాత్మ్యంబు సకలశ్రుతి స్మృతీతిహాసపురాణాదులయందెల్ల బహుతరంబును సకలజగద్ధితంబై యుండు నీమహాత్మ్యం బు మాయాజ్ఞచే యుధిష్ఠిరుండు నిరంతరంబు వినుచుండు మీరలును భక్తియుతులరై, పఠనంబుజేయుచు శిష్యులకుపదేశింపుచుండుండని వచించిన వారలందరియ్యకొని రంత వ్యాసమునీంద్రుండు శిష్యుండగు సూతుండు కైలాసంబునకుంబోయె పిమ్మట నైమిశా రణ్యవాసులగుమునీంద్రులు పరమసమ్మద పరిపూరిత హృదయులై ప్రత్యహంబును పఠిం పుచు వినుచుండిరి.

ఇది స్కాందపురాణంబునందలి సేతుమహాత్మ్యంబునందు
సేతుస్నానప్రభావమాహాత్మ్య పఠనాదిఫలితంబులుగల
యేబదిరెండవ యధ్యాయము సంపూర్ణము.

---

సేతుమాహాత్మ్యము - సమాప్తము.



# శ్రీరామవిలాసముద్రాక్షరశాలయందు వెలకుదొరుకుగ్రంథములు.

| | | రూ. | అ. | పై |
|---|---|---|---|---|
| శ్రీమదాంధ్రభాగవతము, దశమస్కంధపూర్వభాగము, టీకాతాత్పర్య విశేషార్థప్రతిపదసహితముగలది. | ... | 4 | 8 | 0 |
| డిటో దశమస్కంధము-ఉత్తరభాగము. | ... | 3 | 12 | 0 |
| డిటో నవమస్కంధము. | ... | 2 | 0 | 0 |
| డిటో అష్టమస్కంధము. | ... | 2 | 4 | 0 |
| టీకాతాత్పర్యప్రతిపదసహిత- సీతారామాంజనేయసంవాదము. | | 1 | 4 | 0 |
| తాత్పర్యసహిత సీతారామాంజనేయ సంవాదార్థ సంగ్రహము | | 0 | 10 | 0 |
| శ్రీవాసిష్ఠరామాయణము-ఈయోగశాస్త్రమునందు50ఉపాఖ్యానములున్నవి. | | 0 | 12 | 0 |
| శ్రీభగవద్గీత-ఇందులో, శ్రీకృష్ణాష్టక, శ్రీకృష్ణాష్టోత్తర, శతనామస్తోత్ర, శతనామావళి, అష్టాదశశ్లోకీగీతా, గీతామహాత్మ్య, అధ్యాయానుక్రమణిక కరన్యాస హృదయన్యాస శ్లోకపాదానుక్రమణిక మొదలగువాటిని నిమిడ్చి హస్తకోశముగా మంచిబైండుచేయబడినది, | | 0 | 4 | 0 |
| వేమనపద్యములు-ఇందులో 1600 పద్యములున్నవి. | ... | 0 | 8 | 0 |
| ఆత్మారామశతకము - వేదాంతపద్యములు. | ... | 0 | 1 | 0 |
| మనసానందశతకము. డిటో | ... | 0 | 1 | 0 |
| భూమానందశతకము. డిటో | ... | 0 | 1 | 0 |
| పురూరవచక్రవర్తిచరిత్రము ప్రతిపదసహితము | ... | 0 | 3 | 0 |
| శశిరేఖాపరిణయమను అభిమన్యువివాహము వచనము. | ... | 0 | 3 | 0 |
| ఇందువదనయను సుందరాంగికథ. | ... | 0 | 3 | 0 |
| కాశీరామేశ్వరమజిలీకథలు, | ... | 0 | 12 | 0 |
| ధన్వంతరినిఘంటువు | ... | 1 | 8 | 0 |
| శతకంఠరామాయణము పదము- ఇదే సీతావిజయము. | ... | 0 | 8 | 0 |
| కుసలాయకము. పదము. | ... | 0 | 4 | 0 |
| కుశలవకుచ్చలచరిత్ర, పదము. | ... | 0 | 4 | 0 |
| లక్ష్మణమూర్ఛ, పదము. | ... | 0 | 2 | 0 |
| లంకాయాగము. పదము. | ... | 0 | 2 | 0 |
| దక్షునియజ్ఞము. పదము. | ... | 0 | 1 | 0 |

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| గజేంద్రమోక్షము. పదము. | ... | 0 | 1 | 0 |
| రుక్మాంగదజననము పాముపాట. | ... | 0 | 1 | 0 |
| శ్రీరాఘవకల్యాణము. | ... | 0 | 1 | 0 |
| శృంగారవేడుకపాటలు. | ... | 0 | 1 | 0 |
| దీపావళిప్రభావము. | ... | 0 | 0 | 6 |
| రుక్మిణీకల్యాణనాటకము. | ... | 0 | 1 | 0 |
| బాలనాటకము-జంగముకథ. | ... | 0 | 4 | 0 |
| గోపికావస్త్రాపహరణము-ఇదిహరికథా కాలక్షేపయుక్తవిశేషార్థములతోను అనేకఉపమానములతోనున్నవి. | ... | 0 | 4 | 0 |
| ప్రతిమాసహితవ్రతకల్పము. | ... | 0 | 2 | 0 |
| వ్రతరత్నావళి. | ... | 0 | 4 | 0 |

1. పుస్తకములు తెప్పించుకొనువారు అర్ధరూపాయి కరీదుకు పైబడియే యుండవలెను. లేనియెడల- వి. పి. గా పంపబడదు.

2. వలయువారలు ఈక్రిందివిలాసమునకు విడిఅక్షరములతో పైవిలాసము పోష్టాపీసు మొదలగునవి స్పష్టముగా వ్రాయవలయును.

3. ఒకరూపాయకు పైబడు పుస్తకములను యేకకాలములో తెప్పించుకొనువారికి ప్రతిరూపాయి 1-కి 1-అణావంతున కమిషన్ యివ్వబడును.

4. ఇదిగాక నేకైననూతనగ్రంథములుగాని యిదివరలో ముద్రించిన గ్రంథములుగాని ముద్రించవలసియుండినయెడల పండితులచే పరిష్కారింపించి శుద్ధప్రతిగాను తక్కువచార్జీలకు ముద్రించి యివ్వబడును.

ఇట్లు,

పెసల-నమ్మాళ్వారు శెట్టి.

శ్రీరామవిలాసము ముద్రాక్షరశాలాధికారి,

నెం. 16 రెడ్డిరామునవీధి, మద్రాసు.